

# శ్రీమదాంధ్రలలితోపాఖ్యానము.

కడపమునిసిపల్ హైస్కూలు

తెలుఁగు పండితులగు

## జనమంచి. శేషాద్రిశర్మప్రణీతము.

శ్రీవక్కలంక. వేంకటసూర్యనారాయణజోగమ్మ

గారివలన

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి

ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రితము.

కాపీరైటు. 191 . ...ల్యము.

Ramaswamy Sastr... ...Sons. Madras.

లగు నీట్టియుద్యమము లన్నింటిని విద్యాధికులు సమర్థించుచుండుట యెల్లరకు నిక్కాలమున స్పష్టమే.

విద్యాధికులయభిప్రాయ మిట్లుండుటంజేసి సామాన్యులలోఁ గూడఁ బురాణములన్న మాకుఁ దలనొప్పియనుచుండినవారే యిక్కాలమున నవ్వానిం జదివియో వినియో వాని మహిమను దెలిసికొని సంతోషమున నుబ్బితబ్బిబ్బు లగుచున్నారు. ఆధునికభౌతికశాస్త్రములయు, రసాయనశాస్త్రములయు, నితరశాస్త్రములయు సిద్ధాంతములు పూర్వులకుం గరతలామలకములుగ నుండినవేగదా యని పట్టరానియానందమున మునుకులాడుచున్నారు. ఔరా! ప్రాచీనులమహిమ!!

ప్రపంచచరిత్రము తెలియవలెనన్నఁ బురాణములనే చదువవలయును. సకలవిషయము లందు స్పష్టముగఁ దెలియవచ్చును. లోఁతునకు దిగి వెదకిన కొలఁదిని యద్భుతానందప్రదములగు విషయరత్నములు కరగతములగును. భూతకాలమట్లు భవిష్యత్కాలస్థితి మనోగోచర మగును. ఇట్టి యుత్కృష్ట పురాణరత్నముల నేసరసమతి నిందించును! నిందించుఁబో మతఁ డవ్వాని నానుపూర్వకముగఁ జదివి యందలి సారమును గ్రహింపఁజాలక పోయెఁగదా యని మనము జాలినొందవలయునే గాని యాగ్రహింపరాదు. నీరక్షీరవిభాగ మొక్కహంసజాతికిం దప్ప నితరపత్రిజాతులకు సాధ్యమగునే?

మనుజులకుఁ బురాణములు చేయుచున్నయుపకారమును మఱెవ్వియుఁ జేయఁజాల వనుట మూటికి ముమ్మాటికి నిశ్చయము. ఏగాథ చదివినను నీతిని బోధించును. దుర్మార్గమునఁ బోకుండఁజేయును. ధర్మముల నుపదేశించును. పాపకృత్యము లిట్టివని యుద్ఘోషించును. వాని నవలంబించిన వారి కిట్టియవస్థలు సంభవించెను గాన మీ రాదారిని బోవవలదని నొక్కినొక్కి ముచ్చటించును. భూతభవిష్యద్వర్తమానకాలగతులఁ బలుభంగుల దృష్టాంతపూర్వకముగఁ జెప్పును. ఇంతయేల? పిల్లలకుఁ బెద్దలకుఁగూడఁ దగినయుపాఖ్యానముల మనోహరముగఁ దేటపఱచును. ఏపూరణమునం దేమూల వెదకినను సద్విషయములఁ బ్రవర్తించు బుద్ధిని గల్పునే గాని దుర్విషయములకుఁ లోఁబఱచు నంశము గోచరించదు. తల్లిదండ్రుల కన్న నివియే పూజ్యస్థానము లనిచెప్పుట కింకను సంశయమా?

పురాణము లాధునికము లగుననలలవలె ధూమశకటమునఁ బ్రయాణము చేయువారు కేవలకాలయాపనమునకై చదువ నిర్మింపఁబడినవికావు. వీని నెన్ని పర్యాయములు చదివినను గ్రొత్తనీతులను, అనేకాంశములను జదువరుల-మన

స్సులకుఁ దోఁచుచునే యుండును. కాని యెప్పుడును విసుగు నొందింపవు. కనుకనే "పురాపినవా" (ప్రాతదైనను గ్రొత్తదే) యని వీనికి వ్యుత్పత్తి.

అట్టిపురాణములు పదునెనిమిది.

"మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం,
అనాపలిఙ్గ కూస్కాని పురాణాని పృథక్పృథక్."

మత్స్య మార్కండేయములు, భాగవత భవిష్యములు, బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మకైవర్తలు, వామన, వాయు, విష్ణు, వరాహములు, అగ్ని, నారద, పద్మ, లిఙ్గ, గారుడ, కూర్మ, స్కాందము లని వానిపేరులు.

ఉపపురాణములు.

సనత్కుమారము, నారసింహము, నారదీయము, శైవము, దౌర్వాసము, కాపిలము, మానవము, ఔశనసము, వారుణము, కాలికము, సాంబము, సౌరము, ఆదిత్యము, మాహేశ్వరము, భాగవతము, వాసిష్ఠము అను నీపదాఱును ఉప పురాణములు అని కొందఱును, బ్రహ్మాండము, గాణాపత్యము కలిసి పదునెనిమిది యని కొందఱును జెప్పుచున్నారు. ఈ యిరుతెగలవారు మహర్షులే.

శ్రీవేదవ్యాసమహాముని పదునెనిమిదిపురాణముల రచించి లోకముల శిష్యముఖముల వెల్లడించెను. అందులో సంక్షేపముగఁ జెప్పఁబడిన గాథల విస్తరించి మహర్షులు సనత్కుమారాదు లుపపురాణముల రచించిరి కావున వ్యాస ప్రోక్తపురాణములవలెనే యీయుపపురాణములుగూడ గౌరవపదవి నధివసింపఁ దగినవియే.

పురాణోపపురాణములలో బ్రహ్మాండపురాణము చేరియున్నది.

మొదటి పంక్తిలోఁ జేరిన బ్రహ్మాండపురాణపరిమాణము పండ్రెండువేల నూఱుశ్లోకములు.

"ద్వాదశైవ సహస్రాణి బ్రహ్మాండం చ శతాధికమ్."

అని ప్రమాణము.

అద్దానిని బ్రహ్మ వాయువునకును, వాయువు మునులకును, దానినే సూతుఁడు శౌనకాదులకుం జెప్పెను.

రెండవపంక్తిలోఁ జేరిన బ్రహ్మాండపురాణమును హయగ్రీవుఁ డగస్త్యులకును, దానినేసూతుఁడు శౌనకాదులకును జెప్పెను.

మొదటిది ప్రపంచస్థిత్యాదులను, పరశురామచరిత్రము, సగరాదులచరిత్రములను సంపూర్ణముగఁ దెలుపును. కావున నది విష్ణుపురాణములలోఁ జేర్పదగు. రెండవది లలితాంబికమహిమను, లలితాదిసహస్రనామములను, భండాసురాదిచరిత్రములు, మఱికొన్ని గాథలను దెలుపును గాన నది శక్తిపురాణములలోఁ జేర్పఁదగు.

మొదటి దగు బ్రహ్మాండపురాణము తక్కినపురాణములలోఁ బేర్కొనఁబడినదిగాన నది ప్రాచీనమే యందుముగాని రెండవది ప్రాచీనమనుట కాధారములు లేవేయని కొంద అందురు. అట్లనుట పొరపాటు.

లలితాసహస్రనామములకు శ్రీశంకరభగవత్పాదులవారును, భాస్కరరాయలవారును భాష్యముల వ్రాసిరి. రెండవవారికి భట్టభాస్కరుఁ డను నామాంతరము గలదు. ఈ రెండుభాష్యములలో రెండవవారిదే ప్రఖ్యాతినొందినది. అద్వైతమతమున శ్రీశంకరులవారి గ్రంథము నెట్లు ప్రమాణములో శాక్తమతమున భట్టభాస్కరులవారి గ్రంథము లట్లు ప్రమాణములు.

భట్టభాస్కరులవారు భాష్యము వ్రాయుచు నందందు బ్రహ్మాండపురాణములోనివని యుదహరించిన శ్లోకములన్నియు నిపుడు బ్రహ్మాండోత్తరభాగ మగు శ్రీలలితోపాఖ్యానమునఁ గనఁబడుచున్నవి. కావున రెండువేలమూడువందల సంవత్సరమునకు మున్నే యీ బ్రహ్మాండపురాణము ప్రఖ్యాతినొందియున్నట్లు మన కిందువలనఁ దెలియవచ్చుచున్నయది. కనుకఁ బురాణోపపురాణములలో బ్రహ్మాండపురాణము చేరియున్నదని మనము సిద్ధాంతము చేసికొనవచ్చును. శక్తిమహిమను బోధించు బ్రహ్మాండపురాణము సమగ్రముగా ముద్రింపఁబడినట్లు కానరాదు. అందు లలితోపాఖ్యానము మాత్రము, ఆంధ్రాక్షరములతోను, నాగరాక్షరములతోను ముద్రింపఁబడియున్నది, భట్టభాస్కరు లుదహరించిన శ్లోకములన్నియు నిందున్నవి. కావున నీరెండుపురాణములను బ్రాచీనములేయని మన మొప్పుకొనక తప్పదు.

నేను బ్రహ్మాండపురాణములోని లలితోపాఖ్యానమును విశ్వావసుసంవత్సర కార్తీక బ ౫ శుక్రవారము (17-11-1905) మొదలుపెట్టి పౌష బ ౪ శనివారము (13-1-1906) నాటికిఁ బూర్తిచేసితిని. తరువాతఁ బరీధావిసంవత్సరమున బ్రహ్మాండపురాణమునంతయు దెనిఁగించితిని. లలితోపాఖ్యానమును దెనిఁగించునపుడు పూర్వభాగము దొరకినయెడల నాంధ్రీకరింతమని తలఁచియుంటిని.

కొంతకాలము పిదప బొంబాయిలో ముద్రింపఁబడిన బ్రహ్మాండపురాణమును దెప్పించిచూడఁగా నిది విష్ణుపురాణములలోని దనియే స్పష్టమైనది. మొదటిదాని పూర్వభాగము దొరకనందున నిపుడు సంపూర్ణముగ నున్నయీపురాణమును దెనిఁగించి తర్వాత నీవిషయము చూతమని యెంచితి.

రెండవది సంపూర్తినొంది 1913 సం॥ న ముద్రితమాయెను. లలితోపాఖ్యానము కొంత ముద్రింపఁబడి నిలిచియుండి మరల ముద్రింపఁబడి నేఁటికి వెలువడు భాగ్యమును గాంచెను.

మొదట స్కాందపురాణములోనిదగు హాలాస్యమాహాత్మ్యమును (మధురానగరమహిమను) దరువాత లలితోపాఖ్యానమును, పిదప బ్రహ్మాండ పురాణమును దెనిఁగించితి. హాలాస్యమాహాత్మ్యమును శ్రీ శివకామసుందరీపాదార విందములకును, బ్రహ్మాండపురాణమును శ్రీవెంకటాచలపతి శ్రీపాదపద్మములకును సమర్పించితిని.

నేను విశాఖపట్టణమునకుఁ జెంత నలరు ఖాసింకోట సంస్థానమున విద్వాంసులగు బ్ర. శ్రీ తోపల్లి వేంకటరామసిద్ధాంతిగారియొద్దఁ జదువుకొనుచుఁ గొంత కాలముంటిని. అప్పుడు మహారాజశ్రీ వక్కలంక శ్రీరామజోగరావుగారి మైత్రి నాకబ్బెను. వారి భార్యయగు శ్రీమతి వేంకటసూర్యరామజోగమాంబగారు లలితోపాఖ్యానమును బారాయణము సేయుచుండి దాని నాంధ్రీకరింపుఁ డని నాకు భర్తృముఖమునఁ జెప్పించిరి. శ్రీ లలితాంబయే వారిముఖమున నాకీ యనుజ్ఞనిచ్చెనని భావించి యామెద్వారా యాపరదేవి కర్పింప నుద్దేశించి యా వేంకటసూర్యరామజోగమాంబగారు నన్నుం బురికొల్పినందులకుఁ గృతజ్ఞతను గనఁబఱచుచు నీగ్రంథము నాయంబకడ నిడినాఁడను.

ఇందలి ముద్రణాదిస్ఖాలిత్యముల నాకుఁ దెలుపఁ బరశ్రేయస్సహనమతి విభవులగు పండితాఖండులలఁ బ్రార్థించుచున్నాఁడను.

"కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావికస్తద్గుణః"

అని విన్నవించు సజ్జనపాదసేవకుఁడు

జనమంచి శేషాద్రిశర్మ,

గ్రంథకర్త.

# సవరణలఁ దెలుపుపట్టిక.



| పుట. | పంక్తి. | ఇపుడుండునది. | సవరణ. |
|---|---|---|---|
| 11 | 16 | చరణసంభవులనూర్వ్వఱకుగా | చరణసంభూతుల శతము నకొక్కని |
| 12 | 11 | మాయభగవతి సర్వమాన్య | మాయభగవతిసన్మాన్య |
| 33 | 6 | నలుకలంకుల | నలువలంకుల |
| ,, | 7 | జంపకౌఘగుచ్ఛ | జంపకాళిగుచ్ఛ |
| 34 | 10 | కయునుబృషన్మాక్తి | కయునుబృహన్మౌక్తి |
| 36 | 12 | యద్రూపశాలినినెల్లరందురు | యద్రూపశాలినియందురెల్లరు |
| 48 | 27 | బ్రాహ్మమాతృకల్ | బ్రాహ్మ్యాదిమాతృకల్ |
| 49 | 16 | మంగళాచారసంపన్ను | మంగళాచారైకమహితుఁ |
| 52 | 18 | ననూనార్యభేద్య | వైరులకునభేద్య |
| 64 | 6 | ముగజ్యోతిరూపమై | ముగఁగాంతిరూపమై |
| 69 | 10 | రంబులుసాంద్రమ్ములన్వహా | రములు సాంద్రమ్ములు రమ్యాభి |
| 96 | 10 | భువినిచేతనములౌ | భువినచేతనములౌ |
| 140 | 6 | లగుచునలరారు | లనఁగనలరారు |
| ,, | 23 | యాభిదంబుల | యాహ్వయంబుల |
| 144 | 19 | బ్రమథమునకు | బ్రథనమునకు |
| 152 | 25 | సర్వపూర | సర్వపూర్వ |
| 163 | 20 | భూషితంబులు | భాషితంబులు |
| 190 | 25 | భంగిప్రౌఢ | భంగిఁబ్రౌఢ |
| 194 | 14 | మామద్వయా | యామద్వయా |

| పుట. | పంక్తి. | ఇపుడుండునది. | సవరణ. |
|---|---|---|---|
| 194 | 17 | హుంచేక | హుంబేక |
| 206 | 13 | కౌసముద్ర | లౌసముద్ర |
| 209 | 15 | తందా్రిమయోగనిద్రా | తంద్రామయోగ్రనిద్రా |
| 230 | 5 | సంకసంహర్త్రి | సంగసంహర్త్రి |
| 260 | 26 | కడుప్రియం | కడుఁబ్రియం |
| 262 | 22 | లలిచలాత్ము | లతిచలాత్ము |
| 275 | 28 | రాత్రి | దాత్రి |





శ్రీ ర స్తు.

శ్రీ సోమసుందరేశ్వరాయనమః.

# శ్రీమదాంధ్రలలితోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.



భరితేక్షణాయత[1]వి॰శృంఖలదృష్టిని భక్తవారముం
శోభిలఁజేయు నాత్రిపుర॰సుందరి వేంకటసూర్యరామజో
గాభిధఁ బుణ్యశీల నన॰యంబు సమస్తశుభంబులున్ మహా
వైభవచారుకీర్తిసుత ॰ వర్గములం గృప నిచ్చి ప్రోవుతన్. 1

చ. మమత మురారి వక్షమున ॰ మంగళదేవతఁ దాల్చె భారతిం
గమలజుఁ డాస్యపంక్తినిడెఁ ॰ గా యని [2]మేలము లాడుచున్నయ
య్యుమ కరమేనొసంగు శివుఁ ॰ డొప్పుగ వేంకటసూర్యరామజో
గమకుఁ జిరాయువుం సుఖ మ॰ఖండసుసంపద వృద్ధిచేయుతన్. 2

సీ. విమల [3]దుగ్ధాంభోధి ॰ [4]వీచీమతల్లిక ముద మొప్పఁ గన్నట్టి ॰ ముద్దుపట్టి
బ్రహ్మారుద్రార్చిత ॰ పాదపద్మండగు విష్ణువక్షస్థ్సలి ॰ వెలయు లలన
నిజచరణార్చన ॰ నిరతసజ్జనమానసావాసయా రాజ॰హంసయాన
ఆయతహారిపీ॰యూంచలవిస్తారితాఖిలైశ్వర్యయా ॰ యబ్జనిలయ

తే. ఎల్లలోకంబులను గన్న ॰ తల్లి దేవ, తామతల్లి [5]నతాళిమం॰దారవల్లి
శుభగుణకదంబ వేంకట॰సూర్యరామ, జోగమాంబను శుభదృష్టిఁ॰జూచుఁగాక.

చ. జలధిగభీర మీహృదయ॰ సారసభావ మెఱుంగ సాధ్యమే
జలరుహసూతికైన నని ॰ సంశయమొందెడు లోకమాత మం

---

1 విశృంఖల=అడ్డములేని. 2 మేలములు=పరిహాసములు. 3 దుగ్ధాంభోధి = పాలసముద్రము. 4 వీచి=తరంగము. 5 నతాళిమందారవల్లి = మ్రొక్కినభక్తులను తుమ్మెదలకు మందారపుఁదీవెవంటిది.

గళ నిజవక్షమందుఁ జెలఁగన్ ధరియించి యహర్నిశంబు ల
వ్వేలఁదికిఁ సంతసంబు నిడు • వెన్నుఁడు ప్రోచుఁ గృతీశ్వరిం గృపన్. 4

సీ. కమ్రహస్తాంభోజ • కంకణస్వానంబు లఖిలతాళస్ఫూర్తి • ననువదింప
నుపనిషద్బృందంబు • లొగిఁ జెలికత్తెలై పైఁ పాటఁబాడుచు • బలసికొలువ
వల్లకీగళకల•స్వానంబులేకమై యసమాన విఖ్యాతి • నలరుచుండఁ
గమ్రకటాక్షవీ•క్షణములు భక్తులకెల్ల వాంఛితముల • నీనుచుండ
తే. నిండువేడుకతో దివ్య • [1]పుండరీక, మందుఁ గూర్చుండి మదికి నిం • పొందునట్లు
వీణవాయించు[2]నలివేణి • వికచకమల, పాణి శ్రీవాణి నాజిహ్వ • వఱలుఁగాక. 5

ఉ. మానస పంకజంబున సమస్త జగద్రచనావిశారదుఁ
మానిసమర్చితున్ దివిజ • మాన్యుఁ ద్రయీమయు భక్తరక్షకుఁ
జ్ఞానమయాంగునిఁ సలిల • జాతభవుం బరమేష్ఠి భక్తినా
నీనుని జేసి సంతతము • సేవయొనర్తు ముదంబు మీఱఁగన్. 6

చ. సకలకళా ప్రవీణత నెసంగి సమస్తశుభాద్యసంస్తుతిం
బ్రకటముగాఁగ నొంది సుర•వారసమర్చితమై తనర్చి [3]భా
వుకవరదానదక్షము న•పూర్వమునై ద్విరదేంద్ర వక్త్రమా
నొక [4]మహ [5]మంతరాయముల • నుద్ధతిఁదోలి శుభంబు లిచ్చుతన్. 7

సీ. [6]కమలాక్షదశకంబుఁ • గల్పించె నేయంబ కరముచే రక్షణా•కరముచేత
భండాది దైత్యుల • ఖండించె నేయంబ శక్తిచే నతితీక్ష్ణ • శక్తిచేతఁ
బాకారిదైన్యంబుఁ • బోకార్చె నేయంబ రణముచే [7]నిహతవా•రణముచేత
సజ్జనాభీష్టాళి • సవరించె నేయంబ దృష్టిచేఁ గరుణార్ద్ర•దృష్టిచేత
తే. నరగ నేయంబ నిర్గుణు • సగుణుగాఁగఁ, జేసి జగమున [8]నిజసుంద•రీసమాఖ్య
నెరపె నాశివకామసుం•దరి సతంబు, నెమ్మి నామానసంబున • నిల్చుఁగాక. 8

సీ. పుట్టి పుట్టకమున్నె • ప్రొద్దుఫలంబంచు మ్రింగఁబోటినయట్టి • మేటిబలుఁడు
లవణాబ్ధి నవలీల • లంఘించి జానకి జాడఁదెల్పినయట్టి • శౌర్యఘనుఁడు

1 పుండరీకము=తెల్లని కమలము. 2 అలివేణి = తుమ్మెద పెక్కులవంటి తలవెండ్రుకలు గలది. 3 భావుకవర దానదక్షము=శుభస్కరములగు వరముల నిచ్చుటయందు సమర్థమైనది 4 మహము=తేజము. 5 అంతరాయములు=విఘ్నములు. 6 కమలాక్షదశకంబ=పదిమంది విష్ణుమూర్తులు. "శ్లో. కరాంగుళినఖోత్పన్న నారాయణదశాకృతిః" అని రహస్యనామసహస్రము. 7 నిహతవారణము=చంపఁబడిన యేనుఁగులుకలది. 8 నిజసుందరీసమాఖ్య=తనదు సుందరి (త్రిపురసుందరి) అను పేరును.

సౌమిత్రికై వేగ ♦ సంజీవనిని దెచ్చి ప్రాణమిచ్చినయట్టి ♦ బాంధవుండు
శిరమునందెప్పుడు ♦ శ్రీరామపాదముల్ వహియించియున్నట్టి ♦ భక్తవరుఁడు
తే. కష్టములకోర్చి భాస్కరు ♦ కరుణవలన, సర్వవిద్యలఁ జదివిన ♦ జ్ఞానరాశి
మారుతాత్మజుఁ డనుకంప♦మహితశబ్ద, కమ్రకవితను దయచేయుఁ♦గాతనాకు. 9

క. ధ్యానించెద నెల్లప్పుడు, మానసమున రాణివంశ ♦ మౌక్తికమణి ఛా
త్రానందవర్ధనుని వి, ద్యానిధి నరసింహాయజ్వ ♦ దైవజ్ఞమణిన్. 10

క. [1]శ్రుతినేత్రము భాగత్రయ, మతికరుణను నాకుఁ దెలిపి ♦ నట్టి విపశ్చి
న్నుతు వేంకట రామాహ్వయుఁ, గృతి సఫలత నొంద భక్తిఁ ♦ గీర్తింతుమదిన్.

సీ. కవితాకుమారిని ♦ గన్నట్టి వాల్మీకి వేదవిభక్తయై ♦ వెలయువ్యాసు
నంబ "త్వమేనాహ" ♦ మనుకాళిదాసుని మంజులసుకవిత్వ ♦ మహితుదండిఁ
గాళీప్రసాదైక♦ఘనుఁడైన భవభూతిఁ బ్రౌఢశబ్దస్ఫూర్తి ♦ వఱలుబాణుఁ
[2]బీయూషవర్షాఖ్యుఁ ♦ బెంపొందు జయదేవుఁ గల్పనాచతురుఁడై ♦ క్రాలుమాఘు
తే. నర్థగౌరవలసితకా♦వ్యంబుఁజేసి, ప్రౌఢిమను గన్నభారవిఁ ♦ బ్రౌఢులైన
యితరసంస్కృతకవులస♦న్నుతులొనర్తు,భూరివిఖ్యాతిమత్కృతి♦పొందుకొఱకు.

ఉ. వాగనుశాసనున్ సుకవి ♦ వర్ణ్యుని దివ్యకవిత్వమాన్యునిన్
యాగపరాత్ముఁ దిక్కనమ♦హామతి సత్కవి శంభుదాసునిన్
భాగవతాగ్రగణ్యుఁడగు ♦ బమ్మెరపోతన మంత్రివర్యునిన్
జాఁగిలి కేలుమోడ్చి యని♦శంబును భక్తిఁ బ్రశంస సేయుదున్. 13

సీ. కవిసార్వభౌమ వి♦ఖ్యాతిని గన్నట్టి శ్రీనాథునకు భక్తి ♦ చెలఁగ మ్రొక్కి
కవితాపితామహఖ్యాతిఁ ♦ గాంచినయట్టి పెద్దనార్యుని గవి ♦ ప్రియుని [3]దెలచి
పేశలవాక్సుధ ♦ విబుధులఁదనియించు కవిరాజుఁదిమ్మనఁ ♦ దవిలికొలిచి
ఘటికాశతగ్రంథ♦కల్పనానల్పనైపుణు రామరాజభూ♦షణుని దలఁచి
తే. రామభద్రుని బాగడి సూ ♦ రకవినెంచి, రామలింగనిగొలిచి ధూ ♦ ర్జటిపదాబ్జ
ములకుసాష్టాంగముగఁ గేలు♦మోడ్చియితర,సుకవులకుభక్తిదైవార♦[4]జోతలిడుదు.

క. పరవస్తు వంశవారిధి, శరదమృతమయూఖు సర్వ♦శాస్త్రజ్ఞుఁ గవీ
శ్వరు భట్టనాథసూరిని, వర [5]సమయాచార్యపదుని ♦ బ్రార్థింతు మదిన్. 15

ఆ. సౌరభంబుగల్గి ♦ సరసతనొప్పు ప, ద్మంబురసముగ్రోలి ♦ తనరు భృంగి

---

1 శ్రుతినేత్రము=జ్యోతిశ్శాస్త్రము, "శబ్దశాస్త్రం ముఖం జ్యోతిషం చక్షుషీ" అని ప్రమాణము.
2 పీయూషవర్షాఖ్య=అమృతమును వర్షించునట్లు కవిత్వమును జెప్పువాఁడను పేరు. 3 తెలచి=నమస్కరించి. 4 జోతలు=నమస్కారములు. 5 సమయాచార్యపదుని=ఒకానొక బిరుదు.

[1]ప్లవముగ్రోలలేక • బలువిడి నిందించుఁ, గాక దానవేమి • కమలమునకు. 16

చ. అలర సమక్షమందు ముద • మార నుతించి పరోక్షమందుఁ గా
ఱులు తగనాడి తజ్జ్ఞత నె•ఱుంగక నోటికివచ్చినట్లుగాఁ
బలుకుచు స్వీయసౌష్ఠవముఁ • బల్మఱు నెన్నుచు వారకాంతల
ట్లిలఁ గుకవుల్ క్రమంబుగను • హీనతనొందుదు రార్యగోష్ఠులన్. 17

చ. అనియిటులిష్టదేవతల • హర్షమునం గొనియాడి భక్తిస
జ్జననుతులైన దేశికుల • స్వాంతమునందుఁ దలంచి సంస్కృతాం
ధ్రనిపుణసత్కవీశసము • దాయము నెంతయు సన్నుతోక్తులన్
మనమున వేఁడి కాకవుల • మత్తుల ధిక్కృతిసేసి ప్రీతితోన్. 18

తే. ఒకపురాణముఁ దెనిఁగింప • నుద్యమించి, పుణ్యగాథలఁజదువుచుఁ•భూతనాథ
పాదపంకేరుహధ్యాన • పరనిజాంత, రంగభృంగుఁడనై యుండు • నంతలోన.

సీ. జనమంచివంశాబ్ధి • చంద్రోపమానుఁడై వెలయు సుబ్రహ్మణ్య • విబుధమణికి
ననురూపపత్నియై • యలరుకామాత్యంబకును దనూజాతుండ • మునివరేణ్యుఁ
డగుకశ్యపునిగోత్ర•మందుద్భవించిన వాఁడను ద్రైలింగ్య • వంశజాత
విప్రుండ మఱి యజు•ర్వేదపాఠకుఁడను శివకామసుందరీ • ప్రవిమలాంఘ్రి

తే. తామరససంతతధ్యాన • తత్పరుండ, సంస్కృతాంధ్రకవీంద్రపూ•జారతుండ
జ్యోతిషాగమవిదుఁడ శే•షాద్రిశర్మ, యనుచుఁబెద్దలు పిలువఁగాఁ•దనరువాఁడ.

వ. ఇట్టి నన్నొక్క సమయంబున శ్రీమద్వక్కలంకసత్కులదుగ్ధపాథోనిధిచంద్రుం
డగు శ్రీమద్రామజోగరాయనిధర్మపత్నియు, సద్గుణాలంకారయు, నిరంతరదా
నతర్పిత యాచకవ్రాతయు, సంస్కృతాంధ్రభాషావిశారదయు, వశీకృతశారద
యునగు శ్రీవేంకటసూర్యరామ జోగాంబ పిలువంబంచి బ్రహ్మాండపురాణాంతర్గ
తంబగు శ్రీలలితోపాఖ్యానంబు నాంధ్రభాషను రచియింపవలయు ననికోరఁ
గృతజ్ఞతంగొని యేతద్గ్రంథంబును దదంకితముగా రచియించితి. ఇఁకఁ దత్పితృ
వంశానుక్రమం బెట్టిదనిన. 21

క. కలరీయాంధ్రక్షితియం, దలఘుగుణాన్వితులు ఘనులు • నార్వేలనియో
గులలోఁ జాగంట్యన్వయ, జలనిధిశీతాంశులైన • సోమ్మదివిజేశుల్. 22

వ. వారిలోన.

సీ. కట్టించె నేకీర్తి • ఘనుఁడు శ్రీకాశియం దన్నసత్రంబును • హర్షమలర

1 ప్లవము=కప్ప.

నిర్మించె నేసూరి • నిర్మలాంబుల్లసద్వాపీతటాకముల్ • వైభవమునఁ
దన్పె నేమహనీయ • తమయశస్సాంద్రుండు భూదానములనెల్ల • భూమిసురులఁ
జేసె నేసద్గుణ • సింధువధ్వరములు నిత్యాన్నదానసం • తృప్తి మెఱయ
తే. సకలరాజాధిరాజ [1]సం • సదుపలబ్ధ, చారుకీర్తినివారిత • సజ్జనార్తి
హారితరమూర్తి జ్ఞానమా • ర్గానువర్తి, శుభవిరాజి జనార్దన • సోమయాజి. 24
చ. అతనికి నాత్రిమూర్తులన • నాత్మభవుల్ ముగు రొప్పి రాసుత
త్రితయమునందు నెంతయును • దేజునఁబొల్చెను రామజోగి త
త్సుతుఁడును రామజోగియను • శోభననామముచేఁ బరంగువాఁ
డతులగుణాభిరాముఁడు మ • హాత్ముఁడు వొల్చెను గీర్తిసాంద్రుఁడై. 25
తే. అతని ప్రియభార్య [2]మహిమస • మధరితార్య
మాన్యబాలాంబకీర్తిచే • మహిని దనరె
నతని కాసతియందు దు • గ్ధాబ్ధినింది
రారమణిమాడ్కిఁ బుత్రికా • రత్న మొదవె. 26
సీ. వకుళాలంకారాన్వయ • పాథోధిశీతాంశు సన్నిభుం డర్థేశ • సదృశవిభవుఁ
డర్థిజనాళి భ • వ్యామరభూజంబు సద్గుణమణిగణ • సాగరుండు
విమలాంతరంగుండు • కమనీయరూపుండు సర్వదిక్సంవ్యాప్త • సాంద్రకీర్తి
పండిత సత్కవి • కాండగోష్ఠీరతుం డనవరతాశ్రితా • వనచణుండు
తే. జానకీధవదివ్యాంఘ్రి • సరసిజాత, నిరతహృద్భ్రమరుండు నా • నిర్మలాత్ము
ఘనుని శ్రీరామజోగరా • యనిగిరీశుఁ, బార్వతియువలెవరియించి • [3]ప్రతిభఁగాంచి.
సీ. సాధుచరిత్రయై • సజ్జనావనదీక్ష వహియించి భువిలోన • వాసిఁగాంచి
సంస్కృతాంధ్రోన్నత • సాహిత్యమున మించి హరికీర్తిని దిక్కు • లావరించి
సత్యశీలాచార • సంసక్తఁ బెంపొంది యసమానవిఖ్యాతి • నవని నొంది
లలితగుణాళిఁ జె • లంగు వేంకటసూర్యరామ జోగాంబకు • ధీమహితకు
తే. శ్రీత్రిపురసుందరీశుభాం • ఘ్రిద్వయాను, షక్తచిత్తకుఁ బతిభక్తి • యుక్తికాశ్రి
తాళిమందారవల్లికి • నఖిలసుగుణ, మండితకును సాధ్వీకులా • మాళిమణికి. 28
వ. అభ్యుదయపరంపరావాప్తి యగునట్లుగా నాయనువదింపఁబూనిన యాంధ్రలలి
తోపాఖ్యానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 29

1 సంసత్=సభ. 2 మహిమసమధరితార్య= మహిమచేఁదక్కువగాఁజేయఁబడిన పార్వతికలది. 3 ప్రతిభ=అప్పటప్పటికి వికసించెడుబుద్ధి.

# కథాప్రారంభము.

తే. శుభములిడుమీకు వామాంగ•సుందరంబు, దేనఁబండితతతికిఁ [1]దృతీ•య మొగిఁ [2]దు
రీయమై పొల్చునమ్మహా•నీయవస్తు, వమలమాత్మరూపము త్రైపు•రముమహమ్ము.

సీ. వేదవేదాంగైక•విదుఁడు బ్రహ్మానందరసమయాత్ముఁడు యోగ•రతుఁడు సర్వ
సిద్ధాంతసారజ్ఞుఁ • డిద్ధవిచారుండు దేవతాఋషియు నై • తేజరిల్లు
నట్టి యగస్త్యుఁ డ•త్యద్భుతహేతువు లౌ తీర్థముల దేవ•తాలయముల
గిరివనంబుల సరి•ద్వరముల దేశాళిఁ గాంచుచుఁ దిరుగుచుఁ • గరుణ నచటి

తే. జంతువుల నాత్మకుక్షి పో•షణచణముల, మౌఢ్యతిమిరావృతంబుల•మానహీన
ములనుగనుఁగొనిచింతించి•యలఘుగతిని, గనియెనటఁజని కాంచీన•గరమునతఁడు.

క. అతిపుణ్యం బత్యద్భుత, మతులము నౌ నచటఁగనియె • హస్తిశిఖరియం
దతఁ డేకామ్రనికేతను, శితిగళుఁ గలిదోషహర్త్రి • శ్రీకామాక్షిన్. 32

తే. భక్తివారలఁబూజించి • పరమదృఢద, యార్ద్రచిత్తంబుతో నాతఁ • డపుడులోక
సంస్థితిని గొంత యోచించి •చాలకాల, మతులతపమున శ్రీహరి • నలరఁజేసె. 33

మ. తురగగ్రీవ తనూవిలాస మమరన్ • స్థూలాక్షమాలా [3]దర
స్ఫురదుద్యద్వరచక్రపుస్తకమహా•శోభోజ్వలద్బాహువై
ఖరి నొప్పారుచు నాత్మదేహజరుచి•క్రాంతత్రిలోకుండు నై
గరుడారూఢుఁడు తోఁచె మౌనియెదుటం • గారుణ్య మేపారఁగన్. 34

ఆ. అమిత తేజుఁడైన • యామౌని యానంద, భరితుఁడగుచు నతని • గరుడరథుని
గాంచి మరల మరలఁ • గడుభక్తి మ్రొక్కుచు, నలరునట్లుచేసె • నతులనుతుల.

క. గరుడరథుండను గుంభజ!, పరిహృష్టుఁడనైతి నీత•పంబున నింకన్
వరముంగోరుము శుభకర, వర మనినం గుంభజుండు • పలికె మృదూక్తిన్. 36

క. శ్రీనాథ! ముదమునొందితి, వేని మహిన్ మూఢజనము • లెవ్విధి ముక్తి
జానుగఁగాంతురొకో దయ, చే నెఱిఁగింపంగవలయు • శీఘ్రమ యనినన్. 37

ఆ. హరివచించె హరుఁడు•నబ్జసంభవుఁడు [4]దు, ర్వాసుఁడీవునిట్లె • ప్రశ్న మొక్క
వరుస లోకహితము • స్వాంతమ్మునను గోరి, చేసితిరి మదీయ•చిత్తమలరె. 38

---

1 తృతీయము=కోరిక. 2 తురీయము=మోక్షము(30వ పద్యము మొదలు భాషాంతరీకరణము కావున మంగళముకూడ మూలములోనిదేయని తెలియఁదగు). 3 దరము=శంఖము. 4 దుర్వాసుండు=ఒక ముని. దూర్వాసుఁడని కొందఱందురు. ముద్రితగ్రంథములయందున్నది.

తే. అస్మదుపదేశ మస్మత్కటాక్షమహిమ, లోకముల విశ్రుతంబగుఁ గాక; నేను
దేవతల కాదికర్తను దేవదేవుఁ, డనుస్వయంవిభుఁడను పరుఁడను తలంప. 39

సీ. పుట్టింపఁ బెంపను బోకార్పఁ గారకుండను త్రిమూర్త్యాత్మకుండను గుణత్ర
యాతీతుఁడను ద్రిగుణాశ్రయుండను గుణహీనుండ సతతంబు నిచ్చఁదిరుగు
వాఁడ భూతేశుండఁ బరుఁడ జగద్రూపధారి బ్రహ్మంబను దత్త్వవిదుఁడ
నిట్టినాదగురూప మిరుదెఱంగులుగల దయ్యెఁ బ్రధానమా నట్టిరూప
మది సర్వభూతగుణాత్మకంబై తగు నపరంబు సకల గుణాధికంబు

తే. పరతరం బేకమైయొప్పుఁ బరమధైర్య, నియమనిశ్చయతపముల నిఖిలదాన
ములనుదుష్కర్మనాశమై వెలయునపుడె, యాదిరూపంబు మోక్షదంబగుధ్రువమ్ము.

తే. ఏగుణంబులతోఁగూడియెసఁగురూప, మాగుణైక్యంబుచేఁబొందనౌనువినుము
అపరరూపంబుగుణయుతమైపరంగు, నదియుఁ గర్మభోగాత్మకమైతనర్చు. 41

తే. కర్మవుల నాచరించి జగంబునందుఁ, బ్రాణికోటి యద్దానిని బడయఁగలదు
మఱియుదానిననిఖిలకర్మములఁబాసి, యేనియునుబొందఁగావచ్చు నెంచిచూడ.

క. ధరఁ గర్మత్యాగము దుష్కరమేగతినైన మానిచంద్ర! విను మపా
యరహిత మతి సుగమము గో,చరమగునందఱకు; నద్దిసదసత్తనువౌ. 43

వ. ఆత్మైక్యజ్ఞానంబెద్దియది సర్వసిద్ధిప్రదాయకంబగు. మఱి వర్ణాశ్రమ విహీనులును
బాపిష్ఠులునగు పురుషులకైన యద్రూపధ్యానమాత్రంబున దుష్కృతంబు సుకృ
తంబగునో యట్టిపరశక్తిని విధిచేతనొండె నవిధిచేనొండె నెవరర్చింతు రట్టివారు
సంసారముక్తులగుదురు. సంశయంబువలదు. శివుండును ధ్యానయోగబలంబున
నారాధించి సర్వశక్తులకు నీశ్వరుండును మఱి యర్ధనారీశ్వరుండునయ్యె. బ్రహ్మా
దులగు దేవతలు తద్ధ్యానయోగవైభవంబున నఖిలసిద్ధులంగాంచిరి. కావున సక
లలోకంబులకును [1] త్రిపురారాధనంబును విడిచి యోగపద్యంబున భోగాపవర్గం
బు లొనఁగూడవు. తత్కారణంబున మంత్రాస్త్రసంయుక్తుఁడై న్యాసపూర్వక్ర
మంబునఁ దద్గతస్వాంతుండును, దద్గతప్రాణుండును, దద్యాజియుఁ దద్గతేహాకుం
డునునై యాత్మైక్యబుద్ధి నారాధించినసిద్ధినొందు. ఈరహస్యంబు సర్వహితమ్ము
గా వివరింపఁబడియె. నీతపంబునకు మెచ్చితి. దేవముని సిద్ధమనుష్యులులోనగు
వారు త్వన్ముఖాంభోజమువలన నీరహస్యము నెఱింగి సిద్ధినొందఁగలరని పలికిన
హయగ్రీవు వాక్యంబు నాలకించి. 44

తే. భక్తిసాష్టాంగమెఱఁగి యిప్పగిదిఁబలికె, నీశ!యెటువంటిరూపం బదెట్లుమున్న

1 త్రిపురారాధనము = త్రిపురసుందరికొఱకుఁ జేయఁబడుపూజ.

సృష్టి చేయంగఁబడియె నీ • చేత; నెవ్వి,తత్ప్రభావవిహారముల్ • దయను జెపుమ.

చ. అనవిని యశ్వకంఠుఁడను • నార్య! యితండు మదంశసంభవుం
డనఘుఁడు [1]సైంధవాస్యుఁడు మ•హర్షి దయానిధి గాన నెద్దిగో
రినవచియించు భవ్యతమ•రీతిని సంశయముల్ వచింపుమీ
యని హరియేగ విస్మయస•మాకులచిత్తముతోడ మౌనియున్. 46

తే. ఆహయగ్రీవుతోఁగూడి • యాశ్రమంబు,నొంది పరమాద్భుతాసన•మందునతని
భక్తినాసీనుఁగావించి • పలికెఁ గుంభ,సంభవుఁడులోకహితమైన• సరణిమెఱయ.

అగస్త్యుఁడు హయగ్రీవుని దేవ్యవతారములఁ జెప్పమనుట.

సీ. సర్వధర్మజ్ఞ! యీ•శ్వర! సర్వసిద్ధాంతవిత్తమ! శ్రేయోభి•వృద్ధికొఱకుఁ
గాదె భవాదృశ • కరుణార్ద్రచిత్తుల దర్శనంబు వచింపు • దయఁ బరేశి
యావిర్భవంబు రూ•పాంతరంబులు విహారపదమ్ములు సవిస్త•రంబుగాఁగ
ననిన హయగ్రీవుఁ • డనియె ననాదియు, నఖిలలోకాధార, • ధ్యానమాత్ర
దృశ్యయు,జ్ఞానాంగి • హృదయాస్పదయు,మహావిద్యాస్వరూపయు•విపులసుకృత

తే. కర్మరూపయునై ధ్యాన•గౌరవమున, నొప్పునాత్మైక్యమునవ్యక్తి• నొందె నాదిఁ
గలిగె నబ్జజుధ్యానయో•గమునశక్తి, ప్రకృతియననొప్పి దేవాళి • వాంఛలొనఁగ.

శా. క్షీరాంభోనిధిమంథనమ్ము గడఁకం • జేయంగ దేవాసురుల్
సేరన్ రెండవమూర్తి నొందెను మహా•చిత్రంబు సమ్మోహనో
దారాధార మచిత్తగోచరము నా • తద్రూపముం గాంచి లో
కారాధ్యుండు పినాకపాణి మది మో•హంబంది యుద్యద్గతిన్. 49

చ. లలితతనూవిలాసము చె•లంగఁగఁ బార్శ్వమునందుఁ బొల్చు న
క్కులగిరి పుత్త్రిఁ బోవిడిచి • కూరిమి మోహిని వెంటఁబాఱి యు
జ్జ్వలదనుజాంతకుండయిన • [2]శాస్తను దాఁ బడసెన్ శివుం; డనం
గలఁగినచిత్త మొప్పఁగ న•గస్త్యుఁడు వల్కె హయాస్యుతో వెసన్. 50

తే. మదనశాసనుం డెట్టుల•మ్మానినీవ, శంగతుండయి మోహాను•షక్తినొంది
పడసె నద్దేవియందు డిం•భకునినొకనిఁ,జిత్రమయ్యెడివచియింపు• చెలఁగినాకు.

క. అనినన్విని హయవదనుం, డనియెం గుంభజునితోడ • ననువొంద మునీ!
వినుమా వృత్తాంతంబును, మును సురపురపాలకుండు మోదము చెలఁగన్. 52

ఇంద్రునకు దుర్వాసముని శాపమిచ్చుట.

క. సిరిచే విజయశ్రీచేఁ, బరఁగుచుఁ ద్రిదశౌఘదనుజ • వారణమహా

1 సైంధవాస్యుఁడు = హయగ్రీవుఁడు. 2 శాస్త=బుద్ధుఁడు.

ద్ధురమగు లోకత్రయమును, బరిపాలన మొనర్చెఁ • బ్రౌఢతతోఁపన్. 53

ఆ. వెండికొండపగిది • వెల్లనౌగజరాజు, నెక్కి వేడ్క లోకు•లెల్లఁ బొగడఁ
జెలఁగుచుండ నంత • జిష్ణునిమత్తుని, గా నెఱింగి వేగ • కాలగళుఁడు. 54

వ. దుర్వాసునిఁ బిలిచి యమరవిభునికడకనుపుటయు నతండు. 55

తే. బొంత నజినంబు దండంబు • భూతిఁ దాల్చి, ధూళిచే దేహమెల్లను • ధూసరితము
గాఁగ నున్మత్తవేషుఁడై • ఖండపరశు, నాజ్ఞ [1]సురమార్గమున నేగె • నమరపురికి.

సీ. సుందరాకారంబు • శోభిల్ల విద్యాధరాంగన యోర్తు మ•హానియతిని
జిరకాలతపమున • శ్రీపరాంబను హర్షమానసఁ గాఁ జేయ • మహితకరుణ
నమ్మహాదేవి మా•ల్యంబొసంగినదానిఁ గైకొని స్వేచ్ఛ నె•క్కడకొ పోవు
చుండి దుర్వాసుని • నోగిఁ గాంచి మ్రొక్కిన నాతండు కోమల•హరిణనయన

ఆ. వేడ్కఁ గాంచి పలికె • వెలఁది యెచ్చటి కేగఁ, దలఁచితివొ వచింపు • లలితమాల్య
మిద్ది పొందఁబడియె • నెచ్చట ననవిని, వినయ మొప్పఁ బలికె • వనరుహాక్షి. 57

క. చిరకాలతపోనియతిని, బరమమునీ! తుష్టినొంది • పరమేశ్వరి శం
కరి యొసఁగె నన్న నొసఁగుము, పరమము మాల్యంబు నాకుఁ • బడఁతీ! యనిసన్.

చ. మునియిటు వేఁడినంతనె య•మూల్యము నౌ ఘనమాల్య మమ్మహా
త్మునకు నొసంగ మానినియును • దోడన హస్తములొగ్గి భక్తిచేఁ
గొనుచుఁ గృతార్థజన్ముఁడను • గోమలి! యంచు ధరించి మస్తకం
బున మరలన్ వచించె విరిఁ • బోఁడికి హర్షరసంబు పొంగఁగన్. 59

చ. సరసిజసంభవాద్యమర • సత్తమకోటి కలభ్య మిద్ది సుం
దరి! భవదీయభాగ్యమునఁ • దద్దయుఁ బొందఁగ నయ్యె నాదు భా
గ్యరతిని బొందినాఁడ నిటఁ • గామహరప్రియభామినీ పదాం
బురుహమునందుఁ ద్వద్విమల•పూతసుభక్తి యెసంగుచుండుతన్. 60

తే. సంతసమునొందినాఁడనో • సాధుమాన్య, చరిత! శుభమగు నీకు ని•చ్ఛాప్రకార
మరుగుమని చెప్ప నాతియుఁ • బరమమునికి, వీణఁ దగనిచ్చి వలగొని • వేడ్కఁ జనిన. 61

చ. తరుణిని బోవఁగాఁ బనిచి • తానును వీణియ మీటుచున్ మనో
హరగతిఁ బాడుచుర్ నభము • నందుఁ జెలంగుచు దివ్యమాల్య వి
స్ఫురణతఁ బొల్చి నవ్వుచును • బోవుచు నొక్కట నింద్రుఁ గాంచి సుం
దరవర మాల్యమాతనికిఁ • దద్దయుభక్తి చెలంగ నిచ్చినన్. 62

వ. మునివర దత్తమాల్యవర•ముఁ గ్రహించి కరీంద్ర [2]స్కంధమం

1 సురమార్గము = ఆకాశము. 2 స్కంధము = భుజశిరస్సు.

దున నిడె నింద్రుఁడగ్గజము • తోడనె చూర్ణముచేసి భూమిపై
చినఁగని క్రుద్ధుఁడై మునియు • జిష్ణునిచూచి మదర్పితంబునై
తన రెడు పుష్పమాలికను • దాల్పవుగా నిజమస్తకంబునన్. 63

క. పరమేశ్వరి శీర్షంబునఁ, బరఁగెడు మాల్యంబుభక్తి • బ్రహ్మాదులచేఁ
బరినుతమై పూజితమై, నిరుపమగతిఁ బొల్చుచుండు • నిర్మలమగుచున్. 64

వ. లోకత్రయైశ్వర్యమత్తుండవగు నీచేనమ్మహామాల్యం బవమానితంబయ్యెఁగావున సదేవాసురమానుషంబై భవత్పరిపాలితంబునగు లోకత్రయంబు మచ్ఛాపబలంబునఁ దేజోహీనంబగుఁగాతమని పలికి వినీతుండగు నింద్రునిచేఁ బూజింపఁబడియు దుర్వాసుండు భావికార్యమ్మును స్మరించుచు నూరకచనియె. అంత నింద్రుని విజయలక్ష్మి దైత్యలోకంబునొందె. నిత్యలక్ష్మియు నిత్యపురుషుండగు వాసుదేవునాశ్రయించె. మహేంద్రుండు దేవసమన్వితుండై పురంబునకువచ్చి నిశ్రీకుండును, విషణ్ణచిత్తుండునునై చింతించుచుండె. సురపురంబున ననేక దుర్నిమిత్తంబులు దృష్టంబులౌటకు నెంతయుఁ జింతిల్లి దివస్పతి బృహస్పతినిరావించి పూజించి యిట్లనియె. 65

—ఇంద్రబృహస్పతులకు ధర్మాధర్మసంవాదము.—

తే. సర్వధర్మజ్ఞ [1]త్రిసమయ • జ్ఞానకోవి, దగురుసత్తమ నాకు నెం•తయు నదృష్ట
పూర్వదుశ్శకునంబుల•ర్బుదములగుచుఁ, దోఁచుచున్నవి హేతువు•తోఁచదకట.

ఆ. ఏమిఫలమొ వాని • కెయ్యదినిష్కృతి, కి సదుపాయమనిన • వెనగురుండు
వలికెనిట్లు శాస్త్ర • పద్ధతిచెలఁగ ధ,ర్మార్థసహితవాక్య • మప్పు డెంచి. 67

క. కృతమగు కర్మమునకు విను, శతకల్పంబులకునైన • శక్తి కలుగదే
గతినిదలంచిన నాశం, బతిశయముగ ననుభవించు • టదియొకవిధమా. 68

క. ప్రాయశ్చిత్తం బనునది, సూ రొకవిధమీవిధముల • సుజనులు ప్రాక్ప్రా
ర్థాయతనాశముఁ జెప్పిరి, చేయమినది యెవ్విధమునఁ • జెడునఘమనఘా. 69

ఆ. అనిన నింద్రుఁడనియె • నతిభక్తి గురువర్య, కర్మమెట్టిదట్టి • కర్మమునకు
నాశనంబదెట్లు • నయముగఁ జెప్పుమా, విస్తరించియనిన • విబుధగురుఁడు. 70

క. మానులు [2]స్తేయము హింసయుఁ, బానము [3]హననంబు నన్య•భామారతియున్
దానవహర దుష్కర్మము, జానుగఁ బంచవిధమంచు • శాసించిరొగిన్. 71

1 త్రిసమయజ్ఞానకోవిద=త్రికాలజ్ఞానముల నెఱింగినపండితుఁడా. 2 స్తేయము = దొంగతనము. 3 హననంబు=చంపుట.

వ. దుష్కృతంబొనరించిన నద్దోషంబు బ్రాహ్మణుల [1]కయుతగుణితంబును, క్షత్రి
యులకు సహస్రగుణితంబును, వైశ్యులకు శతగుణితంబును, శూద్రులకు దశగు
ణితంబును, గోతురంగ ఖరంబులకు దశగుణితంబును, ఉష్ట్రింబులకుఁ బంచగు
ణితంబును, [2] అండజంబులకుఁ ద్విగుణితంబును, దిర్యక్కులకు నేకగుణితంబు
ను, [3]అనస్థికంబుల కేకార్ధంబునునగు మఱియును. 72

తే. బ్రహ్మభూభుజ వైశ్యయు•వతులకు క్త, మందు [4]బాదంబయగుదోష•మమరనాథ
వినుగురుస్వామిసుతమాతృ•జనయకవిమ,మునకు[5]నిష్కృతిలేదఘ•మునకునిజము.

సీ. గుర్వనుజ్ఞను జేయు • ఘోరాఘమునకగు నందునాల్గవభాగ • మతనియాజ్ఞ
దాఁటనర్ధంబగు [6]దశవిప్రభృత్యర్థ మొక్కవిప్రునిఁజంప • నొందఁడఘము
నరపతి శతమహీ•సురభృతికొఱకొక్క ధరణీసురుండు భూ•సురునిఁజంప
నఘమునొందఁడు దేవ•తాధిప భూసురపంచకార్ధం బొక్క • వైశ్యునరసి

ఆ. దండనంబుచేయఁ • దగులదుపాపంబు, పొందఁడట్లవైశ్యుఁ • బూని వైశ్య
దశకమునకుఁగాను • దండింపమఱిదాని, కొక్కనరునిఁజంప • నొందఁడఘము.

క. విను శతవైశ్యుల కొఱకొ•క్కని విప్రుని శిక్షసేయఁ • గాఁ దగుఁజేయం
జనుశూద్రసహస్రార్ధం, బనఘా దండితుని నొక్క • యవనీసురునిన్. 75

సీ. చరణసంభవుల నూ•ర్వురకుగా నొక్కని వైశ్యుదండింపఁ బా•పంబులేదు
దశపాదజులనిమి•త్తముగాఁగ నొకశూద్రు దండింపవచ్చు బాం•ధవసుహృన్ని
మిత్తమైదండింపఁ • జొత్తెంచును ద్విపాదమఘ మర్ధమఘమగు • నాత్మజస్వ
జాయార్ధమటుసేయ • స్వనిమిత్తమొనరింపఁ దగులదుపాపంబు • తథ్యమిద్ది

తే. తన్నుజంపంగవచ్చెడు • ధరణిసురుని, క్షత్రియుని వైశ్యుఁ బాదసం•జనితు గోవు
హాయము మఱిదేనినైన నత్యంతశిక్ష, సేయనఘమంటదనిమునుల్ •చెప్పిరనఘ.

మ. తనయభ్రాతృకళత్ర బాంధవుల బా•ధల్ వొందఁగాఁ జేయఁగా
విను పాపంబు పదింతలౌఁ గ్రమముగా • వృత్రాంతకా రక్షణం
బునఁ బుణ్యంబును నట్లయౌ ననుచు ను•ద్భూతానుకంపామతిఁ
ఘనవాచస్పతి పల్కి ప్రీతి మరలం • గాంతోక్తితో నిట్లనున్. 77

వ. దేవద్విజశ్రోత్రియ వేదవి [7]ద్వ్రతి వేదాంతవి ద్వేదవేత్తల హింసించినఁ గ్రమం
బున నేకద్విపంచ దశదశాయుత లక్షవారంబులు ప్రాయశ్చిత్తం బొనరింప

---

1 అయుతగుణితంబు=పదివేలచేగుణింపఁబడినది. 2 అండజంబులు=పక్షులు. 3 అనస్థికంబులు=ఎముకలులేనివి జలగలు మొదలగునవి. 4 పాదము=నాల్గవపాలు. 5 నిష్కృతి=ప్రాయశ్చిత్తము. 6 దశవిప్రభృత్యర్థము=పదిమందిబ్రాహ్మణుల భరించుట నిమిత్తము. 7 వ్రతి=యజ్ఞముచేయువాఁడు.

నిష్కృతియగు. వారిరక్షణంబునకును దానికై యొనరించిన దానంబునకును బు
ణ్యంబు పూర్వోదితోత్తర గుణంబగు. అట్టివారి దర్శనంబుచేతను, నమస్కా
రంబు చేయుటచేతను, శుశ్రూషణంబుచేతను బుణ్యంబు పూర్వోక్తసంఖ్యాతు
ల్యంబగునని పెద్దలు వచింతురు. 78

చ. హరి కరివైరి సూకర మృగాదుల ఘాతుకచేష్టలన్ మహీ
వరుఁడు సురద్విజార్థమయి • వారక చంపఁగవచ్చు నాపదం
బొరసిన నాత్మరక్షకయి • పూనికని హింసయొనర్చి [1]మేధ్యముం
గరమనురక్తిచేఁ దినఁగఁ • గల్గదు పాపము దేవనాయకా! 79

తే. తనకుఁగా నన్నమును బశుతతిని వండఁ,జనదు దేవ ద్విజార్థమై • చనునొనర్ప
నట్లొనర్చినఁ బాపంబు • నతనినంట,దనుచుఁజెప్పిరి మౌనుల • త్యాదరమున. 80

సీ. మాయ,భగవతిసర్వ • మాన్యలోకోజ్జీవనోన్ముఖియైపూర్వ • మొగినదైవ
మానుషాసుర దేవ • మాన్యులఁబుట్టించి తద్రక్షణముమదిఁ • దలఁచి పశువి
సరముఁజతుర్దశ • సంజ్ఞకమఖములఁ దద్విధానంబులఁ • దగనొనర్చి
పలికెమానవులార! • పశువులచే దేవతతిమఖమ్ములఁ దృప్తిఁ • దగును జేయ

తే. వారుమీకిష్టములనిచ్చు • వారు యజ్ఞ, భావితులునొటఁదృప్తులై;•యీవిధంబు
నెవఁడువిడనాఁడు [2]నిస్వుఁడై•యెల్లజన్మ, ములను [3]నిరయంబునందుండు•మూఢుఁ [డతఁడు.

క. సురగణమును బితరుల, గురువరు[4]నభ్యాగతు మహాత్ముఁ • బరితృప్తులఁజే
య రహిన్ మేధ్యపశువ్రజ, మురుగతిఁజంపంగవిప్రుఁ • డొందఁడఘంబుల్. 82

క. ఆపదల మేధ్యమాంసము, నాపాఱుఁడు తినినయంట • దఘమాతనినా
యాపనులనిషిద్ధంబుల, నేపునవిహితంబులైన • నీఁగుటఘనమౌ. 83

చ. మునుయువనాశ్వుఁ డెంతయును • భూరిమహాక్రతు వాచరింప నా
ఘనమఖమందు భాగములఁ • గైకొనఁబోయి యమర్త్యులెల్లఁ బా
వనమఖభాగమిచ్చునెడ • వారక మాయది మాదటంచుఁ బం
బినక్రుధఁబోటులాడఁగని • ప్రేమ విరించి మృదూక్తి నిట్లనున్. 84

ఆ. పోటులాడనేల • పోలునేయివ్విధ, మేరికైనఁ జాలు • నింకననుచుఁ
బలికి [5]పంచజనులఁ • బశువుల విభజించి, యొసఁగె వేఱువేఱ • నుద్యమమున.

చ. పరశివశక్తిభూతగుణ • పాలిని యవ్విధమెల్లఁ గాంచి ని
ష్ఠురమగు తద్విధంబునటు • చూడఁగఁ జాలక క్రోధపూరవి

1 మేధ్యము=పవిత్రమైనది. 2. నిస్వుఁడు =ధనహీనుఁడు. 3. నిరయంబు=నరకము. 4. అభ్యాగతుఁడు=భోజనమప్పుడు వచ్చినయతిథి. 5. పంచజనులు=మనుష్యులు.

స్ఫుర దరుణాక్షియాటఁదన • బుద్ధినెఱింగి నయాన్వితోక్తిన
ప్పురశివురాణితోఁబలికెఁ, • బద్మజుఁడెంతయు భక్తిమీఱఁగన్. 86

క. దేవతలకు నేపశువుల, నేవిభజించితినొ యవ్వి • యెల్లనుదలఁపం
దావకములగును ద్వద్భా, తావళికింద్రప్తినేయ • ననియజుఁడరిగెన్. 87

సీ. పరమేష్ఠిచెప్పిన • పద్ధతి నొనరించి పరమేశ్వరిని మేధ్య • పశువిసరము
వధియించి సంతృప్తి • పఱిచెఁ దత్తద్విభాగము వేదరాశినుఁ • క్తంబయాట
నిటఁజెప్పఁబడదయ్యె • నింద్ర! బ్రాహ్మణితక్క స్త్రీశూద్రులెల్ల భ • క్షింతురెలమి
మాంసఁబు; విప్రభా • మయు నాపదల దాని దేశికునాజ్ఞచేఁ • దినఁగవచ్చు

తే. మఱియునొక్కవిశేషంబు • నెఱుకపఱుతుఁ, దెలిసికొనఁదగునదిగోప్య • కలితమాట
మాంసదోషంబుఁబొరయండఁ • మానవుండు, శాస్త్రిసమ్మతమానది • సాధుహితము.

వ. ఈపిండంబు శివోద్భవంబు. మహామంగళకరంబె యగుఁగాన నోజీవమా! తెలివి గనుము. నీవశివంబవుగావు. మఱి శివస్వరూపంబవు. ఈశ్వరుఁడు జగత్కర్తయుఁ బాలకుండును బ్రళయకర్తయునగు. ఎందుచేత రుద్రుండు విశ్వాధికుండట్టి రుద్ర స్వరూపం బవని తలంచుచు గోతురంగగజోష్ట్రమహిషాదుల నాత్మార్థంబొండెఁ బరార్థంబొండె హింసించిన నరుండు పాపంబుఁ బొరయఁడు. గృహానిష్టకరంబుల గు[1]నాగాఖుజలవృశ్చికంబుల హింసించినఁ బాపంబులేదు. ఈపశుయజ్ఞంబు క్రియాఫలంబులఁగోరు గృహస్థులకొఱకుఁ జెప్పఁబడియె. అన్యులకు జపహోమార్చనాదులచే నిష్టంబులు సిద్ధించునని పలికినవిని బృహస్పతికి దివస్పతియిట్లనియె.

క. గురువర! కరుణన్ మీచేఁ, బరిగణితంబయ్యె హింస • వలనఁ గలుగు ను
ద్ధురదోషంబుల తెఱఁగిఁక, వరయఁగ స్తేయాఖ్యదోష • మధికంబనుచున్. 90

తే. చెప్పవినుచుండుఁ దద్రీతిఁ జెప్పినాడు, సంశయముఁదీర్పఁ డనవిని • శక్రుఁజూచి
పలికెగురుఁడిట్లు వినుమింకఁ బాపతరము, జీవహననంబు శాస్త్రసం • సిద్ధమిద్ది. 91

తే. దీనికన్నను బాపంబు దేవనాథ!, తలఁప విశ్వాస పాత్రుఁడు • తన్ను శరణ
మనిన నాతని శూద్రుని నంత్యజాతి, నైనఁబ్రేమించిహింసింప • నయ్యఘంబు. 92

క. విను బ్రహ్మహత్యకంటెను, ఘనమగు; నిష్కృతియు నెందుఁ • గానంబడదే
మనిచెప్పుదు నప్పాపం, బొనరించినవానిఁజూడ • నొందునఘంబుల్. 93

వ. బ్రహ్మవేత్తయు, కృచ్ఛ్రసంపాదితధనుండును, మిగుల దరిద్రుఁడును, బహుపుత్త్రకళత్రుండును, పూర్వార్జితధనంబు చేతనే జీవించుచుండువాఁడును ననువారి ధనంబును హరించిన నద్దోషంబునకుఁ బ్రాయశ్చిత్తంబులేదు. మఱియుఁ దాను

1. నాగాఖుజలవృశ్చికములు=పాములు, ఎలుకలగుంపు, తేళ్లు.

విశ్వసించినవాని ధనంబుహరించిన దోషంబు పూర్వోక్తదోషంబుకన్నను
దోషంబు, తాను బ్రేమించినను బ్రేమింపకున్న దరిద్రుని ధనం బెంతమాత్రము
హరింపఁదగదు. దానికిఁ బ్రాయశ్చిత్తంబు లేదు. కావున దేవబ్రాహ్మణుల హేమ
రత్నంబుల నెవండు హరించు నాతని వధించినవాఁ డశ్వమేధఫలంబునొందు. ఇం
దుల కుదాహరణంబుగాఁ బరమరహస్యంబును బాపప్రణాశంబును నగు నొక్క
పురాత[1]నేతిహాసంబును వచియించెదనని వాచస్పతి యిట్లనియె. 94

## ద్విజవర్మనామక కిరాతోపాఖ్యానము.

సీ. మున్ను కాంచీనామ • పురమున వజ్రాఖ్యతస్కరుం డుండెఁ ద•త్పత్తనవర
మందునెల్లరు సమ•స్తైశ్వర్యయుక్తులు సుఖులు నిరోగులు • సూనృతైక
రతులు కృపారాసు • లతులదాంతులు నొచువర్తింతు రఖిలసం•పత్సమృద్ధిఁ
దనరు తత్పురమునఁ • దస్కరుం డాతండు కొంచెము కొంచెము • కూర్చి వరుస
ఆ. ధనమునిట్లు కూర్చి • వనమున నొకచోట, స్థానమెలమిఁ జేసి • చాలలోభ
మునను దానినట్టె • పూడ్చి [2]తద్గోపన, శిలకు దూరభూమిఁ • జేరెనతఁడు. 95
క. ఆతతభూరికుఠారస, మేతంబుగ [3]వ్యాధుఁ డొకఁడు • మిక్కిలి శ్రమచే
నేతెంచి ధనదశాంశముఁ, జేతోముదమలరఁ గొనుచుఁ • జేరెఁ బురంబున్. 96
ఆ. ఇట్టులగుటఁ జోరుఁ • డెఱుఁగక యాస్థాన, మునుగడంగి శిలను • మనుజులకును
గానకుండఁ గప్పి • పూనిక మంటిచేఁ, బదిలపఱిచి చేరెఁ • బత్తనంబు. 97
క. ధనతృష్ణచేతఁ దస్కరుఁ, డనయము నార్జించి దాని•నంతయుఁ దద్భూ
మినిఁ బూడ్చెనటఁ గిరాతుఁడు, తనగృహమునకరిగి సమ్మ•దంబునఁ బ్రియతోఁ.
ఆ. పలికె నబల! కాష్ఠ•భారంబు నగ్రహింపఁ, బోవుచుండ [4]విజన•భూమియందు
సీధనంబు చిక్కె • నెప్పుడు ధనమును, గోరుచుంటివీవు • కొనుము దీని. 99
చ. అనవిని మేనువొంగ ధన • మంతయుఁ గైకొని లోననుంచి తా
మనమున నూహచేసి పతి • మన్నన తోఁపఁగఁ బల్కె నాయకా!
యనుదిన మొక్క విప్రవరుఁ • డాదర మొప్పఁగ గేహసీమయం
దునఁ జరియించు నన్నుఁ బరి•తోషమునం గని పల్కె నివ్విధిన్. 100
సీ. " ఈ [5]యోషవేగంబ•యెంతయు భాగ్యవతియగును మఱి నాల్గు• తెఱఁగులైన
వర్ణంబులందలి • వనితలలో నీపె వల్లభయగు మున్ను • [6]భిల్లులందు

1. ఇతిహాసము=తొల్లిటికత. 2 గోపనశిల=మూఁతఱాయి. 3 వ్యాధుఁడు=బోయవాఁడు. 4 విజనభూమి=మనుష్యులు లేని ప్రదేశము. 5 యోష=స్త్రీ. 6 భిల్లులు=బోయవారలు.

నంత్యజాతికిరాతు ♦ లందును[1] శైలూషులందు లక్ష్మివసింప ♦ నధికకాల
మనుచు వల్మీకసం♦జనితుఁడు శపియించె నట్లైననేమి ? యీ ♦ యబలచాల
ఆ. భాగ్యపుణ్యములకుఁ ♦ బాత్రిణియగు" నని, పల్కెవ్యర్థమానె ♦ పండితోక్తి
యెప్పుడైననద్ది ♦ యిత్తఱినిఫలించె, నాథ! యిపుడతోఁచె ♦ నాకునద్ది. 101
చ. వినుమదియట్టులుండె నొక ♦ విశ్రుతవాక్య మతిప్రయాసయు
క్తిని స్వశరీరకష్టమున ♦ దేవుకృపన్ లభియించు విత్తమే
తనకఁగఁజాలకాల మది ♦ తప్పమఁబొందు ధనంబునిల్వకే
చనును; దనంతవచ్చు ధన ♦ సంతతిధర్మమునన్ వ్యయింపనౌ. 102
సీ. కావున నీధన ♦ గణముచేఁ గూపవాపీముఖంబుల నతి ♦ పేర్మిమీఱ
నిర్మింపుమని చెప్ప ♦ నెలఁతవాక్యమువిని యాతండు భావిభా♦గ్యప్రచోది
తుండునై పలుచోట్లఁ ♦ దోయపూరంబగు స్థలముఁబరీక్షించి ♦ చెలఁగియింద్ర
ప్రాగ్భాగమందు ని♦ర్మలజలంబును బహుద్రవ్యసంసాధ్యమై ♦ తనరి యక్షు
ఆ. యోదకంబునగుచు ♦ నొప్పుతటాకంబు, నిర్మితంబుచేయ ♦ నిఖిలధనము
[2]గర్మకారులకును ♦ కడుభక్తినిచ్చి సం, పూర్తినొందకుంట ♦ బుద్ధినెంచి. 103
క. చింతాకులమానసుఁడై, యంతటమదినిట్లుతలఁచె ♦ నావజ్రాఖ్యం
బంతంబున ననుచరణం, బెంతయుఁగావింతు నాతఁ ♦ డెఱుఁగకయుండన్. 104
క. ఆతనిచేబహుధనము మ, హీతలముననునుపఁబడియె ♦ నించించుకగా
నీతఁడెదెచ్చెదననియతఁ, డాతతమతినిశ్చయించి ♦ యాచోరునకున్. 105
తే. తెలియరాకుండఁదిరుగుచు ♦ దెలిసినంత, మాత్రధనముహరించుచు ♦ మమతనాతఁ
డాతటాకము [3]సేతువు ♦ నంతఁబూర్తి, గాఁగనొనరించె సుజనులు ♦ గారవింప.
క. జలమధ్యమందుఁజక్రికి, లలిత[4]ప్రాసాదమొండు ♦ [5]లక్షణయుక్తిం
జెలఁగెడుగతినిర్మింపఁగ, జలమవ్యయమయ్యెఁజెఱువు ♦ సందీప్తిఁగనెన్. 107
ఆ. సేతుమధ్యమందు ♦ శ్రీశంకరాలయ, మురుతరంబునొచు ♦ నొప్పఁజేసె
నంతనాయరణ్య♦మతిసత్త్వయుక్తమ, య్యనుగృశించెనంత♦నుద్యమమున. 108
సీ. ఆవిత్తమునమహా♦గ్రాగ్ర్యంబులౌ క్షేత్రములనునిర్మించిసం♦పూర్ణములుగ
ద్విజసమూహమునకు ♦ దేవతావరులకు విభజించియొసఁగెను ♦ వినయమొప్ప
దేవరాతముఖాతి ♦ పావనద్విజులను బిలిపించియంబరం♦బులసువర్ణ
కనకాదులనొసంగి ♦ యనియెనిర్విధిపీఠదంతాహ్వయంబునఁ ♦ దనరి వ్యాధ

1 శైలూషులు=ఆటకాండ్రు. 2 కర్మకారుఁడు=కమ్మరవాఁడు. 3 సేతువు=కట్ట. 4 ప్రాసాదము=దేవాగారము. 5. లక్షణయుక్తిన్=శిల్పిశాస్త్రలక్షణములతోఁ గూడునట్లు.

ఆ. కులమునందుఁబుట్టి • క్రూరుండనై కాష్ఠ, భారమమ్ముకొనుచు • భూరిపాప
నిశ్చయుండనైన • నేనేడ సేతుబం, ధంబుచేయుటేడ • దైవములకు. 109

తే. ఆలయంబులు నిర్మించు • టద్దియెట్లు, విప్రులకు దివ్యగృహముల • విపులభూమి
నొసఁగుటదియెట్లు లిద్దిభూ • మిసురులార!, భూరిభవదీయకృపసిద్ధిఁ • బొందెఁగాని.

తే. క్షేత్రముల గేహములఁగొని • శీఘ్రము కృప
నన్నుఁగృతకృత్యుఁగావింపు • డెన్న ద్విజులు
గారె నాబోఁటిజడునకు • గతియటన్న
సంతసంబునఁ గైకొని • క్ష్మాజవిజులు. 111

వ. ద్విజవర్మయను నామంబాతనికిని శీలవతియను నాహ్వాయం బాతనికళత్రంబునకు నొసంగి యద్దేవరాత ప్రముఖులగు మహాత్ములు సంతుష్టమానసునిగా నొనరించిరి. అంత నాద్విజవర్మనామకకిరాతుండబ్భూసురులసంరక్షణార్థమచ్చటభార్యతోడ సంతసంబున నివసించె. పురోహితాభిధానునిచే నప్పురంబునకు దేవరాతపురంబని నామకరణంబు గావింపఁబడియె. ఇవ్విధంబున సమస్తభూసురులసంతుష్టులంగావించి భార్యతోడనాద్విజవర్మ కాలవశంబు నొందుటయు బ్రహ్మవిష్ణురుద్రదూతలరుదెంచిరి, అంతవారికి దేవాసురయుద్ధోపమంబగు యుద్ధంబు పరస్పరంబునయ్యె. తత్సమయంబుననారదుండరుదెంచిమీరేలకలహింపదూతలారా నావచనంబునువినుండీ కిరాతుండు చౌర్యధనంబున సేతుబంధనంబు గావించెఁ గావున ద్రవ్యవంతుని మరణపర్యంతంబు వాయుభూతుండై సంచరింపఁగలఁడు. విశేషించి బహుజనద్రవ్యంబును వజ్రాఖ్యచోరుండునుహరించెఁగావున వారిమరణపర్యంతంబును నీతండు వాయుభూతుండుగావలయునని పలికిననారదోక్తినాలించియాదూతలరుగుటయు నాద్విజవర్మ ద్వాదశాబ్దంబులు వాయుభూతుండైయంతరిక్షగతుండయ్యె. నారదుండాతని కళత్రముంగాంచి నీకుఁ గొంచెమైనను దోషంబు లేదు. త్వత్కృతపుణ్యవిశేషంబున బ్రహ్మలోకమున కరుగుమనవిని వాయుభూతుండగు పతింగాంచి బ్రహ్మలోకంబున కరుగ నిచ్ఛయింపక మిగుల [1]నిర్వేదంబునొంది మునివర్యునితో మహాత్మా! పతిని విడిచి బ్రహ్మకడకరుగనోప నిటనివసించి నాభర్తకెప్పుడు స్వదేహములభించునాతని కెద్దిగతియగు నేనును దాని ననుసరించెద. ఏదియేని నేనొనరింపఁదగిన పరిహారంబుగాని నాభర్త యొనర్పఁదగిన పరిహారంబుగాని గలదేయనిన నారదుండు నీభర్తకు [2]భోగార్థకశరీరంబు గలుగవలయునేని గొప్పతపంబును జేయవలయు. మత్ప్రభావంబువలనఁ బరిహారంబును వచిం

1 నిర్వేదము=నిరాశ. 2 భోగార్థకశరీరము=సుఖములనుభవించుట కొఱకగు దేహము,

చెద. నీవుని రాహారవై మహాతీర్థంబున స్నానంబొనరించి నిత్యంబీశ్వరుని నంబి కాయుతుని భక్తిచేఁ బూజించి కందమూలంబులను మాత్రము భక్షించుచు మహేశ్వరుని మనంబున ధ్యానించి [1]శతరుద్రమంత్రంబును జపింపవలయు. అష్టోత్తరసహస్రవారంబులు పఠించిన బ్రహ్మహత్యాది సకలపాపంబు లడంగు సంశయంబు లేదని [2]రుద్రాధ్యాయం బుపదేశించి తపోధనుండగు నారదుఁ డత్తరుణి ననుగ్రహించి యంతర్ధానంబునొందె. ఆతరుణి భర్తృప్రియంబు కొఱకు సంకల్పించి [3]యమ్మనువర్యంబు జపింప నాద్విజవర్మ స్తేయదోష నిర్ముక్తుండై పూర్వదేహంబునొందె. పిదప వజ్రాఖ్యచోరుండును గాలధర్మంబునొందె. వజ్రాఖ్యుం డెవరిధనంబు నపహరించె వారెల్లఁ గ్రమంబున మనుష్యతనువుల వదలిరి. యముండు వజ్రాదులం బిలిపించి మీచేనొనరింపఁబడిన పాపంబు దైవ యత్నంబునఁ బుణ్యంబుఁగూడనయ్యె. కావున సుకృత దుష్కృతఫలంబులలో మొదటదేని ననుభవింపఁగలరని యడుగుటయు వజ్రాదులు మొదట సుకృతం బునే యనుభవించి తరువాతఁ బాపఫలం బనుభవింతు మని పలుక యముండు మీరెల్లఁ బుత్రమిత్రకళత్రంబులంగూడి పుణ్యబలంబున వేగంబస్వర్గంబు నొందుఁ డనవుడు వారెల్ల విమానంబునెక్కి ద్విజవర్మనాశ్రయించి యథోచిత ఫలోపేతులై స్వర్గంబు నొందిరి. ద్విజవర్మయు స్వర్గాదిలోకంబుల నతిక్రమించి ప్రమదాయుక్తుండై గాణాపత్యంబునొంది కైలాసంబున నిప్పటికి నివసించి మోదంబున నున్నవాఁడని వాచస్పతి పలుకుటయు దివస్పతి యిట్లనియె. 112

తే. తారతమ్యవిభాగంబు • భూరికరుణ, సేతుబంధాదిపుణ్యాసం • ఘాతకర్మ
ములకువచియింపుమీవేగ • పుణ్యచరిత! యనినదివిజపురోహితుం•డనియెనిట్లు.

సీ. పుణ్యార్ధఫలమును • బొందెనుద్విజవర్మ తత్ఫలార్ధమువజ్ర • తస్కరుండుఁ
దత్ఫలార్ధఫలంబి• తరులెల్లఁబొందిరి వాక్కాయచేష్టల • స్వాంతమునను
జేసిన పాపంబు • జీర్ణించునాయాయి పరిహారములు నని • పలుక వజ్రి
యాసవంబున కెట్టు • లమరుషాపముదోష మెయ్యదితద్గుణ • మెద్దియెద్ది

ఆ. త్యాగ దోషకరము • దయమెయినాకువి
స్తరముగాఁగఁ జెప్పు • కరుణ ననినఁ
దగినప్రశ్నమనుచుఁ • దగుభంగినుత్తర
మిచ్చువాఁడ ననుచు • నిట్టు లనియె. 114

1 శతరుద్రమంత్రము = నూఱుగురు రుద్రు లధిదేవతలుగా నున్న యొకానొక మంత్రము.
2 రుద్రాధ్యాయంబు=నమకము. 3 అమ్మనువర్యంబు=ఆమంత్రశ్రేష్ఠమును.

### బృహస్పతి యింద్రునకుం జెల్పిన మద్యపాన ప్రాయశ్చిత్తము.

వ. పైష్టికంబు, తాళజంబు, [1]కైరంబు, [2]మాధూకంబు, గుడసంభవంబు ననంబడు. క్రమంబున నొకదానికంటె నొక్కటి సగము సగము పాపంబుఁ గలిగించునది యగు. అందు సర్వవర్ణంబులచేత నాద్యంబు త్యాజ్యంబు. రాజు ప్రథమద్వితీయంబుల విడువవలయు. తృతీయంబునుగూడ వైశ్యుండుత్యజింపవలయు. శూద్రుండాద్యద్వయంబును ద్రోసివేయునది. కైరమధూకగుడ సంభవంబులు క్షత్రియాదులకుఁ బానార్హంబులవు. బ్రాహ్మణవనితలు తప్పఁ దక్కిన ప్రమదలు కైరాద్యాసవంబులఁ బానంబుచేయవచ్చు. పతిహీనయుఁ గన్యయు, ఋతుమతియును నాసవంబు దేనినైనను బరిగ్రహింపఁజనదు. అభర్తృసన్నిధియందు వనితయాసక్తి మద్యపానంబొనరించిన నున్మాదిని యని ఖ్యాతినొందు. చండాలవనితనువలె దానిని ద్యజింపవలయు. దశాష్టషట్చతుర్గుణితంబులు బ్రాహ్మణాదులకుఁ బాపంబులవు. స్త్రీలకు నందర్ధంబగు. భర్తృసంగమంబున మద్యపానంబొనరించినఁ బాదదోషంబగు మఱియు. 115

సీ. మోహంబునను సుర • భూసురుండు గ్రహింపఁ గృఛ్రచాంద్రాయణ•కృత్యము
నర్చిగాయత్రినై•నను భక్తిఁబదివేలు జపియింపవలయును • జాతవేద [ను నొ
సము నేని యంబికా • సద్ధృదయం బేని జపియించిననుజాలు • సాధుశీలుఁ
డగుశుద్ధుఁడగువిప్రుఁ, • డవనిపాదికవర్ణములకు దోషముక్రమ•ముగలభించు
తే. భూసురార్ధార్ధ ముగనిట్లు • పూవుఁబోఁడు
లకును దోషంబు లభియించు • నిఁకద్విజుండు
వనితల నిమిత్త మైశీత • వారిమధ్య
మందున సహస్రము జపింప • నఘమడంగు. 116

వ. లక్ష్మి, సరస్వతి, గౌరి, చండిక, త్రిపురాంబిక, భైరవుండు, భైరవి, కాళి మహాశాస్త్రలోనగువారి పూజనంబుకొఱకు మద్యంబు ప్రశస్తంబగు. వేదాంతపారగుండగు విప్రుండు తప్పనితరులెల్లఁబరదేవిని మద్యమున ఫలాభిలాషులై యర్చింతురు. పరదేవతానైవేద్యమును గ్రహించి తదాత్మకులై ధన్యులగుదురు. మఱియు నాపరదేవీప్రభావంబున దోషరహితులై పరమగతినొందుదురు. జ్ఞానంబున నొండె నజ్ఞానంబున నొండెనొనరించిన సమస్త పాపంబులకును బరాశక్తిపాద

1. కైరంబు = నాళికేరసంబంధము - వామైకదేశేనామగ్రహణమను విధిచేనని తెలియఁదగు.
2 మాధూకము=ఇప్పచెట్టునుండితీయునది.

పంకజన్మ ౖతియే ప్రాయశ్చిత్తంబుగాఁ జెప్పఁబడియె. పరదేవి నారాధింపక యే యధముండు మద్యంబును ద్రాగు నాతండు తద్బిందుసంఖ్యాకవత్సరంబులు రౌరవనరకంబున నివసించు. ఏబ్రాహ్మణాధముండు భోగేచ్ఛచే మద్యంబును ద్రావు నతనికి శిలాగ్నిపతనంబు తక్క వేఱొండు ప్రాయశ్చిత్తంబు లేదు. కామంబుచేతఁగాని స్నేహంబుచేఁగాని భూసురుండు సురాపానంబును జేయఁజనదు. అజ్ఞానంబున సురాపానంబుచేసిన మహాత్ముల యనుగ్రహంబుచేతను, గర్హానుతాపంబుచేతను, బరాశక్తి నర్చించుటచేతను, యమనియమాదులచేతను, దినసంఖ్యాకృతంబగు కృఛ్రచాంద్రాయణంబుచేతను బ్రాహ్మణుండు శుద్ధుండగు. బుద్ధిపూర్వకంబుగా మద్యమునుద్రావిన ద్విగుణ ప్రాయశ్చిత్తంబున శుద్ధుండగు నని పలుక బృహస్పతితో శతముఖుం డిట్లనియె. 117

—॥ అగమ్యాగమనదోష తత్ప్రాయశ్చిత్త విచారము. ॥—

సీ. సంతసంబందె నా♦స్వాంత మగమ్యాగమన మెట్టి దద్దియే♦మూడ్కినడఁగు
నెద్దిదోషమునాకు ♦ నెఱుఁగంగఁజెప్పుమా విస్తరంబుగసాధు ♦ వినుతచరిత!
మునివర్య! యనదేవ ♦ ముఖ్యునిగనియిట్లు వల్కెఁదద్దోషమె ♦ బ్బంగియనిన
మాతృసోదరిగురు ♦ మానిని మాతులపత్ని వీరినిబొంద ♦ వచ్చునట్టి
ఆ. దోషమునుమియట్టి ♦ దోషమునశియించు, భంగిలేదు; మాతృ ♦ సంగమమునఁ
గలుగునేయఘంబు ♦ కన్నుగానక తన, భగినిఁబొందనట్టి ♦ పాపమొందు. 118
సీ. గురుభార్యఁబొందుట ♦ సరియగుదానికిఁ బరికింపగురువులు ♦ బహువిధములఁ
గీర్తింపఁబడుదురు ♦ కేవలబ్రహ్మోప దేశంబు మొదలుగా ♦ దివ్యవిమల
వేదాంత దర్శన ♦ విధితుదగానున్న గురువెయా ధరమహా ♦ గురువు మఱియు
బ్రహ్మోపదేశంబు ♦ పరఁగనొక్కెడ వేదశాస్త్రంబులొక్కెడఁ ♦ జదువవార
తే. లగుదురాచార్యులటుగాన ♦ నందుగురువు
పత్నిఁగూడినఁ దనదేహ ♦ పతనమెయగు
నిష్కృతి, మఱియు నాచార్య ♦ నెలఁతఁబొంద
ద్వాదశాబ్దంబు లతికృచ్ఛ్ర ♦ తపముసేయ. 119
వ. దోషశాంతియగు. అట్లె దేశికుల పత్నులను బొంద నొక్కొక్కదానికి షడబ్దంబులుగాఁ బ్రాయశ్చిత్తం బొనరింపవలయు. మాతుల పత్నీసంగమం బొనరించిన షడబ్దంబులు కృచ్ఛ్రం బొనరింపఁదగు. బ్రాహ్మణుండు సజాతీయప్రమదను

గామింపఁ ద్రిరాత్రోపవాసంబును బ్రాణాయామశతంబును బ్రాయశ్చిత్తంబులు. పిదప శుద్ధుండగు. విప్రుండు సజాతీయ యగు [1]కులటనుబొందఁ ద్రిరాత్రోపవాసంబున శుద్ధుండగు మఱియును. 120

తే. క్షత్రియను వైశ్యజనుబొంది • క్ష్మాసురుండు, పంచసప్తాహములనుప•వాసకలనఁ
బాపనిర్ముక్తుఁడగును [2]కైవర్తకర్మ, కారఘటకృత్కిరాతాది•కామినులను. 121

సీ. కామింపఁబరదేవి • కమ్రాంఘ్రిపూజచే ద్వాదశదివసోప • వాసమహిమఁ
బరిశుద్ధుఁడగు; [3]నంత్య•భామినిభూసురుం డరయక కామింప • నబ్దమునను
పవసింపశుద్ధుఁడై • భాసిల్లు; దేవదాసియు మఱిబ్రహ్మదా•సియుస్వదాసి
పాదజుదాసిగాఁ • బరిగణింతురు నాల్గుతెఱఁగులనందుక్ష•త్రియకుసమలు

తే. మొదటియిద్దఱు; తరువాతి•పూవుఁబోఁడి, వైశ్యజాసమ; తరువాతి•వనితహీన
జాతితుల్యయయగు; విప్ర•జాతిజన్ముఁ, డాత్మదాసినిబొంద దో•షార్ధమొందు.

క. ఋతుమతియగు స్వాంగనను, ద్యతమతిఁ గామించువిప్రుఁ • డాసమయమునఁ
వ్రతమును బ్రాజాపత్యము, నతిభక్తినొనర్ప శుద్ధుఁ•డగు నఘమడఁగున్. 123

వ. ఋతుమతియైయున్న పరభామనుగామించినఁ[4] బ్రాజాపత్యంబును ద్వివారంబొనరింపవలయు. అట్టి క్షత్రియాంగనఁ గామించినఁ జతుర్వారంబులు ప్రాజాపత్యవ్రతంబు నాచరింప నఘముడంగు. అట్టిదియగు వైశ్యకామినిని బొందిన నష్టవారంబులు పూర్వోక్తవ్రతం .బాచరించినఁ బాపంబునశించు. అట్టిశూద్రతరుణితో భోగించిన షోడశవారంబు లావ్రతంబు నాచరించునది. అట్టి సంకరజాతిలలనతోరమించిన ముప్పదిరెండువారంబులు పైవ్రతంబు నాచరింపవలయు. అట్టి వేశ్యనుగూడిన శూద్రతరుణీ ప్రాయశ్చిత్తంబును జేయ నఘమునశించు. రజస్వలయగుభార్య నెవండు మోహంబున రమించు నతండు స్నాతుండై వస్త్రాంతరమును ధరించి యాదినం బాసాయంబు నుపవసించి పరదేవిని బూజించిన శుద్ధుండగు. అన్యాంగననుబొందినఁ బూర్వోక్తంబగు ఋతుమతియగు పరభామినికిఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తార్ధంబును జేయునది. ఎవండు పితరుల యనుజ్ఞచేఁ గన్యను విధివిరహితంబుగఁ బొందు నతండు త్రిరాత్రోపవాసంబున శుద్ధుండగు. మఱియాకన్యను వివాహంబుగావలయు. కన్యాగంతయగువాఁడు పితరుల యనుజ్ఞచే నన్యోఢను గామించిన దివసత్రయోపవాసంబున శుద్ధుండగు. పితరు

---

1 కులట=అంకుటాలు. 2 కైవర్తకర్మకారఘటకృత్కిరాతులు=జాలరి, కమ్మరి, కుమ్మరి, అడవియందుఁ దిరుగుబోయ. 3 అంత్యభామిని= చండాలస్త్రీ. 4 ప్రాజాపత్యము = పండ్రెండు దినములలో ముగింపఁదగినవ్రతవిశేషము.

లచేఁ దెలియఁబడి కన్యాత్వమం దొక్కమాస ముపభోగించిన వాఁడన్యోఢయ
గు దానిం బొంది ప్రాణాయామశతంబున శుద్ధుండగు. ఏకపురుషసంగతయని
తెలిసియు నాకన్యను మఱియొకవరునకిచ్చిన నాతండు వృషలుండనంబడు. సర్వ
కర్మబహిష్కృతుండగు. పితరులచేఁ దెలియఁబడి పరోఢ నెవఁడు కామించునో
యాతండు మృతినొందిన నావనిత విధవయనఁ బడి పూర్వపురుషునిఁ బొందవల
యు. ఆతండు విప్రానుగ్రహంబున నుద్వాహవిధిచే దానిని బరిగ్రహించి శ్రౌత
స్మార్తాదికర్మముల నొనరింపవలయు. ప్రథమమున వివాహితయగు వనిత తనవ
రుండు మృతినొందిన నన్యసంగతయగునది యాపురుషునకు భోగసాధనమాత్ర
యగు. అఖిల కర్మాచరణంబుల కనుకూలంబుగాదని చెప్పి మఱియును. 124

సీ. విను బ్రహ్మ మొదలు పిపీలికాంతంబగు జగము స్థావరమును • జంగమంబు
పంచభూతాత్మకం • బంచుఁ జెప్పంబడు వాసనాత్మకమగు • వపువు తలఁప
నాహారమదననిద్రానిష్టములు జని మొదలెల్ల కాలంబుఁ • బొదలునందు
నాహారములు లేక • యలరదు జంతువాహారంబు మదనుండె • యగునతండు
తే. దుస్సహుఁడుగాన నాతనిఁ • దొలఁగఁ ద్రోయఁ
బ్రాణిసముదాయమున కెట్లు • వశమగు మును
కమలగర్భుండు సృష్ట్యాది • కాలమందు
సర్వలోకాళినిర్మించు • సంతసమున. 125

వ. మన్మథుని చేఁ బున్నారీరూపంబుగా నొనరింపఁబడి సృష్టిస్థితిలయాత్మకంబగు ప్రవృత్తి
నొనరించె. ఆప్రవృత్తిచేఁ బ్రవర్తించుచుందురు. ఆప్రవృత్తి నిమానిననక్షయగతిలభిం
చు. నివృత్తివలన నేముక్తి నలుగునట్టిముక్తియుఁ బ్రవృత్తివలనఁ గలుగు నుపాయం
బు నిప్పుడు వచియించెద నాకర్ణింపుమని సురగురుండు సురవరున కిట్లనియె. 126

క. పురుషుఁ డెన్న వినుము • పూర్వుండు సర్వాత్మ, గతుఁడు వాసుదేవుఁ • డతులితుండు
సర్వలోకములకు • జననియు మూలప్ర, కృతియునైన లక్ష్మి • యిదియె సుమ్ము. 127

తే. [1] పంచపంచాత్మతృప్త్యర్థ • మెంచి రతముఁ, జేయుసీవక్ష్యమాణసం • సిద్ధమంత్ర
భావనను రతమొనరించు • వారు పుణ్య,కర్మకులు దోషదూషితుల్ • గారు జగతి.

ఆమంత్రానుభావం బెట్లనిన నిదియంబ జగద్ధాత్రి. నేను బురుషుండ. సదాశివుండ.
పంచవింశతితత్త్వప్రీతికై యిప్పుడు సురతంబొనరింతు నని రతంబొనరించిన నా
యిరువురు పుణ్యకర్ములు. వారి నించుకంతయు దోషంబంటదు. మహేంద్రా!
యిది పరమమహారహస్యంబు. సర్వపాపంబులకు యోగపద్యనాశనంబు భక్తిశ్రద్ధా

1 పంచపంచాత్మతృప్త్యర్థము=పంచవింశతితత్త్వములతోఁ గూడిన మనస్సుయొక్క తృప్తికొఱకు.

సమాయుక్తుండై స్నానంబొనరించి యంతర్జలస్థితుండయి పంచాక్షరీమహావిద్య నష్టోత్తరసహస్రవారంబులు జపించి పరాశక్తినారాధించినఁ గలుగు. ఈకృత్యంబునఁ గల్పకోటికృతంబులగు పాపంబులైన నశించు. సర్వాపదలు తొలంగు. మనోవాంఛాసిద్ధియుఁగలుగు నన విని శచీనాథుండు. 129

తే. సర్వధర్మజ్ఞ! గురువర్య! • సర్వభూత, హితరతా! కృపచేనాకు • నెఱుఁగఁ జెపుమ
పాపమెట్టిదిసంయోగ • భవముతద్వి, శేషము ననంగ మోదంబు• చెలఁగగురుఁడు.

ఆభోజ్యవస్తునిర్ణయము.

వ. సంయోగజంబగు పాపంబు ననుభవించువాడు ప్రధానకర్తయు,సహకారుండును, ప్రేరకుండును,అనుమతుండునునను నీనలుగురియందుఁ గర్తకన్న సహకారుండుదశాంశాల్పపాపంబు నొందు. ఇట్లే క్రమంబునఁ దక్కినవారలు పాపంబును బొందుదురు. తన్నివృత్తి పూర్వోక్తమార్గంబుననగు. మఱియును[1]మద్యంబును,[2]గలంజంబును, [3]వృక్షరసంబునుఁ,బుట్టగొడుగులును, ముల్లంగియు,వెల్లుల్లియు,[4]గళింగంబును, ఏనుఁగుబీరకాయయు, దొండపండును, [5]లింగియు, నల్లకలువయు, [6]శిగ్రుబింబికయు, నౌదుంబరంబును, వార్తాకంబును,[7]గతకంబును,బిల్వమారికయు నను వీనికిఁ గ్రమంబున దశగుణన్యూనపాపంబు చెప్పఁబడు. 131

సీ. వినుభామ గ్రామాంగ • వేశ్యాంగములనమ్మువారలుమఱియును • వారతరుణి
వగునుపాయనముల • నమ్మువాఁడును మఱి స్వపురస్థసేవకా • ల్పపురవాసు
లును, వైద్యుఁడభిశస్తుఁ•డును శాఖివైఖానసుఁడు నారీజీవ•కుండునన్న
విక్రయి, శస్త్రజీ • వియును బరివ్రాట్టును, వైదికాచారంబు • బదలునతఁడు
తే. నొగి శచీనాథ వీరిప • క్వోదనంబు,దశగుణన్యూనదోషంబుఁ • దగులుఁదినిన
ననుచు ధర్మజ్ఞులైనమ • హాత్ములనువ, దించిరింకను వినుపాప • సంచయంబు. 132
తే. ఉత్తముండగు పాదజు • నోదనంబుఁ, దైలపక్వంబునెఱుఁగక • తగభుజించు
బ్రాహ్మణక్షత్రవైశ్యులఁ• బాదదోష, మంటునని చెప్పి రెంతయు•నరసిమునులు.
సీ. ద్విజదాసియన్నంబుఁ • దినినవట్లగు నదిచూడంగనర్థంబు • చొచ్చునఘము
వైశ్యాన్నముననుద్రి • పాదదోషంబగుఁ దద్భ్రష్టమైననో • దనముఁదినినఁ
బాదజాన్నప్రోక్త • పాపంబులభియించు; గవ్యచతుష్టయ • కలనవిరహి
తంబైనగోపున•న్నంబుభక్షించినఁ జరణజప్రోక్తదో•షంబు దగులుఁ

1 మద్యము=సారాయి. 2 కలంజంబు=గంజాయిచెట్టు. 3 వృక్షరసము=చెట్టుజిగురు. 4 కళింగము=పుచ్చకాయ. 5 లింగి=లింగాకారమగు విత్తనములుగల యొకానొక చెట్టు. 6 శిగ్రుబింబికా=మునగ. 7 కతకము=చిల్లగింజ.

తే. దైలఘృతగుడసంప్రయు• క్తంబునైన, పక్వమూరవ్యకృతముఁబా•పంబులేదు,
భక్షణముసేయ; నీరీతి•భక్షణార్థ, వస్తువితతిని జెప్పిరి•వరమునులొగి. 134

వ. వైశ్యకృతమష్టయగు బ్రాహ్మణిచేఁజూడఁబడిన దోషంబులేదు. ఋషియన్నంబును బ్రాహ్మణుండు భక్షించినఁ బ్రాణాయామశతంబునుగాని యంతర్జలంబున ద్రుపదను ద్రివారంబులుగాని "యిదం విష్ణుత్ర్యంబకంబుల" నంతర్జలంబునఁ ద్రివారంబులుగాని జపింపవలయు. ఋషియన్నంబును వనితభుజించి యేకాదిబ్రాహ్మణభోజనంబు నొనరించి యొక్కరాత్రి యుపవసించిఁ బాపనిర్ముక్తయగు. అబ్లింగంబులగు పావమానికంబుల నన్నంబును బ్రోక్షించి యన్నసూక్తంబులను జపించి "భృగుర్వై వారుణి" యనుమంత్రంబును "బ్రహ్మార్పణ" మ్మను శ్లోకంబును జపించి యన్నంబును భుజించినఁ బాపంబులేదు. "ఇదంవిష్ణు" వను మంత్రంబుచే సప్తవారంబు లభిమంత్రించి సోహంభావంబున దానినిధ్యానించి భుజించిన దోషంబులేదు. అట్లుగాక శంకరునిధ్యానించి త్ర్యంబకంబును జపించి సోహంభావంబున నన్నంబు భక్షించినను బాపంబుపొందదు. మహేంద్రా! యొక్కరహస్యవచనంబును వినుము. పరాశక్తిని ధ్యానించి పంచదశాక్షరీ మహామంత్రంబును జపించి తన్నివేదితబుద్ధితో నెవండు ప్రత్యహంబు నన్నంబును భుజించునాతని కించుకంతయు నన్నదోషంబుగలుగదు. దారిద్ర్యభయంబును, వ్యాధిభయంబును, శత్రుభీతియునుగలుగవు. పాపంబు తెఱంగును దత్ప్రాయశ్చిత్తంబును విస్తరించిచెప్పితి నింక నేమి విన వాంఛింతువని యడుగుటయు నింద్రుండు భక్తితో సురగురువున కిట్లనియె. 135

ఇంద్రుండు తనకుఁగలిగిన యాపదలకుఁ బ్రాయశ్చిత్తమడుగుట.

క. గురువర! కాలత్రయవి, ద్వర! ధర్మజ్ఞాననిపుణ! • పాపంబులుత
త్పరిహారము దెలుపంబడెఁ, గరుణనుమీచేత; జ్ఞాన • కలితుఁడనైతిన్. 136

క. నాకీయాపదగల్గుట, యేకర్మవిపాకముననొ • యెవ్విధిఁదొలఁగుం
బ్రాకటముగఁ దదుపాయము, నాకిపు డెఱిఁగింపవయ్య • నయగుణనిలయా!.

చ. అనవిని దేవతాపతికి • నాదరమొప్పఁగ నిట్లు చెప్పె నా
ఘనమతిమున్ను కశ్యపుఁడు • కాంచెసుతున్ దితియందునొక్కనిన్
దనుఁడనువానినొక్కరుచి • ధామనుబుత్త్రికనట్లకాంచె న
వ్వనితచెలంగె శీతరుచి • వైఖరిరూపవతీ మహాఖ్యచేఁ. 138

మ. తనయారత్నముఁగాంచిమౌనివరుఁడీ • తన్వంగి నెందేనియో
గ్యునకీయందగునంచు ధాతకొసఁగెం • గోర్కుల్ విడంబింప న
వ్వనజాతప్రభవుండు రూపవతితో • భాసిల్లి క్రీడించియొ
క్కనిఁబుత్త్రుంగనె విశ్వరూపుని మహా • కాంతిప్రమోదాకరున్. 139

చ. అతఁడును గేశవాంఘ్రిభజ • నాయతచిత్తుఁడు వేదపారగుం
డతినయశాలియై చెలఁగె • సంతటదానవ నాయకుండు వి
శ్రుతగుణుఁడైన భార్గవుఁ బురోహితుగా వరియించె నింద్ర! నీ
వతులిత దేవరాజ్యమున • కర్త్వతనొందక యుంటివయ్యెడన్. 140

ఆ. విబుధులకునునీవ • వికృతుఁడవౌటను, దెలిసి కొంటివీవు • దేవతలును
విశ్వరూపునంత • విబుధపౌరోహిత్య,మునకురమ్మంటచుఁ • బూన్కిఁబిలువ. 141

సీ. అంగీకరించెన • య్యనఘుండు మునివర్యుఁడసురుల మేనల్లుఁ • డయ్యుసురుల
యందువిరోధంబు • నొందకుండెఁదపస్వి కావుననంతటఁ • గర్బురాధి
పతియును నీవును • బరికింపఁగసమాన బలశాలురైతిరి • పంతమూని
కుపితుఁడవై నీవు • తపమూనియున్న యవ్విశ్వరూపునిఁజంప • వెదకియనఘు

తే. నాసనస్థునిమునిసంఘ • భాసమానుఁ, ద్రిముఖుశృంగత్రయోపేత • దివ్యశిఖరి
సముని వేదౌఘముఖరిత•సర్వదిగ్వి, భాగకునిసచ్చిదానంద•పరునిఁబరుని. 142

క. భూతౌఘహితుని నతనిన, రాతులకనుకూలుఁడనుచు • రయమునశీర్ష
వ్రాతముయుగపత్ఖండిత, మైతగునట్లొనరఁజేయ • నప్పాపమునన్. 143

ఆ. బాధితుండవగుచుఁ • బరిపరివిధముల, ననుభవించియఘము • మనమునందు
భయముప్రబలుటయును • బరుగెత్తికనకాద్రి, కందరమునఁజాల • కాలముండి.

చ. కృతమగుఘోరపాపమును • గేవలబుద్ధిఁ దలంచుచుంటి వీ
వితమునసీవటుండనిట • విశ్రుతమౌనియొకండు చెప్పఁగా
సుతుఁడిటులంతమొందవిని • చొక్కుచుధాతసుతాతిశోకసం
తతపరిపీడితుండగుచుఁ • దద్దయుఁగ్రోధరసంబు పొంగఁగాన్. 145

క. శపియించెనిన్ను "శక్రుం, డపగతలక్ష్మీయుతుండ • యయ్యెడు నిఁక నా
తపముబలిమి" ననిపల్కిన, యపుడే దేవతలుభీతి • నందిరిమిగులన్. 146

ఆ. నాయకుండులేమి • మాయదైత్యులుతమ్ము, బాధనొందఁజేయఁ • బౌరుషంబు
విడిచిబ్రహ్మకడకు • వెసఁజనివృత్తాంత, మంతయునువచింప•నతఁడువగచి. 147

క. చింతించితత్ప్రతిక్రియ, నెంతయునదికానరామి • హితమతిఁదనలో
మంతనముచేసివారలఁ, జింతామణి యైనహారిని • జేర్చి మహార్తిన్. 148

చ. నతులొనరించిభక్తిబహు • నామములన్నుతియించి యంతనా
శతధృతివిన్నవింపవిని • సారసనేత్రుఁడు లోకనాయకుం
డతికరుణాంతరంగుఁడవు • డారసియోచన చేసి పాపసం
తతిఁద్రివిధంబుచేసివని • తాధరణిక్షితిజోత్కరంబులన్. 149

వ. భరియింప నియోగించి ఋతుకాలంబుల యందె భర్తృ సంగమంబును, పుత్త్రావాప్తియును స్త్రీలకును, ఛేదింపఁబడినను మరల నుద్భవించునట్టి శక్తి వృక్షంబులకును, ఖాతపూరణంబు భూమికిని వరంబుగా నొసంగె. అంతనప్పాపంబును రజోరూపంబున వనితలును, వృక్షరసరూపంబున వృక్షంబులును, ఊషరక్షేత్ర రూపంబున భూమియునుధరించె. అంత దేవనాయకా! నీవు మేరుకందరంబునుండి వెడలి రాజ్యంబును లక్ష్మిని బరమేష్ఠికరుణనొంది యతనిచే నూరడింపఁబడితివి. ధాతయు జనార్దనునితో మహాత్మా! నాశాపం బమోఘంబు కావున నీయింద్రునకుఁ గాలాంతరంబున ననుభవరూపంబగుఁగాక యనవిని నారాయణుండు భావికార్యజ్ఞుండు కావున మాఱుపలుకక వైకుంఠంబునకరిగె. అది మొదలింత పర్యంతంబును లోకత్రయంబును బాలించితివి. ఐశ్వర్యమదమత్తుండవై కైలాసంబును బీడించిన కతంబున సర్వజ్ఞుండగు నీశ్వరునిచేఁబ్రేరితుండై దుర్వాసుండరుదెంచి త్వన్మదభ్రంశంబును జేయనెంచి శపించెఁ గావున శాపద్వయంబునకు ఫలం బొక్కవిధంబుగా సమకూరె మఱియును. 150

సీ. కనుఁగొను దేవేంద్ర! • కడువడిలోకత్రయంబు నిశ్శ్రీకంబ • యయ్యెనిపుడు
దానంబులును యజ్ఞ • తపములు యమనియమంబు లెల్లనడంగె • మహినివిప్రు
లెల్లనిశ్శ్రీకులై • యెసఁగు లోభోపహత హృదయులై విసత్త్వతనులగుచు
ధైర్యవిహీనులు • దైవదూషకులునై పరఁగిరిభూదేవి • విరహితౌష

తే. ధియును నిర్గతవీర్యమై • తేజరిల్లె,రవియు ధూసరతనుఁడయ్యెఁ • బ్రభయులేక
చంద్రుఁడాకసముననుండు • జ్వలనుఁడనిల,ధూళితనుఁడునుగాంతివి • దూరుఁడయ్యె.

క. సుముఖములుగావు దిగ్భా, గములు నభంబమలమగుచుఁ • గానంబడ దీ
యమరులు దుర్బలులై యి, ష్టముకొలఁదిగ నవ్యరీతిఁ • జనుచుందురహా. 152

వ. సచరాచరంబగు త్రైలోక్యంబు వినష్టప్రాయంబె యయ్యెనని బృహస్పతి దివస్పతికిఁ దెలిపెనని కుంభసంభవునకు హయగ్రీవుండు తెలిపి మరల నిట్లనియె.

క. విను కుంభజ! మునివర్యా!, ఘనముగ నీరీతి [1]దేవ • కాంతేజ్యులక
య్యెను వాద మంతలోపల, దనుజులు మలకాదులెల్ల • దర్పోద్ధతులై. 154

1 దేవకాంతేజ్యులు=దేవకాంత, ఇజ్య=ఇంద్రబృహస్పతులు.

చ. సురనగరంబుఁజొచ్చి బల • శోభితులై కడుబాధచేసి సుం
దరతరుగుల్మసౌఖ్యకర • నందననామక పుష్పవాటి ను
ద్ధురగతిఁగిట్టి వృక్షములఁ • దోరపుశక్తిని బెల్లగించి ని
ష్ఠురరభసంబునన్ లతల • సొంపునడంచి కలంచి యంతటన్. 155

చ. వనపరిపాలకౌఘమున • వారితబాణములం గలంచి మిం
చిన బలయుక్తిసాలము విజృంభిత బాహుల బెల్లగించి ప
త్తనమునుజొచ్చి హర్మ్యగత • దానవవైరుల బింకమార్చి త
ద్వనితల నప్సరోంగనల • బాహుబలంబునఁ బట్టి చెచ్చెరన్. 156

క. కొనిపోయిరంత దివిజులు, దనుజాపీడితులు నౌటఁ • దావిని వారిం
గొని పురమువిడిచి పాఱెను, వనజాసను కడకు వజ్రి • బలవిరహితుఁడై. 157

ఆ. బ్రహ్మధామ మొంది • పరిపరివిధములఁ, జింతమోమునందుఁ • జెలఁగుచుండ
విస్తరించిదైత్య • విక్రమవృత్తాంత, మునువచింప ధాత • యును గలంగి. 158

క. వారల నిశ్శ్రీకు సునా, శీరుని గని పలికె నిట్లు • చింతింపఁగనే
లా రయము మీఱఁ గేశవు, భూరికృపానీరరాశి • భూతహితకరున్. 159

చ. శరణము నీవెయంచు నతి • సంఘమొనర్పుము దానఁ గేశవుం
డురుముదమంది సత్ఫలము • నొయ్యననిచ్చునటంచుఁ బల్కనా
సరసిజసూతివేఁడి దివిజప్రకరంబును బ్రహ్మతోడ దు
స్తరకలశాబ్ధి నొందఁగ విధాతయుఁ నింద్రుఁడు దేవయుక్తులై. 160

తే. హరినిగీర్తింప సర్వలోకాధిపుండు, నాను దేవుం డచింత్యుఁ డవ్యయుఁడు సుప్ర
సన్నుఁడై లోకరక్షణచతురుఁడౌటఁ, బల్కె దేవాళిఁ గనుఁగొని ప్రౌఢ [1]భణితి.

తే. మీకుసన్నిధి నొసఁగెద • మీరలిపుడు, తేజమునువృద్ధినొందించు • దివ్యతరము
నైన మద్వాక్యమాలించి యట్లెచేయుఁ, డమరవరులార! మీకగు నఖిలశుభము.

## అమృతమథనము.

సీ. ఓషధివరముల • నొయ్యనఁ గలశాబ్ధివైచి నా చెప్పిన • వాక్యరీతి
నసురులతో మంద • రాద్రిని గవ్వంబుగాఁ జేసి వాసుకిఁ • గడఁగి [2]యోక్త్ర
మునుగానొనర్చినే • ఘనసహాయుండనై యుండ మథింపుఁడీ • యుబ్బుమీఱ
నసురులమ్మృదువులౌ • నట్టిమాటలచేత మన్ననచేసి సామాన్యమిద్ది

1 భణితి="భణితిః – 'తితుత్రఇతీణ్నిషేధే' 'తితుత్రేష్వగ్రహాదీనాం' ఇతి వచనాదిడాగమః" అని అణరణాది దండకమున మాధవాచార్యుఁడు. భణితియనికొందఱు. వాక్కు. 2 యోక్త్రము=పలుపు.

తే. మాకుమీకును ఫలమని • మథనమునొగిఁ
జేయుఁడయ్యబ్ధినమృతంబు • సిద్ధిదంబు
పుట్టునాసుధఁద్రావిన • భూరిబలుల
మర్త్యులును నొందురట మీరు • మాన్యులగుచు. 163

చ. దనుజులు కొంచెమైన సుధఁ • ద్రావఁగఁజాలక క్లేశమొందున
ట్లనువుగ నేనొనర్చెద న • హార్యభుజాబలయుక్తి మీరలొం
దిన నదినాకు సంతసముఁ • దృప్తియునిచ్చునటన్న వాసుదే
వుని పలుకాలకించి మఘ • వుండును బ్రహ్మయు దేవసంఘమున్. 164

ఉ. కుంభజమౌనివర్య! విను • కూరిమిమీఱెడు నట్టివాక్తతిన్
జృంభణమొప్పఁ బల్కి దరిఁ • జేరిసురారులమైత్రిజేసి వే
జంభరిపుండు పూన్చ గిరి • సంఘయుతౌషధి వారమెల్ల సం
రంభముమీఱఁ దెచ్చిరి సు • రప్రకరంబులు దైత్యవీరులున్. 165

తే. ఓషధులనెల్లఁ గలశాబ్ధి • యుదకమందుఁ, జంచదుద్యమమునఁదెచ్చి • సంతసమున
వైచి మందరభూరుహ • వరముఁ గవ్వ,ముగనొనర్చి యాదిత్యక • ర్బురచయంబు.

సీ. యోక్త్రంబువాసుకి • నొనరించియత్నంబు చెలఁగసుధకువార్ధి • నలఘుగతుల
మథియించుచోనంద • మరులువాసుకిపుచ్ఛభాగంబు నసురులు • ప్రాగ్విభాగ
ముననుండునట్లుగా • వనరుహనేత్రుండు నియమించెఁగావున • నియమమెడల
కబ్జనాభునియాజ్ఞ • నాదలసిడుకొని పీయూషలబ్ధికై • పృథులశక్తి.

తే. నట్లుచేయంగ బలవంతు • లయ్యు దనుజు, లాఫణీంద్రముఖోద్ధితా • త్యంతగరళ
పావకార్చులనిర్దగ్ధ • వపువులగుచుఁ, బంతమునఁబట్టి మథియించి • బడలిబడలి.

వ. మఱియును దేజోహీనులును నైరి. అప్పుడు దేవతలు వాసుకి పుచ్ఛదేశంబున నున్నవారలై మథించుచున్నవారగుట శ్రీవిష్ణుప్రేరితంబగు ననుకూలవాతంబులచే బహువారమాప్యాయితులైరి. అంత శ్రీపతి యాదికూర్మాకృతియై క్షీరపయోధి మధ్యంబునఁ దిరుగుచున్న మందరాచలంబున కధిష్ఠానభూతుండై యుండి రూపాంతరంబున దేవమధ్యంబునను, మఱియొకరూపంబున దానవుల మధ్యంబుననుండు వేగంబుగా వాసుకి నాకర్షించె. మఱియును బ్రహ్మరూపంబున నాపర్వతోపరిభాగంబు నాక్రమించె. మహాతేజోవంతంబగు నన్యరూపంబునఁ బలుమఱు నేయుపాయంబున దేవతలు బలవంతులగుదు రాయుపాయంబున దేవతలకుఁ బ్రోత్సాహంబుచేసె. బలాత్కారసహనంబగు నొక తేజోరూపంబున సర్వశక్తియుక్తుండగు జనార్దనుండు వాసుకి నాగంబును బ్రోత్సా

హితునిగావించె. ఈవిధంబున క్షీరసముద్రంబు మథింపుచుండ నాకసంబున నిలువంబడి సిద్ధు లిదియేమి యాశ్చర్యంబని యోచించుచుండ మదాలోల విలోచనయగు వారుణీదేవి యుదయించి యసురుల పురోభాగంబున నిలువంబడుటయు. 168

తే. అట్లు నిలుచున్న వారుణి ♦ నందుకొనక, దనుజులుండుట నసురాఖ్యఁ♦దనరిరవని
సురగ్రహింపమిచే వార♦సురులటంచుఁ, జెప్పఁబడిరిట్లు నామంబు ♦ సిద్ధమయ్యె.

చ. వినుమటమీఁద వారుణియు ♦ వేగమె దేవత లున్న చోటికిం
జనినముదంబునంగొనిరి ♦ సారసనాభుని నేత్రసూచనన్
దనుజవిరోధులెంతయును ♦ ధైర్యమునన్ సురసంగ్రహింపఁగాఁ
గనిరి సురాహ్వయంబుమఱి ♦ కైకొని యోక్త్రము వే మథింపఁగాన్. 170

సీ. సుందరాకారలై ♦ శుభతమరూపలై లోకమోహనకరా♦లోకనముల
నలరుచుధీరలౌ ♦ నప్సరసలుపుట్టె రవ్వలమథియింప ♦ నాత్మశుభద
పరిమళంబున జగ♦త్పటలంబుఁ బరిమళింపఁగఁ జేయుచునుబుట్టెఁ ♦ బారిజాత
మను మహాభూరుహం♦బటమీఁదఁదుహినాంశుఁ డవతరించెను వేగ♦హారుఁడుచం

ఆ. బుచ్చికొనియెనంతఁ ♦ బుట్టెను విమజాత, మట్టెనాగజాతు ♦ లందికొనిరి [ద్రుఁ
కౌస్తుభాఖ్యదనరు ♦ క్రమమహారత్న, మవతరింపఁగొనియె ♦ హరిముదమున.171

చ. వినుము స్వపత్త్రిగంధమున ♦ వేడుకనింపుచు లోకమోహనం
బునఁ జెలువారుచుమ్ విజయ ♦ పుట్టెమహౌషధి దానిభైరవుం
డనుపమ మోదమొప్పఁగొనె ♦ నవ్వల దివ్యమహాంబరంబుచేఁ
దనరుచుఁ జూచువారలకుఁ ♦ దద్దయుసంతసమిచ్చుచున్ వెసన్. 172

ఆ. అమృతపూర్ణమైన ♦ యట్టికమండలు, వాత్మహస్తపద్మ♦మందు నమర
దైవమవతరించె ♦ ధన్వంతరియనఁగ, దేవదాసవాళి ♦ తృప్తినొంద. 173

వ. మహర్షులెల్ల సంతోషపూర నిమగ్నులైరంత. 174

చ. వికసితపద్మవాసిని య♦భీష్టవరప్రద, పద్మహస్త, తో
షకలితచిత్త, లక్ష్మి దివి♦జప్రకరంబులు మోదమొందున
ట్లు కలశవార్ధిఁ బుట్టెను వి♦లోలమనంబుల మానులెల్లరున్
సుకృతఫలంబటంచు రమ ♦ సొంపుగ శ్రీవరసూక్తులందమిన్. 175

క. స్తుతియించిరి గంధర్వులు, హితముగవిశ్వాచి మొదలు ♦ హృదయములలరన్
జతనంబునఁ బాడిరి దై, వతగణికలు ప్రీతినాడి పాడిరి మఱియున్. 176

ఆ. గంగమొదలుగాఁగఁ ♦ గల్గిననదులెల్ల, స్నానకార్యమునకు ♦ సన్నిధాన

మొసఁగిరంత బ్రీతి • యొసఁగ దిగ్గజములు, కరములందు హేమ•కలశజలము. 177
ఆ. పూని నిలిచి లక్ష్మి • స్నానంబుఁ జేయించె, నంత హరిపదార్చ్య•నార్హ రూప
యమలకలశవార్ధి • నవతరించె ననన్య,జ తులసి మునులెల్ల • సంతసింప. 178
చ. సరసిజమాల నక్కలశ • సాగరుఁ డా తులసీనితంబినీ
వరకు నొసంగె దివ్యమణి • హారవిభూషల విశ్వకర్మయి
చ్చె రమణ నంతదివ్యమృదు • చేలముఁ దాల్చి లసద్విభూషణో
త్కరము చెలంగ శ్రీతరుణి • కాంచనచేలు నురంబుఁ జేరెదాన్. 179
ఉ. కాంచనచేలుఁడా తులసిఁ • గ్రన్ననఁ దా ధరియించెఁ బ్రీతి ని
శ్చంచలరీతి లక్ష్మియట • సారసనేత్రుని వత్ససీమ య
భ్యంచిత గేహమంచు ముద • మంది వసించి దయార్ద్రదృష్టి న
క్తంచరవైరివీరులును • గాంచి కృతార్థులఁ జేసె వారలన్. 180

### మోహినీ రూపావతారము.

సీ. అంతమహేంద్రాదు • లాదరంబునఁ బ్రభవిష్ణువౌ విష్ణువు • విబుధగణముఁ
దమ్మి లోఁ గొనఁ బ్రమో•దమ్మునఁ బొదలిరి మలకాదిదానవుల్ • మదినెఱింగి
కపటవిష్ణువుఁ జేరఁ • గాఁదగ దంచుఁ బరాఙ్ముఖత్వమునొంది • ప్రకటలక్ష్మి
తమ్ముఁ ద్యజింపంగఁ • దత్తఱపాటొంది ధన్వంతరికరస్థి•తంబునైన
లలితసుధాసార • కలశంబుఁ గైకొన నంత నయ్యమృతార్థ • మాదితేయ
ఆ. దానవులకు నయ్యె • దారుణకలహంబు, మదినెఱింగి దాని • మాధవుండు
సర్వరక్షకుండు • సర్వశక్త్యన్వితుఁ, డౌటఁ గలహమధ్య•మందు వేగ. 181
క. స్వైకస్వరూపిణిని శ, క్త్యాకృతి లలితాంబ భక్తి • నారాధించెన్
[1]లోకేశుఁడు దారుణమగు, నాకలహముఁ గాంచి చనియె • [2]నాత్మవసతికిన్.
క. హరుఁడును గైలాసంబున, కరిగెను మలకాఖ్యు నాజి • నమర్వేరుఁ డు
ద్ధురగతిఁ దాఁకిననమరుల, సురవీరులఁ దాఁకి యాత్మ • శూరత మెఱయన్. 183
వ. పెనంగిరట్టి సందడికయ్యంబున సురాసురులు ఘోరంబుగా నేటులాడుచుండ భగ
వంతుండు యోగీంద్ర సమారాధ్యయగు నమ్మహేశ్వరి నారాధించి తదేకధ్యా
నంబున. 184
చ. సురుచిర రూపవైఖరిని • శోభిలి సర్వజగద్విమోహనాం
గరుచిఁ జెలంగి భూషణని•కాయమహాద్యుతిఁ జాలమీఱి సుం

---

1 లోకేశుఁడు=బ్రహ్మ. 2 ఆత్మవసతికిన్ = తననివాసమునకు.

దరమగు వేషమొప్పవర • నాయికయై లలితాకృతిం జెలం
గి రహి సురాసురాళి రణ • కృత్యముమాన్పి ముదంబుమీఱఁగాన్. 185
క. సుందరముఖ చంద్రలస, న్మందస్మిత మసురవరగ • ణంబును మోహం
బందఁగఁ జేయఁగ మాటల, చందము చెలువార నసుర • సంతతికనియెన్. 186
ఉ. మానుఁడు యుద్ధరీతి నభి • మాన మికేటికి [1]తీవ్రమర్మసం
స్థానవిభేదశస్త్రముల • [2]జన్యమొనర్పఁగ నేమిలాభ మో
దానవులార! నిష్ఠురవ్య • థాప్రతిభాషలఁ [3]గంఠశోషణ
స్వానములన్ వచింపనగు • సత్ఫలమెద్ది వచింపుఁడీ వెసన్. 187
ఆ. దివిజులకును మీకుఁ • దృప్తిగ మధ్యస్థ, నౌదు నేను మీరు నమరులెల్ల
నిందుఁ గ్లేశభాగు • లే యెఱుంగుదు సుధఁ, బంచియిడుదు సమవి • భాగముగను.
తే. అమృతకలశంబు నా హస్త • మందుఁ బెట్టు, డుత్తమంబిది యన్న న • య్యువిదవాక్య
తతుల మోహితులై ముగ్ధ • మతులు నౌచు, నిచ్చిరద్దానిఁ గలశంబు • నెయ్యమమర.
ఉ. ఇచ్చిన నా సుధాకలశ • మెంతయు వేడ్కఁ బరిగ్రహించి తా
ముచ్చటలొల్కు వాక్యముల • ముగ్ధతవారల నొందఁజేసి ప్రాం
చచ్చలితేక్షణంబు లతి • చారురుచుల్ ప్రసవింపఁ బంక్తిగా
నిచ్చక మొప్ప దానవుల; • నింపుగ నిర్జరపంక్తి నిల్పుచున్. 190
ఆ. ఇట్లు వేఱుగాఁగ • నెంతో చమత్కృతి, యలర నిల్పి లోక • ములకు మోహ
కరమునైన రూప • కలితయై యా పంక్తి, మధ్యభాగమందు • మమతఁ జేరి. 191
ఉ. దానవులార! నిర్జరవి • తానములార! క్రమక్రమంబునన్
జానుగ నీ సుధారసము • సామ్యముగాఁగ నొసంగుదాన మీ
రానతవక్త్రపద్మముల • నందఱు నూరకయుండుఁ డీయనం
గా నయరీతిఁ బల్కెనని • క్రమ్మఱ వారలు పల్కకుండఁగన్. 192
సీ. అత్యర్థసమ్మోహి • తాశేషలోకయై కామినీమణికన • త్కనకచారు
[4]దర్వీక, [5]మంగళ • తమనిక్వణన్మనోహరకంకణవ్రజ, • నిరుపమాన
కమనీయభూషణ • కలితయుఁ [6]బరమకళాస్వరూపిణియునై • లలిఁ జెలంగి

---

1 తీవ్రమర్మ...శస్త్రములన్ = వాడియైనవియు మర్మస్థలములను భేదించునట్టియునగు శస్త్రములచేత. 2 జన్యము = యుద్ధము. 3 కంఠశోషణస్వానములన్ = కంఠమును శోషింపఁజేయు ధ్వనులు గలవి. 4 దర్వీకము = గరిటె. 5 మంగళత.....వ్రజ-మంగళతమ = మిక్కిలి శుభములయినవియు, నిక్వణత్ = మ్రోయుచున్నవియు, మనోహర = ఇంపయిన, కంకణవ్రజ = కంకణపంక్తులుగలది. 6 పరమకళాస్వరూపిణి = శ్రేష్ఠమను విద్యాస్వరూపిణి.

[1]వామ, వామకరాంబు•భవమందు నాసుధాకలశంబురుచిరంబు•గాఁ గ్రహించి

తే. దేవతాపంక్తి కాదిని • దృష్టిదీర, నిచ్చి యాలోన శశిరవు • లెలమిఁ జూపు
చిన్నమునుగాంచియాదర్వి•చేనురాంత, రస్థునా[2]సైంహికేయు•శిరంబుఁద్రుంచె.

క. రుచిరామృత సంస్పర్శో, పచితశిరోమాత్ర మభ్రి•భాగమునొందెన్
విచికిలగంధివిమోహితు, లుచితానజ్ఞలయి పలుక•కుండిరి దనుజుల్. 194

క. ఈవిధమున నయ్యమృతం, బావరవర్ణినియు దేవ•తావళిమదిలో
భావించుచు నిశ్శేషము, గావించి సురారిపంక్తిఁ • గలశమునిడియెన్. 195

తే. రిక్తకుంభముహరియునీ•రీతివారి, యెదుటనిడి చూడఁజూడ న•దృశ్యుఁడయ్యెఁ
గాంచియద్దానిదానవుల్ • గాఢరోష, మొంది సన్నద్ధులైరంత • యుద్ధమునకు.

చ. శతముఖుదొట్టి దేవతలు • చయ్యనసాయుధపాణులై మహో
ద్ధతగతి దుర్బలాసురుల • దర్పముమీఱఁగ గిట్టినెట్టనన్
వితతమహోగ్రశస్త్రముల • వేశతసంఖ్యలుగా వధింప నా
దితిసుతులందుగొంద ఱల • దిక్కులవంకకుఁ బాఱి రెంతయున్. 197

తే. చనిరికొందఱు పాతాళ•మునకు వేగ, వజ్రకులకాఖ్యదైత్యుని • బవరమునఁ బ
రాజితునిజేసి యూర్త్మియ•రాజ్యమొంది, శ్రీకటాక్షేక్షితుండయి • చెల్వుఁగాంచి.

క. మరలన్ సురసింహాసన, వరము నధిష్ఠించి లోక•వారము మున్న
ట్లురుదుగఁబ్రోచెను దేవత, లరిభయ మిసుమంతలేక • యభ్యున్నతులై. 199

భుజంగప్రయాతము. చరాచరాత్మకప్రపంచ • జాలమందు ధీరులై
పరాజితామరారివీర • పంక్తులై చెలంగి స్వే
చ్ఛరాజ్యమందు సంచరించి • సంతతప్రమోదులై
మురారిపాదపద్మభక్తిఁ • బూనియుండి రెంతయున్. 200

గ. అని హయగ్రీవుం డగస్త్యునకుఁ దెలిపి మఱియు నిట్లనియె. 201

వ. విను మటమీఁద మోహిని ప•విత్రచరిత్రముగాంచి దేవతా
మునివరుఁడైన నారదుఁడు • భూతపతింగనుకొంతుకంబునం
జని యటవెండికొండఁగని • సంతసమొప్పఁగ నందికేశు నా
జ్ఞను గిరియెక్కి యీశునకు • సంతసమొప్ప నమస్కరించినన్. 202

ం. హరుఁ డమ్మౌనిని గారవించి యుచితా•గ్ర్యస్థానముంజూప నం
దురుమోదంబున విశ్రమించి హరభ•క్త్యుద్దాముఁడైయుండ ని
ర్జరమానీశ్వరుతోడఁ జారుమహితా•చ్ఛస్ఫాటికాభాంగసం

1 వామ=సుందరము. 2 సైంహికేయుఁడు=రాహువు.

స్ఫురణంబొప్పెడు శంకరుండువలికెన్ ♦ మోదంబు సంధిల్లఁగన్. 203

సీ. సర్వవృత్తాంతజ్ఞ! ♦ సర్వజ్ఞ కలహప్రియ! సురర్షియట దేవ♦ తాసురులకు
నయ్యెనేయుద్ధంబు ♦ నందుజయం బెరికయ్యె నద్భుతవార్త ♦ యందుఁగలదె
కాంచనాంబరుఁడేమి ♦ కార్యంబుచేసె నాకెఱిఁగింపుమనవిని ♦ యొసఁగు వేడ్క
నారదుండా దేవ♦ నాథునకిట్లను సుప్రసన్నముఖాంబు♦జుండునగుచు

తే. దేవ! సర్వజ్ఞుఁడవు నయ్యుఁ ♦ దెలియనట్లు
ప్రశ్న మొనరించి తల్లైనఁ ♦ బలుక వాఁడ
నట్లు సంగ్రామమగుచుండ ♦ హరిపనివడి
మోహినీరూపమొందె వి♦బుధులు పొగడ. 204

క. పరమాద్భుతరూపమునుం, దరభూషణరాజియలర ♦ నతిశృంగార
స్ఫురణము మెఱయఁగ మోహిని, యరుదుగఁ గన్పట్టె దేవ♦ తాసురులెల్లన్.

చ. సమరమువీఁటిఁబుచ్చి యట ♦ సారెకు సారెకు మోహినిం గడున్
మమత చెలంగఁ జూచుటయు ♦ మానినికోరినచొప్పుఁ దప్ప క
య్యమృతమునిచ్చి యద్దనుజు ♦ లట్టె కనుంగొనుచుండ దేవతా
సముదయముబ్బ సుస్మితము ♦ సాంద్రముగా ముఖసీమఁ బర్వఁగన్. 206

చ. నిరతిశయప్రమోదమున ♦ నిర్జరపంక్తికిఁ బోసి యాసుధం
గరము విలోలతన్ దనుజ♦ కాండము చూడనదృశ్యయయ్యెఁ గ
ర్బురులటరిక్తమా కలశ♦ముంగని క్రోధముఖంబులొప్ప ని
ర్జరులను జుట్టుముట్ట సుధఁ ♦ ద్రావి మహాబలయుక్తులై సురల్. 207

చ. దనుజులరూపుమాపుటయు ♦ దర్పమడంగి హతావశేషులె
ల్లనుబరుగెత్తి రన్న ముని ♦ లాలితవాక్యము సాంబమూర్తి పా
వననుతకీర్తి భంజితస♦ వాసవనిర్జర దుర్భరార్తి వే
విని దయితాసహాయుఁడయి ♦ విష్ణువుఁ జూడఁగ నేగెఁ బ్రీతితోన్. 208

శా. క్షీరాంభోనిధి తీరగుర్వ గిరిసుతా♦ శృంగారితార్ధాంగు సు
స్మేరాస్యాబ్జు వృషాంకుఁ గాంచి హరిదా♦సీభూత దేవాళి ల
క్ష్మీరాజత్ప్రథువక్షుఁ డీశుఁడు హృషీ♦కేశుండు [1]మందానిలా
హారేశాసన సీమనుండిదిగి య♦త్యంతానురాగంబునన్. 209

తే. ఎదురుగాఁబోయి కౌఁగిట ♦ నిందుధరుని, జేర్చివచ్చిన కార్యంబుఁ ♦ జెప్పుమనుచు
భక్తినాసీనుగావింపఁ♦ బరమపురుషుఁ, డతులయోగీంద్రసంసేవ్యుఁ♦ డైనహరుఁడు.

1 మంధా...సీమనుండి=శేషశయ్యనుండి.

సీ. సరసోక్తినిట్లను ♦ సర్వసమ్మోహన జనకమై చిత్రమై ♦ ఘనతమీఱ
వాఙ్మనోగోచర ♦ భంగి గాకచెలంగు నీరూపమవలీల ♦ నీరజాక్షు
చూపింపఁబడెనది ♦ చూపుము శృంగారమునకు దైవంబగు ♦ తనువు దానిఁ
గనుఁగొనఁగోరితిఁ ♦ గావున నాశ్రితకామధుగ్విభవంబు ♦ గలుగునీవు
తే. చూపుమాయని వేఁడిన ♦ శ్రీపతిహరు, సన్నిధిసదృశ్యుఁడౌటయు ♦ శర్వుఁడట్టె
తత్తఱముదోఁప వైకుంఠ♦ధాముఁజూడ, [1]నలుకలంకులఁ గనుఁగవఁ♦గలయఁబఱపె
సీ. వికసత్కుసుమపంక్తి ♦ పృథువినోది [2]మధుకరాళికంబును జంప ♦ కౌఘగుచ్ఛ
కామోదసురభీకృ♦తాశాంతమును, మఱి [3]మాకందసముదయ ♦ మంజుళతమ
[4]మాధ్వీకమాద్యత్స♦మంతతోవ్యాలోల కోకిలౌఘంబున ♦ శోకభూజ
కాండతాండవకృ[5]చ్ఛిఖండిమండలమును, భృంగాళిఝంకార ♦ విజితవల్ల
కీఘనస్వానంబు ♦ కేవలపాటలౌదరశుభ్రి[6]పాటలీ ♦ వరసుమోజ్జ్వ
తే. లంబు, [7]హింతాల[8]కృతమాల♦లలితతాల, ముఖవికాసితమును, వాత♦పోతచలిత
చారుపల్లవసంఫుల్ల♦భూరిపుష్ప, కంబు, పర్యంత[9]దీర్ఘికా ♦ కంజహారి. 212
క. [10]సంతానప్రసవో[11]త్సుక, సంతానసువాసితంబు ♦ సాంద్రద్రుమమై
యెంతయు [12]నదృష్టపూర్వముఁ, గాంతము నుద్యానమునటఁ♦గనెహరుఁడెలమిన్.
తే. సర్వలోకమనోజ్ఞమై♦సర్వకాల, వికచపుష్పాఢ్యమైయొప్పు♦విహరణార్హ [నాంగి.
వనమునం బారిజాతాఖ్య♦వర్ణ్యతరువు, మూలమునఁ గాంచె హరుఁడొక్క♦మోహ
చ. బరవసమొప్ప బాలరవి ♦ పాటలదేహయు, నవ్యయౌవన
స్ఫురదురుదర్పశాలిని య♦మూల్యమనోహరపద్మరాగశు
భ్రిరుచిరసన్నిభాంఘ్రి నవ♦పద్మనఖచ్ఛటయున్ [13]సుయావకో
త్కరరుచి నిర్వ్యపేక్షపద ♦ కంజయుగారుణ కాంతికాంతయున్. 215
సీసమాలిక. మఱియుఁ గలస్వాన ♦ మంజీరనిక్వణ త్కింకిణీమండిత ♦ [14]పంకజాక్ష
తనయసత్తూణీర ♦ దర్పోన్మథనజంఘికయుఁ, గరిశుండాల ♦ కదళీవృక్ష

---

1 నలుకలంకులన్ = నాల్గుదిక్కులను. 2 మధుకరాళికము = తుమ్మెదలగుంపుగలది. 3 మాకందము = మామిడిచెట్టు. 4 మాధ్వీకము = మకరందము. 5 శిఖండిమండలము = నెమిలిగుంపుకలది. 6 పాటలి = విలిగొట్టుచెట్టు. 7 హింతాల = గిఱకతాడిచెట్టు. 8 కృతమాల = ఱేలచెట్టు. 9 దీర్ఘికా = చతురశ్రమైనకోనేరు. 10 సంతాన = కల్పవృక్షము. 11 ఉత్సుకసంతాన = సంతోషాధిక్యము. 12 అదృష్టపూర్వము = మున్నుచూడఁబడనిది. 13 సుయావకోత్కర... కాంతయున్ = మంచిలత్తుకకాంతిని దిరస్కరించు పాదపద్మముయొక్క రక్తకాంతిచే మనోహరమైనదియు. 14 పంకజాక్షతనయ... జంఘికయు = మన్మథుని యమ్ములపొది గర్వమడంచిన జంఘలుకలది.

కాంతితుల్యోరుయుగకమనీయయు, [1]రక్తసుస్పర్శకదుకూలశోభితోరు
వరనితంబాఢ్యయు సురుచిరజఘనయుగ్మాభోగరుచిరయు నచ్ఛకాంతి
నవమణి పంక్తిసన్నద్ధసువర్ణ కాంచీ విరాజితయును [2]బావననత
నాభిమహావర్త శోభితత్రివళిభంగ ప్రభాఝరియు, [3]శృంగారసుకుచ
కుట్మలాందోళన్నిగూఢముక్తాదామ శతసమావృతయుఁ, బర్వతసమాన
వక్షోజయుగభార భంగురమధ్యయు, [4]లలితశిరీషకోమలభుజప్ర
శస్తయుఁ గంకణ చార్వంగదప్రభయును, [5]సోర్మికాంగుళీయును [6]మనోజ్ఞ
కంబుసుందరతర కంధరయును, [7]ముఖముకురవృత్తాభచుంబుకయుఁ, బాట
లాధరయును, మనోహర కుందకుట్మలాయతకాంతి దంతదర్శితసుచంద్రి
కయును, బృహన్మౌక్తికప్రభావృతనాసికాభరణయుఁ, [8]కేతకాంతరస్థ
కాంతదళద్రోణికాదీర్ఘదీర్ఘనయనయును, [9]శీతభాన్వర్ధతులిత
భాలభాగయును, గ్లప్తాలకచ్ఛదయును, బాలీసమాణిక్యభవ్యకుండ
లామండితశ్రుతి వామయు, నభినవకర్పూర కస్తూరికాసదాభి
మోదితవీటియు, స్ఫురదచ్ఛకస్తూరితిలకయు, నీలకుంతల కదంబ
చిత్రభాయుతయును సీమంతరేఖౌఘ విన్యస్తసిందూర విమలపంక్తి

---

1 రక్తసుస్పర్శ...బాఢ్యయు = ఎఱ్ఱనిదియు మృదువైనదియునగు విలువయైన వస్త్రముచేఁ బ్రకాశించుచున్నట్టియు గొప్పదియు శ్రేష్ఠమైనదియునగు పిఱుదులచే నొప్పినదియు. 2 పావన......ఝరియు=పవిత్రమైనదియు లోఁతైనదియునగు నాభియను సుడిచేఁ బ్రకాశింపఁజేయఁబడిన త్రివళులను తరంగప్రభాపూరముకలదియు. 3 శృంగార......వృతయు = సొగసైనవియు గొప్పవియునగు మొగ్గలవంటి పాలిండ్లయందుఁ గదలుచున్నవియు మఱుఁగు పుచ్చఁబడిన ముత్తియములుగల నూఱుహారములచే నావరింపఁబడినదియు. 4 లలితశిరీష...శస్తయు= సుందరమగు దిరిసెనపుపూవువలె మృదువులగు భుజములచేఁ బ్రశస్తమైనదియు, 5 సోర్మికా...యును = ఉంగరములతోఁగూడిన వ్రేళ్లుకలదియు. 6 మనోజ్ఞ...కంధరయును=మనోహరమగు శంఖమువలె సుందరమగు కంఠముకలదియు. 7 ముఖముకుర...కయు=ముఖమనెడు గుండ్రమగునద్దముయొక్క కాంతితోఁగూడిన గడ్డముగలది. 8 కేతకాంతర...నయనయు=మొగలిపువ్వులోని పడవలవంటి యింపైన దళములవలె మిక్కిలి పెద్దవియగు నేత్రములుకలదియు. 9 శీతభా...గయును= అర్ధచందురునితోఁ దుల్యమైన నుదురుకలది. ఇచట నుదురునకు భాలశబ్దముప్రయోగింపఁబడినది. భాలః—'అకర్తరిచ కారకే' ఇతిఘఞ్. భాందీప్తింలాతీతివా భాలః. ఇతిభలభల్ల పరిభాషణ హింసాదానేష్విత్యస్మా మాధవః (చూ. ధాతువృత్తి.) శ్లో. భాలంతేజోలలాటయోః అని మేదినీకోశము. భాలః—అ-పు-నిట లమ్-౨ మహః. 3 కాలస్కంధవృక్షః. అని సర్వశబ్దసంబోధిని. ఈనిఘంటువునందే ఫాలశబ్దమును వ్రాయుచు దానికి "నుదురు" అను అర్థమును వ్రాయలేదు. ఇంచె "భాలదృక్-శ్-పు-శివః" అని వ్రాయఁబడియున్నది. మఱియు నిందే "భాలలోచనః-అ-పు-శివః" అని కూడనున్నది, ఇఁక ఫాల శబ్దమునకు నుదురను నర్థమందు ఫాలాక్షః-శివః అని యుండుటయే యాధారము.

భాసురయును, [1]లస • ద్బాలవిధూ త్తంసయును, మదాలోలలో • చనయు, సర్వ
శృంగారవేషయుఁ • జిత్రసర్వాభరణాభూషితయుఁ గందు • కాభికేళి
కాలోలయును, సమా • లోల భూషణయునునగుచుఁ జెలంగు నా • యబ్జనయన
తే. నచట మోహినిగాంచి నె • య్యమునశివుఁడు, వేగహిమగిరిజాతను • విడిచిపెట్టి
యెట్టులైననుగ్రహియించి • యట్టినామెఁ, గౌఁగిలింపఁగఁ బరుగెత్తి • కౌఁగిలించె.
చ. హరకరము క్రమె సుదతి • యట్టియుపాయముచేతఁ దాఁటి ని
ర్భరగమనంబుమీఱఁగను • బాఱెనఁ గామవశీకృతాత్ముఁడై
స్మరరిపుఁ డామెవెంటఁబడి • చయ్యనఁగౌఁగిటఁ జేర్చినంత స
త్వరముగఁజాతెవీర్యము ని • తాంతబలాఢ్యుఁడు పుట్టె శాస్త్రయుక్. 217
వ. అనేక కోటి దైత్యేంద్ర గర్వనిర్వాపణక్షముండగు నీశ్వరుని వీర్యబిందు స్పర్శ
మేస్థలంబునఁ గలిగె నాభూమి రజతస్వర్ణ వర్ణయయ్యె. అంత నచ్చట విశ్వమో
హినియగు మోహినీదేవి యంతర్హితయగుటయు నీశ్వరుండు గౌరీసహాయుండై
హిమగిరికరిగెనని చెప్పి హయగ్రీవుం డగస్త్యునకిట్లనియె. 218
క. లోపాముద్రానాయక!, యేపట్టునఁ జెప్పనట్టి • హితము రహస్యం
బై పరమంబగు చరితముఁ, బాపహరముఁ జెప్పవాఁడఁ • బరమప్రీతిన్. 219
మ. మునుభండాసురనామకుండు దనుసం • భూతౌఘచూడామణి
ప్రణుతుండొక్కడ సృష్టిచేసి దనుజ • వ్రాతంబులన్ దిక్కులం
బెనఁగంజేయఁగ బుద్ధినెంచి రచనా • ప్రీతుల్ విడంబింప నొ
క్కని దైతేయసమూహరక్షకు విశు • క్రప్రాహ్వయున్ శూరునిన్. 220
క. కవితుల్యు విచారజ్ఞుని, సువిహితు దక్షాంసమునను • శూరతమెఱయన్
జవమునసృజించి యంతట, [2]ప్రవణువిషంగునిసృజించె వామాంసమునన్. 221
తే. భగిని ధూమినిబుట్టించి • భండుఁడుగ్ర, వీరులను సోదరులఁగూడి • విక్రమమునఁ
బూన్కిబ్రహ్మాండమునుద్రుంచె • భూరివీర్య, శౌర్యుఁడాతఁడు రణసము • త్సాహమమర.
క. హరిహరులును బ్రహ్మయు ని, ర్భరతేజుని భండదనుజుఁ • బరికించి మహా
తురతన్ బరుగిడి తమముం, దిరములనెవసించి రాత్మ • తేజముదూలన్. 223
క. అనిమొనఁ దద్భుజసమ్మ, ర్దనమూర్ఛితులగుచు దేవ • తావళులెల్లం
గనరైరి మరల శౌర్యము, వినుమంతభయార్తులగు ది • విజులెల్లవడిన్. 224
ఉ. కొందఱు నాగలోకమునఁ • గొందఱు వారిధివారిలోపలం

1 లసద్బా...సయును=ప్రకాశించుచున్న బాలచంద్రుఁడు భూషణముగాఁగలది. 2 ప్రవణుఁడు=సమర్థుఁడు.

గొందలు భీతి భూమిధర • కుంజములందు దిగంతపంక్తులం
గొందలరణ్యభాగములఁ • గుందుచుఁ ద్యక్తకళత్రపుత్త్రులై
సందియమేది దేవతలు • ఛన్నతనుల్ పశువేషులై వగన్. 225

క. భ్రష్టాధికారులగుచుఁ ద్రివిష్టపమునుమఱచి యాత్మవీర్యాదులు ప్ర
భ్రష్టములై చనఁదాఁగిరి, దుష్టుండగుభండుఁడంతఁ • దోరపువేడ్కన్. 226

చ. గురుబలులైన రాక్షసులఁ • గూడి మహోరగ సిద్ధ సాధ్య కి
న్నరగరుడాదులం గమల•నాభుని బద్మజు రుద్రు దొట్టి వి
స్ఫురదురు శౌర్యులం గఱక • పోఁచకుఁ బోలనివారిగాఁ గ ని
ర్భరమతి నెన్నిలోకములఁ • బాలనచేయుచునుండె మత్తుఁడై. 227

క. వినుమంత భండనామక, దనుజుని దునుమాడి లోక•తతిఁ బాలింపం
గను దేవి ద్వితీయంబగు, ఘనరూపం బవతరించెఁ • [1]గ్రతుశుచివలనన్. 228

సీ. యద్దూ్రిపశాలిని • నెల్లరందురు లలితాంబఁ బరాదేవి • నమలపాశ
చాపాంకుశాంబక • శాలికరాంబుజ నాదేవిపరశక్తి • [2]కాదివిద్య
బ్రహ్మస్వరూపిణి • ప్రథనవిశారద భండదైత్యునిద్రుంచెఁ • బవరమందు
ననిహయగ్రీవుండు • మునివర్యునకుఁ జెప్ప మునివల్కె నాహయ•ముఖునితోడ

ఆ. భండుఁడెట్లుపుట్టెఁ • బరదేవిలలితాంబ, యెట్టులవతరించె • నెట్లుయుద్ధ
మందు భండుఁడోడె • నవ్విధమంతయు, వినఁగవలయునాకు• వేడ్కఁజెపుమ. 229

భండాసురుండుపుట్టుట.

చ. అనవిని మందహాసము ము•ఖాబ్జమునం జెలువార నాతఁడి
ట్లను వినుమున్ను దక్షతన•యామణి దక్షునియజ్ఞనాశనం
బున విడనాడి జ్ఞానమయ • మోదరసాత్మకమైన స్వాత్మచే
తనుదనుగాంచుచున్ సుగుణ•ధాముఁడు శంకరుఁ డంత మౌనియై. 230

తే. మునిగణోపాస్యమానుండు • మోదరూపుఁ
డగుచు నద్వంద్వగుణలక్ష•ణాంతరంగుఁ
డగుచు భాగీరథీకూల•మందుఁ దుహిన
శిఖరిపర్యంతమునఁ బ్రవే•శించి యుండె. 231

తే. దక్షతనయ మనస్విని • ద్ర్యక్షుశివుని
దలఁచి యోగబలంబుచేఁ • దనువువిడిచి

1 క్రతుశుచివలనన్=యాగమునందలి యగ్నివలన. 2 కాదివిద్య=కకారము మొదటివర్ణము గాఁగల మంత్రవిద్యకలది.

ధ్యానబలమునఁ దుహినభూ • ధరమునకును
తాత్వమొందెను వింటివే • తన్వి నియతి. 232

క. మునివర! నారదువలనన్, విని గిరి రుద్రాణితనకు • విమలాత్మజయా
టను ముదమున శంకరునకుఁ, బనిచెఁ శుశ్రూషచేయఁ • బ్రమదయునంతన్.

చ. జనకునియాజ్ఞ మౌళినిడి • సంతసమొప్ప మహాత్ముశంకరున్
దనఘనచిత్తపంకరుహ • ధామునిగాఁగఁ దలంచుచున్ మహా
వినయము మీఱఁగా సలిపె • వేవిధులొప్ప సపర్యలం గడున్
మనమున శంకరుండు తను • మానితరీతిని మెచ్చునట్లుగన్. 234

తరళ. సురగణంబులు తారకాసుర • శూరపీడిత దేహులై
సరసిజాసను సూక్తులన్ విని • సత్వరంబుగ నిందిరా
వరకుమారుని గానఁగాఁజని • పల్కిరిట్లు కృపానిధీ!
స్మర శరణ్యుల మమ్ముఁగావుము • సారశౌర్యము మీఱఁగాఁ. 235

సీ. అనఘాత్మ! వినుము స • ర్గాదికాలంబునఁ బరమేష్ఠి సృజియించి • ప్రజలనెల్లఁ
జిత్తనిర్వృతిలేక • చింతించి చిరకాల మాత్మవాక్కాయక • ర్మానురక్తిఁ
దపముసల్పిన రమా • ధవుఁడు ప్రసన్నుఁడై కరుణైకదృష్టి న • క్కమలజన్ము
సంతుష్టుఁగాఁ జేయ • నెంతయుభక్తితోఁ బరమేష్ఠిపల్కెనో • పద్మనాభ!

తే. తుష్టినొందితి వేని నీ • సృష్టినెల్ల, నే ననాయాసముగఁ జేయ • నెమ్మివరము
వేగదయచేయుమీ యన • విష్ణువరసి, కాంచె నిందిరనప్పుడ • కల్గితీవు. 236

వ. జగన్మోహనాకారుండవగు నీకు నాయుధంబులుగాఁ బుష్పంబులు, ఇక్షుకార్ముకంబును, విజయత్వము, అజయ్యత్వమునొసంగి పద్మనాభుండు ముదితహృదయుండై సరసిజాసనుంజూచి భూతంబుల స్వస్వకర్మకారణంబున నీతండు సృజించు. నీవు సాక్షిభూతుండవు కమ్ము. ఇఁక నిర్వృతినొందుమని పల్కిన బరమేష్ఠి నీయందు జగద్భారంబు నునిచి మనస్తృప్తినొంది వర్తించుచున్నవాఁడు. నీవీర్యపరాక్రమబలంబు లమోఘంబులు. ఆయుధంబులు సుకుమారంబులగు కుసుమంబులు. పరమేష్ఠిదత్తవరగర్వసమన్వితుండై మాఱులేని పరాక్రమంబునఁ దారకాసురుండనువాఁడు లోకంబుల బాధించెడు. విశేషించి మమ్ము నాయాసంబు నొందించుచున్నవాఁడు. శివపుత్రునిచేఁ దక్క మఱియొకనిచే నాతనికిఁ జావుసిద్ధింపదు, కావున నిమ్మహాకార్యంబునకు నీవుదక్క వేఱొకండు సమర్థుండు లేఁడు. ఈకార్యంబు నీకగగతంబ. ఆత్మైక్యధ్యాననిరతుండై,

గౌరీసమన్వితుండై, మునిసేవితుండునై శివుండు రమ్య హిమాచల తటంబున నున్నవాఁడు. అతని గార్యానురక్తుని గావించినఁ దనయుండుద్భవిల్లు. ఈస్వల్ప కార్యంబొనరించి మమ్ముఁగాపాడుమని దేవతలు బహుభంగుల స్తుతియించిన మన్మథుండు సంతుష్టుండై యాత్మవినాశంబుకొఱకు హిమగిరి తటంబునకరిగి యచ్చట. 237

తే. ఒకయనిర్వచనీయమై • యొప్పువస్తు, వును దలంచుచు గంధాదు•లను జెలంగి
పూజగావించునీశుని • బూనియీశు, సేవచేసెడుపార్వతిఁ • బావనమతి. 238

ఉ. కాంచి యదృశ్యుఁడౌచు రతి•కాంతుఁడు దూరమునందు నిల్చి చా
పాంచిత పుష్పబాణముల • నగ్ర్యములన్ శివుచిత్తసీమ భే
దించిన గార్యవిస్మృతి మ•దిం బొడకట్టినఁ జెంతనున్న య
క్కాంచనగాత్రఁ బార్వతిని • గాంచె స్మరాహృత ధైర్యసారుఁడై. 239

చ. మరల సమాహితాత్మతను • మాధవుఁ డేమిది చిత్తవిస్మృతిం
బొరసితినంచు నెంచి తన • ముందటఁ బుష్పశరంబులున్ ధను
ర్వరమును బూనియున్న సుమ•బాణునిగాంచి మహోగ్రకోపుఁడై
పరశివుఁ డమ్మరారిసుతు • భస్మముచేయఁగ నెంచి ధీరతన్. 240

క. లోకత్రయ దహనక్షమ, మై కడుగోప్యంబునైన • యట్టి [1]శుచిమయ
పాకటనేత్రముఁ దెఱచియు, మాకాంతుఁడు బూదిచేసె • మకరధ్వజునిన్.

చ. స్మరుఁడిటు భస్మమైన హిమ • శైలకుమారిక దుఃఖితాత్మయై
పరశివుఁ డించుకంతయును • భద్రకృపం దను జూడమిన్ గిరీ
శ్వరుని యనుజ్ఞనొంది శివు • భర్తను బొందఁగఁ గోరి యేగ ని
ర్భరతపమాచరింపఁ గడు • రమ్యవనంబున కాతురంబునన్. 242

తే. అంతగణనాథుఁ డాభస్మ • మచటఁజూచి, చిత్రకర్ముండుగావునఁ • జెలఁగిదాని
నొక్కప్రోగుగనొనరించి•యుద్యమమున,భూరిచిత్రాకృతునినొక్క•పురుషుఁ జేసె.

సీ. చిత్రదేహునివాని • శివుఁడు ముందటఁజూడ జాతజీవుండయ్యె • స్మరుఁడుమరల
మూర్తినొందినపోల్కి • భూరిబలాఢ్యుండు మధ్యాహ్నసూర్యస•మప్రభుండు
తేజస్వియును మహో•దీర్ణుండునై వాఁడు చెలఁగంగ నాతని • జిత్రకర్మ
యాలింగనమొనర్చి • యతిమోదమునఁబల్కె బాలక! యీశ్వరు • భద్రవరదు
సర్వార్థసిద్ధిదు • సంస్తుతింపుమటంచు వే శతరుద్రీయ • విమలమంత్ర

1 శుచిమయ=అగ్నివికారమైన.

తే. మతనికుప దేశ మొనరింప • నట్టిలేచి
భక్తిశతవారములు మొక్కి • భవ్యమంత్ర
మునుజపింపఁగ సుముఖుఁడై • త్రిణయనుండు
వరములను గోరుమీాయన • బాలకుండు. 244

వ. వైరిబలార్ధంబు నాబలంబుతోఁ గలియునట్లును మఱియు శత్రువుల శస్త్రాస్త్రాదికంబులు నన్ను బాధింపకుండునట్లును వరంబొసంగ వేయని ప్రార్థింప నట్లయ గుఁగాకయని పలికి మరల నీశ్వరుండు యోచించి షష్టివర్షసహస్రంబు లాతనికి రాజ్యంబునుగూడ నొసంగె. ఈచరిత్రమునుగాంచి విధాత "భణ్డ, భణ్డ" యని పలికినకారణంబున నాతండు భండుఁడనఁబరఁగె. ఈవిధంబున నాతనికి వరంబు లొసంగి సకలమునినికరపరివృతుండై యాశ్వరుండు శస్త్రాస్త్రంబులనుగూడ నతనికొసంగియచ్చట నంతర్హితుండయ్యెనని చెప్పి హయగ్రీవుండు కుంభసంభవుంగాంచి. 245

భండాసుర పట్టాభిషేకము.

తే. అంతభండుఁడు రుద్రకో•పానలంబు, వలనఁ బుట్టినకతన స్వ•భావమయ్యె
రౌద్ర; మాతఁడు దానవ•రాజునయ్యె, బలపరాక్రమయుక్తుఁడై •ప్రబలుఁడయ్యె.
క. విని యావృత్తాంతము వే, దనుజపురోహితుఁడు మంత్ర • తత్పరుఁ డసురా
వనదక్షుఁడునగు శుక్రుఁడు, చనుదెంచెనువచ్చిరట్ల • సకలదనుజులున్. 247

ఉ. వారలగారవించి వడి • భండుఁడు దైత్యకులాదిశిల్పి వి
స్తారకళానిధిన్ మయుని • సంతసమొప్పఁగఁ బిల్వఁబంచి శు
క్రేరితరీతి నెచ్చట న•హీనబలస్థితి దానవావళుల్
గౌరవమొప్ప లోకములఁ • గాచిరొ యచ్చటకేగి ప్రీతితోన్. 248

ఆ. శోణితాఖ్యపురము • శుభరీతి నిర్మింపు, మద్దిరాజధాని • యై చెలంగ
వలయుననినమయుఁడు • వల్లెయటంచేగి, శోణపురమువిజిత • సురనగరము. 249

సీ. మానసగమనంబు•మాడ్కి నిర్మింపంగ శుక్రోపదిష్టమా • శుభముహూర్త
మందు దైతేయరా•జ్యాభిషేకమునొంది భండుండు బలదర్ప•భరితదనుజ
సంయుక్తుఁడై రమా•సాంద్రుఁడై తేజస్వియై చెలంగిన శుక్రుఁ • డలరిమునువి
రించి యొద్దాన ని•ర్మించె హిరణ్మయసత్కిరీటము నది • శాశ్వతంబు
తే. జీవసహితంబునత్యంత•పావనంబు, దనుజవిభుభూషణంబు, భా•ఘనము,బాల
రవిసహస్రక రాయత•రాజితంబు, నిచ్చెధరియించె నాదను•జేశ్వరుండు. 250

వ. వేని ధరియించిన రోగదుఃఖంబులు తొలంగు నట్టినజీవంబులును, చంద్రసంకాశంబులును నగు చామరంబుల నొసంగె విద్దానిఛాయను సేవించిన నస్త్రసమూహంబులుబాధింపనేరవట్టి బ్రహ్మనిర్మితంబగు నాతపత్త్రంబునిచ్చె, మఱియు విజయంబనుధనుస్సును, రిపుఘాతియగు ఖడ్గంబును, మహార్హంబులగు ననేకభూషణంబులను శుక్రుండొసంగి సూర్యసన్నిభంబు, అక్షయంబునునగు సింహాసనంబునుగూడ నిచ్చినం బ్రీతుండై భండాసురుండు సర్వాభరణభూషితుండై సింహాసనంబు నధిష్ఠించి[1]యుత్తేజితంబగు రత్నంబుమాడ్కి తేజస్వియై వెలింగె. ఇంద్రశత్రుండు, అమిత్రఘ్నుండు, విద్యున్మాలి, విభీషణుండు, ఉగ్రకర్ముండు, ఉగ్రధన్వుండు, విజయుండు, శ్రుతిసాగరుండునను నెనమంద్రుదానవులు మంత్రిపదంబు నొందిరి. సమ్మోహినియు, కుముదినియు, చిత్రాంగియు, సుందరియునను నలువురు భండాసురునకు భార్యలైరంత. 251

సీ. కాలజ్ఞతను దేవ • గణ మింద్రుతోఁగూడి సేవించె హస్తివాఃజిరథపైని
కావళియలరెమఃహాకాయులై జితకాశులై దైత్యులు • [2]కవిమతాను
సారులై చెలఁగి యా • శంకరార్చనయందు నాసక్తులై శివు • నమలకరుణ
బహుపుత్త్రపౌత్రసంఃపద్వృద్ధినిగాంచి రాగృహంబుల మహా • యజ్ఞగణము
తే. నాశ్రయించెను వేదత్రఃయంబునఖిల, శాస్త్రములువారిగృహములఃసంతసంబు
పఠనపాఠనములనొప్పెఁఃబరమసమ్ముదమునుగాంచిరి సతతంబుఃదనుజులెల్ల. 252

క. మునివిప్రనికేతనముల, ననయంబేరీతినుందు • రామాడ్కి సురల్
దనుజమఖంబుల హవ్యముఁ, దినుచుండిరి సర్వకాల • తృప్తింగనుచున్. 253

ఆ. ఇవ్విధమున రాజ్య • మేలెడుభండుని, కట సహస్రషష్టి • హాయనములు
గడిచెఁదపముబలముఃకలిమిచేతనుభండుఁ, డలరుటయునువిష్ణుఁఃడడఁగుటయును.

చ. హరి మదినెంచి వాసవుని • నాదర మొప్పఁగఁ గావనెంచి ని
ర్జరపురలక్ష్మి నిశ్చలత • రాజిలఁజేయఁగ నిశ్చయించి క
ర్బురవరు నాక్రమింప మదిఁ • బూన్కివహించి కడంగి మోహినిం
గరము సృజించి యన్నెలఁత • గాంచి మృదూక్తులఁ మించ నిట్లనున్. 255

ఉ. కాంచననేత్ర! నీరుచిర • కాంతుల భూతములెల్ల మోహముం
గాంచఁగఁజేయుచున్ మనసు • కల్మిఁ జరింపుము లోకమందు నిక్

1 ఉత్తేజితము = సానపెట్టఁబడినది. 2 కవిమతానుసారులై = శుక్రునిమతముననుసరించినవారలై.

మించెదువీరుఁడుండఁడు సు•మీ జయమొందుచు నీవు వేగ న
క్తంచరు భండనామకుని • గ్రమతరోక్తులఁ దేల్చి నేర్పునన్. 256

తే. మోహితునిగాఁగ నొనరించి • భూరివిషయ
సౌఖ్యములఁ దేల్చుచుండు మీ•చాలకాల
మనిన నవ్విధివరముల • నందిమాయ
కాంచనాంబరునకు మ్రొక్కి • కడుముదమున. 257

తే. దేవనాయక నాతోడ • దివిజభోగ, కాంత లరుదెంచునట్లను•గ్రహము సేయ
వలయుననవినియట్ల య•వ్వారిజాక్షు, లరుగుదెంతురు పొమ్మన•హరియనుమతి.

సీ. విశ్వాచిముఖ్యలౌ • వెలఁదులతోఁగూడి భండాసురుండాత్మ • పద్మముఖుల
తోడనెచ్చటఁ గ్రీడఁ • దొరపువేడుక నల్పు నుజ్జ్వలభూమి•జంబునైన
మానసకాసార • మహితతటంబున కరిగి చంపకమహీ•జాగ్ర్యమూల
సీమనాసీనమై • చెలఁగి యామృగనేత్ర మధురస్వనంబు గ•మ్యంబునైన

తే. పాటఁబాడుచు వసియించె • భండుఁడాత్మ, సచివసంయుక్తుఁడై వచ్చి • సద్విపంచి
కానినాదముతోఁగూడఁ•గాంతపాడ, వినిజవంబుననటకేగి వెలఁదిఁగాంచి. 259

తే. హారిసర్వాంగి, సుందరి•యపర [1]చంచ, లాలతాకృతిఁబోలియా•లలనయచట
దృష్టిగోచరయగుటయు•నెనఁగుదర్ప, కాహ్వమాయైకగర్తంబు•నందుఁబడియె.

క. స్మరతాపిత మానసులై, పరకాంతాసక్తిదనుజ • వరుమంత్రిలు ని
ర్భరధైర్యము దూలఁగఁబడి, రరుదుగ నక్కాంతచూచి• యద్భుతమందన్. 261

తే. కొంతవడినిట్లు దైతేయ • కాంతుఁడుండి, లబ్ధచేతనుఁడై తమి • లలనఁజాల
వేఁడికొన సమ్మతించె న•వ్వెలఁది; సచివు, లట్లప్రార్థింపఁగాఁ దోడి•యబలలెల్ల.

తే. సమ్మతించిరి హయమేధ • సవముఖాది, కములచేఁ బొందరానట్టి • కాంతలెల్ల
స్వవశలగుటకు ముదమంది•భండముఖులు, దేవతలయజ్ఞముల శంభు• దేవదేవు.

క. అనుదిన మొనరింపఁగఁదగు, ఘనకృత్యంబులను మఱచి • కాంతామోహాం
బునిధి మునింగి పురోహితు, ననుమానంబింత లేక • యవమానింపన్. 264

చ. చనియెఁ బురోహితుం డిటుల • సారసనేత్రలఁగూడి సౌఖ్యవా
రినిధిమునుంగుచున్ దనుజ • బృందములుండగతించె నూటిపై
నెనిమిదిహాయనంబు లమ• లేశ్వరుఁ దొట్టి సురౌఘముల్ ముదం
బునుగని యేయుపద్రవముఁ • బొందక స్వర్గమునొంది రెంతయున్. 265

---

1 చంచలాలతాకృతిన్ = మెఱపుతీఁగెవంటి యాకారమును.

మ. ఒకనాఁ డయ్యమరాధిపుండు నవర•త్నోద్యోతమానామల
ప్రకటాస్థాన తలస్థితుండగుచు భా•స్వత్సూర్యచందంబునన్
సకలామర్త్యులుఁగొల్వ నచ్చరలు శ•శ్వద్గీతముల్ పాడఁగా
నకలంకస్థితి నొప్ప నచ్చటికి వీ•ణారావముం జేయుచున్. 266

సీ. ఉజ్జ్వలత్పావకు • నొప్పున నారదుం డరుగుదెంచినఁ జూచి • యమరవిభుఁడు
మ్రొక్కి-కృతాంజలి • పుటుఁడౌచు సర్వజ్ఞ! పరమేశ! తత్త్వజ్ఞ! • భవ్యచిత్త
ఎట్టిశోభనము నా • కిచ్చుటకో భవదాగమనంబు ముం • దగుశుభంబు
సూచించుఁగావున • శుభయుష్మదీయవాక్యసుధను గ్రోలి నా • కర్ణయుగళ

తే. మతిశయానంద నిర్భర • మైచెలంగు
నట్లుచేయుము దుఃఖంబు • లవలఁదొలఁగె
జాలఁ గృతకృత్యతనుగంటి • సాంద్రకరుణ
రయమునంజెప్పవయ్య! కా•రణము ననిన. 267

చ. శతమఖుమోముఁగాంచి దివి•జర్షి వచించు ముదంబు మీఱఁగా
దితిసుతవర్యుఁ డిత్తఱి వి•తృప్తిగ మోహిని విష్ణుమాయ నం
చితగతిఁ గూడి లోకముల • స్త్రీలను బోవిడిచెన్ సుఖించె; నొ
క్క తెఱఁగుఁ జెప్పెదన్ వినుము • కర్బురనాథుఁ డడంగుదానిచేన్. 268

చ. అసదృశ తేజమున్ బలము • నద్భుతశస్త్రచయంబు మాయయున్
వెసఁ బనిచేయునట్టి సఖి • బృందముఁగూడి యరాతితేజముం
గసటుఁగనంగఁజేయఁదగుఁ • గావున నట్లొనరించి దివ్యమా
యనము జగద్వితానముల • నందఁగఁజేయుము దేవనాయకా!. 269

క. ఈ పరికరములు వలసిన, నావరదేవిని భజింపు • మనువొందంగా
నీపద్ధతి విడిచినచో, నేపగిది జయింపఁజాల • వీభండుననిన్. 270

క. అరి పూజింపకమున్నా, పరమేశ్వరిఁ బూజచేయు • పరదేవత నీ
కరుదుగ శ్రేయమొనంగును, ద్వరపడు మీపనికి ననిన • వాసవుఁడుతమిన్. 271

మ. మునిఁబూజించి సుపర్వులెల్లఁ గొలువన్ • భూర్యుత్సుకంబొప్ప న
ప్పనికై సర్వసుమోజ్జ్వలంబునగు నా • భాగీరథీతీరమం
దున శీతాచలసత్తటంబున సురల్ • దోడ్తోడఁ బ్రేరేపఁగా
వినయంబొప్ప మహార్చనానిరతి న•వ్విశ్వేశ్వరిం బార్వతిన్. 272

వ. పూజించుచుండ నాస్థలం బింద్రప్రస్థపురంబనం బ్రఖ్యాతంబయ్యె. నారదోపదిష్ట

మార్గంబునం బరదేవినర్చించుచు జపధ్యాననిరతులై యనన్యాయత్తచిత్తులై యప్రమత్తులైయుండ దశవర్షసహస్రంబులు పదిదినంబులును గతించె నంత. 273

క. పరనారీమోహితులగు, సురవైరుల భండముఖులఁ • జూచి భృగుసుతుం
డురుబుద్ధినెంచి భండా, సురునింగని ప్రియములొలుకు • చొప్పుననని యెన్.

చ. నిను విభుగా నొనర్చికొని • నిర్భయులై త్రిజగంబులన్ మహో
త్సురవరు లిచ్చచేఁ దిరుగు•చున్ ముద మొందుచు నుందురారమా
వరుఁడును జాతిమాత్రమున • వైరముఁ బూని వధించు దానవో
త్కరమును విష్ణుమాయయగు • తన్విని గాంచి విమోహితుండవై. 275

క. కేళీలోలుఁడవగుటన్, బాలిశుగా నెన్నికొనుచు • వైరంబున వే
కూలుపనెంచి యమర్త్యులు, వేళయిదియటంచుఁ దెలుప•వృత్రహరుండున్. 276

వ. రంధ్రాన్వేషణతత్పరుండగుచు విజయంబుకొఱకుఁ దపంబొనరించుచున్నవాఁడు. ఆతపంబునఁ బరదేవి సంతుష్టయైన నింద్రునకు విజయంబుగల్గు. ఈమాయా తరుణినిద్యజించి మంత్రులతోఁగూడి నీవు సత్వరంబుగాఁబోయి హిమవత్పర్వత ప్రదేశంబుననున్న శత్రువులకుఁ దపోవిఘ్నంబొనరింపుము. వేగంబ లెమ్ము లెమ్మని పలికిన శుక్రునివాక్యంబులచే బోధితుండై భండాసురుండు పర్యంకంబునువిడిచి మంత్రులంబిలిపించి యావృత్తాంతంబంతయు నెఱింగించిన నందు శ్రుతవర్మ యను మంత్రి విచారించి దైత్యనాయకా! షష్టివర్షసహస్రంబులు రాజ్యంబునీకు శివార్పితంబయ్యె. అంతకన్న నధికకాలంబుగతించె. రాజ్యనిర్వహణంబునకై చింతించుట వ్యర్థంబు. శివవాక్యం బమోఘంబు. దేవతాతపోవిఘ్నం బొనరించుట మనకశక్యంబు. సుఖదుఃఖంబు లాయాకాలంబున ననుభవింపవలయునకా దేయని పలుకుటయు భీమకర్ముండను మంత్రి యిట్లనియె. 277

తే. అరినుపేక్షింపఁగూడ దే•వరునకైనఁ, దత్క్రియావిఘ్నమొనరింపఁ•దగుదు మేము
విజయమగునీకు దానవ•వీర! శత్రు, బలముఁ నందర్థమునుగొను•ప్రబలశక్తి. 278

క. హరుఁడొసఁగ లేదె కావున, దురమున విజయంబుగల్గుఁ • దోరపుశక్తిన్
హరిహయుతపమును జెఱుతము, బరవసముఁనఁబోయియనిన•భండుఁడు నెమ్మిన్.

క. అంగీకరించి యప్పుడ, సాంగాయుధపాణులగుచు • నమితబలయుతిం
బొంగుచు మంత్రులు రాఁ జని, యెం గరమలరుచును నిర్జరేశ్వరుపైకిన్. 280

మ. హిమవత్పర్వత తీరమొంద దనుజో•ద్వృత్తిన్ మదిం గాంచి వ
జ్రిమహాకార్యము భంగ మొందునటుగాఁ • జేయంగనే తెంచిరి

కుమతుల్ వీరల యుద్యమంబు చెడ నా♦కుల్ సంతసంబందఁజే
సి మహాశౌర్యముఁ జూపఁ గాలమనుచుం ♦ జింతించి శ్రీదేవి తాన్. 281

ఉ. శాత్రవులెల్ల బెండువడఁ ♦ జయ్యనఁ గృత్రిమ [1]సాలమొండు లో
కత్రయచిత్రముండగని ♦ కామమహాద్భుత శక్తిఁ జేయఁ గాఁ
జిత్రమిదేటి సాలమిటు ♦ చేసినవారెవరంచు భండుఁడా
కృత్రిమసాలముఙ్ నఱికెఁ ♦ గేరుచు నొక్క మహాస్త్రశక్తిచేఙ్. 282

శా. కోపాటోపము బాహువీర్యము లస♦ద్గాఢాస్త్రవిన్యాస మి
ట్లేపారన్ వడిసాలముం జెఱుపఁగా ♦ నింకొక్క ప్రాకారమున్
దీపింపం బరదేవి సేయుటయు నెం♦తేపూన్కి వాయ్వస్త్రసు
వ్యాపారంబునఁ జెండె ధీరుఁడగుచున్ ♦ భండాసురుం డుద్ధతిన్. 283

ఉ. సాలముఁబోనడంచి భుజ♦శౌర్యము మీఱఁగ నార్వ నట్టిదా
సాలము వేఱొకండుఁ గడు ♦ శక్తిని దేవిసృజింప నద్దియున్
బాలిసు కార్యమట్లు చెడఁ ♦ బల్మఱు నవ్విధి బుట్టుచుండఁగాఁ
జాల మదిం దలంచుచు వి♦షణ్ణమతిం బురిఁ జేరె భండుఁడున్. 284

చ. సురవరు లాపరాంబికను ♦ జూడక యుజ్వలసాలముఙ్ మహో
ద్ధురమును గాంచి భీతులయి ♦ తోడన కృత్యము మానిపోవ దే
వరమణుఁ డంతనిట్లనియె ♦ వైరివెసం జనుదెంచెఁ బాఱినన్
వరదుఁడు లేఁడుగా మనకు ♦ బాఱకనిల్చి వినుండు కార్యమున్. 285

చ. కలహమునందు భండునిద♦గన్ గెలువంగ నసాధ్యమౌటయుం
గలుగమియున్ శరణ్యుఁడిది ♦ కాంచియు మీరరుఁగంగనేల నే
గలుగనె భీతియేల యిఁకఁ ♦ గార్యము శాస్త్రము రీతిఁ జేయ నా
వలఁ బరమేశ్వరుండె యగుఁ ♦ బట్టిన గార్యము మానవచ్చునే. 286

చ. వినుఁడిఁకఁ గార్యరీతి విని♦పించెద యోజనవిస్తృతంబుగాఁ
గను వరకుండమొండు విధిఁ ♦ గా నొనరించి వడిన్ మహాక్రతూ
క్తనయవిధానతన్ జ్వలను ♦ గాఢతరంబుగ మండఁజేసి యా
ఘనతమకీలలం బశిత ♦ ఖండములన్ మనమొక్కరీతిగాన్. 287

ఆ. పరమశక్తిఁ గుఱిచి ♦ నిరతిశయసుభక్తి, హోమమాచరింత ♦ మోమహాత్ము
లార! బ్రహ్మభూత ♦ గౌరవమును గాని, స్వర్గలోకభోగ ♦ సమితిఁ గాని. 288

1 సాలము=ప్రాకారము.

ఆ. అనుభవించువార • మనవినిసేంద్రులై, యెల్లసురలు విధిగ • నెసఁగుమంత్ర
ములఁ బఠించి దివ్య•ములగు మాంసంబులఁ, గోసి వైవ నిట్లు • భాసురముగ.

వ. హోమము చేయుటయు సర్వమాంసంబులు పూర్ణంబు లగుటయు బాదంబు
లును గరంబులు హోమమొనరించుటకుఁ బ్రయత్నించుచుండ నొక్క పరమంబు
ననూపమంబునగు తేజంబుద్భవించె. అది కోటిసూర్యప్రతీకాశంబును, చంద్ర
కోటిసుశీతలంబునునై భాసిల్లె. తన్మధ్యభాగంబున నుత్తమంబగు చక్రాకారం
బుద్భవించె. తన్మధ్యభాగంబునందు. 290

సీ. ఉదయార్కసమకాంతి • నొప్పినపరదేవి, నబ్జజహరిశంక•రాకృతి, జగ
దుజ్జీవనాకార • మొప్పినతల్లిని, సౌందర్యజలధి నా•నందరాశి,
దాడిమీకుసుమవ•స్త్రిను జపాసుమతుల్యకాంతి తనూలతఁ • గ్రమవిమల
భూషణవ్రాతసం•పూర్ణను, శృంగారరసరాశిఁ, [1]గరుణాత•రంగితామ
లాపాంగయుజ్నయ•నాలోకకౌముదిఁ, బూతపాశాంకుశ • పుష్పసాయ

తే. కేక్షుకోదండకరఁ, బర•మేశ్వరిఁ గని
వాసవాదిసుపర్వులు • వందనములు
చేసి ముదమొంది మఱిమఱి • శ్రీపరాంబఁ
గాంచి వందనశతము ల•ర్పించుటయును. 291

క. కరుణాదృష్టిని వారలఁ, బరమేశ్వరి చూచె నంత • వారలు విగత
జ్వరులై వజ్రశరాయిత, వరతనులై పూర్ణశక్తి • భాసిలిభక్తిన్. 292

వ. అఖిలార్తిహరణ చణయగు నప్పరాంబిక నిట్లనిస్తుతించిరి. 293

## లలితా స్తవరాజము.

క. జయలోకప్రజజననీ, జయ దేవి పరాత్పరేశి • జయదేవేశీ
జయకల్యాణమహాంబుధి, జయకామకళాత్మికాంబ • జయకామాక్షీ. 294

క. జయ సర్వసురారాధ్యా, జయజయకామేశి కామ • సముదయదాత్రీ
జయ [2]పరమేష్ఠిమయాకృతి, జయనారాయణి జితారి • జనసందోహా. 295

క. పరదేవీ బ్రహ్మానం, దరసాత్మిక, వితతనంది•తత్రిదశౌఘా
పరమేశ్వరదయితా, హత, పరసంఘా, విజయదాత్రి, • పరమాలలితా. 296

1 కరుణాతరంగి......కౌముది=కరుణాతరంగములుగలదిగాఁ జేయఁబడినవియు స్వచ్ఛములునగు కటాక్షవీక్షణములతోఁ గూడిన నేత్రములయొక్క చూపను వెన్నెలకలది. 2 పరమేష్ఠిమయాకృతి=బ్రహ్మమయాకారముకలది.

క. జయవిజయశ్రీధాత్రీ, జయలోకసమూహా, సృష్టి • చతురా, సాధ్వీ,
జయదేవ పూజితాంఘ్రీ, జయజయ శ్రీదేవి, సాధు • జనపక్షమతీ. 297

ఆ. [1]జాయమానమునకు • జాతంబునకును జే, ష్టానుపూర్తిహేతు • సరణివెలసి
త్రిజగములను బెంచు • త్రిపురేశ్వరీనీకు, వందనములుమఱియు • వందనములు.

చ. కలలు ముహూర్తముల్ దివస • కాష్ఠము లబ్దము లెల్ల మాసముల్
వెలయును నీదురూపమున • వేయిశిరంబులు వేయిలోచనం
బులును సహస్రపాద [2]కర • పుష్కరముల్ జనయిత్రి నీమహో
మలతనువందునొప్పునిదె • మానిని మ్రొక్కెదు మేము భక్తితోన్. 299

తే. అణువులందెల్ల నల్పమా • నణువ వహహ
యలమహాత్ములయందు మ • హత్తరమవు
పరమునకుఁజూడఁ బరమవు • పంకజాక్షి
తేజములలోన దివ్యమా • తేజమీవు. 300

క. అతలము నీపాదములౌ, వితలము జానువులుగాఁగ • వెలయును గటియు
గ్మతనొప్పు రసాతలమున్, క్షితికుక్షితలంబునీకు • శ్రీపరదేవీ. 301

సీ. మనసు భువర్లోక • మనునది స్వర్లోక మాస్యమౌ దృక్కులౌ • నర్కశశిహు
తవహులు,దిక్కులు•త్వద్బాహువులుతల్లి!శ్వసనంబులౌఁదనూ•చ్ఛ్వాసములుమ
హాదేవి! శ్రుతులెల్ల • నగునువాక్కులు జగద్రచనయౌఁ గ్రీడ మి•త్రమగునీకుఁ
జిన్మయరూపుఁడౌ • శివుఁడు, సదానందమాహారమగు సజ్జ•నాంతరంగ
మావాసతలము దృ•శ్యాదృశ్యరూపంబులౌ భువనంబులు • నంబరంబు

తే. చికురములునీకుఁ,దారకా•నికరమరయఁ,గుసుమములుతల్లి ధర్మాది•విసరమాయు
ధములు,యమనియమంబులు•తావకాంఘ్రి,కరరుహంబులునగు శివ•కాంతనీకు.

వ. లోకోజ్జీవనకారకంబులగు స్తనంబులు స్వాహాస్వధాకారంబులు. ప్రాణాయా
మంబులు నాసికంబు. సరస్వతిరసనయగు. ప్రత్యాహారంబింద్రియంబులు. ధ్యా
నంబు బుద్ధియగు. మఱియు నాననం బిచ్ఛాస్వరూపంబు. ధారణాశక్తి మనస్సు.
సమాధి హృదయంబు. మహీరుహంబు లంగరుహంబులు. ప్రభాతంబు నీకు
వస్త్రంబు. భూతంబుభవ్యంబు భవిష్యంబు నిత్యంబును నీవిగ్రహంబునగు.
సమస్తజనులు యజ్ఞరూపయు, జగద్ధాత్రియు, విష్వగ్రూపయు, పావనియునగు
నిన్ను సర్వాధార స్వరూపవుగా నెఱుంగరని పల్కి మఱియును. 303

1 జాయమానము = కలుగుచున్నది. 2 కరపుష్కరముల్ = హస్తపద్మములు.

ఆ. హృదయసీమయందుఁ ♦ బొదలుచుండియు నగ, పడక నామతనువి ♦ భాగమెల్ల
నాత్మలీలఁ జేసి ♦ యందు సక్తవుగాక, వెలయుదాననీవు ♦ జలజనేత్ర!. 304

తే. సర్వకామదవీవు స ♦ చ్ఛక్తివీవు, వందనంబుల నర్పించు ♦ వార మంబ!
యేపరాశక్తి బ్రహ్మాఖ్య ♦ నెసఁగు మోద, మిచ్చునో యట్టినీకంబ ♦ యిదిగొ మ్రొక్కు.

సీ. ఏయంబయాజ్ఞచే ♦ నెప్పుడు శశిసూర్యవహ్నిమారుతములు ♦ వఱలుచుండు
పృథ్వ్యాదిభూతముల్ ♦ ప్రియముగ వర్తించు నాయంబకిదె వంద ♦ నాళి, సృష్టి
కాదిభూమికయయి ♦ యజునినిర్మించి భూభారమొక్కతె తాల్చె ♦ భవునిపత్ని
కమ్మహాదేవికి ♦ నర్పింతుమీనమస్కారంబు లేదేవి ♦ తన్మాత్రలంబు

తే. నంబరంబును దాల్చెనే ♦ యంబవలన, సవితపుట్టెనే తల్లిలోఁ ♦ జనుదివంబు
పుష్కరంబే మహాదేవి ♦ పూర్ణశక్తి, వలననిల్చెనో యాయంబఁ ♦ గొలుతుము కడు.

సీ. ఏయంబికామయ ♦ మీలోకనికురుంబ మెచ్చట నుదయించె ♦ నీజగంబు
లెచట నిర్భయరీతి ♦ నెసఁగు నెటనడంగుఁ గాలవశంబున ♦ నాలతాంగి
కిదె వందనౌఘంబు ♦ లిదె రజోరూపయై తామససాత్త్విక ♦ తనువిరాజ
యై చెలంగినయట్టి ♦ హరసతికి నివందనము లివ్వి యాజగ ♦ న్మాత కఖిల
జగదేకపితృరూప ♦ కగజాతకును వందనావళి సకలతం ♦ త్రాత్మరూప

తే. యజ్ఞరూపయునైనట్టి ♦ యంబకఖిల, వాగ్విభూతికి సర్వప్ర ♦ పంచతుష్టి
తనువిలాసకు శాంభవి ♦ కనఘమతికి, సర్వశక్తికి నిదె నమ ♦ స్కారపంక్తి. 307

తే. ఆదిమధ్యాంతశూన్యమై ♦ యట్లు పాంచ, భౌతికంబయియట్లు వా ♦ క్స్వాంతగమ్య
మప్రతర్క్యాత్మవైభవ ♦ మై యరూప, మద్వయ మదృష్టిగోచర ♦ మై చెలంగి.

లోకంబులఁ బాలించుచుఁ, బ్రకటచిచ్ఛక్తివైన ♦ పరమేశ్వరి! ని
న్నే కరణిఁ బొగడువారము, శ్రీకరకరుణైకదృష్టిఁ ♦ జేఁ గను మమ్మున్. 309

సుప్రసన్నవగుము ♦ శ్రుతిరూపిణీ విశ్వ, గణమహేశి సర్వ ♦ గతనిజైక
తనువిలాసినీ, స్వ ♦ తంత్రమంత్రాత్మిక, సుప్రసన్నవగుము ♦ శుభములిడుము.

హరిహయుఁ దొట్టి దేవగణ ♦ మా పరమేశ్వరి లోకవంద్య నీ
కరణి నుతించి సంతసము ♦ గ్రమ్మఁగఁ బల్మఱు మ్రొక్కి భక్తిచే
శరణము వేఁడ వారిఁ గని ♦ శంకరి సారసనేత్ర ప్రీతిచే
వరదకరంబుచేఁ దెలిపె ♦ వారకులన్ వరపంక్తి వేఁడఁగాఁ. 311

క్రతుభుఙ్నాథుఁడు వేఁడె నిట్లు జననీ! ♦ కల్యాణి మాయందు సం
తతతృప్తాత్మవయేని మే మసురనా ♦ థప్రోజ్జ్వలద్బాహుని

రక్షితదర్వాంగులమై త్వదీయకరుణం • జెల్వొందఁగాంక్షించి వ
చ్చితి మీ వేగతి కావకున్న నెటులో • జీవింప మేమి త్తఱిన్. 312

చ. శరణముఁగోరినారమిదె • శంకరిమాదగు ప్రార్థనంబునాఁ
బరశివురాణియిట్లనియె • భండమహాసురు నేజయించి వే
సురపురి భద్రపీఠి నిను • శోభిలఁజేసి యొసంగెదం జరా
చరసహితత్రిలోకమును • సాధ్వసమేటికి దేవనాయకా !. 313

చ. సురలును నిర్భయాత్ములయి • శోభిలుచుందురు గాత మింక నీ
వరనుతి నేమనుష్యులు స•భక్తినను న్నుతియింతురట్టి వా
రరుదుగ ధర్మసంపదభి • యాతిజయంబులఁ గాంచి విద్యచేఁ
గరము యశంబు నొంది గత • కల్మషులై దృఢకాయులై కడున్. 314

తే. చాలకాలముజీవించి • సాధుపుత్త్రి, మిత్రజాయలతోఁగూడి • మేదిని సుఖ
జీవనంబులఁగాంతురు•సిద్ధమిదియ, యనుచుఁ బరదేవి పలుకంగ • హర్షమొంది.

వ. వాసవుండమరులతోఁగూడ నవశ్యంబు కార్యసంసిద్ధి యయ్యెనని తలంచెనని
చెప్పి హయవదనుండు మునిచంద్రున కిట్లనియె. 316

—— బ్రహ్మాదులు పరదేవిదర్శనమునకు వచ్చుట. ——

క. ఈరీతిని జగదంబిక, గారవమునఁ బల్కినట్టి • కాలంబున నా
నీరేజభవుఁడు మునివృతుఁ, డై రయమున వచ్చె నాప•రాంబఁగను దర్శిన్. 317

మ. వినతానందన నందివాహములతో • వేఁచేసి రబ్జాక్షుఁడున్
ఘనుఁడౌ శంకరుఁ డప్డువచ్చిరిమునుల్ • గాఢప్రమోదంబునన్
వనజాతేక్షణఁ దేవిఁ గాంచుటకు రం•భామేనకాద్యప్సరో
వనితల్ వచ్చిరి దేవయక్షగరుడ • వ్రాతంబు వచ్చెందమిన్. 318

వ. విశ్వావసు ప్రభృతులగు గంధర్వులును యక్షులును వచ్చి రప్పుడు. 319

తే. బ్రహ్మచేత నియుక్తుఁడై • భవ్యశిల్పి, విశ్వకర్మయు దేవికి • విజితదివిజ [లఁగ.
పురమునగు పత్తనంబును•బూన్కిఁగట్టెఁ, దనదుచాతుర్యమునుగాంచి•ధాతచె

తే. సకలమంత్రాధిదేవత • సారసాక్షి, యైన దుర్గయు సర్వవి•ద్యాధిదేవ
తాస్వరూపిణి శ్యామయుఁ • దరలివచ్చి, రమ్మహాదేవి నంబిక • నచటఁజూడ.

సీ. బ్రాహ్మ్యాదిమాతృకల్ • స్వస్వభూతంబులఁ గూడివచ్చిరి మఱి • కోట్లకొలఁది
యోగినీసముదయ • ముత్సాహమున నణిమాది సిద్ధులు భైర•వాళి, క్షేత్ర
పాలకుల్ ప్రమథాళి • వర్యుఁడై తగుమహాశాస్త్రయు, గణపతి•స్కంధవటుక

వీరభద్రులు మహా•వీరులు చనుదెంచి ప్రణతులై శ్రీదేవిఁ • బలువిధముల
ఆ. వినుతిచేసిరంత • విశ్వకర్మయు సాట్ట, సాలతోరణంబు • చారుతరము
హస్తిసైంధవరథ•హారిగృహంబును, గానొనర్చెఁ బురముఁ • గడురయమున.
చ. పురమది రాజవీధులను • బొల్చి మహీసురమంత్రిసైనికో
త్కరనృపమాన్యదాసముఖ•కాంతగృహావళిచేతనొప్పి సుం
దరముగ మధ్యభాగమున • ద్వారసుగోపురదివ్యమైన భూ
వరగృహాయుక్తిరమ్యమయి • వర్ణ్యసభాస్థలి నొప్పె నెంతయున్. 323
ఉ. కన్నుల కింపుగాఁ దనరెఁ • గ్రమమణివ్రజ దివ్యకాంతి సం
పన్న సభాంతరంబున వి•భాసురమై నవరత్నహారియై
ఉన్నత మద్వయంబు నుది•తోష్ణకరప్రతిమంబునై జగ
త్సన్నుతమై మనోజ్ఞము వి•శాలమునై తగుపీఠ మెంతయున్. 324
క. కనియా సింహాసనమును, దనమదిఁ జింతించె బ్రహ్మ•తరమే యీయా
సనమహిమ నెన్న దీనిని, మనమున నెల్లెంచి శిల్పి • మతిచేసెనొకో. 325
తే. బాలిశుండైన దీనిపైఁ • బాదమూన, సర్వలోకేశ్వరుండగుఁ • జనునె దీనిఁ
బురుషవిరహితమైయున్న•పువ్వుఁబోఁడి, యెక్కి రాజ్యంబుఁబాలించుటెట్టులొక్కొ.
సీ. మంగళాచార సం•పన్నుఁ బూజ్యుని మహా, పురుషలక్షణయుక్తు • నిరుపమాన
కాంతాసమన్వితుఁ • గడఁగి పట్టాభిషేకముఁ జేయఁ దగు నంచుఁ • గానఁబడెడు
స్మృతి; యివ్వరారోహ • చెలఁగెడు శృంగార దేవతాకృతి నిట్టి • దివ్యతరుణి
కనురూపుఁడగువరుఁ • డారయఁ ద్రిజగంబులను లేఁడు ఖండేందు • లలితుఁడైన
ఆ. శంకరుండు దక్క; • జటిలుఁడు ముండధా, రణుఁ డమంగళుండు•రహితతనువి
లాసుఁడైనహరుని • లలితాంగి యెబ్బంగిఁ, దా వరించునొక్కొ • తమిచెలంగ.
చ. అనుచు విరించియెంతయు మ•హాపురుషుం డెటులబ్బునంచుఁ దా
మనమునఁ జింతచేయఁగను • మన్మథకోటిమనోజ్ఞదేహుఁ డ
వ్వనరుహసూతి ముందటను • భాసురరీతిఁ దనంతఁ బుట్టెనే
ఘనుఁ డితఁడంచు ధాత మది • గాఢవిచిత్రము నొందుచుండఁగాన్. 328
వ. అమ్మహాపురుషుండు మఱియును. 329
ఉ. హారకిరీటకుండలమ•హాంగదముఖ్యలసత్తనుండు, సు
స్మేరముఖాంబుజుండు, మృదు•చిత్రమహాంబరధారణుండు స్ర
గ్వారమనోహరుండునయి • భవ్యసుచందనచర్చితాంగుఁడై
గారవమొప్పఁగా నెదుటఁ • గన్పడ నాతనిఁగాంచి వేడుకన్, 330

ఉ. ధాత వినీలకుంతల వి॰తానమనోహర భాసమాన వా
జ్నేత్ర, మహాప్రపంచతతి ॰ నిర్మలమానసవాంఛితార్థసం
ధాత, కుమారుఁ గౌఁగిట ము॰దంబునఁ జేర్చి యుమాధినాథ[1]మా
నేతలు నింద్రముఖ్యులు ము॰నివ్రజముల్ వెఱఁగందిచూడఁగన్. 331

క. కామేశ్వరాహ్వయంబున, నీమానిత దేహుఁడలరు ॰ నీఁకనని రుద్రా
ణీమాశచీశ్వరులతో, నామహితుని గొనుచు ధాత ॰ యంతట దేవిన్. 332

వ. సమీపించి స్తుతియించెనంత. 333

ఆ. హరిణశాబనయన ॰ నా దేవిఁ గనుఁగొని, యాకుమారుఁ డప్పు॰డతనుబాధ
చేత నెల్లక్రియలఁ ॰ జింతింపక వరించి, చూచుచుండె మదనుఁ ॰ డేఁచుచుండ.

చ. స్మరుఁ డపరావతారమునఁ ॰ జయ్యనవచ్చెనటంచుఁ బూని య
త్తరుణి యనంగబాణసము॰దాయవిభిన్నశరీరయై మనో
హరుఁడగు నాథుఁ డీతఁడని ॰ యాతనిఁజూచుచు నుండఁగాఁ బర
స్పరమును వారు భావభవ॰సాయకబాధలనొంది పిమ్మటన్. 335

వ. వారిరువురును సర్వభావవిశేషజ్ఞులును, ధృతిమంతులును, పరాజ్ఞాత చారిత్రు
లునునై ముహూర్తకాలము స్వస్థచేతసులై యుండి రప్పుడు. 336

సీ. ఆ దేవిఁగని బ్రహ్మ ॰ యనియె లోకైకనాయిక! దేవమునివర్య ॰ లెలమి సకల
గంధర్వులచ్చరల్ ॰ కాంతుఁగూడిన నిన్నుఁ బ్రభ్వీని జూడంగఁ ॰ బరమతోష
ముల నేఁగుదెంచిరి ॰ లలితుఁడౌ ప్రియుఁ డెవ్వఁ డతిధన్యు నాతని ॰ నరసి లోక
సంరక్షణార్థమై ॰ జనయిత్రి! పురుషుని వరియించి యాతని ॰ వరసతివయి

తే. చెలఁగి సింహాసనంబును ॰ జేరి దేవ, మాను లభిషేక మొనరింప ॰ మమతరాజ్య
లక్ష్మితోఁగూడిభూషణ॰లలితవగుచుఁ, బ్రియునితోఁగూడునినుఁజూడ వేడ్క గలదు.

—— శ్రీలలితాకామేశ్వరుల వివాహము. ——

కవిరాజవిరాజితము.

అనియిటువల్కిన॰నాయజువాక్యము॰హర్షమునన్వినియంబయనున్
వనరుహగర్భుఁడు ॰ వారిజనేత్రుఁడు ॰ వాసవుఁడు స్మతి శంకరుఁడున్
వినదయపర్వఁగ ॰ విక్రమమొప్పఁగ ॰ వేడుకపొంగఁగ సుస్మితయై
ఘనతరశక్తిని ॰ గామవిహారిణిఁ ॰ గావున మీరిట నాకుఁ బతిన్. 338

ఆ. మదనరూపచరితు ॰ మాన్యునిభావింపుఁ, డనిన దేవవర్యు ॰ లందఱువిన
బ్రహ్మ దేవుఁ డనియెఁ ॰ బరికించిధర్మార్థ, సహితమైనవచన॰సారమపుడు. 339

1 మాధేశ=విష్ణువు.

సీ. రమణి! కాలక్రీత • క్రయమిత, పితృదత్త మఱిస్వయంయుతయను• మగువలకును
బురుషుల కుద్వాహ•ము చతుర్విధంబగుఁ; బరఁగుఁ గాలక్రీత • వారవనిత
గాఁ గ్రయసంయుత • కాంత దాసిగఁ; బితృదత్తభార్యగ మఱి • తాను గోర
గాంధర్వియనఁగనీ • క్రమమునఁ బిలువంగఁబడు; మఱి తానుగా • వరునిస్వసమ

ఆ. ధర్మయుతునిగోరఁ • దనరుఁ బిత్రర్పిత, యైనభార్యకరణి • ననిన నంత
బ్రహ్మతోడఁగూడఁ • బల్కిరి విష్ణ్వాదు, లెల్ల బ్రహ్మరూప • నీశ్వరిఁగని. 340

క. ఎది యద్వైతము బ్రహ్మము, సదసద్భావరహితంబు • శాశ్వతతమమున్
విదితము చిన్మోదాత్మక, మదిమూలప్రకృతిఁ బుట్టు•నట్లుగఁజేసెన్. 341

తే. ఆపరబ్రహ్మ మనసీవె • యమ్మహాప్ర,కృతివనంగను నీవెకా•వే యనాది
వీవె యఖిలంబు నీవె నీ•వే తలంపఁ, గారణాకారణాత్మవు • గావెతల్లి. 342

వ. సనకాదియోగివరులు వ్యక్తావ్యక్తోదయాత్మవును, సదసత్కర్మస్వరూపవునుగా నిన్నుభావింతురు. మఱియు నిన్నుఁ బంచబ్రహ్మస్వరూపిణిగాఁ బ్రశంసింతురు. సృష్ట్యాదియందు సర్వంబును సృజించి పాలించి కాలంబున వధించుచుందువు. అట్లగుటఁ బ్రియసంగమంబువలన నీకు స్వాతంత్ర్యనాశంబులేదు. లోకానుగ్రహకామ్యంబున నొక్కపురుషుని వరింపుము. అని విన్నవింప బ్రహ్మాదులవాక్యంబుల నాదరించి పుష్పమాలికంబూని గగనంబునకువైవఁ బరమేశ్వర్యుత్సృష్ట యగు నమ్మాలిక నభస్థ్సలంబు నలంకరించి కామేశ్వరు కంఠంబునంబడియె. బ్రహ్మ విష్ణు శంకరాదులానందింప మందవాతప్రేరితంబులై ఘనంబులు పుష్పవృష్టిగురిసె. అంతఁ బితామహుండు జనార్దనుంగాంచి యీశివాశివులకు విధివిహితంబుగా వివాహంబుసేయవలయు. జగన్మంగళకారకంబగు ముహూర్తంబు సమీపించెడు. పరమేశ్వరిత్వద్రూపిణి. నీవెయాయంబకు సహోదరుండవు. కావునఁ గామశివునకు నీకళ్యాణి నొసంగవలయుననినఁ ద్రివిక్రముండు తత్క్షణంబ కామేశ్వరునకుఁ గామేశ్వరిని దేవర్షిపితృముఖ్యులును, సర్వత్రిదశులును, గంధర్వాదులునుజూచి యానందింప జలపూర్వకంబుగా నొసంగి వివాహంబు గావించె నంత. 343

చ. సరసిజసూతి యిక్షుమయ • చాప మనశ్వరవజ్రతుల్యముం
గరివరదుండు నిచ్చె సుమ•కాండము మ్లానవిహీన మంబకున్ ;
వరుణుఁడు నాగపాశమును • వారికి నిద్దఱకిచ్చె నంకుశం
బరుదుగ విశ్వకర్మ చెలు•వారెడువారల కిచ్చె వేడ్కతోన్. 344

చ. హుతవహుఁడుం గిరీటవర • ముద్యమ మొప్పఁగనిచ్చె భాస్కరా
మృతకిరణుల్ చెలంగెడు త•మిం వరకుండలయుగ్మమిచ్చి రా
సతికి మణీమయస్ఫురిత • సాధుసుభూషల నిచ్చె నబ్ధి తా
నతిముద మొప్ప నక్షయము • నౌ మధుపాత్రము నిచ్చె వజ్రియున్. 345

క. చింతామణి మయమాలిక, నెంతయుఁ దమి యక్షనాథుఁ • డిచ్చెన్ సతికిం
గంతుజనకుండు ఛత్రమ, నంతసుసామ్రాజ్యసూచ•నం బంబికకున్. 346

క. గంగాయమున లొసంగిరి, యంగనకున్ శంకరునకు • నబ్జరుచిరమౌ
మంగళచామరయుగళ మ, భంగమహారాజ్యదంబుఁ • బ్రాంధతతోఁపన్. 347

చ. సరసిజసూతి యశ్వినులు • శంకరులున్ వసువుల్ మరుద్గణే
శ్వరులును సాధ్యముఖ్యులును • సంతస మొప్పఁగ నాత్మదివ్యదు
ర్భరశరపంక్తి నిచ్చి రథ • వారముఁ జిత్తసమాన వేగవి
స్ఫురదురుసైంధవంబులను • బుష్పములన్ రుచిరాంగకంబులన్. 348

తే. ద్విరదముల నట్టివానిక్షు• త్తృష్ణ లేని, వానిఁ గులిశాకృతులనొప్పు • బాణములను
నాయుధంబుల నబ్భంగి • నలరువాని, బ్రీతినిచ్చిరి దేవతా•బృందములట. 349

—— శ్రీలలితాంబికా పట్టాభిషేకము. ——

సీ. తదనంతరంబ యా • తన్వంగి కభిషేకమున రాజ్యభారంబుఁ • బూన్పఁదలఁచి
శంకరుఁగూడిన • శాంభవి కొక్కవిమానంబును రచించి • మహితరీతిఁ
గుసుమాకరంబని • కూర్చిరి నామము, మ్లానమాల్యము [1]ననూ•నార్యభేద్య
సాయకం బంతరి•క్షస్థానభస్త్రులకామగంబు సమృద్ధి • కలిత మగుచు

తే. నావిమానము వెలసెనే • యమలపుష్ప, కాత్తగంధంబు నాసికా•యత్తమైన
భ్రాంతిరోగక్షుధార్తులు • పాఱిపోవుఁ, దత్క్షణంబున నాహ్లాద•దంబు దాని. 350

వ. అధిష్ఠించి యాదివ్యదంపతులు నృపమందిరంబునుండి చామరవ్యజన చ్ఛత్రధ్వజంబులలర, వీణావేణు మృదంగాది వివిధవాద్యస్వనంబులు సెలంగ, సురనికర పరిసేవ్యమానులై బయలువెడలి నిజవిజయసంసూచకతేజంబున నెల్లరఁ బ్రకాశింపఁజేయుచు, విహారంబుగా వీధియందరుగుచుండ నవమణిగణ ప్రభాభాసమాన నిస్సమానచారుసౌధహర్మ్యశీర్షస్థితాప్సరః ప్రమదాకదంబంబును, నిఖిలమంగళసూచక విరాజల్లాజాక్షతయుతాయత శుభతమ రేఖాసంయుత హస్తలగుపురసతులును బుష్పాదికంబులను జల్లుచుండ, వీణావేణువినిస్వనంబులును, మంగళార్థాభిహిత విహితగాధలును శ్రోత్రపాత్రంబులై యొప్పుచుండ,

1 అనూనార్యభేద్యసాయకము=అధికులగు శత్రువులను భేదింప శక్యముగాని బాణములుగలది.

వందిమాగధబృందంబు లమందానందంబున సుందర మృదుమధురవాక్యంబులఁ బ్రశంసించుచుండ, సంరంభంబున నూరువిజిత రంభయగురంభయు, మాననీయ గాన సంతోషీకృత త్రిదశోత్తమయగు తిలోత్తమయు, సౌందర్యోద్దామయగు హేమయు, చపలనయన విజితహరిణియగు హరిణియు, ఫాలవిలాస తిరస్కృత శశిలేఖయగు శశిలేఖయు, సౌభాగ్యసౌందర్య [1]తానకమగు మేనకయు లోనుగాఁగల దేవభామినులు నాట్యంబు సల్పుచుండ నానందించుచు మందమందగమనంబునఁ జని యప్సరోలలనాదత్తనీరాజనంబును బరిగ్రహించి విమానంబుడిగ్గి మహాసభాస్థలంబును బ్రవేశించి కామేశ్వరునితోడ సింహాసనంబు నధిష్ఠించి తత్రత్యులగు మహాజనులు మానసంబున నేయే యభీష్టములం గోరిరప్పుడా సర్వజ్ఞకటాక్షపాతంబునఁ దత్తత్కామంబుల నొసంగిన నయ్యద్భుత చరిత్రంబును గాంచి లోకపితామహుం డమ్మహారాజ్ఞికిఁ గామాక్షియనియును గామేశ్వరియనియును నాహ్వాయంబును బెట్టె. అప్పురంబునఁ బరదేవియాజ్ఞచే మేఘంబులువర్షించె. మహార్హ వస్తువులును, దివ్యాభరణంబులును, చింతామణి కల్పవృక్షకమలా కామధేనువులు ప్రతిగృహంబున దేవి యాజ్ఞ నివసించె. అంతఁ దత్స్వైకరసాకారులును, విముక్తాన్యక్రియా కలాపులును, సర్వకామార్థసంయుక్తులును, నిరంతరసంతోషస్వాంతులునునై సర్వకాలం బాపత్తనంబునఁ బితామహ హరిశంకర హరిహయులును, తక్కుంగల దిగధిపతులును, సకలదేవతలును, నారదాది దేవర్షులును, వసిష్ఠాది తపోధనులును, గంధర్వాప్సరోయక్షులును, స్వర్గాంతరిక్షభూములయందు బాధించుచు నివసించు భూతంబులును సంతోషంబున నప్పత్తనంబున నివసించిరి. ఎల్లజనులిమ్మహాదేవి మాయందుఁ గరుణగలిగియుండునని తలంచునట్లు మహానురాగంబున సర్వజనుల సంతోషమానసులంగావించె. కామేశ్వరుండు విద్వత్సకలేప్సితంబులను, కామేశ్వరి సర్వజనుల కభీష్టంబుల నిచ్చుచుండిరి. ఇట్లు వారలు రాజ్యంబును బూజ్యభంగిఁ బాలింపుచుండ దశవర్షసహస్రంబులు క్షణకాలంబురీతి గడిచె. అంతనొక్కనాఁడు. 351

చ. సురముని నారదుండు త్రిదశుల్ దివినుండుట మాని శ్రీపరే
శ్వరిపురి నుంటఁ గాంచి గడు • భక్తి చెలంగఁగ నేగుదెంచి య
ప్పరశివురాణిపాదముల • భవ్యతరోక్తుల సన్నుతించి మ్రొ
క్కి రమణ నమ్రుఁడై నిలిచి • కృత్యమునెంచి వచించె నివ్విధిన్. 352

[1] తానకము = స్థానము.

క. పరమేశ్వరి! పరము పరా, త్పరము పరబ్రహ్మ మీవె ♦ పరమపవిత్రం
బురుసదసద్భావంబనఁ, బరఁగెడు సంకల్పమీవె ♦ పంకరుహాక్షీ. 353
సీ. జగదభ్యుదయముకాం♦క్షగ వ్యక్తభావంబు నొందితీవు [1]ఖలౌఘు ♦ ముక్కడంప
సజ్జనాభ్యుదయంబు ♦ సరగునఁ జేయంగఁ గాంక్షించితిద్ది సం♦కల్పమంబ!
త్వత్ప్రవృత్తియు సాధు♦తతిపాలనార్థమేకద చారుకల్యాణి ♦ కమలనయన
భండాసురుండనఁ ♦ బరఁగు రక్కసుఁడిప్డు బాధించె లోకాళిఁ ♦ బౌరుషమున
ఆ. నీవుదక్క నొరులు ♦ నిలువఁజాలరు పోరఁ, జచ్చునతఁడు నీదు ♦ శక్తిచేతఁ
ద్వత్పదాబ్జసేవఁ ♦ దగుభంగిఁ జేయుచు, నున్నవారు దివిజు ♦ లొప్పుగనిట. 354
మ. చిరకాలంబుగతించె స్వర్గము సురల్ ♦ చేరంగనోఁ ద్వత్కృపన్;
బరమంబౌ దివి శూన్యమై యశుభమై ♦ వ్యర్థంబునై యున్నదం
చు రహిన్ విన్నపమొప్పఁ జేయ విని యా ♦ శుభాంగి యిందాదులం
గరుణంబిల్చి బహూకరించి యనుపం ♦ గాఁ బోయి రుద్యద్వ్యథన్. 355
చ. హరిఁ బరమేష్ఠి శంకరుని ♦ సర్వగతిం గడు గౌరవించి స
త్వరముగఁ బోయిరండనుచుఁ ♦ బంపినఁ బోవఁగ లేక స్వాంశముల్
నిరుపమతాత్మరూపులుగ ♦ నిల్పి పరాంబను బూజసేయఁగాఁ
గర మనురక్తి నేర్పడిచి ♦ గద్గదకంఠరవంబు లొప్పఁగన్. 356
ఆ. కరుణతోడమమ్ముఁ ♦ గాపాడుచుండుమో, యంబయనుచు వేఁడి♦యమరవరులు
చనిరి మరలి మరలి♦చక్రేశ్వరినిభక్తిఁ, దలఁచుకొనుచు స్వపుర♦ములకు వారు.
చ. అని హయకంఠుఁ డమ్మునికి ♦ నద్భుతరీతి వచించి యిట్లనున్
మునివర! లోకమాత కడు ♦ మోదమునన్ జనియించి సర్వలో
కనుతులఁగాంచి రాజ్యమును ♦ గైకొని చార్వభిషేచనక్రియన్
ఘనతవహించె నన్నకథ ♦ కావున దీనిని భక్తిమీఱఁగన్. 358
సీ. పఠియించినంత నీ♦భవ్యచరిత్రంబు సర్వమంగళదమై ♦ చనుధరిత్రిఁ
గాన నేమానవుం ♦ డైనఁ బ్రభాతంబునందు మేల్కని శ్రద్ధ ♦ యలరుచుండ
జపియింప ధనికుఁడౌ ♦ నపగతపాపుఁడౌ నమృతవాక్కలితుఁడౌ♦నశుభమడఁగు
నిహపరంబులుగల్గు ♦ నెనఁగు సత్కీర్తియు, సాటివారలలోన ♦ మేటి యగును
ఆ. అచలలక్ష్మికల్గు ♦ నెచట భయంబులే కలరువీర్య తేజ♦ములు చెలంగు
తాపములును మూఁడు ♦ తలఁగును బురుషార్థములులభించు వేయు♦పలుకులేల.
క. కాలత్రయమున నేనరుఁ, డాలలితను దలఁచి దీని ♦ నవలఁ బఠింపం

1 ఖలౌఘము=దుష్టులగుంపు.

గాలక్ష్మి యాఱునెలలకు, లోలత్వము విడిచి యింటిలో నివసించున్. 360

వ. అని కుంభసంభవునకుం జెప్పి యనంతర కథాకథన కుతూహలియై హయ గ్రీవుండు. 361

తే. వ్యక్తరూపుని నవ్యక్తుఁ • బాపహరుని, దేవునానందచిన్మయుఁ • బావనాత్ము సాంబమూర్తిమహేశాను•ననఘుఁదలఁతు, శంకరుని నాదుమనమున•సంతసమున.

సతీదేవి దక్షాధ్వరమునకుఁ బోవుట.

క. ధ్యానించి యీవిధంబున, మానితశివనామతతిని • స్మరియించి తమిన్ గానముసలుపఁగఁ గుంభజ, మానిహయగ్రీవుఁగాంచి • మమతంబలికెన్. 363

క. తురగగళ! దేవ! లోకని,కరపతి! కరుణైకనిలయ! • జ్ఞానానందా దర! హస్త చతుష్కోల్లస, దురుమూర్తి! మహాత్మ! మనవి•నొక్కటివినుమీ.

సీ. ప్రతిపాదితములయ్యె • బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాచార•వారమాశ్ర మోచితధర్మంబు • లొక్కటమీచేత శాస్త్రతత్త్వమునెల్ల • సమ్ముదమున నెఱిఁగితి, సర్వలో•కేశ్వరి మాహాత్మ్యమును జండికామహి•మను మఱియును బ్రాహ్మ్యాదిమాతృకా • పటలమాత్మ్యంబు వర్ణింప వింటి స•ర్వాదివిజులకు

ఆ. పూజనీయ దేవి • యాజగన్నాయక! యెవతె? యేపరాప•రేశికృపను సర్వకాలవిజయ • సంపన్నుఁడగునరుఁ, డెట్లుభుక్తిముక్తు • లెసఁగఁ జెపుమ. 365

క. ఎదిభుక్తినొసఁగు దైవం, బది ముక్తినొసంగఁజాల • దట్లిడుమోక్షం బెదిభుక్తినీయఁజాలదు, కద యదియన నతనికశ్వ•కంఠుండనియెన్. 366

శా. ప్రాచుర్యంబుగ భుక్తిముక్తులనిడన్ • భాసిల్లు నెద్దద్దియే శ్రీచక్రేశ్వరినాఁ జెలంగులలితా • శ్రీదేవియాఁ గుంభజా యాచక్రేశ్వరి బ్రహ్మమానదియ సూ • హర్షంబునన్ లోకముం బ్రోచున్ సృష్టియొనర్చు నాజననిచే • భూతేశమావాక్పతుల్. 367

ఆ. నాథవంతులైరి • నాకులనరులను, భండుఁడేచిచాల • బాధచేయఁ బాలనంబుసేయఁ • బరతత్త్వ మాలలి, తాతనువునుదాల్చెఁ • బ్రీతితోడ. 368

మ. అనినం గుంభజుఁడిట్లుపల్కె నెవఁడ•య్యా! భండుఁ డెవ్వానికిం దనయుం డెచ్చటనుండు, నెట్లుసమరో•ద్దాముండు చచ్చెన్ రణం బున నెవ్వానిపరాక్రమంబున జగం•బుల్ స్రుక్కె నెవ్వానిచే తను గావంబడెనేనిచేఁ దెలుపు మే•తద్వృత్తమున్ సర్వమున్. 369

క. అనియడిగిన హయవదనుం, డనియె మహాప్రీతిచెలఁగ • నమ్మునితోడన్ వినవయ్యా? తచ్చరిత్రము, ననూనవిధిఁ జెప్పువాఁడ • నని ఘనభణితిన్. 370

మ. విను మర్ధేందుధరుండు దక్షతనయా ♦ విఘ్నేశసంయుక్తుఁడై
ఘననందీశ్వర భృంగిముఖ్యగణముల్ ♦ కైవారముల్ సేయఁగా
సనకాదుల్ తనుఁ బూజచేయఁగ సదా ♦ సంతోషుఁ డద్వంద్వుఁ డా
ధ్యానాస్థానపు మండపంబున మహా♦ర్హ్వాస్థానసంవాసుఁడై. 371

మ. సరసాలాపములన్ స్వకీయదయితన్ ♦ సంతుష్టఁగాఁ జేయుచుం
గరుణానీరధి శంకరుండు కొలువై ♦ కాలోచితప్రక్రియల్
పరమానందమున న్మునీశ్వరులకుం ♦ బల్మాఱు బోధించుచున్
సురసంఘార్చితపాదపద్ముఁడగుచున్ ♦ శోభిల్లుచుండెం గడున్. 372

చ. అటువలెఁ గొంతసేపు చను♦నంత విమానము లెక్కి దేవతా
పటలము దక్షునధ్వరము♦భంగిఁ గనుంగొను వేడ్కతో సము
త్కటగతిఁ బోవుచుండ సుర♦కాండపరస్పరభాషణోత్థమా
చటులమహారవం బొకటఁ ♦ జయ్యనఁ బర్వె సమస్తదిక్కులన్. 373

చ. అరుదుగ నింగిఘోషమిటు ♦ లాసమయంబునఁ బుట్ట దక్షక
న్యరమణ నాలకించుచు న♦హా! యొకఘోషము పుట్టెఁ గారణం
బరసి రయంబునం దెలుపు ♦ మంచుగణాగ్రణిఁ బంపఁగా నతం
డు రయముమీఱఁ బోయెను బ♦టుధ్వనియానెడ కెంతొ పూన్కితోన్. 374

చ. చనిచని కారణంబరసి ♦ చయ్యనవచ్చి వినమ్రశీర్షుఁడై
యనియె భవాని! నీజనకుఁ ♦ డర్హ్వావిధిన్ మఖమొండు చేయఁగాఁ
జనియెద రీసుపర్వులదె ♦ సంతసమొప్పఁగఁ దమ్మునెల్ల నీ
జనకుఁడు పిల్వఁ; దద్గమన♦సంభవమీఘనఘోషమంచనన్. 375

చ. జనకుఁడు యాగకర్త సుర♦సంఘము తన్మఖదర్శనార్థమై
చనియెడువారు పేరుగల ♦ సాధ్విజనంబులు సోదరీగణం
బును మఖముం గనుంగొనఁగఁ ♦ బోవుట నిక్కమటంచు నెమ్మనం
బునఁ దలపోసి సంతసము ♦ పొంగఁగ నాసతి భర్తకిట్లనున్. 376

ప్రియంవదావృ. జనకుఁడిప్డు తమి ♦ సత్రతంతువుం
బొనరఁజేయునట ♦ భూతనాయకా!
కనుఁగొనంగమదిఁ ♦ గాంక్షకల్గె నా
కనుపమానదయ ♦ నంపుమీ ననున్. 377

సీ. చాలకాలంబయ్యె ♦ జననుల సోదరీ జనముల సన్నల ♦ సహజజనముఁ
దత్తనూజులను బాం♦ధవులఁ గనుంగొని; కావునఁ జంద్రశే♦ఖర మఖంబుఁ

జూడఁగా ననుఁబంపు ♦ చూచెద దానిని బాంధవులను వేగ ♦ వత్తు మరలి
యనవిని గంభీర ♦ మైనవాక్యములఁబల్కెఁ జంద్రశేఖరుఁడాత్మ ♦ సాధ్వితోడ
తే. దేవి! మఖమునుజూడంగఁ ♦ బోవవలదు, కారణంబొండుఁదెలిపెదఁ ♦ గడఁగివినుము
భక్తవాంఛలనొసఁగుచు ♦ వారికష్టములను జెండుచు మేముందు ♦ మెలమిచెలఁగ.
క. లోకాధికులము సత్య, ప్రాకటవిజ్ఞానరూప ♦ పరిణతులము మే
మోకలకంఠి! స్వకార్యము, మాకించుకయైన లేదు ♦ మాటలిఁకేలా. 379
ఆ. ఒక్కమాటచెప్పి ♦ నుద్యమమైనను, గానరాదు విత్త ♦ కాంక్ష లేదు
కార్యమొండుచేయఁ ♦ గా బుద్ధిపూనదు, కొదువయింత లేదు ♦ కోర్కిలేదు. 380
క. కృతకృత్యులమై స్వాత్మా, యతమోదపరాయణులము ♦ నై యుండెడు మ
మ్మతులితభక్తినివచ్చి రొ, కతజిని జూచుటకు దేవ ♦ గణములు వేడ్కన్. 381
ఆ. వారితోడఁగూడి ♦ వచ్చె నీజనకుండు, దురభిమానధనుఁడు ♦ సురగణంబు
వందనములుసేయ ♦ నందుమీతండ్రి న, న్నల్లుఁడనెడుబుద్ధి ♦ యుల్లసిల్ల. 382
చ. నతులొనరింపఁడయ్యె మఱి ♦ నాకులనెల్ల బహూకరించి నే
నతనిని వారితోడ ముద ♦ మందఁగ క్షేమము ప్రశ్నచేసి స
త్కృతినొనరించి మామయని ♦ కేవలభక్తి నమస్కరింప కా
వితమున గారవించితిని ♦ వేఱొకదోషము లేదు నాయెడన్. 383
ఆ. కానఁబడఁడునాకుఁ ♦ గలయంగవెదకిన, జాన! వందనంబు ♦ సలుప నర్హుఁ
డెల్లలోకములను; ♦ ఈర్ష్యాదులందునీ, కొక్కతకెజగాన ♦ మ్రొక్కువాఁడ. 384
తే. ఇట్టులౌటను బురుషున ♦ కేనికెచట, వందనము చేయవలసిన ♦ వాఁడఁ గాను
ప్రణయకలహంబుననునీకుఁ ♦ బ్రణతులిడుదు, నద్దియటులుండెనావల ♦ నవధరింపు.
ఉ. అంతట నీదుతండ్రియు మ ♦ హాగ్రహమూర్ఛితుఁడై మనంబునం
దింతయు శాంతమూనకయె ♦ హీనతరోక్తుల నన్నుఁదిట్టి య
త్యంతముదహ్యమానహృద ♦ యంబునఁ బోయి గృహంబుఁజేరె నో
కాంతరొ యప్పుడే నతని ♦ గంటి వికారసమన్వితాస్యగన్. 386
తే. దురభిమానత దౌరాత్మ్య ♦ మరయ నతని
యందుఁ గలుగుట నాతఁ డ ♦ య్యాగ్రహమున
విడిచె నిన్నును నన్నును ♦ వేయునేల
కుమతులగు దేవతలతోడఁ ♦ గూడియుపుడు. 387
చ. నవమొనరింపఁ బూనె నది ♦ సాధ్వి నిరర్థకమై మదీయనిం
ద వఱలుగాన నీవుసనఁ ♦ దప్పక కీడుపొసంగు స్వేచ్ఛచే

త వడిఁ జనంగఁగోరిన స్వ•తంత్రవుగావున వెళ్లు మావలం
గువలయనేత్ర ! నాదుపలు•కుల్ హృదయంబున నాఁటు నీకనన్. 388

మ. విని దాక్షాయణి శంకరోక్తులననున్ • విశ్వేశ ! యెట్లైనచో
ననుమానంబిఁక నేల తండ్రికిఁ ద్వదీ•యంబైన మాహాత్మ్యమున్
వినిపింతుం దగ వొప్పుఁ డెల్లు నటుకా•వింపంగ లేకున్న నా
జనకుండుర్వ వడి క్షీణ మొందుఁ బరమే•శా! నిన్ను దూషించుటన్. 389

తే. చిత్తదోషంబుచేఁదండ్రి • చెడునుగాని, నీకుదూషణకల్గునే • నిన్నుఁబిల్చి
యజ్ఞమునఁగడు సత్కార•మతఁడుచేయు, నట్లుబోధింతుజ్ఞానంబు•నందునటుల.

సీ. జనకుండుదుష్పాప • సంకటంబున భవన్నిందామయంబునై • నెగడువ్యర్థ
శుష్కమహాకూప • సుకృతహీనాంతరతలమునఁ బడుఁగానఁ • జెలఁగి యతని
నేఁ దరింపఁగఁజేయ • నేర్తు; భవచ్ఛక్తి బూదిగప్పిననిప్పు•పోల్కి నొప్పు
దానిగా నెఱుఁగఁడు • గాననాతండ్రికి బోధసేయఁగనేన • పోవవలయుఁ

ఆ. గాన వందనములఁ • గైకొనిననుఁబంప, వలయుననిన ముందుఁ • గలుగఁబోవు
ఫలములనుదలంచి • పరమేశుఁడూరక, యుండెసతియుఁబోవ •నుద్యమించె. 391

చ. సతియిటునాథునాజ్ఞఁగొని • చయ్యనఁదండ్రి మఖోత్సవంబు నెం
తో తమిఁ గనుంగొనంగఁ జన • నూల్కొనఁ దల్లి ప్రయత్నమెంచి వే
గ తగినవారిఁదోడఁజనఁ • గాఁ దగుఁబంపుట యంచు స్కందుఁ డు
ద్ధతులగు యోధవీరులను • దర్పసమగ్రులఁ బిల్చి యిట్లనున్. 392

చ. జననిమహాక్రతూత్సవము • సందడిఁజూడఁగఁ గోరి పోవగా
మనముననిశ్చయించెఁ గడు • మన్ననతోఁ వఁగఁ గూడఁబొండు మీ
రనయముఁ గార్యభంగిని స•మాదరమొప్పఁగఁ జేయుచుండుఁడీ
జనకునియాజ్ఞ మీరిటకుఁ • జయ్యనఁ దల్లిని గూడిరండనన్. 393

వ. వల్లెయని ప్రయాణమై మహాకాళ, మహాకంఠ, ఘంటాకర్ణ, కపాలి, కుంభోదర, నికుంభ, మీనగ్రీవ, మృగాంత, కోర్ధ్వకేశ, కేతుమాలి, తండు, మకరలోచన, సోమక, నీలబాహు, భైరవ, కాలభైరవ, స్వచ్ఛందభైర, వోచ్చాసోృ, ద్వరత్త, విశ్వఘస్మరా, లర్క, సింహకేతు, మణిమ, న్మణికంధరులను ప్రమథగణాగ్రణులు మహౌజసులునగు వీరులు సతీదేవి రక్షణార్థమై శస్త్రాస్త్రపాణులై యొక్కొక్క రనేక గణంబులంగూడి కుమారసమాదిష్టులై కాంచనమణిమయ విమానంబునకు వాయువేగ తురంగంబులంబూన్చి దాక్షాయణినం దుపవిష్టఁ

గావించి వ్యోమమార్గంబున బయలువెడల నమ్మహాదేవిని సిద్ధచారణాదులు నుతింపఁజనిరి. అంత [1]కలాచీచామరంబులను, తాళవృంతంబును, కనకపాదుకలను, తాంబూలీ [2]కరండంబులను, భూషణపేటికను గైకొని సర్వాంగసుందరులును, కేళీచతురలును, ప్రాణప్రియలునునగు సతీపరిచారికలు మనోవినోదన ప్రాయకథాబంధ విచక్షణలై సతీదేవి ననుసరించి రప్పుడు. 394

చ. ఒరయుచుఁ [3]గేతుమాలికల • నుద్ధతవేగము తోడ నడ్డుగాఁ
బరఁగుచునున్న మేఘములఁ • బాఱఁగఁదోలుచు నెల్లదిక్కులం
దురుతరఘంటికాఘణఘ•ణోజ్వలనాదము నింపుచుం గన
ద్వరకనకాంగ మెంతయును • భాసురమై తగ స్వర్ణశైలనుం
దరతరమైనయాకృతిని • దార్ఢ్యనిభంగి విమాన మొప్పగన్. 395

క. ఆకసమున విహరించుచుఁ, బ్రాకటగమనంబు మెఱయఁ • బరుగిడ దివిజా
లోకములు నిర్నిమేషము, లై కడు ననిమేషములన • నవనింబరఁగెన్. 396

వ. ఆసమయంబున. 397

సీ. అర్కునకెదురుగా • నాస్యంబులెత్తుచు నెగయఁజాలక పక్షు • లేడ్వఁదొడఁగె
నశుభసూచకముగ • నాసతీదేవికి దక్షిణాక్షియు వే క•దలఁ దొడంగెఁ
బ్రతికూలగమనుఁడై • పవనుండుబోరున వేయివిధంబుల • విసరసాగెఁ
బొగగప్పుకొనిదిశల్ • సొగసుదప్పి యపారపాంసుసంఛన్నతఁ • బరఁగె మఱియు

తే. నివ్విధమున మహోత్పాత • మెల్లచోట్లఁ
గనఁబడుచు నుంట కాదక్ష•తనయ యేయు
పద్రవమువచ్చునోయంచు • భయపడుచును
జనియె జనకునిమఖముఁ గ•న్గొనెడు కాంక్ష. 398

క. చనిచని ముందటఁ గనియెన్, ఘనమంత్రాహూతసురని•కాయమహోచ్చ
స్స్వనఘోషితదిగ్వ్యూహము, ఘనతరమఖగేహమును ని•కామముదమునన్.

సీ. ఆయజ్ఞవాటిక•యందుఁ దల్లులఁ దోడఁబుట్టువులను మహా•ముఖ్యులైన
బాంధవులను దేవ•పతిముఖ్యగీర్వాణ సముదాయములను గం•జప్రసూతి
ముఖులను వహ్నియ•ములను రాక్షసపాశిపవమానధనదుల • భాస్కరేందు
వసువులఁ దద్యజ్ఞ•వాటస్థితానేకదేవతలను శచీ•దేవి స్వాహ

తే. మొదలుగాఁగల నిర్జరీ•సుదతులను ము,దంబు మీఱఁగఁజూచి య•త్యంతభక్తి
యజ్ఞపాత్రములను వివి•ధాంగకములఁ, దత్ప్రయోగసమర్థులౌ• ధరణిసురుల.

1. కలాచి=తమ్మపడిగము. 2. కరండము=బరిణె 3. కేతుమాలికలు=జెండాలగుంపులు.

వ. కాంచి మఱియుఁ గర్మలంపటులగు పరీక్షకసదస్యఋత్విక్కులచేతను, మంత్రధ్వనితనిర్భిన్నపాపులయి సాంగమంత్రఘోషణంబుల హోమం బొనరించు ప్రయాజానుయాజకులచేతను, వౌషడ్వషట్కారస్తోత్రశస్త్రసామపురోనువాక్యంబులు పఠించు వారలచేతను, పత్నీసంయాజకృత్యములచేతను, దర్భసంవేష్టితయూపంబులచేతను, ప్రకాశించు తావులఁ గాంచి యజ్ఞవాటంబునం గల వివిధాశ్చర్యంబులను జూచుచు సఖులంగూడి దురభిమానియుఁ దండ్రియు నగు దక్షునిసన్నిధి కేగె నప్పుడు. 401

సతీదక్షులపరస్పర నిష్ఠురసంభాషణము.

క. పరిచారిక లిరుపంకలఁ, బరమప్రమదమున రాఁగ • భాసిల్లుచు స
త్వరగతివచ్చెడు సుతఁ గని, హరు నందలి రోష మప్పు • డభివృద్ధిఁ గనన్. 402

చ. గురుతరరోష మొప్పఁ దన•కూరిమిపుత్త్రిని గాంచ కట్టె ని
ష్ఠురతరబద్ధమాభ్రుకుటి • చూచినవారికి భీతి నింపఁగాఁ
గరము ముఖంబు నడ్డముగఁ • గన్నను ద్రిప్పి మనోజ్ఞఫక్కి నా
దరము సెలంగ బంధువులఁ • దన్పుచుఁ గూఁతుఁ దిరస్కరించుచున్. 403

శా. ఓసీ! పాపమతీ! దురాత్ముఁ గలుషో•ద్యోగుం జితాంగారభూ
త్యాసంవేష్టితవేషుగర్హితకపా•లాయత్తచిత్తుం బిశా
చీసమ్యక్పరివేష్టితుల్ గతకులుల్ • జీర్ణాంబరుల్ భర్తగాఁ
జేసెన్ రుద్రుని నీకు ధాత కలదే • చింతింప నింకేమియున్. 404

వ. నాకుఁ దనూజాతవైనను మిథ్యాభిమానియు, మిథ్యాహంకారుండును, సదాచారవిరోధియు, శక్తిగర్వితుండును, దామసాహంకారుండును, ధూర్తుండును, బరమదాంభికుండును నగు భర్తృదోషంబున నీవు దూష్య వైతివి. మఱియు నశివవేషుండు, నశివస్థాననివాసియు నగు రుద్రుని సదాచారనిరతులగు జనులు కొందఱు శివుం డని పలుకుదురు. అది యట్లుండె వినుము.

చ. హరుఁడు తపస్వివేషమున • నందఱ మోహము నొందఁజేయు నో
తరుణిరో! మాయచేసి నిను • దారనుగాఁగ గ్రహించె నక్కటా!
హరునఘకోటిహేతవుగ • నట్లనె నీవును దుష్టవైతి వే
మరు దిది యావుపాలు శున•కావలి ముట్టిన నెట్లు తావనా. 406

ఆ. పొమ్ము పొమ్ము మగని • ప్రోలికి వేవేగ, కలిగె కలిగెఁ బ్రీతి • కడఁగి యిటకుఁ
బొట్టుపెట్టి యెవరు • బోటిరో! నిర్భీతు, కింకరిం బిలిచిరి • శంకలేక. 407

క. ఇది మొదలెత్తఱి నాదగు, సదనంబున కీవు రాఁగఁ • జనదని యామెన్

మది నొచ్చుమాటలాడిన, సుదతియుఁ గడుదుష్టుఁ దండ్రి♦జూచుచుఁ బలికెన్.

మ. జనకా! నీకెటు లిట్టి యూహకలిగెన్ ♦ సాన్నిధ్యముం జెందె నిన్
ఘనకష్టంబు లిదేమొ? మూలమడఁగం ♦ గాఁ జేయు దుర్మార్గరీ
తిని నేఁడెవ్వఁడు నీకుఁ జెప్పెనొకొ యీ ♦ దివ్యంబులౌ సంపదల్
చనియెన్ త్వద్ఘనకీర్తిఁగూడి దివికిన్ ♦ శాంతించె నీజ్ఞానమున్. 409

వ. ప్రాజాపత్యాధికారంబును గథామాత్రావశేషం బయ్యె నని పలికి వెండియు.

చ. నిరుపమ విప్రసంతతి జ♦నించి కులీనుఁడ వంచు సజ్జనుల్
పరుస నుతింప నొప్పి కుల♦పాంసన! నీవిటు దుష్టబుద్ధివై
పరమ కులంబు కీర్తి చెడఁ ♦ బల్మఱు నీశ్వరుఁ దిట్టుచుంటి వి
ట్లు రహితసత్త్వరీతిని గ♦డున్ నిను నేమని దూఱఁగాఁ దగున్. 411

సీ. త్వత్సంగతిని సమ♦స్తబ్రాహ్మణుల్ చెడి రింక మీఁద వచింతు ♦ నెవ్వఁ డరయ
యజ్ఞంబు, మఖభోక్త,♦యజ్ఞఫలంబును, యష్టయు, స్రష్టయు,♦యజ్ఞమూర్తి
యట్టిఁడా శివుని దు♦రాశయ! తెగడితి వతిభక్తి శివ యను♦నక్షరద్వ
యంబున నెవ్వాని♦యాహ్వయంబుస్మరింపఁ గైవల్య మొనఁగూడు♦గాన నతని

ఆ. దుష్టబుద్ధి వగుచు ♦ దూషించెదవు కటా!, [1]జ్ఞానశుచివిదగ్ధ♦కల్మషులు త
పోనియతులు నైన♦మానులే మహనీయు,వందనములఁ దన్పు♦చుందు రెపుడు.

చ. అతనిని దిట్టెదే కుమతి! ♦ యష్టవిధం బగు మూర్తిసంఘమే
వితత జగంబు గల్గుటకు ♦ విశ్వ మహోన్నతికాలయంబు నా
నతని విశుద్ధతత్త్వతను ♦ నబ్జశిఖామణి నిందచేసె దే
గతి నిఁక గౌరవంబును జ♦గంబునఁ గాంచెద వీవు దుర్మతీ!. 413

ఆ. అక్కటకట! పాప♦మెక్కువ యయ్యెనీ, శాంతమెల్ల నిప్పు♦డంత మొందె
వేయిపలుకు లేల♦విపులాంధకూపంబు, నందుఁ బడుట కేమి ♦ సందియంబు. 414

శా. [2]మూలోన్మూలనకృత్యబుద్ధిని గడుం ♦ బోఁదోలి సర్వేశ్వరున్
లీలాకల్పిత లోకజాలుని హరున్ ♦ లీలాకురంగాంచితుం
జాలన్ భక్తిని దోడితెచ్చి యిచటన్ ♦ సన్మానితుం జేసినన్
వాలాయంబుగ యజ్ఞసిద్ధి యగు స♦ర్వస్వామియుద్యత్కృపన్. 415

చ. అని మరలన్ సతీతిలక ♦ మాతని కివ్విధిఁ జేయవేని నీ
వొనరుచు నట్టి యజ్ఞ మిది ♦ యొయ్యన నౌఁ గడునాభిచారికం

---

1 జ్ఞానశుచివిదగ్ధకల్మషులు=జ్ఞానాగ్నిచే దహింపఁబడిన పాపములు కలవారు. 2 మూలోన్మూలనకృత్యబుద్ధి = మూలచ్ఛేద మొనరిచునట్టిపాపబుద్ధి.

బనితరసాధ్య దైవ మగు • నట్టి యుపాస్యు ననాదివిగ్రహున్
జనక! శివుం ద్యజించి యిటు • జన్నముఁ జేసెద వేమిచెప్పుదున్. 416

ఆ. ఇసిరో! నీదు నేరు• పేమని నిందింతు, వంశమునకు నీకు • వసుధవృద్ధి
కలుగవలయు నేని • ఖండశశాంకుని, పూజసేయవలయుఁ • బూని కృపఁ దండ్రి. 417

చ. ఇటువలెఁ బూజసేయక [1]య • హీనధరున్ శివు నీచుగాఁగ ను
త్కటమతిఁ దిట్టి తేని రిపు • దర్పవినాశకు దేవతామహా
పటల నమస్కృతాంఘ్రి గణ • పాలుని కోపమహాగ్నికీలలన్
దటుకున మండిపోవును ని • తాంతము లోకము లొక్కమాఱుఁగన్. 418

తే. అట్టి కోపాగ్నిఁబడక యె • ట్లవనినుందు
వనిన సతి నిష్ఠురోక్తుల • కట్టె మండి
పడి కనుబొమలు ముడివడఁ • బరుషవాగ
సితతి నడరించి యలయించె • స్వీయ తనయ. 419

చ. జనకుని దుష్టవాక్కులను • శస్త్రికదంబముచేత నొచ్చి యీ
శుని సతి యద్దురాశయుని • జూచి సహింపఁగఁ జాల కప్పుడే
తనువును దత్సుసంగతిని • దగ్ధయు దుష్టముఁ గాల్ప నెంచి యా
తని శపియింపఁ బూని యతి • దారుణరోషము పొంగ నిట్లనున్. 420

—సతీదేవి దేహమును వదలుట.—

క. తాత శివద్రోహివి నీ, పీతనువు త్వదార్జితంబ • యిటుకావున వి
ఖ్యాతభవత్కులనాశన, మాతతమతిఁజేయ విడుతు • నంగము దీనిన్. 421

తే. గర్హితం బది తమినీవు • కడఁగి చూడ, విడుతు; దుష్టాత్మ! వేగంబ • విపులకోప
వహ్ని నినుభస్మ మొనరింప • వచ్చునైన, జనకతనుజూచి విడిచితి • శాంతమూని.

క. పరమేశ్వరుఁ డాశంకరుఁ, డరిజనభీషణుఁడు నిన్ను • నతి దుష్టుని ను
ద్ధురమతి శిక్షించును గా, వర మింకేటి కని యోగ • వైభవ మెసఁగన్. 423

తే. బద్ధపద్మాసనయు లస • త్పరమనాసి
కాగ్రవిన్యస్తనయనయు • నగుచు సాధ్వి
యింద్రియవ్యూహములు మది • నెసఁగు పూనిక
వేగ బంధించి ప్రాణముల్ • విడువఁ దలఁచి. 424

---

[1] అహీనధరున్ = సర్పశ్రేష్ఠములను ధరించినవాఁడు.

వ. పరమోద్యోగంబున యోగపరాయణత్వంబు వహించి చెంతనున్న చేడియను జూచి యిట్లనియె. 425

సీ. ప్రియసఖీ! యాజగ♦త్ప్రియశంకరుని పార్శ్వమున కేగు సత్వ♦రమ్ముగ సమస్త
పరిచారికలఁ గూడి♦ పరిచర్యసేయుము పతియాజ్ఞ మీఱి యి♦ప్పగిది నేను
వచ్చితిఁ దత్ఫలం♦బిచ్చట లభియించెఁ గావున విడిచెదఁ♦ గడఁగి తనువు
జనకునందలికోప♦మున మాత్రమే కాదు కారణాంతర మొండు♦కలదు వినుము

ఆ. భక్తిసార్ధకోటి♦వత్సరంబులు మున్ను, చేసెఁ దపము తుహిన♦శిఖరి దేవ
దానవులకుఁ గూడఁ♦ దత్తపం బొనరింప, నలవిగాదు దాన♦ నలరి నేను. 426

ఉ. ఆతని పాలి కేగి మది♦హర్షము పైఁ బయిఁ బొంగుచుండ నీ
వీతఱిఁ జేసినట్టి తప♦మెన్న నసాధ్యము తృప్తి యయ్యె సం
ప్రీతిని నీయభీష్టమును ♦ వేగమె సిద్ధిని బొందునట్టు లో
హో తగురీతిఁ గోరుము స♦ముద్యతబుద్ధి వరంబు నావుడున్. 427

చ. వినయము భక్తియుం దనర♦ వేడుకశీతగిరిప్రభుండు న
న్ననుపమరీతి నెన్నికొని ♦ యంబ! దయామృతవర్షిణీ! ననుఁ
మనమున భక్తుఁగాఁ గొనిన ♦ మాట యథార్థమయేని సంతసం
బున నొకజన్మమందు దయఁ ♦ బుత్త్రివి నాకగు మీవరం బిదే. 428

చ. అన విని నేను శీతగిరి ♦ నాదర మొప్పఁగ గారవించి నీ
తనయత నొక్కజన్మమునఁ ♦ దాల్చెద నంచు వచించితిం గృపం
గన సమయం బిదే యతని ♦ గాదిలిపుత్త్రిక నై చెలంగి యీ
జనికృత మైనకల్మషముఁ ♦ జయ్యనఁ బాపుకొనంగ నెంచితిన్. 429

వ. కావున నాస్థితికి నాకులతంబొందక శివునిపాలికిం జని నానమస్కారముం దెలిపి.

సీ. నీమాట వినక నీ♦నెలఁత యజ్ఞముఁ జూడఁ జని తిరస్కృతయయి♦చచ్చె ననుమ
చచ్చుచోఁ దన నమ♦స్కారంబు నాథున కనువొప్ప నెఱిగింపు♦మనియె ననుమ
యోగాగ్ని కీలల♦నుద్యమం బొప్పంగఁ దనువును విడిచె నీ♦తరుణి యనుమ
జన్మాంతరమున నీ♦సంగతిఁ గోరుచుఁ జనియెద నిదెయని ♦ చనియె ననుమ

ఆ. సర్వలోకనాథ♦ సారసోద్భవ హరి, దేవనాథముఖ్య♦దేవనికర
పూజితాంఘ్రికమల♦భూతేశ ప్రాణేశ, యనుచుఁ దలఁచి తలఁచి చనియెననుమ.

ఆ. ప్రాణసఖివి నీవె♦ పద్మాక్షి నా[1]వైశ, సంబుఁ గాంచి వే భ♦యంబు శోక
మొందకమ్మ మరల♦ నొగి శీతగిరిపుత్త్రి, నైన నన్నుఁ గూడ♦వమ్మ ప్రీతి. 432

1 [illegible]

వ. అని పలికి జన్మాంతరంబున నన్నుం గూడి సంతోషంబు నొందు మని చెప్పి సఖీ
జనంబు లాక్రందనంబులు సేయుచుండ నాసతీదేవి యోగంబు నవలంబించి.433

సీ. చెలఁగి మూలాధార♦చిద్వహ్ని నెగయించి నాసాగ్రవిన్యస్త♦నయనయగుచుఁ
ప్రజ్వలచ్చిద్వహ్ని ♦ స్వశరీరమెల్లను దీపింపఁ జేయ నా♦దివ్యతనువు
కర్పూర దీపంబు♦కరణి యోగాగ్నిచే నావృతం బయి యుండి ♦ యనవశేష
ముగ జ్యోతిరూపమై ♦ యెగసి మధ్యాహ్నార్కచందంబున వెలింగి♦సర్వజనులు

ఆ. కనుఁగొనంగఁ బోయి♦క్షణమాత్రమున నభ, మంద దృశ్య మయ్యె♦నాస్థలమున
భస్మమైనఁ గానఁ♦బడకుండెఁ గుంభజ, చిత్ర మేమటంచుఁ ♦ జెప్ప నగునో.434

శా. ఆవింత ల్గనులారఁ గాంచిన సద♦స్యవ్రాత మోహో యిదే
మో వర్ణింప నసాధ్య మిట్లగుట ము♦న్నొక్కప్పుడుం గంటిమే
లే వీరీతి విచిత్రముల్ ధరణిలో ♦ లీలాకృతిం దాల్చి యిం
దీవింత ల్గనిపింప మోక్షరమ యి♦ట్లే తెంచెనో ప్రీతిచేన్. 435

చ. అని యిటు సభ్యులెల్లఁ గొని♦యాడఁగ నవ్వరతేజ మంబరం
బునఁ జని శీతభూమిధర ♦ పూతసధర్మిణి మేనకాహ్వయన్
వినుత చరిత్ర నొందెఁ దమి ♦ విశ్రుత శైలకులంబు శుద్ధరీ
తిని వెలయింపఁ జేయఁగ సు♦దీర్ఘమనంబున నెంచి యంతటన్. 436

తే. సకల జగములఁ గని యెడి ♦ శంకరి దయ
మేనకాగర్భమును జొచ్చి♦ మించఁ జేసె
సహజ మిద్ది తలంపఁగ ♦ సాధుమతుల
కాత్మవాక్యంబు సార్థకం♦ బట్లుచేయ. 437

ఉ. శీతమహీధరేంద్రునకుఁ ♦ జెల్వుగముం బితృసంఘ మిచ్చె వి
ఖ్యాత నయోనిజన్మను మ♦హాగుణ; నవ్వరనారి తాల్చె న
త్యాతతశక్తిధుర్యను మ♦హాకరుణానిధి లోకపూతసం
ప్రీతిగ గర్భమందు సుఖ♦వృద్ధిని నాథుఁడు సంతసింపఁగన్. 438

క. క్షీరోదధిగర్భంబును, [1]వారిజరిపుకళయుఁ బోలె ♦ భామాగర్భం
బారూఢిగ వెలయించెను, జారుతరంబుగను శంభు♦సతికరుణ మెయిన్. 439

తే. ఎట్టులెట్టులు శంకరి ♦ యెలమివృద్ధి, నొందె మేనకగర్భంబు♦నందు నట్టు
లట్టు లామేనకయుఁ గాంతి♦నలరెఁ జూడ, శుక్లపక్షపుఁ జంద్రుని♦చొప్పు మెఱసి.

క. వననిధి జలములతో భూ, మిని దాల్చిన తుహినశిఖరి♦ మేనకఁ దాల్పం

---

1 వారిజరిపుకళ=చంద్రునికళ.

గనుశక్తుఁడు గాఁ డయ్యెను, ఘనదేవీగర్భభార♦కలిత యగుటచేన్. 441

క. మేనాగర్భవిభూతిన్, భానుసహస్రప్రభావి♦భాసురుఁ డగుచున్
జానుగఁ దేజోనిధి యై, కానంబడె నపుడు శిఖరి♦కాంతుఁడు మఱియున్.

తే. దార తేజోవిశేషంబుఁ♦ దలఁచి శిఖరి, యంబికాదత్తవరఫలం♦బపుడు కలిగె
నని తలంచి మనంబున♦ నలరుచుండ, ననుదినంబును గర్భంబు♦ నలరె నంత.

సీ. గర్భభారాలసఁ,♦ గమనీయపాండుగండస్థలోజ్జ్వల, మహో♦న్నతసురుచిర
నీలచూచుకరుచి♦జాలమనోహరస్తనయుగ విమల, న♦శ్యద్వళీత్ర
యీభంగసంస్ఫుట♦హితరోమతతిలత, నీషత్పదన్యాస♦ దోషభూరి
నిశ్వాసఖేదిని♦ నిత్యాలసాలససంచారకస్నిగ్ధ♦చారుతార

తే. కనయ నను గాంత, నత్యంత♦ గర్భఖేద
సముదితస్వేదబిందువి♦సరమనోజ్ఞ
జాయశతసంఖ్యసఖులఁతో♦ సరసవాక్య
ములను గాలము బోద్రోయు♦ మోహనాంగి. 444

క. కనుఁగొని ఘనసంతోషం,బున వంశము సుప్రతిష్ఠఁ♦ బూనె నటంచున్
మనమునఁ దలంచి భార్యకు, దినదినమును గర్భరక్షఁ♦ దృప్తిగఁ జేయన్. 445

చ. నలువుగఁ బుండరీకనయ♦నల్ మహిళామణు లన్నవాక్య మీ
యిల వెలయింపఁ జేయ మది♦ నెంచి విధాత యొనర్చినట్లుగా
నలరెను మేనకాక్షియుగ♦మందు సితత్వము సుందరంబుగాఁ
దలఁప విధాతృనాశయము♦ తప్పక సిద్ధిని గాంచు నెల్లెడన్. 446

ఆ. మందగమన లన్న♦మాట సత్యఁబుగా, నడుగు వెట్టి మరల♦ నడుగు వెట్టు
నంతలోన నయ్యె♦ నెంతొ కాలము మేన, యాదిగర్భమూని♦ యలరు నపుడు.

క. తనుమధ్యాహ్వయ మనదై, కనకాంగికి మధ్యతలము♦ కడుఁ బృథులంబై
తనరెను మంజులభాషిణి, యనుమాట యసత్య మయ్యె♦ నతిమందోక్తిన్.

ఉ. ఉన్నని ముందుపల్కు మఱి♦ యొయ్యన మెల్లఁగఁ బల్కుగాని తా
లెన్నగ మాటలాడదు; ని♦లింప వధూటులు చెంత చేరినన్
బు స్ననుకాలసర్పమును♦ బోలి తృణీకరణంబుచేయు వే
యున్నని పవ్వళించుఁ బతి♦యొద్దకుఁ బిల్వఁగ వెన్కదీసెడున్. 449

ఉ. [1]భామిని యన్నమాట యన♦పాయము నొందఁగ భర్త యెంతయున్
గోమునఁ జేయిఁబట్టఁ గొన♦గోటను జిమ్మఁగఁ జాలుఁజాలు నే

1 భామిని=శృంగారచేష్టలుగల స్త్రీ.

నీ మరియాదయంచుఁ బతి • నెయ్యము మీఱఁగఁ బల్కినంతలో
నే మృదువాక్యముల్ పలికి • నేర్పున రంజిలఁ జేయునాథునిన్. 450

క. ఎన్నఁడుఁ గోరని కోర్కులఁ, దిన్నఁగఁ బ్రాణేశ్వరునకుఁ • దెలుపుఁ బతి తమిం
గ్రన్నన శయ్యను జేరిన, మన్ననలనె ప్రీతినొందు•మాడ్కిం జేయున్. 451

సీ. అంతకంతకు లేమ • కాయాస మెచ్చయ్యె నరుచియు నిద్రయు • నధిక మయ్యె
నంబరధారణం • బాయాసకర మయ్యె దేహవల్లి కరమెంతొ • తెల్ల నయ్యెఁ
బాలిండ్ల తుద లట్టె • నీలరోచులు నయ్యె నిట్టూర్పు వాయువుల్ • నెగడుటయ్యె
ననుదినంబును జింత • యత్యధికం బయ్యె మాటల నేరుపు • మంద మయ్యె
తే. ప్రాణసఖులను బిలుచుట • పలుచ నయ్యెఁ
బ్రాణనాథునితోఁ బల్కఁ • బంత మయ్యె
శయనమే సర్వకాలంబు • శరణ మయ్యె
నెమ్మిఁ దొమ్మిది నెల లంత • నిండ నయ్యె. 452

మేనకకుఁ బార్వతి యుదయించుట.

మ. నవమాసంబులు సౌఖ్యరీతి నిటు నిం•డన్ మంచిలగ్నంబునన్
దివసేశాదికఖేచరంబులు సము•ద్దీప్తంబు లై యుచ్చయం
[1]దవఖేటంబుల దృష్టిలేక బలులై • హర్వొందఁ దారాబలం
బు [2]విధుప్రోద్బలముం దగన్ వెలయఁగాఁ • బూఁబోఁడి కాంచెన్ సుతన్.

సీ. త్రైలోక్యజనయిత్రిఁ • దద్దయు ముదమున మేనక కాంచిన • మిగుల దిశలు
సుప్రసన్నంబు లై • శోభిల్లె నీరంబు విమలమై వర్ధిల్లె • విపులమోద
భరితు లై జనులెల్లఁ • బరఁగిరి నాకస మచ్ఛమై తనరారె • నప్సరసలు
నృత్యంబు సల్పిరి • నిఖలత్రిదశదుందుభులు మ్రోసె మంజుళ•పుష్పవృష్టి
తే. దేవతార్పిత మై యొప్పె • దివ్యసౌఖ్య, పూర్ణమై లోకజాలంబు • పొల్చె నంత
హిమగిరీంద్రుఁడుసంతోష•మెసఁగఁబుత్త్రిఁ,గాంచిశ్రీదేవియనిమది•నెంచెనపుడు.

ఆ. తల్లి నలరఁజేసెఁ • దనయ రత్నశలాక, వోలెఁ జంద్రరేఖ•వోలె భాస
మాన తేజమునను • మఱిమఱి మురిపెంపుఁ, జేష్టలను మనంబు • చెలఁగునట్లు.

క. గిరిభామలు స్వాంతంబుల, మురిపెంబుల లాలనములు మునుకొని చేయన్
గిరిసుత మాణిక్యము దీ,పరేఖవలె వృద్ధినొంది • భాసిల్లెఁ గడున్. 456

క. వనితాజన సంకుల మగు, ఘనగిరియంతఃపురంబు • కడనుత యొప్పెన్

1 అవఖేటంబులదృష్టి=పాపగ్రహముల చూపు. 2 విధుప్రోద్బలంబు=చంద్ర బలము.

[1]భనిబిడ మగువ్యోమతలం,బున నొప్పెడు చంద్రరేఖ•వోలె ముదమునన్.

చ. తనయను గాంచి పర్వతవ•తంసము స్వాంకమునందుఁ జేర్చి లా
లనములఁ జేయుచుఁ ముఖము • లక్షణపంక్తిని వేడ్కఁ గాంచి [2]ము
ద్వననిధియందు మున్గిన వి•ధంబున నొప్పియుఁ జంద్రఖండభా
లను గుటిలాలకఁ విమల•లక్షణనేత్రను బ్రీతితోడఁ గ
న్గొని మదిఁ దృప్తినొందకయె • కోరికఁ బల్మఱుఁ జూచెఁ బుత్త్రికన్. 458

సీ. ఈరీతి నభివృద్ధి • నెనఁగెఁ గుమారిక హిమగిరిగృహమున • మహితరీతి
మైనాకసోదరి • మహనీయగుణభూష విశ్వసంశ్లాఘ్యను • వెలఁదిసఖులు
లాలించుచుండిరా • లలితాంగియును సుధాస్యందిభాషణముల • స్వాంతహారి
చాతుర్యములను ర•సాయనం బట్లు కర్ణములకు సంతృప్తి • మమతఁ జేసెఁ
తే. జెలఁగి నీలోత్పలశ్యామ, •స్నిగ్ధకాంతి, చిత్తహారిణి, యబ్బాల•[3]యుత్తమేంద్ర
నీలనిర్మితపుత్తళి • లీల మెఱసి, సంచరించెను గ్రమముగ • జనకునింట. 459

చ. వనచరకన్యకాతతుల • వైఖరిఁ గూడి శిశుత్వశోభనం
బునఁ గడుఁ గృత్రిమంబు లగు • బొమ్మలతోడను గందుకాళితో
మనమునఁ జింతలేక సుకు•మారము గాఁ దగఁ గ్రీడఁ జేయు నా
తనయకుఁ బేరుపెట్టె మమ•తఁ గిరి పార్వతి యంచు నంతటన్. 460

చ. పురుషుల పాపజాలములఁ • బోవఁగఁ జేసెడు నాహ్వయంబుచే
గిరిసుత యొప్పి యెల్లెడలఁ • గ్రీడల భేదము లొప్పుచుండ నా
[4]ధరవరసీమ నాడుచును • దండ్రికిఁ బ్రేమ చెలంగఁ బాంసు సుం
దరమగు నాటలాడెను ము•దంబునఁ దల్లియుఁ జూచి పొంగఁగన్. 461

క. తిరుగుచు గంగాసైకత, గురుదేశములందు స్వీయ•గురు సానువులం
జరణాలక్తాంకంబుల, ధరణిఁ బవిత్రంబు చేయఁ • దగు నటులాడెన్. 462

వ. అంత. 463

సీ. పాదాధరోష్ఠముల్ • పాణియుగ్మం బెంతొ రక్తప్రభాయుక్తి • రాజిలంగ
ముంగురుల్ కౌటిల్య•మును ముందుగ వహింప నఖులు నఱచూడ్కి•నాశ్రయింప
వేమఱు మధ్యంబు•బీదఱికముఁ దెల్పఁ బాలిండ్లు మించి వై•భవము దెలుప

1 భనిబిడముఅగు - భ=నక్షత్రములచే, నిబిడముఅగు=దట్టమైన. 2 ముద్వననిధి=సంతోష సముద్రము. 3 ఉత్తమేంద్ర...లీలఁ-ఉత్తమ=శ్రేష్ఠమగు, ఇంద్రనీల=ఇంద్రనీలమణులచే, నిర్మిత= చేయఁబడిన, పుత్తళిలీలఁ = బొమ్మయొక్క విలాసముచేత. 4 ధరవరసీమ=పర్వతశ్రేష్ఠమగుహిమవత్పర్వతప్రదేశమందు

నూరుయుగ్మంబు బాహూన్నతిచే నొప్పఁ బలుకు లర్థద్వయ•ములను జెప్ప

తే. సారెసారెకు వెలఁది శృం•గారమెంతొ
క్రొత్తయై తోఁచె నిఁక నుండఁ•గూడ దిచట
నూతనం బయ్యె సర్వంబు • నీతతి నని
యరసి బాల్యం బదృశ్యత • నాశ్రయించె. 464

తే. ముగ్ధఁ [1]గందర్పహంక్రియా • మూలకంద
మైన నూతన యౌవన • మాశ్రయించె
మధువు నొల్కెడు కుసుమంబు • మనుతఁ జూచి
మధుకరం బాశ్రయించిన • మాడ్కిఁ గాఁగ. 465

చంపకమాలిక. అరుణములై స్వభావమున • నల్లనఁ బల్లవకోమలంబులై
వరశుభరేఖలై మఱియు • వ్యక్తమహాసుగుణోల్బణంబులై
చరణయుగంబు భూమిపయిఁ • జక్కఁగఁ బెట్టినఁ గుంకుమోదక
స్ఫురణము రీతి నొప్పెసఁగ • శుభ్రములై శశిచంద్రికోల్లస
ద్వరనఖరోచులై [2]విమల•పన్మణినూపురనాదరాజహం
సరుచిరముత్ప్రదంబు లయి • సంతత యోగి మనస్సరోజకాం
తరనిలయంబులై వెలయు • తద్గిరిపుత్రికపాదముల్ మనో
హరగతి నొప్పి కాంతితతి • కాశ్రయతం బొలుపారె నెంతయున్. 466

క. లలనకు జంఘాకాండం,బులు స్మరతూణీరసదృశ•ములునై బంధ్వ
త్తులఁ జిత్తము బంధించెను, దలమే వర్ణింప రుచిర•తను ధరలోనన్. 467

సీ. [3]కందర్పగజరాజ•క్రమశుండాకాండ సదృశవిద్యుత్తులు [4]మోచాసుకాండ
సౌభాగ్యగర్వసం•క్షయకారకంబులు [5]శంభుచిత్తోదగ్ర•సామజవర

1 కందర్ప...కందము = మన్మథునియొక్క యహంకారమునకు ముఖ్యాధారము. 2 విమల సన్మణి.. దంబులు అయి - విమల = స్వచ్ఛములైన, పత్ = పాదములయందలి, మణినూపుర= మణులచేఁ జేయఁబడిన అందెలయొక్క, నాద=ధ్వనిచేత, రాజహంస = రాయంచలకు, రుచిర = మనోహరమగు, ముత్ప్రదంబులు అయి = సంతోషము నిచ్చునవి అయి. 3 కందర్ప...విద్యుతులు- కందర్ప = మన్మథుఁ డనెడు, గజరాజ = గజశ్రేష్ఠముయొక్క, క్రమశుండాకాండ = సుందర మగు తుండమను దండముతో, సదృశ=తుల్యము లగు, విద్యుతులు=కాంతులు కలవియు. 4 మోచా ...కంబులు - మోచాసుకాండ = అరఁటిస్తంభముయొక్క, సౌభాగ్యగర్వ = సుభగత్వ గర్వ మును, సంక్షయ కారకంబులు = క్షీణింపఁ జేయునట్టివియు. 5 శంభు...పంబులు - శంభు = శివునియొక్క, చిత్త = మానసమును, ఉదగ్రసామజవర = గంభీరమగు మదపుటేనుఁగుయొక్క, బంధ= కట్టివేయుటకు, ద్రుమంబులు = ద్రాఁకు లైనవియు.

బంధద్రుమంబులు • పంచసాయకజగచ్చక్రజయ స్తంభ • సన్నిభములు
నై యొప్పు పార్వతీ • హారిపృథూరువు లత్యంతశోభల • నలరె మఱియు
తే. వఱలెఁ గాంచీకలాపసు•భగకరీంద్ర, శీర్షసన్నిభమును దార్క్ష్య•శిలలనొప్పు
ధరణి ధరకటకక్రోడ•తతమయూఖ, యు నగుచున్న నితంబంబు • నొప్పుమెఱసి.
చ. ధరతనయానుమధ్యలత • తద్దయు రోమసమూహహారి యై
నిరుపమమహా వళిత్రయము • నేర్పున నొప్పి గభీరనాభిసుం
దరకుహరంబుచేఁ దగి పి•నాకిమహామణిమపోలె యోగిహృ
ద్వరపరమాణు వట్లు గడు • భాసిలెఁ జూడ విచిత్రరీతిగన్. 469
సీ. చెలఁగి యన్యోన్యసం•శ్లిష్టమండలములు [1]నుచ్చచూచుకములు • నొగి [2]నిరంత
రంబులు సాంద్రమ్ము [3]లన్వహావర్ధనసంప్రాప్తదోర్మూల • చారుతీర
ములు, యౌవనద్విపేం•ద్రలలితకుంభద్వయోపమంబులు మఱి•యును స్మరాభి
షేకార్థ యోజిత•క్షీరపూరితమహా•కలశద్వయాభముల్ • కర్కశములు
[4]రమణీతనూభాస•రఃకృత కేళికోకద్వయోజ్జ్వలములు • కాంతహార
తే. కములుఁ [5]బరివేష మంజుళ•కములు, శర్వ,మానసాంబుధిమంథన•మందరములు
[6]హారిసౌభాగ్యరత్న గే•హవరభర్మ, కలశ విద్యోతమానముల్ • కాంతములును.
సీ. పరిణాహమునను బు•ష్కరమును ద్రావంగ నొప్పుచుఁ బైపయి•నొగిఁ జుబుకముఁ
జుంబనం బొనరించు • చొప్పునఁ బరఁగెడు పాలిండ్లునభివృద్ధి • వఱలె మఱియుఁ
బార్వతీ భుజములు • పరఁగె శిరీషదామసుకుమారతను వే•మఱు హసించు
చును స్మరడోలికా•శుభభర్మశృంఖలా కాంతిచే నొప్పుచుఁ • గాంతకరము
[7]ప్రాతర్వికస్వర • పద్మసంస్పర్ధి భా•భాసురం బయి కకు•ప్పంక్తిఁ గాంతిఁ
తే. దనరి లౌహిత్యధారలఁ • దడుపుచున్న, పగిది నొప్పారి యీశ వి•వాహమంగ

---

1 ఉచ్చ...ములు=ఎత్తైన పాలిండ్ల తుదలుగలవియు. 2 నిరంతరములు=అవకాశము లేని వియు. 3 అన్వహా...తీరములు - అన్వహ=ప్రతిదినమందైన, వర్ధన=వృద్ధిచేత, సంప్రాప్త=చక్కఁగాఁ బొందఁబడిన, దోర్మూల=బాహుమూలము లనెడు, చారు=మనోహరము లగు, తీరములు=తటములు కలవియు. 4 రమణీ...జ్వలములు-రమణీ=కాంతయొక్క, తనూభా=దేహకాంతి యగు, సరః=కొలనునందు, కృత=చేయఁబడిన, కేళి=క్రీడయందు, కోకద్వయోజ్జ్వలములు=చక్రవాకపు జంటవలెఁ బ్రకాశించునవియు. 5 పరివేష మంజుళకములు=పరివేష్టనముచే సుందరములు. 6 హారి...ముల్-హారి=మనోజ్ఞమైన, సౌభాగ్య=సుభగతయను, రత్నగేహవర= రత్నములచే నిర్మింపఁబడిన గృహశ్రేష్ఠమునకు, భర్మకలశ = బంగారుకలశములవలె, విద్యోతమానముల్ = ప్రకాశించునవియు. 7 ప్రాతర్వి...భాసురంబు అయి-ప్రాతః=ప్రాతఃకాలమందు, వికస్వర=పుష్పించిన, పద్మ=తామరతో, సంస్పర్ధి=స్పర్ధచేయునట్టి, భా=కాంతిచే, భాసురంబు అయి=ప్రకాశమై.

లోచితం బయి యంగుళీ॰యోరురుచిర, రక్తిమను వృద్ధిజేయంగ ॰ రాజిలెఁగడు.

సీ. అమృష్టదరభాగ్య॰మై కంఠనాళిక భాసిల్లె శరదిందు॰భాప్రభంబు
[1]నవనతభ్రువుసరో॰జాయతేక్షణమును, దిలపుష్పభాసుర ॰ దివ్యనాస
మును, [2]శుచిదంతౌఘు॰మును, [3]గలాలాపమధ్వాపగాసంతర్పి॰తాఖిలజన
మును, [4]మణినిర్మిత॰ముకురసచ్ఛాయ కపోలోజ్వలంబును ॰ [5]బూతనవ్య
తే. విద్రుమస్నిగ్ధపాటలా॰వృతమనోజ్ఞ, పల్లవాధర మంబుజ ॰ వైరిఖండ
లలిత భాలంబు వక్రకుం॰తలము నైన, పార్వతీచారువదనంబు ॰ ప్రోఢిఁదనరె.

వ. మఱియును దరుణశ్యామతాపింఛద్రుమమేచకంబును, గుటిలంబును, బర్బరంబును, బరిమళితంబును, శుభకాంతియు నగు పార్వతీకేశపాశంబు శిఖండిపింఛంబు ననుకరించె. ఇవ్విధంబున నారూఢతారుణ్యయు, సకలసుగుణసంపూర్ణయు నై తంద్రిగృహంబున జగదంబిక విహరించుచుండె నని చెప్పుటయు నగస్త్యుండు. 473

## దక్షాధ్వరధ్వంసము.

మ. కరుణాసారనిధీ! హయాస్య! వినఁగాఁ ॰ గౌతూహలం బయ్యె ను
ద్ధురకోపంబున భార్యత్య క్తతనువై ॰ తోడ్తోన యోగాగతా
మరలోకంబున కేగె నంచు విని యే॰మాడ్కిన్ మహాదేవుఁ డీ
శ్వరుఁ డాదక్షుని గోపవహ్నిరుచులన్ ॰ సాధించెఁ బంతంబునన్. 474

క. కరుణామయుండు గావునఁ, బరమేశుఁడు శాంతమూని ॰ పరిపంథిని నే
కరణిని సాధింపక యే,విరతిం బొందెనొకో చెప్పు ॰ వే తద్రీతిన్. 475

చ. అన విని యశ్వకంఠుఁ డను॰నార్య! యగస్త్యమునీంద్ర! చెప్పెదన్
విను మటు దక్షపుత్త్రిక సు॰వృత్తతనూలతఁ బాసి ప్రీతి నా
ఘనహిమశైలమాశ్రయము ॰ గాఁ జను టారసి తత్సఖీజనం
బును గణనాయకుల్ చనిరి ॰ భూతవిభుం గన దుఃఖచిత్తులై. 476

---

1 అవనతభ్రువు—అవనత=వంగియున్న, భ్రువు=కనుబొమలుకలదియు. 2 శుచిదంతౌఘమును=పరిశుద్ధములు దంతములవరుస కలదియు. 3 కలాలాప...జనమును - కలాలాప=అవ్యక్తమధురములగునాలాపములను, మధ్వాపగా=తేనెపూరముచే, సంతర్పిత=తృప్తినొందింపఁబడిన, అఖిలజనమును=సమస్త జనులు కలదియు. 4 మణినిర్మిత...బును-మణినిర్మితముకుర=మణిదర్పణముయొక్క, సచ్ఛాయ=మంచికాంతిగల, కపోల=గండస్థలములచేత, ఉజ్వలంబును=ప్రకాశమానమైనదియు. 5 పూతనవ్య...ధరము-పూత=పవిత్రమైనదియు, నవ్య=నూతన మగు, విద్రుమ=పగడమువలె, స్నిగ్ధ=సుందరముచేతను, పాటల=తెలుపుమించిన యెఱుపువర్ణముచే, ఆవృత=ఆవరింపఁబడిన, మనోజ్ఞ=ఇంపగు, పల్లవాధరము=చిగురుటాకువంటి క్రిందిపెదవి కలదియు.

ఉ. భూసురమౌని దేవ ముని•పుంగవ కిన్నరసిద్ధసాధ్యసం
వాసముఁ బార్వతీరమణ • భద్రదపారసరోజయుగ్మవి
న్యాసముఁ [1]గుంజరాననగు•హాదివిలాసము నైన యట్టి కై
లాసముఁ గాంచి [2]యుద్ధతవి•లాసమునన్ గణనాథు లచ్చటన్. 477

తే. అంత [3]నిర్విణ్ణచిత్తులై • వింత చరితఁ, జెప్పవలసెఁ గదా యని • చింతనూని
భయమునొందుచుసఖులుస•త్వరముగాఁగఁ, జేరఁబోయిరిశంకరు•సిద్ధపూజ్య.

మ. జనశూన్యం బగుపుష్పకంబుఁ గొనుచున్ • సత్వంబు దూలంగ నీ
శునిసాన్నిధ్యము నొంది వే గణవిభుల్ • శోకంబు పైఁ బొంగఁగా
ఘన వర్షంబును బోలి బాష్పజలముల్ • గ్రమ్మంగ నోరాడకు
న్ననతాస్యంబులఁ దత్సఖీజనములం•తం బల్కి రార్తధ్వనిన్. 479

మ. సతి యోగంబునఁ ద్యక్తదేహలత యై • చంచద్గతిం బోయె ను
ద్ధతమౌ యజ్ఞము సాగుచున్నయది యో • తండ్రీ! సతీదేహ మీ
వితమై పోవుటఁ గాంచి వచ్చితిమి నా • విశ్వేశ్వరుం డంగనా
మృతివృత్తాంతము నాలకించి మదిలో • నెంతేని దుఃఖంబునన్. 480

తే. ధీరుఁ డయ్యును సంత్యక్త•ధీవిలాసుఁ, డగుచు క్షణమాత్ర శోకంబు•నందివేగ
మతితిరస్కృతశోకుఁ డై •మండిపడి యు,దగ్రుఁడై కోపమూనె న•య్యుగ్రుఁ డంత.

చ. హరహృదయంబునం బొడమి • యప్పుడె కోపమహాగ్ని దుష్టకా
ర్యరతు మహాపకారపరు • నార్యవిదూషకు దక్షుఁగాల్ప ను
ద్ధురగతిఁ బ్రజ్వలించె మఱి • [4]ధూర్జటిఫాలతలంబునందు స
త్వరముగ మించె భ్రూకుటియు • దక్షకులాటవికిం గుఠార మై. 482

తే. భాస్వదభినవపల్లవ•పాటలంబు, నౌ మహేశ్వరు నధరంబు • నప్పు డుగ్ర
బహుళనిశ్వాసపవనసం•ప్రహతమగుచు,నదరెఁబలుమఱు ఖేచరు•లార్తిబెదర.

సీ. వృషభాంకు తనువున • నెసఁగు స్వేదంబులు జ్వాలానుకారు లై•క్రాలఁజొచ్చెఁ
బ్రజ్వలత్కోపంబు • పరఁగు నప్పుడు శిరోజాహ్నవిబుద్బుద • సంచయములఁ
దాడ్యమానయుఁ బోలెఁ•దత్తరిల్లెను దేహభూషణంబులు గాఁగ•బొల్చు సర్ప
సంచయంబు పెనంగె • సత్వరంబ పరస్పరాశ్లిష్టతనువు లై • యంత నీశు

---

1 కుంజరా.. విలాసము - కుంజరానన=గణపతియు, గుహ = కుమారస్వామియు, ఆది= మొదలగువారియొక్క, విలాసము = క్రీడలుకలది. 2 ఉద్ధత విలాసమునన్ = పోయిన వైఖరిచేత. 3 నిర్విణ్ణచిత్తులు ఐ=నిరాశ చేసికొనిన బుద్ధిగలవార లై. 4 ధూర్జటిభాలతలంబునందున్ = ఈశుని నుదుటియందు.

తే. లోచనంబులు ఫాలవి•లోచనంబు, సాటి నొందిన రీతిని • సరగ గాఢ
రక్తతను బొందె నట్టియు•గ్రప్రకోప, మరసి పాఱిరి గణనాథు • లార్తులగుచు.
క. భీతిల్లి ప్రమథగణములు, చేతోభవహరునిజూడఁ • జేరక పాఱన్
భీతిల్లియు నందీశ్వరుఁ, డాతఱి శివు నంతికంబు•నందుండె దగన్. 485
క. నందీశ్వరుండు పిమ్మట, సందీపితకోపుఁ డైన • శంకరునికడం
గంది నిలువంగనోపక, సందియమున వెనుక కేగె • సరభసగతితోన్. 486
మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ గ్రో•ధం బొందుచున్నట్టి యీ
శ్వరునౌద్ధత్యముఁ జూడనోడి రవియున్ • భాసిల్ల కెం తేవడిం
గరపంక్తిన్ ముకుళించె దుల్లెవడి న•క్షత్రంబు లంభోనిధుల్
పరుషస్వానము లొప్ప ఘూర్ణిలె జగ•ద్వ్యాప్తంబు భీతిం గనెన్. 487
⟶ వీరభద్రుం డుదయించుట. ⟵
ఉ. ఆవల నాలకింపుము మ•హాత్మ! ఘటోద్భవ! దేవదేవుఁ డ
ట్లావిలమానసుం డగుచు • నాత్మ లలాటజ మైన స్వేదముం
బావకుజ్వాలరీతిఁ గడు • భాసిల నం దొకబిందుమాత్రముం
బావనధోర్నఖాగ్రమున • వైచె జవంబునఁ దీసి భూమిపై. 488
వ. ఆసమయంబున. 489
సీ. ప్రళయకాలోజ్జ్వల•త్పావకజ్వాలాభ దేహవల్లిక ఘోర•దీప్తి మెఱయ
నాయతోర్ధ్వాండకు•డ్యప్రభేదనచణస్వోన్నతి చెలువార • నుగ్రబద్ధ
మైనట్టి భ్రూకుటి • యలరంగ దీప్తోర్ధ్వకేశముల్ మెఱయంగఁ • బాశమూని
[1]లోకఘస్మరగాత్రుఁ•డై కడువేగంబ పుట్టె నొక్కఁడు యము•పోల్కి వీర
ఆ. భద్రుఁ డనఁగఁ జాల•భయదాకృతిని బొల్చి, భక్తిపూర్వకముగ•భవున కెరఁగి
దేవదేవ! సర్వ•దేవవందితపాద!, యేమిచేయవలయు • నిపుడు నేను. 490
క. గురువర! యాజ్ఞాపింపుము, సరగునఁ జేసెదను గార్య•సంతతిసి భవ
త్కరుణను నాకెందును దు, ష్కరకార్యము చూడలేదు • కావునఁ జెపుమా.
తే. ధరణిఁ గలపింపఁ జేసెద • దర్పమొప్ప, నంబురాసుల నేడింటి•నజలములుగఁ
జేయుదును లోకములఁబండి • జేయువాఁడ, మీరుకనుసన్న చేసిన•మించుశక్తి.
మ. అనివిజ్ఞాపనమాచరింప సుతు శౌ•ర్యం బాత్మ నూహించి యి
ట్లనిపల్కెన్ వెసఁబోయి దక్షుమఖ మ•త్యంతంబు విధ్వంసతం
గనఁగాఁజేసి మదీయదూషణపరున్ • గర్వాంధు దుష్టాత్ముఁ బా

1 లోకఘస్మరగాత్రుఁ డై=లోకములను భక్షింపఁజాలిన శరీరముకలవాఁ డై.

పిని దుర్బుద్ధిని దక్షు నిర్దయుని సం•హృతాధ్వరుం జేయుమీ. 493

చ. మునివరు లచ్చటం గలరు • [1]భూరిమనుప్రకటప్రయోగసి
ద్ధిని ననుమీఱు వా రనుచు • దీనత నొందకు మెంతమాత్రముం
జనుము మదుక్తి నీ కచట • సాధ్యము గానిది లేదు సుమ్ము నా
పనుపునఁ బోవు నిన్నుఁ గన • బ్రహ్మజనార్దను లైన శక్తులే. 494

మహాస్రగ్ధర. అని యాజ్ఞాపింప రోషా•హతసకలజగ•ద్వ్యాప్తభూతాళినీశుం
గని భావం బెంచి యుంకం • గడువడి జని యా•గంబు భంగించి తండ్రిం
గన నా నంచెంచి శ్రీప•త్కమలముల కసం•ఖ్యాకముల్ వందనంబుల్
ఘనభక్తిం జేసి యాశీః•కలితుఁ డగుచు వే•గంబ యానోన్ముఖుం డై. 495

తే. వీరభద్రుండు రౌద్రదు•ర్వారుఁ డగుచు
వెండికొండను వేగంబ • విడిచి తండ్రి
పనుపు మదిలోన నెంచుచుఁ • బాశకుంత
శక్తిముఖ్యాయుధము లూని • చనుచునుండ. 496

ఉ. ఆతని రోమకూపనిట•లాక్షిభయంకరకర్ణనాసలన్
భీతిదవక్త్రదంష్ట్రలను • బెల్లుగఁ బుట్టి రనేకపాపసం
ఘాతహరుల్ [2]సహస్రకర•కాంతిసమప్రభు లున్నతుల్ మదో
ద్ధూతమహీధరుల్ ప్రమథ•ధూర్జటు లొక్కట లక్షసంఖ్యలన్. 497

సీ. పెడ బొబ్బలను బెట్టి • పృథుబాణములఁ గొట్టి యట్టహాసంబులు • నాచరించి
గగనంబుఁ జుంబించు•కరణి మేదినిఁ గాల్చుభంగి భూతంబులఁ • బట్టి తినెడు
చందాన ప్రమథులు • చనిరి శౌర్యంబున వీరభద్రునిగూడి • విపులవేగ
మున నంత వీరభ•ద్రునియాజ్ఞ దక్షుని యజ్ఞవాటం బెల్ల • నావరించి
తే. రపుడు కల్పాంతవహ్నిజ్వా•లావళులను, నంబుదంబులు నీటిచే • నావరించు
నట్లు లాప్రమథేశులు • నాత్మశక్తి, యజ్ఞవాటము నంతయు • నావరింప. 498

ఉ. ముందుగ వీరభద్రుఁ డొక • మూఁపున ఖడ్గము నూని రాఁగ నా
క్రందన మొప్పఁ జేయుచు ని•కామభయంబుల దేవవీరు లె
ల్లం దగఁ బాఱఁ జొచ్చి రతి•లాఘవరీతిని నందులోపలం
గొందఱు నేడ్వసాగి రొక • కొందఱు మూర్ఛిలి రార్తి పెంపునన్. 499

ఉ. కొందఱు పాఱఁజూచి మదిఁ • గుందుచుఁ బోవను గాళ్లురామిచే

---

1 భూరి...సిద్ధిని=గొప్పమంత్రములయొక్క ప్రబలప్రయోగముయొక్క సిద్ధిచేత. 2 సహస్ర...ప్రభులు=సూర్యకాంతితో సాటియగు కాంతులుగలవారు.

వందురుచుండఁ గొంద ఱటు • పాఱను దోఁచక యూరకుండఁగాఁ
గొందఱు వీరుఁ డొక్కఁ డిదె • క్రుమ్మె శరంబుల నంచు నివ్విధిం
జిందఱ వందఱై రిటులు • చెల్వఁ దొలంగి యమర్త్యు లెల్లెడన్. 500

వ. ధ్రువోపభృజ్జుహూముఖ్య యజ్ఞపాత్రనికరంబులఁ బాఱవైచి ఋత్విక్కు లెల్లఁ గాందిశీకు లైరి అందు. 501

ఉ. కొందఱు పక్షిరూపములఁ • గూరిమితో ధరియించి పాఱఁగాఁ
గొందఱు వే బిడాలముల • గుంపులరీతిని బాఱి రందులోఁ
గొందఱు పాడు దేహములు • కూడ వివంచుఁ ద్యజించునట్టుగాఁ
గుందుచు వీడి రంగముల • గొల్లున నేడ్చిరి కొంద ఱార్తులై. 502

ఉ. అక్కట! దుష్టదక్షుఁడు శి • వాగ్రహపాత్రుఁడు నై కులంబుఁ బెం
పెక్కిన దాని దార్ష్ట్యమున • నివ్విధి నాశముఁ జేసికొన్నవాఁ
డక్కట దక్షుసంగతిని • నూరక మే మిటు వీరిచేతిలోఁ
జిక్కితి మన్న వాక్యములు • చెల్లెను యజ్ఞగృహంబులోపలన్. 503

చ. శతమఖుఁ డెంతయున్ భయము • స్వాంతముఁ దూలఁగఁ జేయ [1]బర్హిరూ
పతఁ బరుగెత్తె నమ్ముఖము • పాఱె మృగాకృతిఁ దాల్చి యంత నా
వితము నెఱింగి శౌర్యమున • భీషణశాతశిలీముఖంబునన్
జతనము మీఱ రుద్రజుఁడు • చంపఁగ లోనఁ దలంచి యార్చుచున్. 504

తే. వెంట నంటుచుఁ దీవ్రమా • విశిఖ మొందు, నారి సంధించి తెగవాశి • భూరియజ్ఞ
శిరముఁ ద్రుంపఁగ నది పడె • క్షితిని రుధిర, మటఁ బురోడాశవాసితం • బది స్రవించె.

వ. వీరభద్రుండు క్రతుధ్వంసి యనునామంబునఁ బరఁగి యిట్లు యజ్ఞంబును హరించి యజ్ఞశాలయందున్నవారల సంహరింపఁ దలంచి యజ్ఞగేహాంతరంబును బ్రవేశించి యందు. 506

ఉ. ముందుగ రౌద్రకోపమున • భూతభయంకరుఁ డొచు నప్పుడా
బృందమునందు లోకమును • బెల్లుగఁ దాల్చెడు దృష్టిఁ గాంచె సు
స్యందన మందనూరుఁ డను • సారథి యొప్పఁగ విక్రమించు మ
ధ్యందినసూర్యునిన్ మునిగ • ణార్చితుఁ దీక్ష్ణమరీచి నెంతయున్. 507

చ. కనుఁగొని రౌద్రవేగమునఁ • గన్నుల నగ్నికణంబు లొల్కఁగాఁ
జని రథమెక్కి కేశములఁ • జయ్యనఁ గేల హరించి యీడ్చి భూ
మిని బడఁద్రోసి గండముల • మిక్కిలి కొట్టి రదావళుల్ గరం

1 బర్హిరూపతన్ = నెమిలియాకారముతో.

బునఁ బెకలించి వైచెఁ దన ♦ భూరిపరాక్రమ మందఱుం గనన్. 508

తే. అదియె మొదలుగఁ బిష్టాశి ♦ యయ్యె దంత
ములు తొలంగినకతమునఁ ♦ భూష; రక్త
ధార లొలుకంగ నతఁడు త♦ద్దయు వెలింగెఁ
బ్రాగ్గిరీంద్రోదితుం డగు ♦ భంగి తోఁప. 509

క. దినపతిని భిన్నదంతుని, వినిపాతితు రక్తసిక్తు ♦ విడిచి నిశేశుం
గని పఱచి పట్టుకొని భూ,మిని బడఁగాఁ నీడ్చె, ద్విపము ♦ మృగశిశువుబలెన్.

క. క్షితిఁ బతితుఁ బాదతలమున, నతివేగము మెఱయఁ ద్రొక్కి యాతనిఁ గోపో
ద్ధతిఁ బువ్వును బిండిగ నే,గతిఁ జేయుదు రట్లచేసె ♦ గాఢప్రజ్ఞన్. 511

వ. కలామాత్రావశేషుఁ డై చంద్రుఁడు దీనస్వరంబున స్తుతించిన వీరభద్రుం డాతని విడిచె. దానికిం గరుణించి యీశ్వరుండు శిరంబునఁ దాల్చె నాటంగోలె శంకరుండు చంద్రచూడుఁ డని పిలువంబడియె. అనంతరంబున వీరభద్రుండు.

క. [1]భీతిభ్రష్టవిపంచిక, ధాతృసతిం గోపదృష్టిఁ ♦ దగఁ బట్టి వెసన్
ఖ్యాతిగ నాసికఁ ద్రుంచెను, జేతోముద మలర నగ్ని ♦ చేతులఁ ద్రుంచెన్.

వ. ఇట్లు విజృంభించు నాతనిం గని విష్ణుండు. 514

విష్ణువీరభద్రుల యుద్ధము.

శా. పక్షక్షేపవిధూతపర్వతగణుం ♦ బక్షీంద్రుఁ [2]బక్షానిల
ప్రక్షిప్తక్షితిభృత్కదంబుఁ గని యి♦ప్పాపాత్మశౌర్యంబునన్
శిక్షింపం గదనంబు చేయ నిపు డ♦క్షీణోద్గతిం బోవలెన్
వీక్షింపం దగు నీకు యుద్ధసరణుల్ ♦ వేగంబ రమ్మా యనన్. 515

శా. పక్షీంద్రుం డరుదేరఁ గాంచి వడితోఁ ♦ బద్మాక్షుఁ డారూఢుఁ డై
యక్షీణోద్యమ మొప్పఁ జక్రము నహా♦ర్యంబుం దమిం దాల్చి జ్యా
నిక్షిప్తాస్త్రకదంబుఁ డై కదలి యెం♦తే శౌర్య మొప్పార [3]హ
ర్యక్షప్రక్రమ మొప్పఁ బోయె దివిజుల్ ♦ హర్షంబునం జూడఁగాన్. 516

మ. చని వేగంబున వీరభద్రుని శరా♦సారంబునం గప్పి యా
ర్చిన నాతండును గ్రోధవహ్నికణముల్ ♦ చిమ్మంగ నుద్దీప్తుఁ డై
ఘనమహాస్యందనమెక్కి యస్త్రరుచులం ♦ గాల్పంగ నేతెంచు రీ
తిని లే వచ్చి యదల్చి తాఁకె నతనిన్ ♦ దేవాళి కంపింపఁగాన్. 517

1 భీతి...చికన్ = భయముచే జాఱిపోయిన వీణకలదానిని. 2 పక్షానిల...దంబున్ = ఱెక్కలగాలిచే విసరివేయఁబడిన కొండల పిండుగలవానిని. 3 హర్యక్షప్రక్రమము = సింహముతీరు.

తే. వారి కన్యోన్య మయ్యెను • ఘోరసమర
[1]మప్రతీపము తుముల మ•త్యద్భుతంబు
కంపితాశేష లోకంబు • కా్రిలు గజము
గజము మార్కొనుచందంబు • గానఁ బడఁగ. 518

సీ. రోషాట్టహాసముల్ • [2]రోదసి నింపఁగాఁ దిరుగుచు నార్చుచు • దీప్తదృష్టి
నన్యోన్య మీక్షించి • యడరుచు దివ్యాస్త్రజాలంబు విడుచుచు • జగము లెల్ల
భయమునొందఁగఁ దమ• బాహులాఘవములఁగనఁబఱచుచు శౌర్య•కలన మెఱసి
పోరిరి ఘోరమా•పోల్కి శ్రీనాథుండు వీరభద్రుండును • విక్రమమున

తే. వారి కలహంబు నారసి • వీరభద్రు
నందు విజయంబు గలుట • నాత్మనెంచి
వనజసంభవుఁ డరుదెంచి • వాహనములఁ
దోలుపనియందుఁ బ్రీతిచే • నూలుకొనియె. 519

ఉ. సారథియై పితామహుఁడు • సారథి కృత్యచమత్కృతిం దగన్
భూరితరాగ్రహంబు నెడఁ•బాపిన శంకరసూనుఁ డెంతయున్
వీరత పొంగ మెచ్చుకొని • వే శరవర్షము విష్ణుమేనఁ జె
ల్వారఁగ నింపి యార్చె హరి • యట్ల యొనర్చె నహంకృతిం గడున్. 520

తే. శార్ఙ్గచాపపినాకచం•చద్విముక్త, బాణతతి చాలవెలుఁగుచు • భానుకరము
లట్ల విశ్వంబు నంతయు • నావరించె, శరతతి నజయ్యుగా వైరి • హరి తలంచి.

చ. అరిని వధింపనెంచి రయ• మార [3]జగద్భయకృత్స్వనోల్లస
ద్గురుతర ఘంటికానినద•ఘూర్ణితదిగ్వలయంబు వైరిసం
హరణచణంబునై చెలఁగు • నట్టి సుదర్శనమున్ జవంబునం
గరమునఁ బట్టి లోకములు • కంపము నొందఁగఁ బేర్చి వైచినన్. 522

చ. హరికరముక్తమై నభము•నంతయు దీప్తుల నావరించి యా
తురమునఁ దన్నుఁ జంపవడి•తోఁ జనుదెంచు సుదర్శనంబు న
త్వరముగ వక్త్రిముం దెఱచి • వైఖరి యొప్పఁగ మ్రింగె నవ్విధం
బరసి సుదర్శనంబు వృథ•యౌటకుఁ జింతిలి శౌరి యిట్లనున్. 523

క. వీరుండవు విక్రమ జిత, శూరుండవు నిన్నుఁబోలు • శూరులు లేరీ

---

1 అప్రతీపము=సాటిలేనిది. 2 రోదసిన్=భూమియు నాకాశమును. 3 జగద్భయ...గ్వలయంబున్=లోక భయంకరమగు ధ్వనిచేఁ బ్రకాశించుచున్న గొప్పగంటలచప్పుడుచే మాఱుమ్రోయునట్లు చేయఁబడిన దిక్కులగుంపుగలది.

యీ రేడు జగంబుల నీ, శూరతకు న్మెచ్చు వచ్చె • శుభగుణనిలయా. 524

క. శిక్ష యొనర్చితి పేశలి, దక్షునకుం దుష్టమతికిఁ • దగు నది నీవా
[1]త్ర్యక్షాంగభవుఁడ వికఁ నీ, కీక్షితి సరిపోలఁ గలరె • యెట్టిం డ్రైనన్. 525

ఆ. నీదుశౌర్యమోర్వ•నేర్తురే భువిలోన, నెవ్వరేని సాధు•వృత్త! నాదు
చక్రమన్నవజ్ర•సదృశంబు గిరులందు, వైవఁ జెండు(మింగి•తీవు దాని. 526

సీ. కావున దక్షుఁడే • కరణి రక్షితుఁ డగు నిట్టి యవస్థనే • నిచట నొంది
నాఁడఁ గావున దక్షుఁ•బోఁడిమి రక్షింపఁ జాలు వా రెవ్వ రీ•సమయమందు
శంకర ద్రోహుని•[2]జాల్మశంకరసతీద్రోహపాపిష్ఠుని • దుష్టబుద్ధి
శిక్షింపుమీ నేను • శితికంఠుఁ దపమున నలరించి చక్రంబు • నందువాఁడ

తే. కొంతకాలంబునకు నీకుఁ • గుశలమగు మ
హాత్మ! నేఁ బోయివచ్చెద • హరునియాజ్ఞ
దక్షుదుష్టుని భక్షింపు • దర్పకారి
యాజ్ఞవలె నాదు మాటయు • హతపరాఘ !. 527

చ. హరునకు నాకు భేద మెటు • లారయఁ గల్గును శక్తి నేను మీ
గురుఁడును శక్తిమంతుఁడె యు•గుం మఱి శక్తికి శక్తిమంతుఁడౌ
పురుషున కెన్న భేదమును • బూని వచించు నెవండు వహ్నికిం
సరగున దాహికాఖ్య యగు • శక్తికి భేదము గల్గు నెవ్విధిన్. 528

ఆ. ఈశునాద్యశక్తి • యొసఁగుఁ జతుర్విధ, భిన్నరూప యగుచుఁ • బ్రేమనందు
భోగమందు నద్ది • పొల్చు భవానియై, యనిఁ జెలంగు దుర్గ • యనెడు పేర.

ఆ. కాళి యనెడు పేరఁ • గడునొప్పుఁ గోపంబు,నందుఁ బురుషరూప•మందుఁ దగుమ
దాత్మికయయి కాన • హరునకు నాకు న,భేదమంచుఁ దలఁపు•వీరభద్ర!. 530

క. హరునాజ్ఞయె నాయాజ్ఞగ, నరయుము దుష్టాత్ము దక్షు • నదయ దురాచా
రరతుని మర్దింపుము న,త్వరగతి ననిపల్కి గతసు•దర్శనుఁ డగుచున్. 531

తే. చనియె నంతట సారథి • వనజభవుని, నాత్మ మైత్రికి భాజనం • బని వచించి
సందియము లేక యజ్ఞవే•శ్మమున కేగి, యట్టహాసంబుఁ జేసె•నయ్యవసరమున.

సీ. భయ దాట్టహాసంబు • భంగి నాలోకించి మూర్ఛిల్లి రచ్చటి • భూమిసురులు
[3]విత్రాసమున ముని•బృందము లాతని పాదాగ్రములమీఁద • వ్రాలి భీతి
వినుతింప వారల • విహ్వలస్వాంతుల విప్రుల విడనాడి • విక్రమమున

1 త్ర్యక్షాంగభవుఁడవు=ఈశ్వరుని దేహమునఁ బుట్టినవాఁడవు. 2 జాల్మ్ముం=యోచింపక యే పనిజేయువానిని. 3 విత్రాసమునక్=మిక్కిలి భయముచేత.

యాగశాలాంతరమందు దక్షుని గాంచి సింహవిక్రమ మొప్పఁజేరి ఘోర
ఆ. వాక్యముల నదల్చి వజ్రతుల్యకృపాణ, మున శిరంబుఁ ద్రెంచి వనితభర్తృ
మరణమునకు నేడ్వ మలినముక్తాలకఁ, బాదపతిత నవలఁ బడఁగఁద్రోసి.
వ. శోణితభయంకరం బగు దక్షుశిరంబు నగ్నియందు వైచి భక్షింపు మని భయంకరధ్యానంబున నాజ్ఞాపింప వైతానదహనుండు [1]పూర్వలూనభుజద్వయుండు గావున శీర్షచ్ఛేదంబు గావించు నని యులికిపడి దక్షుని శిరంబును దక్షణంబ భక్షించె. ఆవృత్తాంతం బంతయుం గాంచి భీతివిహ్వలలు, నుత్తానపాణులును, ముక్తకేశ్యలును, గద్గదభాషిణులు నగు దక్షపత్నులు ప్రస్ఖలత్పదవిన్యాసలును, గింకర్తవ్యసమాకులలు నై విభ్రష్టభూషణంబులను, విముక్తాక్షుల్లకణంబులను, బరస్పరాంగంబుల నాలింగనం బొనర్చుచు నేడ్చుచు జని వీరభద్రుని హృదయంబు కృపార్ద్రంబుగా నొనరించి శోకరసంబు పయింబయిఁ బొంగుచుండఁగా నిట్లనిరి. 534

సీ. దేవదేవ! శరణ్య పావన, లోకౌఘసంహార భైరవ సత్కృపార్ద్ర
మానస మునిజన మానిత, ప్రత్యక్ష శంకరాకార సజ్జనవరేణ్య
దుష్టసంహారక శిష్టకల్పద్రుమ, [2]జ్వాలనాంబకవిదగ్ధ సర్వలోక
ములను సృజింపంగఁ బూనితి విశ్వేశ, విశ్వపాలక, సర్వ వినుతదేవ
ఆ. ధాతృవిష్ణుశంభు తను ధరనీయందు, వ్యర్థ వైరమూని ఫలము దాని
కనుగుణంబు నొందె నాత్మనాథుఁడు సృష్టి, కర్తృతాభిమానకలితుఁడగుచు.
క. సమ మైన శిక్షఁజేసితి, శమియింపుము కోప మింక జగములు లయమా
సమయంబున లక్ష్యం బగు, నమితభవత్క్రోధమునకు నస్యం డగునే. 536
క. ఈవిప్ర వటువు లక్ష్యం, బేవిధమున నగు సహింపు మీతని మృతిచే
నౌవైధవ్యము మా కది, పావనగుణ! రాకయుండఁ బాలింపు మింకన్. 537
చ. అని బహుదీనవాక్యముల నాతురతన్ నుతియింపఁగాఁ గృపన్!
వనితలఁ గాంచి వారలకు భర్తను దక్షుని నీయనెంచి యా
తని గతశీర్షమున్ మరలఁ దత్తనువుం దగ నొందఁజేయునో
య్యన నొకభాగమస్తకము నప్పుడ తెచ్చి యమర్చె శక్తిచేన్. 538
క. నారీజనరక్షణచణ, కారుణ్యము మెఱయఁ బ్రాణకలితముఁ జేయన్
గారవమున వినుతించిరి, బోరున దివిఁ జూచు నమరపుంగవు లెల్లన్. 539

---

1 పూర్వలూనభుజద్వయుండు=మున్ను త్రెంపఁబడిన భుజములుకలవాఁడు. 2 జ్వాలనాంబ... లోకములను=అగ్నిమయమగు కంటిచేఁ గాల్పఁబడిన యెల్లలోకములను.

తే. వీరభద్రుండు దక్షుని♦విక్రమమున, భాగమస్తకమునఁ బ్రాణ♦సహితుఁ జేయ
మేలుకని నట్లుగా లేచి ♦ మేషశిరము, చెలఁగ నుతియించె నర్థవి♦శేష మమర.
చ. హరునకు భాగమీయకయె ♦ యాగము చేయఁగఁ బూనినాఁడ శం
కరుఁడు మఖాధినాథుఁడు మ♦ఖక్రియకుఁ ఫల మాతఁడే కదా
యరయక శంభుహీనమగు ♦ యజ్ఞము చేసిన నాకు శిక్ష ని
ట్లురుతరశక్తిఁ జేసితి వ♦హో యిది చక్కని జ్ఞాన మిచ్చెడిన్. 541
క. కృతపాపుని నశరణ్యుని, గృతకృత్యుని గా నొనర్చు ♦ కేవలకృప ని
న్నతులను దనిపెద శంకర, సుత! వందన సముదయంబు ♦ శుభగుణనిలయా.
తే. దర్పబలమున నేను ద♦త్తత్వమునొంది, చాలబ్రహ్మత్వమునఁ బొంగి♦ స్వాంతమందు
గర్వ మొలయుట నీశుని♦గా మహరుని, విభు జగన్నాథుఁ దిట్టితి♦ విమతుఁడగుచు.
సీ. శంకరద్రోహంబు ♦ జంకు లేక యొనర్చినట్టి నాకెట్లు పా♦పాళి తొలఁగు
దుష్టనరకసము♦ద్రుని దాఁట నెట్లగు మద్దోషమున కీవు ♦ మహితరూప
తగిన శిక్షయొనర్చి ♦ దర్పంబు నెడఁబాపి తదియ చాలును జ్ఞాన♦పదవి గలిగె
నేమని వర్ణింతు ♦ నిప్పుడు నిను దేవ! వర్ణింపఁ జాలరీ ♦ వసుధ నెవ్వ
తే. రిదియె మొదలుగ భక్తిచే ♦ నెపుడు నీదు, పాదసేవ యొనర్చెదఁ ♦ బాపి నన్ను
వేగరక్షింపు రక్షింపు ♦ వీరభద్ర, యనిన ముదమంది బ్రతికించె ♦ యజ్ఞమృగము.
వ. ఇట్లు యజ్ఞమృగంబును జీవింపఁజేసి శంకరు దర్శింపఁ జనియె. ఇయ్యది మహా
వీరాగ్రేసరుం డగు వీరభద్రుని శుభచరితంబు. దీనిని భక్తిచేఁ బఠించిన దురిత
విదూరులై శైవపదంబు నొందఁ గలరు. పవిత్రతమంబు, దుష్కల్మషధ్వంసక
రంబు నగు. దీనిని బఠించిన మహనీయులు యశోభాగ్యంబుల నొందుదు రని
హయగ్రీవుం డగస్త్యునకుఁ జెప్పినఁ గుంభసంభవుండు. 545

### నారదుఁడు హిమాలయమునకుఁ బోవుట.

మ. పరమాత్మా! వరవీరభద్రునికథా ♦ భవ్యామృతప్రాప్తిచేఁ
బరితుష్టాత్ముఁడ నైతి నింక వినిపిం♦పంగాఁ దగున్ యావనో
ద్ధురతం బొల్చిన శైలజాతను మహా♦తోషంబునన్ శంభుఁ డా
తురుఁడై కోరెనొ లేమయే స్మరశరో♦ద్భూతార్తయై కోరెనో. 546
తే. ఎట్టు లయ్యె వివాహంబు♦కృత్యమేమి, చేసెఁ బార్వతి యెఱఁగింపు♦చింతితార్థ
దాయకా! విస్తరంబుగ♦నీయమోఘ, వాక్యములఁ దృప్తి నొందెద♦[1]వాజివదన.
చ. అన విని యిట్లు పల్కెను హ♦యాననుఁ డవ్విధ మెల్లఁ జెప్పెదన్

1 వాజివదన=హయగ్రీవా.

వినుము మునివర్య! దేని విన • విచ్యుతమహా నఘరాశియంత న
వ్వనిత [1]విశాలయశోవన వి • వర్ధిత సర్వజగత్ప్రమోదఁ దా
మనమున భూధరుండు పలు • మాఱు తలంచి తలంచె నివ్విధిన్. 548

క. ఈకన్యక మత్కులమునఁ, బ్రాకటముగఁ బుట్టె నౌర! • రత్నపుదీపం
బేకరణి నట్లు వెలిఁగెడు, లోకత్రయ మోహనాంగి • లోలాక్షి తమిన్. 549

తే. అన్యసాధారణము గాని • యట్టి రూప
సంపదల నొప్పె నీకన్య • సార్థకత్వ
మొందె నాయన్వయం బీమె • కొగిని యశోవ
నంబు సమకూరె భవ్యమై • నాథుఁ గవయ. 550

ఉ. ఈతరుణీలలామ కొగి • నీ డగు భర్త త్రిలోకమందు వి
ఖ్యాతులలోఁ గనంబడఁడు • హవ్యవహుండును వజ్రిధర్ముఁడున్
వాతజలేశవిత్తపులు • బ్రహ్మయు ధన్యులు గారు చూడఁగా
శ్రీతరుణీశుఁడున్ మిగులఁ • జెల్వమునం దులఁదూఁగఁ డేమొకో. 551

మ. అని చింతింపఁగ నైణికుండు మహితుం • డార్యోత్తముం డాత్మ మి
త్రుని నప్పర్వతుఁగూడి నారదుఁడు నెం • తో వేడ్క [2]సంచారశీ
లన మొప్పారఁగఁ బోవుచుండి యపు డు • ల్లాసంబునం జిత్రవ
స్తునికాయంబులఁ జూడవచ్చె గిరికిన్ • శుంభద్గతిం బొంగుచున్. 552

సీ. మానిత పూర్ణాబ్జ • మండలంబును బోలు నిర్మలాస్యంబు సం • దీప్తదేహ
కాంతియుఁ జెలువారఁ • గమనీయ గోక్షీర ధవళ దేహం బొప్పఁ • [3]దటిదుపమిత
పింగజటావళి • వెలయఁగా మహతి నాఁ జెన్నారు వీణియ • చెలఁగి నాద
మయ మైన బ్రహ్మంబు • మహితరీతిని బాడ హృద్యగీతంబుల • నీశు శంభు

తే. వినుతిసేయుచు మానస • వనజసంస్థుఁ, బరము ధ్యానించుచును గాంగ • వారిసిక్త
ధౌతశుద్ధవపుర్ద్యుతి • దనరుచుండ, నారదుఁడు వచ్చె నాశీత • నగముఁ జూడ.

తే. దివ్యకాంతివిరాజితు • దివ్యదృష్టి
పూర్ణు దేవర్షి పుంగవుఁ • బోలఁ జూచి
భక్తి నెదురేగి యాశీత • పర్వతుండు
మునిసమాసీనుఁ గావింప • ననియె నతఁడు. 554

---

1 విశాల...మోదన్=విస్తారమగు ప్రాయముచే వృద్ధిచేయఁబడినయెల్లలోకముల యొక్క ప్రమోదముకలది. 2 సంచారశీలనము=సంచార స్వభావము. 3 తటిదుపమిత...వళి=మెఱుపుతో సరిపోల్పఁదగిన కపిలవర్ణమైన జటలగుంపు.

క. సురగణములోన నింద్రుని, సరణిఁ [1]ధరగణమునందు • జంచద్ద్రీతిం
బరఁగుదు వగ్రేసరతఁ, నిరతము ముదమొందుచుండు • నీసుభగతకున్. 555
క. నీవును శేషుఁడుఁ గూర్మముఁ, బావన దిగ్గజము లొకట • వసుధను దాల్పం
గా వసుధ నిలిచెఁ గావున, మీవంటిపవిత్రతనులు • మిగులం గలరే. 556
వ. మఱియు నొక్కవిశేషంబు వచించెద సావధానుండ వై యాకర్ణింపుము. చతుర్దశజగన్మాత యగుపరమేశ్వరి నీకుఁ దనూజాత యయ్యె. ఈయంబ లక్ష్మియుఁ, బుష్టియు, ధాత్రియును, శీతాంశుశేఖరుం డగుశంకరునకు దేహార్ధధారిణియు, స్వాహాస్వధానీతిరూపిణియు, నాత్మవిద్యయు, గుహ్యావిద్యయుఁ, బాపఘ్నియు నగు. సదాశివు నంకస్థాయినియు నగు. ఆరూఢయౌవన యగు నీయంబిక నుపేక్షింపక వేగంబ తీసికొని స్థాణ్వాశ్రమంబున కరుగుము. అందు శంకరుండు సతీవియోగజనితవైరాగ్యంబునఁ దపం బొనరించుచున్నవాఁడు. మఱియు విజితేంద్రియుండు నయి ఘోరయోగమూని యున్నవాఁడు. కావున నీవరిగి యీకన్యకను బరిచర్యార్థము నియోగించి రమ్ము. పరిచర్యాపరిచయంబునఁ బార్వతి నీశ్వరుండు విధివిధానంబున వివాహ మగు. తారకాసురపీడితు లగు దేవత లీవిషయంబునఁ బ్రయత్న మొనరించుచున్నవారు. కావున నిప్పని నీ కవశ్యాచరణీయంబని యాదేశించి పర్వతసహితుం డై నారదముని యరుగుటయు హిమగిరిస్వజన్మంబును బావనంబుగా నెంచి స్థాణ్వాశ్రమాభిముఖుం డై పోవ నుద్యోగించి విజయయు, జయయు, సుశీలయు ననుసఖులతోఁగూడఁ బార్వతిం దోడ్కొని పోయి ముందట. 557
సీ. బాహుబలోల్లస•ద్బహువిధగణనాథపరిపాలితంబును • సురభికుసుమ
ఫలరసభరితంబు • భవ్యకైలాసపర్వతపాదవాసైక•భద్రగృహము
శాంతసత్వవ్రజ•సాంద్రతమంబును, సుస్నిగ్ధసచ్ఛాయ•శుభ్ర దేవ
దారు [2]కంకేళిన•మేరులోధ్రాదిద్యనేకద్రుమకాంతార•గాఢతరము
తే. పుణ్యతమపక్షిసింహాది•భూరిమృగస, మాకులం బల్పశీతల• హారినిర్ఝ
రంబుఁ గస్తూరికామృగ•రాజవాస, వాసితశిలాతలంబు నై • వఱలి మఱియు.
సీ. హారభక్తులును ద్రిపుండ్రాంకితమస్తకు లతిశుభాచారులు • నైన భూసు
రార్భకులకు వాస•మై వృక్షగృహము లై చంద్రభూషితశీర్ష •శంకరేశ
పరశివ యనునామ•పంక్తిని గూజితవ్యాజంబున జపించు • పక్షితతుల

1 ధరగణము=పర్వతముల గుంపు. 2 కంకేళినమేరులోధ్రాది=అశోక, పొన్న, తెల్లలొద్దుగ చెట్టు మొదలగునవి.

చేత భాసిల్లుచు • స్త్రీవార్త లేకయే యలరుచు స్థాణుని•యతుల యోగ
తే. మునకు యోగ్యంబు నయి మది • ముదము నింపు
చున్న స్థాణ్వాశ్రమముఁ జూచి • కన్నకూఁతు
నట బహిర్ద్వారమందుండు • నది యటంచుఁ
దెలిపి సద్భక్తి కలితుఁడై • దీనవృత్తి. 559

వ. అంత గృహాబహిర్ద్వారంబునఁ జెలంగుచు [1]మహాజసుం డగు నందికేశ్వరుం గాంచి మహాత్మా! సోమార్ధమకుటునకుఁ బ్రధాన భక్తుండ వగుట నీశ్వరునితో హిమాలయంబు యుష్మచ్చరణద్వంద్వసేవార్థ మరుదెంచె నవసరంబు దయచేయుం డని తెలుపవే యని ప్రార్థించిన నంది లోనికిం జని నమస్కరించి [2]పిహితవదనుండై యుష్మదంఘ్రిసేవార్థ మరుదెంచితి నని హిమగిరి ప్రార్థించుచున్నవాఁడని విన్నవించుటయుఁ దపస్థితుం డగుటఁ బ్రత్యుత్తర మొసఁగక యించుకభ్రూసంజ్ఞతో హిమశైలాగమనంబు సూచించిన నంది వేగంబ చని యాతని నీశ్వరాంతికంబు నొందించె నంత శీతశైలుండు పరమేశ్వరున కష్టాంగస్పృష్టభూతలుండై నమస్కరించి యిట్లని విన్నవించె. 560

క. హర! లోక వందనీయుఁడ, వురు తేజోనిధివి దేవ•తోద్యత్కార్యా
దరుఁడ వనాదివి నీపద, సరసిజములఁ దలఁపఁ బాప•సంఘ మడంగున్. 561

ఆ. నీసుదర్శనంబు • నిఖిలతపంబుల, ముఖ్యఫలము దేవ • భువి నెవండు
నిన్నుఁ గోరకున్న • నిఖిలవాంఛిత సిద్ధిఁ,బొందఁ జాలఁ డనుట • సందియంబె.

చ. కల దొక విన్నపంబు సుర•కాండనుతా! హర! యాలకింపు మీ
లలితగుణాఢ్య, పార్వతి, వి•లక్షణరూప, కుమారి త్వత్పదా
బ్జలలిత సేవచేయుటకు • సంతతము న్మదిఁ గోరుచుండు న
య్యలఘుతరప్రమోదమును • సార్థకతం గనునట్లు సేయుమీ. 563

తే. నైజవాంఛాభిపూర్తి యో • నాథ! నీదు, పాదసంసేవనంబునఁ • బరిఢవిల్లు
ననుచు యాచించెనాపుత్రి•యదిలభించు, నట్లుచేయుమువిశ్వేశ•యతులకరుణ.

క. తరుణలకుం బురుషులకుం, గరము జడస్వాంతులకును • గళ్యాణభవ
ద్వరపాదసేవముఖ్యము, పరశివ! యట్లౌట నాదు • పట్టిని గొనుమీ. 565

వ. కరుణాంతరంగుండవు కావున నాపుత్రిసేవచేయ ననుగ్రహింపుము. తపం బొనరించు నీకు మత్పుత్రి విఘ్నకారిణి కాదు. యుష్మత్తపంబునకు క్షతి

1 మహాజసుండు=మిక్కిలి బలముకలవాఁడు. 2 పిహితవదనుండై=చేతితో నాచ్ఛాదింపఁబడిన ముఖముకలవాఁడు.

కలుగదు. పార్వతి వాంఛితార్థంబుసిద్ధించు. భవదాజ్ఞం గొని పార్వతిని సఖుల తోఁ రావించెద. బహిర్ద్వారంబున నిప్పుడున్నయది. మీకు గృహసమ్మార్జనాది క్రియ లొనరింప దాసి యగు. మఱియు బువ్వులు తెచ్చి మాలాకారంబులు గా నొనర్చు. జలంబులను దెచ్చు. ఇంకను వధూచితంబు లగు కార్యంబులను మీ యాజ్ఞానుసారంబునఁ జేయుచుండు నని విన్నవించుటయు నీశ్వరుం డట్ల యగుఁ గాక యనుటయు హిమాద్రి నమస్కరించి కుమారిం దోడ్కొనివచ్చి పరమేశ్వరపూజార్థము నియోగించి చనె నంత. 566

తే. పార్వతియుఁ జెడియలఁ గూడి • భక్తితోడఁ
బ్రీతి ననుకూల యయి శివ•ప్రియము లైన
కార్యములఁ జేయుచును మదిఁ • గరఁగఁ జేసె
వేదిసమ్మార్జనాదిస•ద్విధులవలన. 567

సీ. కుసుమాహరణమును•వెసఁజేయు దేవపూజనవేదులందుఁ జం•దన మలందు
జలపూర్ణకలశంబు • నరగునఁ బెట్టు సాక్షతకుసుమంబులఁ • జక్కనునుచు
[1]మంగళపిష్టంబు • శృంగారరీతిచేఁ జిత్రరేఖలు గాఁగఁ • జెలఁగి చేయుఁ
దర్పణార్థంబు శు•ద్ధసలిలమును దెచ్చి యందిచ్చు జాహ్నవి•యందుఁ బూచు
తే. స్వర్ణపద్మంబులను దెచ్చి • సంతసమున
నర్చనము సేయువేళల • నాదరమున
నిచ్చుఁ గోమల మగు కుశ • నిచ్చు హోమ
మునకుఁ బల్లవములఁ దెచ్చి • పూన్కి నొసఁగు. 568

మ. అనయం బీ విధిఁ జంద్రచూడునకు నె•య్యం బొప్ప సేవాక్రియం
బొనరం జేయుచు నిష్టసిద్ధికయి యా•పూఁబోఁడి సేవింపఁగా
ముని మాన్యుం డగుశంకరుండు గిరిజా•ముగ్ధాస్యముం జూడ కొ
క్క నిమేషంబును నూరకుండక మహా • గాఢానురాగంబునన్. 569

సీ. నాసాగ్ర విన్యస్త • నయనుఁ డై యింద్రియ సంతతి బంధించి • స్వాంతమంత
భ్రూమధ్యమునఁ జేర్చి•పొల్చి యంతర్న్యస్తలోచనుం డగుచుఁ ద్రి•లోచనుండు
నిర్వికారంబును • నిర్మలంబును బరానందమయంబును • సుందరంబు
నద్వితీయంబును • నగు నట్టి స్థలమునఁ దనదు [2]ప్రత్యగ్దృష్టిఁ • దగులఁజేసి
తే. భంగశూన్యసముద్రంబు • భాతి నొప్పి
యబహిరావృత చిత్తుఁ డై • యంతరంగ

---

1 మంగళపిష్టంబు=శుభకరమగు ముగ్గుపిండి. 2 ప్రత్యగ్దృష్టిన్=జ్ఞానదృష్టిని.

మందు వెలిఁగెడు జ్యోతియం • దాదరమున
నుండె మిక్కిలి [1] స్తిమితదే•హుండు నగుచు. 570

మ. హరుఁ డిట్లద్వయవస్తుచింతనమునన్ • హర్షించుచుండంగ ని
ష్ఠురచిత్తుం డగుతారకాఖ్యుఁడు సుర•స్తోమంబు బాధింప నా
తురు లై దేవతలెల్ల బ్రహ్మను సము•ద్ధూతార్తునిం జేరి స
త్వరు లై వందనముల్ నుతుల్ సలిపి యం•తం బల్కి రత్యార్తు లై. 571

—దేవతలు బ్రహ్మతోఁ దారకాసురబాధల విన్నవించుట.—

ఉ. నీవు సృజింతు లోకముల • నెమ్మిని బ్రోతువు జంతుజాలమున్
నీవ [2] యవేక్షకుండవును • నీవె కదా వెనుప్రాపు మాకు నీ
వీవిధి సత్యలోకమున • హృత్పరితోషమునన్ వసింపఁగా
దేవత లార్తు లై రనెడు • తీక్ష్ణతరోక్తి మదిం గలంచదే. 572

ఉ. ఏగతి మమ్ముఁ బ్రోచెదవొ • యీతఱి నూరక యున్నఁ బద్మజా!
భోగివరుండు [3] దర్దురముఁ • బోలి మమున్ దితిజుండు మ్రింగు నీ
వీగతి నూరకుండు టది • యేమొకొ మా కెఱిఁగింపవయ్య య
భ్యాగతు లట్లు వచ్చితిమి • భవ్యకృపన్ మము నాదరింపవే. 573

ఉ. నీవె యొసంగినట్టి పని • నీవె యుపేక్షను బూనఁ బోవదే
కావున నీవొసంగు నధి•కారమున న్వసియించి యుంటి మో
దేవ! త్వదీయసత్కృపను • దివ్యపదంబునఁ బొల్చు చుంటి మి
ట్లీవిధి నీ వుపేక్షఁ గన • నిప్పుడ నాశము గంటి మే మనన్. 574

తే. కలిగె [4] నత్యాహితము మాకుఁ • గమలజన్మ, చిత్తశల్యము మమ్మెల్లఁ•జేరెవినుము
విన్నవించెద మవ్వార్త • విశదరీతిఁ, గలఁడు తారకుఁ డనెడు రా•క్షసుఁ డొకండు.

ఉ. ఖ్యాతిగ మీవరంబులను • గాంచి మదోద్ధతదేవవైరి సం
ఘాతముతోఁ జెలంగి భుజ•గాఢపరాక్రమ మొప్పుచుండఁగా
నాతతశక్తి ముజ్జగము•లందు నెదుర్కొనువారు లేక వాఁ
డీతఱి మూఁడులోకముల • నెంతయు లోఁ గొనెఁ బద్మసంభవా!. 576

ఆ. విను హిరణ్యకశిపు • విక్రమగోత్రసం, భవుఁడు తత్సమాన•బాహుబలుఁడు
నష్టనీతి చపలుఁ • డిష్టవిహారుండు, మానధనుఁ డనూన • మదయుతుండు.

1 స్తిమితదేహుండు=కదలని దేహముకలవాఁడు. 2 అవేక్షకుండవు=చూచుచుండువాఁడవు.
3 దర్దురమున్=కప్పను. 4 అత్యాహితము=మిక్కిలి వెఱపు.

తే. యజ్ఞకర్మముఁ జెఱిచె స్వా♦హాస్వధాది, శబ్దవర్జితముగఁ జేసె ♦ జగము నెల్ల
సకలమానులఁ గోపైక♦సరణి మెఱయ, బాధఁ గనునట్లుగాఁ జేసెఁ♦ బద్మజన్మ!.

క. సురపతి కల్పద్రుమమును, వరచింతామణిని గొనియెఁ ♦ బౌరుషమున నా
ఖరబుద్ధి కామధేనువు, సురలెల్లఁ గలంగుచుండఁ ♦ జూఱఁగఁ గొనియెన్. 579

క. కేతన నిస్వనమాత్రనె, భీతిలి సుర లెల్లఁ బాఱఁ♦ బ్రియమున శక్ర
ఖ్యాతపురంబునఁ గల ధన, మాతత గతిఁ గొనుచుఁ జనియె ♦ నాత్మ నగరికిన్.

సీ. గోపురాట్టాలక ♦ కుడ్యసౌధంబులు [1]ప్రగ్రీవములును సో♦పానపంక్తి
చంద్రశాలలు చారు♦సభలు మండపతతిసౌవర్ణగృహములు ♦ సరసులు మఱి
భూరితటాకముల్ ♦ పొలిసెఁ దారకదైత్యవరుచేత దుష్టకా♦ర్యరతుచేత
నశియించె దేవాధి♦నాథు రాజ్యం బెల్ల రవిశశిముఖ్యులౌ ♦ గ్రహములకును.

తే. గల్గునధికారములనెల్లఁ♦గడఁగి తానె, చేయఁబూనెను; బద్మజ! ♦ చెలఁగిచంద్రు
చంద్రతయుసూర్యుసూర్యత♦జ్వలనుజ్వలన, తయునశించెనుదనుజుని♦దర్పశక్తి.

క. యముని యమత్వ మడంగెను, సుమహిత తత్కృత్యతతుల♦శూరతతో నో
కమలజ! తా నొనరించుచు, యమముఖులకు బాధచేయు ♦ నసురుఁడు వేడ్కన్.

క. తరుణులఁ జెఱఁబెట్టెను మా, నరవర్ణినులన్ స్వకీయ♦భామలగా ను
ద్ధురశక్తిఁ జేసె మీ పరి, సరమునఁ జెప్పంగ సిగ్గు ♦ జనియించెఁ గటా!. 583

తే. అతని శౌర్యాగ్ని నీరీతి ♦ నఖిలజగము, గాల్చుచున్నది తద్భయ♦కంపితులము
నగుచు నెల్లప్పుడును దుఃఖ♦మనుభవించు, చున్నవారము నెంతయు♦నోర్పుతోడ.

క. అసురభయంబు మనంబునఁ, బ్రసరించిన నేమి చెప్ప♦వారము దేవా
వెస నాహారవిహారము, లసరణియేతోఁపవంగ♦లక్షణము చెడున్. 585

సీ. రాత్రియుఁ బవలు నా♦రాటను బాధల ననుభవించుచు నిట్టు♦ లనుదినంబు
నందందె తిరుగుచు ♦ నఖిలకష్టంబుల పా లైతి మయ్య! మా♦వలెనె కొంద
ఱమరులు బాధల ♦ నాయాసపడఁ జాల కరిగి మానుషరూప ♦ మంది భూమి
సంచరించెదరు న♦ష్టంబు లయ్యెను దేవపితృకార్యములు దైత్య♦భీతిచేత

తే. వినుము తారకదైత్యుని ♦ విక్రమంబు, వెలుఁగుచున్నది యతులమై ♦ విష్ణుశంభు
చక్రశూలంబులను వాఁడు ♦ చావఁడెట్టు, లైనసాధ్యుండు కాఁడు మ♦హాబలుండు.

ఉ. చెప్పెడిదేమి మాకుఁ గల ♦ చింతలఁ జెప్పితి మోమహాత్మ! నే
ర్పొప్పఁగ నేయుపాయమున ♦ నుగ్ర మహాసురుఁ డీల్గు దాని మీ

1 ప్రగ్రీవములు = మేడకిటికీలు.

రిప్పుడ బుద్ధి నెంచి వచి•యింపుఁడు వాఁ డెటులేని చచ్చుచో
ప్పొప్పదయేని దేహముల • నొయ్యన మానఁగ నెంతు మెంతయున్. 587

ఉ. తావక సద్వరప్రకట•దర్పమునం జుళుకీకృతంబుగా
భావనసేయు లోకములఁ • బద్మజ! స్రష్ట వనాథ నేతవుక్
బావన భక్తరక్షణ వి•భాసురమూర్తివి నీవు మమ్ము ని
క్లేవిధిఁ గావకుండు టిది • యెంతయు మాదురదృష్టమే కదా!. 588

తే. అస్మదాపన్మహాబ్ధికి • నరయనీవె, [1]కర్ణధారుండవుగద యో•కమలజన్మ!
తద్వధోపాయ మీాక్షించి • తగినరీతిఁ, జెప్పవే యంచు మఱిమఱి • చింతనొంది.

వ. దీనప్రలాపంబుల నమరులు వగచుటం గాంచి దేవతల నాదరమధురవాక్యం
బుల నూఱడించి విరించి యి ట్లనియె. 590

తారకాసురపీడానివృత్త్యుపాయమును బ్రహ్మ దేవతలకుఁ జెప్పుట.

శా. ఓహో దేవతలార! తారకసురా•ర్యుద్యత్ప్రతాపోజ్వల
ద్బాహాపీడితులై నితాంతము వ్యధం • బాటిల్లుచున్న న్నిటుల్
సాహాయ్యంబును జేయ వేఁడితిరి ని•శ్శంకర్ మహోపాయ మే
నూహం జెప్పెద నాలకింపుఁ డది సం•ర్వోద్యోగ మూలంబయా. 591

తే. అసురవరుఁడు బలాఢ్యుండు • నయ్యు బాల్య
మందె నన్నుఁగూర్చి తపముసే•యంగ నంతఁ
దత్తపోజ్వాలఘోరమై • తాపమొందఁ
జేసె లోకంబులను నేమి • చెప్పవచ్చు. 592

సీ. తత్తాపమునఁ జతు•ర్దశలోకములు తపింపంగ ధూమావృత•భంగి నెసఁగె
నాకాకదంబంబు • న ల్లాటఁ గని వాని పరిసరమున కేగ • భక్తి మ్రొక్కి
నీవు లోకంబుల • నిర్మింతు వఖిలకామప్రదుండవు మహా•మహిమ వెలుఁగు
వాఁడవు పద్మసం•భవ! తాపసులకెల్ల ఫలసిద్ధియాట నీ•వలనఁ గాదె

తే. నాతపంబున సుప్రస•న్నతఁ జెలంగి, తేని కోరెద వరమొండు • తృప్తిగాఁగ
వేగముగ నిమ్ము [2]శుచిముక్త•వీర్యజాత, పురుషుఁడే నన్ను నంతంబు•బొందఁజేయు.

వ. మహాత్మా! పూర్వోక్తపురుషుండు తక్కఁ బెఱవారివలన నాకు భయంబులేకుం
డునట్లు వరం బనుగ్రహింపవే యని ప్రార్థించినఁ దద్భక్తికి నలరి యాతండు

1 కర్ణధారుఁడవు=ఓడ నడుపువాఁడవు. 2 శుచిముక్తవీర్యజాతపురుషుఁడు, శి=అగ్నియందు విడువఁబడిన శుక్లమువలనఁబుట్టిన పురుషుఁడే.

కోరినవరంబు నిచ్చితి. ఇద్ది యాతని గోనంగిన వరంబు తెఱంగు. కావున మ
దో_త్తవరుండును, మదభివర్ధితుండును నగు తారకాసురుండు నాచేత సంహరింపఁ
బడఁడు. నే నట్లు చేయఁబూనుట పాడిగా దెట్లంటిరేని వినుండు. 594

తే. కపటిదుష్టుండు ధూర్తుండుఁ • గడుశఠుండు
నైనఁ దనచేత వర్ధితుం • డైనవాని
నెప్పుడును జంపఁగూడదు • హితము విడిచి
యట్లు చేయంగఁ బూనిన • నతఁడు చెడఁడు. 595

తే. చెలఁగి దహనుని గృహమందుఁ • జేర్చి యతఁడు
గాల్పఁ దచ్ఛాంతిచేయ దు • ష్కరమువుమ్ము
కాన సేనానియొక్కఁడు • కలుగకున్నఁ
దారకాసురుఁ జంపంగఁ • దరముకాదు. 596

ఉ. తారక దైత్యదోర్బలము • దర్పము వేగ శమించునే మహో
దారుని శౌర్యసారమునఁ • దప్పక యట్టి వరూధినీశునిఁ
గారవ మొప్పఁ గాంచినను • గల్గు జయంబు సురేశులార! యా
భూరిబలుండు పార్వతికిఁ • బుట్టు మహేశ్వరసంగమంబునన్. 597

ఉ. శీతమయూఖశేఖరుఁడు • స్వీయసతీమృతిచేత నెంతో వి
ఖ్యాతవిరాగి ధర్మమును • గాంచి వధూమణిసన్నికర్షమా
త్రాతతహృత్పరాఙ్ముఖత • నందుచు ఘోరతపస్సమాధిచేఁ
బ్రీతిగ నాత్మనాత్మఁ గను • రీతి నెసంగుచుఁ బ్రజ్వరిల్లెడున్. 598

చ. సురవరులార! పూర్వ జని • సొంపుగ మీరొనరించినట్టి యా
గురుసుకృతంబుచే హరుని • గూర్చెడు కాంక్ష హిమాద్రిపంపఁగా
హరునకు సేవచేయుచు న • హర్నిశముల్ హరుసన్నిధానమం
దు రమణి గౌరి యున్నయది • తోరపువేడుక తొంగలింపఁగాన్. 599

క. అణుమధ్యను గాంతి తరంగిణిఁ బార్వతి నిర్మలాంగిఁ • గృతసేవను ని
ర్ఘృణచిత్తుఁ డగుచు స్థాణుఁడు, గణుతింపఁడ యొక్కమాఱు • కనుదమ్ములచేన్.

క. శితికంఠుఁడు ప్రీతిని బార్వతిఁ గూడఁగఁ జేయునట్టి • బహుయత్నము మీ
రు తగం జేసిన శంకరుఁ, డతులితమోహమునఁగూడి • యగ్గిరిజాతన్. 601

క. విహరించుచుండి వీర్యం, బహిభూషణుఁ డట్టె విడుచు • నవ్వీర్యంబున్
దహనప్రఖ్యము గావున, మహివిడుచును దాల్ప లేక • మానిని త్వరతోన్.

క. ధరణి ధరింపఁగఁ జాలక, యురువడి శుచియందు విడుచు • నొయ్యన దహనుం

డు రయమున విడుచు [1]మిహికా, కిరణుని కామినులయందుఁ♦గృత్తికలందున్.

క. అంతట నాకృత్తిక లతి, సంతాపము నొంది దాని ♦ జాహ్నవి విడువం
జింతించి వీర్యతీక్ష్ణత, సంతప్తత గంగ విడుచు ♦ [2]శరవణమందున్. 604

క. అంతఁ గ్రమంబున వీర్యం, బెంతయుఁ బరిణామమొంది ♦ యాశ్వరుకృప న
త్యంతముఁ గుమారరూపత, వింతగఁ జెలువారు దివ్య ♦ విక్రములారా! 605

క. ఆకొమరుఁడు శ్రీకంఠా, స్తోకకృతాస్త్రుండు తీక్ష్ణ♦దోర్దర్పుఁడు నై
ప్రాకటవిద్యానిపుణత, శ్రీకంఠుని కరుణనొంది ♦ సేనాధిపుఁడౌ. 606

క. ఈకార్యము కొనసాగుట, కేకం బగుమూలహేతు ♦ వెయ్యది యన నా
శ్రీకంఠుఁడు గౌరీసా, ఖ్యాకలితుం డౌట చేయుఁ ♦ డద్దానిఁ దమిన్. 607

క. అనలాత్ముండు విరక్తత, ననయము వర్తించు నాతఁ ♦ డనురాగంబుం
గనఁజేయుటకు రతీశుఁడు, ఘనుఁడు నియోగింపుఁ డతని ♦ గార్యముఁ దీర్పన్.

క. చనుఁ డీక మీగృహముల కని, వనజాసనుఁ డరుగ దేవ♦వర్యులు స్వర్గం
బున కరిగి రంత నింద్రుఁడు, మనమున నొకమాఱు తలఁచె ♦ మన్మథుని దమిన్.

ఇంద్రమన్మథుల సంవాదము.

సీ. కమనీయ పుండ్రేక్షు♦కార్ముకహస్తుండు పుష్పాశుగౌఘసం♦పూర్ణతూణ
పృష్ఠభాగుండును ♦ విశ్వసౌందర్యసారరచితదివ్యవి♦గ్రహుఁడ శోక
కంజాతనవమల్లి♦కాచూతనీలోత్పలాయతదివ్యాయు♦ధాళిఁ దాల్చి
పలుమాఱు సేనాధి♦పతి యగు శశితోడ భాషించుచును బ్రీతి♦బరమమిత్రుఁ

తే. డగు వసంతుని గాంచుచు ♦ నాదరమునఁ, బీఠమర్దునిఁ బరిహాస♦పృథువచనము
లను ముదం బందఁజేయుచు♦వనితలెల్ల, వెంటరావచ్చె మదనుండు♦విబుధపురికి.

వ. మఱియును. 611

తే. స్త్రీసమాలోకనాయకుం ♦ డై సమస్త
మోహసంపాదనంబున ♦ ముదముఁ గనుచు
మమత రజనీమయం బగు♦మాయఁ దాల్చి
మందమారుతరథుఁడు నై ♦ మన్మథుండు. 612

వ. తపంబులకుఁ బ్రథమవిఘ్నభూతుండును, మాయాసారపరాక్రముండు [3]నుత్ఫుల్ల
కర్ణికారాభకమనీయదేహద్యుతియు నైన మన్మథుండు రతీదేవింగూడి దేవేంద్ర

1 మిహికాకిరణుని కామినులయందున్ = చంద్రునిభార్యలయందు. 2 శరవణమందున్ = రెల్లువనందు 1 ఉత్ఫుల్ల......ద్యుతియున్ = పుష్పించిన కొండగోఁగువంటి మంచి దేహకాంతి కలవాఁడును.

నాస్థానంబున కరిగి యింద్రునకు నమస్కరించి యాత్మబాణచ్యుతపుష్పరసం
బుల సభాస్థలంబు సంతయు ధూసరవర్ణంబుగాఁ జేయుచు, నింద్రోపదర్శిత
దివ్యాసనంబున భూరిసంజ్ఞాకృతానుజ్ఞుం డై యుపవిష్టుం డగుటయు నాకవిభుండు
కార్యసిద్ధిపరత్వంబునఁ దన వేయికన్నులను బ్రసరింపఁ జేసి యాదరంబునఁ
జూచుటయుఁ దనవిభుం డగు సహస్రాక్షుండు సూచించిన ప్రసాదదృష్టి నల
రుచుఁ బుష్పకోదండుండు వజ్రితో ని ట్లనియె. 613

క. లోకత్రయవీరశ్రీ, ప్రాకటసంవాసభూత • రాజత్కర ల
క్ష్మీకర, దేవ, [1]ప్రతాపా, స్తోకోష్మతిరస్కృతారి•శుంభద్దర్పా. 614

క. జంభాసురలోలాక్షీ, జృంభితమదదర్పహాస•శిథిలీకరణా
రంభానుమోద నిజసం,రంభోద్ధృతపాకదనుజ•రాజచ్ఛౌర్యా. 615

క. సురనాథ! వినుము యుష్మ,త్కరుణాదృష్టులు మదంగ • కలితము లయ్యెం
గరము [2]వరాకుం డగునీ, స్మరుఁ డొనరుపఁ దగినకార్య•సరణి గలిగినన్. 616

క. ఆజ్ఞాపింపుము దేవా!, ప్రజ్ఞాధిక్యమున నెట్టి • పని నైనను స
ర్వజ్ఞ నయిన సాధించెద, విజ్ఞాపన మిదియె నాథ! • విను మిఁకఁ బ్రీతిన్. 617

సీ. సరగున సాధింతు • శక్యంబు గా నిది యైనను గార్యంబు • నమరనాథ!
వెస మోహ మొందింతు • విక్రమంబున విరక్తులఁ దపోనిష్ఠులఁ • గోరి నేను
సన్నద్ధభీకర•చాపుండ నై నవైరాగ్య మెవ్వనికుండు • యోగ్య యోగ
మహిమ నిన్నెవ గవ•మానింతు రెవ్వారు త్వత్స్థానమునగానఁ • దలఁతు రట్టి
తే. యధములను మోహ మొందెడు•నట్లొనర్తుఁ, దావకాస్త్రంబు వజ్రంబు•దర్పఁ డనఁ
జెలఁగు నేను నీ రెండును•గలుగ నీకు, భీతి నొందంగ నేల యో•వృత్రవైరి. [గఁ

క. కులిశము కుంఠం బగుయో,గులయందే నన్న నెంద•కుంఠుం డను నే
యెడలను మద్బాణంబులు, మలఁగును గార్యంబుఁ దీర్చి • మానితతేజా. 619

క. కలుగదు త్రిలోకముల మ,చ్ఛిలీముఖంబులకు నింద్ర! • సిద్ధింపనియే
బెడిదపుఁ బని వినుమింకను, లలనావార్తయును వినక • లలి నైష్ఠికు లై. 620

క. తప మొనరించెడి వారల, తపమును జీకాకుపఱచి • తత్తరమున స్త్రీ
లపనాలోకనపరులను, జపదూషకులుగ నొనర్తు • శక్తిస్ఫురణన్. 621

మ. సురవైరుల్ భుజదర్పరాజితులు న•స్తోకప్రతాపోద్ధతుల్
సురరాజ్యాహరణాదరుల్ గలిగినన్ • శుంభత్ప్రతాపంబునన్

---

1 ప్రతాపో...ద్దర్పా=ప్రతాప మనుగొప్పతపముచేఁ దిరస్కరింపఁబడిన శత్రువులయొక్క గొప్ప దర్పముకలవాఁడా. 2 వరాకుండు= నిష్ప్రయోజకుఁడు.

శరసంధానము మాని యాత్మవనితా♦స్యంబుం దగం గాంచి యా
తురతన్మోహము నొందఁజేసెద రణో♦ద్యోగైకశూన్యాత్ములై. 622

వ. మఱియు [1]నరాళంబునఁ గేళిసంచారచంచురాలోకనపేశలంబును, దేహవీచీస
మాలోలభ్రూవల్లీనర్తనోజ్జ్వలంబును, వక్రవైదగ్ధ్యభణితివ్యక్తీకృతరదచ్ఛదంబు
ను, నీర్ష్యాకలహకోపవిపాటలకపోలభూమియు నయి శఠ! ధూర్త! హతాశ!
యను దుర్భాషణంబులఁ దమనాయకుల నదలింపుచున్న శుద్ధాంతకాంతల
వదనంబుల వీక్షించుచుఁ గామాతురులై యుత్సాహంబును విడిచి నశించు
నట్లొనర్తు నని వెండియు నిట్లనియె. 623

క. పురుహూత నీమనంబునఁ, దరుణిని గవయంగ నిపుడు♦ తలఁచితి వేనిన్
గరువమున నిందచేసిన, తరుణీమణి నైన నీకుఁ♦ దప్పక కూర్తున్. 624

సీ. మదిని పాతివ్రత్య♦మదమునఁ ద్వత్కృత ప్రార్థన నొల్లని♦ ప్రమదనాత్మ
శరజాలపావక♦జ్వాలలఁ బీడించి భవదేకశరణఁగాఁ♦ బౌరుషమున
నొనరింతు నేకార్య♦మున కీవు పంపిన సాధింతు మఱి సిద్ధ♦సాధ్యగుహ్య
కోరగదానవ♦భూరిదేవగరుడ యక్షాదులను సార♦సాక్షు విధిని

తే. సుప్రభావోజ్జ్వలుండనై♦ శోభిలుహరు, మఱియు నింకను గల్గిన♦మానధనులఁ
బూని విడిచిన మద్బాణ♦ములు గలంచుఁ, బ్రతిహతంబులుగా వెందుఁ♦బాకవైరి.

ఆ. సుప్రసాదపిశున♦శుభభవల్లోచన, పంక్తి ననుః గడుఁ ద్వర♦పడు తెఱఁగున
జేయుచున్న దనుచుఁ♦జెలఁగి పల్కెడు పంచ, బాణుఁ గాంచి యనియె♦వజ్రియపుడు.

చ. స్మర! జగదేకవీర! ఘన♦సార! మహోరణశూర! దేవతా
వరఘనకార్యసిద్ధికర♦వైఖరిఁ బల్కిన మాట కెంతయున్
నరగున నాదుమానసము♦ సంతస మందెను లోకసంఘముల్
కరము సుఖించునట్టి పనిఁ♦ గ్రక్కునఁ దెల్పెద దానిఁ జేయుమీ. 627

తే. సారసాకరకోశాళి♦కారయ రవి, గాక స్ఫోటకుఁ డెవ్వండు♦ కలుగు? లోక
కంటకుం డగుతారకు♦ఖండనమున, కీవు దక్క సహాయుఁ డిం♦కెవఁడు మాకు.

క. కడువడి నొక సేనానిని, బడయంగా వలయు నిపుడు♦ పార్వతిని దమిన్
మృడుఁడు వరించినచోఁ గ, ల్గెడుఁ దనయుఁడు; శంకరుండు♦ కేవల నిష్ఠన్. 629

క. ఘోరతపం బొనరించుచు, నారీవార్తయును లేక♦ నారదముఖులన్
గారవమున బోధించుచు, దారుణ వేషంబుతోడఁ♦ దనరుచు నుండున్. 630

క. గిరిజాత తత్సమాగమ, మరయుచుఁ దద్వశగ యగుచు♦ నలరెడు నాపెం

1 అరాళంబునన్ = కుటిలత్వముచేత.

బరశివుఁడు పొందఁజేయుము, స్మర!యిదియే దేవకార్య • సరణి యటంచున్.

ఆ. మఱియుఁ బలికె నిట్లు• మన్మథ! నీవిప్పు, డిట్టికార్య మెంతొ • హితముమెఱయఁ
జేయ దివిజపురముఁ • జెలఁగి రక్షించిన, వాఁడవౌదు వనిన • వజ్రిఁగాంచి. 632

క. సురనాథ మీమహాజ్ఞా, సరణిం జేసెద నటంచు • సత్వరముగ నా
స్మరుఁడు నమస్కారంబులఁ, బురుహూతుని బ్రీతుఁజేయఁ • బొంగెడు కాంక్షన్.

క. హరిహయుఁ డప్పుడు దుష్కర
తరకార్యముఁ జేయుటకును • దగ నూల్కొను నా
స్మరుఁ గౌగిలించెఁ దమిసీ
సరణిని సన్మానమంది • శతముఖువలనన్. 634

క. అనుమతుఁడై పంచాస్త్రుఁడు, చనియెను స్థాణ్వాశ్ర మైక•సరణిని నంతన్
మనమునఁ గులిశనిపాతం,బునబలె భయమంది రతియుఁ • బొగులుచుఁ బలికెన్.

రతిమన్మథుల సంవాదము.

తే. వీరమానిత్వదర్పంబు • గారవమునఁ, బూని యాలోచనముచేయ • కీనికామ
కష్టతరకార్యమున కీవు • కడఁగి తకట!, సర్వమును నాశనం బగు • శార్ఙితనయ.

క. కాతరమనుజులయెడ వి, ఖ్యాతం బగు నీదు శౌర్య • మక్కట! యోగి
వ్రాతేశుం డగునీశుని, చేతస్సును గరఁగఁ జేయఁ• జెల్లునె కడఁకన్. 637

ఉ. అక్కట! [1]తీవ్రయోగజని• తానలదగ్ధజగత్త్రయేశ్వరుం
డెక్కడ? పేశలంబు నయి • హీనబలంబునఁ దూలు స్త్రీలనే
స్రుక్కఁగఁ జేయఁజాలు భుజ•శూరతమాత్రముకల్గినట్టి నీ
వెక్కడ? మానసంబున నొ•కించుక చూడుము ప్రాణనాయకా!. 638

సీ. ప్రజ్వలద్దీప్తాగ్ర•భాగంబును బతంగ మంచితశక్తి భ•క్షించునేని
విషరాశి నొక్కట • వీర్యంబు చెలువార మ్రింగుచు మశకంబు •పొంగునేని
కమలాప్తుఁ బైకొని • గాఢాంధకారంబు సాంద్రంబుగాఁ బర్వఁ • జాలునేని
పంచాస్యనికరంబుఁ• బాఱఁదోలెడు శక్తి మదగజేంద్రంబులు • మలఁగునేని

తే. సుప్రభావోగ్రుఁడై యొప్పు • శూలియందు
నపుడు నీశక్తిసార్థకం • బగును జుమ్ము
ఎఱుఁగ కేటికి నిట్టు ల•య్యింద్రుమాట
విని విజృంభించి చెడెదవు • వెఱ్ఱిబుద్ధి. 639

---

1 తీవ్ర...శ్వరుండు=భయంకర మగుయోగమునఁ బుట్టిన యగ్నిచేఁ గాల్పఁబడిన ముల్లోకములు కలిగిన శంకరుండు.

క. నిరుపమ శౌర్యస్ఫూర్తిం, బరఁగిన యంధకుని కన్నఁ ♦ బరిపంథిభయం
కరము లయి వెలయు రాక్షస, పురములు మూఁడింటికన్నఁ ♦ బూర్ణబలుఁడవే.

తే. మాఱు లేనట్టిదియు స్వాత్మ♦మాత్ర నాశ
కమగు వ్యవసాయమును బూనఁ ♦ గడఁగెదేల ?
వజ్రి మోహింపఁజేయ నీ♦పనికిఁ జనుట
శలభ మగ్నిపైఁ బోయెడు ♦ చందమె సుమి. 641

మ. త్రిదశుల్ ధూర్తులు స్వీయకార్యపరు లెం♦తే దుష్టబుద్ధుల్ మహా
మదు లుద్వృత్తులు సాధుబుద్ధి నిను బ♦ల్మాఱుల్ నుతుల్ చేసి యి
ట్లదయన్ సంకటకార్యతత్పరుని జే♦యంజాలి రే మందు నా
మది శోకాబ్ధినిమగ్నమై కలఁగెడిన్ ♦ మన్నింపు నామాటలన్. 642

మ. సుర లిట్లీపనికి న్నినుం బనుచుటల్ ♦ చూడంగ దుష్టోరగో
త్కరముం జంపఁగ యాచకుం బనుచు చం♦దంబున్ [1]నదీపూరని
ర్భరనీచక్షితి నన్యపుత్రి నరయం ♦ బ్రార్థించు చందంబు నో
[2]హారి ! నీవంతము నొంద నేమి చెడు నా♦యాదిత్యవర్యాళికిన్. 643

తే. నేనె వైధవ్యదుఃఖంబు ♦ నీదుమృతిని
బొగులు చెంతయుఁ గష్టంబుఁ ♦ బొందవలయుఁ
గష్ట మతికష్ట మత్యంత♦కష్ట మిట్లు
దేవదేవునిఁ జెనకంగఁ ♦ దివురు టరయ. 644

క. అని యుక్తియుక్తముగ న,వ్వనిత వచింపంగ వినియుఁ ♦ బ్రద్యుమ్నుఁడు వీ
రునిపగిదిఁ బల్కె రతితో, మనమునఁ గల సంశయంబు♦ మాటు పఱచుచున్.

ఆ. ఓసి! పాపబుద్ధి! ♦ యొడ లెఱుంగక యేమి
ప్రేలి తివుడు నాకు ♦ విషగళుండు
దుర్జయుండె మాని ♦ ధూర్జటుల్ మద్బాణ
పాతుల మూర్ఛనొంది ♦ రది యెఱుఁగవె ?. 646

సీ. స్వాధీనచిత్తుఁడై ♦ వఱలు వసిష్ఠుండు ఫుల్కసాంగనను మున్ ♦ పొందలేదె
[3]సన్మార్గవర్తియా ♦ శశధరుండును బ్రేమ గురుకళత్రంబుతోఁ ♦ గూడలేదె
మహనీయచరితుఁడౌ ♦ మాధవుం డెంతయు గోపభామారతిఁ ♦ గోరలేదె

1 నదీపూర...క్షితిన్=నదీప్రవాహమునందు లోఁతైన క్రిందిభూమిని. 2 హారి=ఇది సంతాపార్థబోధకము. 3 సన్మార్గవర్తి=మంచిమార్గమునఁ దిరుగువాఁడును, నక్షత్రమార్గమునం దుఁ జరించువాఁడును.

లోకాళిఁ బాలించు ♦ పాకశాసనుఁడు గౌతమునిపత్నిని గూడఁ ♦ దలఁపలేదె

తే. మున్ను దండకభూపతి ♦ మునితనూజఁ
బొందఁడే రవి మద్బాణ♦ములకుఁ జిక్కి
నైచ్యముగ బడబారోహ♦ణంబు చేయ
లేదె బ్రహ్మయుఁ దనకూఁతు ♦ లీలఁ గొనఁడె. 647

ఉ. వానరవంశముఖ్యుఁ డగు ♦ వాలి గ్రహింపఁడె భ్రాతృభామినిన్
జ్ఞానమహాబ్ధి బ్రహ్మకుల♦జాతుఁడు నా దశకంధరుండు మ
త్సూనశరవ్రజంబులను ♦ సొక్కి రఘూద్వహుపత్నిఁ గోరి య
మ్మానవతిన్ హరింపఁడొకో ♦ మానిని! వీరిని మున్నెఱుంగవే. 648

తే. నాదుసుమశర నిహతులై ♦ నరు లనేకు
లాత్మ మర్యాదలను వీడి ♦ యతివలందుఁ
దగిలి యనురాగరసమునఁ ♦ దలఁపరాని
కష్టములఁ బొందరే నీవు ♦ కాంచలేదె. 649

తే. ఇట్టియుద్ధతదోశ్శక్తి ♦ నెసఁగు నన్ను, శూలికోటులు చెనకంగఁ ♦ జాల రబల!
వ్యర్థముగ భీతి నొందంగ ♦ వలదు నాకుఁ, గలుగునే యపజయమెట్టి♦కడలనైన.

మ. కలలోనైన మదుగ్రశింజినికి భం♦గం బుండునే యేలొకో
లలనా భీతిలనంచు దర్పమునఁ బ♦ల్మాఱుల్ దగం బల్కి తొ
య్యలి సందేహము వాపి హస్తమున నొ♦య్యారంబునన్ భీతియు
క్తలతాంగీ పరదేహముం దడవి ని♦స్తంద్రప్రతాపంబునన్. 651

ఆ. చెంతనుండి నీతి ♦ చెప్పు వసంతుని, వీరభాషణముల ♦ భూరిభీతుఁ
గాఁగఁ జేసి యంతఁ ♦ గందర్పవీరుండు, నీశుతపముఁ జెఱుప ♦ నెంచి కడఁక.

ఉ. బద్ధవిరోధియై మధుప♦వారమయం బగు మౌర్విఁ జూచి య
త్యుద్ధత చంద్రచూడ బహు♦ళోగ్ర తపంబును మాన్ప వేడ్క స
న్నద్ధము చేసి పుష్పమయ ♦ నైజశరాసనమందుఁ గూర్చి సం
సిద్ధశరాసనుండు నయి ♦ శింజినిమ్రోయఁగఁ జేసె వ్రేల్మిడిన్. 653

తే. అరవము రతి సౌఖ్యవి♦స్ఫారమూర్ఛి, తాంగనామణితస్వాన ♦ మట్లు చెలఁగె
నంత దోస్స్ఫాలనము చేసె♦ వింత గాఁగఁ, బెక్కుసారులు మారుండు♦విక్రమమున.

వ. ఇట్లప్రతిహతవిక్రముం డగుపంచాస్త్రుండు గర్వాంధుండై సకలనిర్జరవరకిరీట
మాణిక్యకాంతి సమ్మిళిత పాదనఖరప్రభాభాసమానుండును, వేదవినుతుండును,
వేదాంతగమ్యుండును, ధైర్యవారాశియు, స్త్రీమాత్రవార్తావిదూరుండును,

నిష్ఠాగరిష్ఠుండును, నగు మహేశ్వరుని జయింప నెంచి యహంకారదిగంతంబు నొంది చని చని ముందుఁ గుసుమలతావితాలమనోహరంబు నై కైలాసపాద నికటస్థితంబగు స్థాణ్వాశ్రమంబును గాంచి దర్పసవిస్మాలితేక్షణుం డగుచుఁ దపోవనంబును బ్రవేశించి యనంతరంబ. 655

స్థాణ్వాశ్రమమున వసంతుఁడు విజృంభించుట.

ఆ. మిత్రతమ! వసంత! మృడతపోభంగంబుఁ, జేయవలయుఁ గానఁ జిత్రగతుల
నసమయంబ యైన వెస విజృంభింపుమీ, యనుచు నాజ్ఞ చేసె నభిహితముగ.

క. మరునాజ్ఞ నవ్వసంతుఁడు, హరవాసం బైనస్థాణు నాశ్రమమున భూ
మిరుహంబులయం దెల్లెడఁ, గరము విజృంభించెఁ బ్రకృతి కరణిఁ జెలఁగుచున్.

సీ. [1]భ్రష్టపాండురపత్త్రిబహుల తాకుంజముల్ శ్యామలరోచు లై యలరెనపుడు
పాండుపత్త్రింబులు పడిపోయి నూతన పల్లవాంకురములు ప్రబలకుండఁ
గాండశేషంబు లై క్రాలె వీరుత్తతుల్ త్యక్తభూషాంగనాతతులమాడ్కి
నీషత్ప్రివాళంబు లెసఁగ వీరుత్తులు [2]వనరమామధుసంగమునను బులకి
తే. తంబు లట్లుగ రాజిల్లెఁ దగనికాల
మందు వెలయు వసంతుని నొంది యక్ర
మముగ నున్మేషతను బొంది మహితపుష్ప
పల్లవంబులఁ జెలువారెఁ బాదపములు. 658

తే. ఆవసంతుఁడు వని నవ్వు దలర నాదిఁ
బల్లవోద్భేద మామీఁద నుల్లమలరఁ
జేయు కుట్మలమంజరుల్ సెలఁగు క్రమము
తప్పిపోవుట చూడఁ జిత్రముగఁ దోఁచె. 659

చ. మరుఁ డనురాజు నాజ్ఞక్షణమాత్రమునన్ మధువయ్యరణ్యముం
గరము సుపల్లవంబులును గల్గి మనోహర యౌవనంబు నొం
ద రమణఁ జేసె; నంతటను దద్దయు నొప్పు ప్రవాళయుక్తి వై
ఖరిని నశోకముల్ మదను [3]కర్ణిరథంబులు పోలె భాసిలెన్. 660

తే. ప్రజ్వలన్మారశౌర్యాగ్ని వర్ధమాన, ధూమతతిపోలె లేచి మధువ్రతాళి
యంతరాళంబునందున నలరుచుండి, వెలుఁగుచుండె నశోకంబు విడువ కపుడు.

1 భ్రష్ట...జముల్=పడిపోయిన పండుటాకులుగల యనేకలతాగృహములు. 2 వన...మునను=వనలక్ష్మియొక్కయు వసంతునియొక్కయు సంబంధముచేత. 3 కర్ణిరథంబులు=విలాసార్థముగా నిర్మింపఁబడిన చిన్నరథములు.

క. [1]అనపేక్షితగౌరాంగీ, జనపదయుగతాడనములఁ • జనుకంకేళుల్
వనినార్ద్రిపల్లవంబుల, మునుకొని పోషించె [2]మారు • ముదలను గడఁకన్. 662

సీ. లలితరక్తాశోక • లక్ష్యంబుచే రాగమను పావకునియందు • నలరి యిక్షు
కార్ముకుండు విరక్తి • గాఢ మనోహవ్యమును వేల్చెఁ బ్రీతిచే • భూరివనర
మాభవ్యనవరత్న • మహితసౌధచమత్కృతి నశోకభూజముల్ • దివ్యకిసల
యోద్దామకములౌచు • నొప్పె; విదగ్ధయోషా[3]సీధుగండూష • సతతసేక

తే. సంపదనుమించునటువంటి • సరణి[4]వకుళ, పాదపంబులు నామూల • వరసుమోజ్వ
లంబులై యొప్పెవనమున • లక్ష్మివేడ్క, వనవిహారంబుజేసెను • భంగితోఁచె.

తే. సరస[5]కేసరవృక్షమం • జరి వహించెఁ, గడఁకఁ బ్రత్యగ్రమదిరాత్త • గంధభస్త్రి
కాసముద్గమమార్ద్వీక • మప్పుడెలమిఁ, జూచు ఖేచరులెల్లను • జోద్యమంద.

తే. వకుళ నిష్యందమకరంద • పానమత్త, బహుళపర్యస్తచేతన • భవ్యనినద
యైన మధుకరభామిని • యతుల సమ్మదంబు ధరియించెనపుడువ • నంబునందు.

తే. మందవాయువిచారసం • స్పందమాన, లైన వనలక్ష్ము లెల్లెడ • నప్పుడు మధు
చారుసంపర్క మొందుచు • భూరిమత్త, తనువహించినచందానఁ • దనరిరెలమి.

తే. చెలఁగుచున్నట్టి షట్పద • స్త్రీలకెల్ల, సతతమాపానగోష్ఠి[6]చ • షకములైన [ను.
వకుళభూరుహపుష్పముల్ • వనమునందుఁ, బొందెను వికాససంపదఁ • బూర్ణముగ

క. వరచూతభూజశాఖో, త్కరములపై నెక్కి పికని • కాయము ప్రీతిన్
సురుచిరపంచమరాగం, బరుదుగ నెలుగెత్తి పాడె • నాసమయమునన్. 668

చ. నిరుపమయోగమూని యతి • నిర్మల చిత్తమునం జెలంగు నా
హరుని జయింపఁబోవు కుసు • మాస్త్రుని యాత్రకుఁ బైకవాణి సుం
దర శుభ[7]కాహళీరుచిర • తం జెలఁగెన్ భటు లట్లనొప్పె ని
ర్భరమలయానిలోచ్చలిత • పల్లవశస్త్రరసాలముల్ వనిన్. 669

తే. ఆమ్రసుమధూళిపాళియో • య్యన నభంబు
నందుఁ జెలువారెఁ జండీశు • నని జయింప
బరవసంబునఁ బోవు ద • ర్పకుని సైన్య
వారధూళీకదంబంబు • భంగి నపుడు. 670

---

1 అనపేక్షి...ములన్=కోరఁబడని స్త్రీజనముల పాదయుగ్మము తన్నులచేత. 2 మారుముదలను=మన్మథుని యాజ్ఞచేత. 3 సీధు=మద్యము. 4 వకుళపాదపంబులు=పొగడచెట్లు. 5 కేసరవృక్షమంజరి=నాగకేసరవృక్షపుఁ బూవుగుత్తి. 6 చషకములు=పానపాత్రలు. 7 కాహళి=ఒకానొకవాద్యము.

క. స్మరునకు రాజ్యం బిప్పుడు, సురుచిరగతిఁ ద్రిభువనములు ♦ శోభిల్లె ననన్
స్మరకీర్తికాహళస్వ, చ్ఛరవోపమ పికరవములు ♦ సాంద్రతఁ బరఁగెన్. 671

క. వనమునఁ [1]జంపక యష్టులు, ఘనసుమనోగుచ్ఛపీన ♦ గాఢమనోజ్ఞ
స్తనసన్నమితభామలవలె, ననయము పోషించెఁ గాంతి ♦ నక్కాలమునన్. 672

చ. అరసి ప్రియాళిపుష్ప మది ♦ రాయత మత్తత భృంగభామినుల్
స్మరజయయాత్రసిద్ధికయి ♦ చారుతరంబుగఁ బాడె నంత భీ
కరపికరావముల్ మధుప ♦ కాంతలఝుంకృతులుం గఠోరశం
బర రిపు చాపటంకృతులు ♦ పర్వి జగంబును శబ్దరూపమై
పరఁగఁగఁ జేసె నొక్కట మొగి ♦ భవ్యము నై వనమెల్ల భాసిలెన్. 673

సీ. భువిని చేతనములౌ ♦ భూరుహంబులు మధుయుక్తి దర్పితములై ♦ యొప్పిగుచ్ఛ
వక్షోరుహానత ♦ వల్లులై వనితలసాటి నొప్పెను; మఱి ♦ శాఖు లపుడు
మున్నున్నరూపంబు ♦ కన్న వేఱొకరూపమున నలంకృతములై ♦ వనమునందుఁ
గామపేశలులైన ♦ కాముకు లట్టులఁ గడు నలంకృతములై ♦ క్రాలె; సకల
ఆ. జంతుచిత్తములకుఁ ♦ జాల మదంబును, వృద్ధిచేయు మధువు ♦ వే సమగ్ర
జృంభణంబు నొందఁ ♦ జిత్రంబుగఁ దపోవ,నంబు మెఱసె నపుడు ♦ నవ్యభంగి.

సీ. ప్రతిపర్వతమునందు ♦ భాసిల్లె వల్లులు ప్రతివల్లియందును ♦ వరసుమాళి
ప్రతిసుమంబున [2]శీధు ♦ రత్నాకరంబులు ప్రతిశీధువున సౌర ♦ భచ్ఛటలును
బ్రతిసౌరభము నభృం ♦ గతరుణీనాట్యముల్ ప్రతిభృంగియందుఁ గ్ర ♦ మస్వనంబు
ప్రతినిస్వనంబున ♦ వితతలయశ్రీలు ప్రతిలయయందు స్త్రీ ♦ మతులు సొక్కఁ
బ్రతివధూమణియందు ♦ రాగవృత్త్యభివృద్ధి ప్రతిరాగమున మారు ♦ బాహుకేళి
తే. మఱియుఁ బ్రతిభుజకేళిని ♦ మధుసుగీత, మలరు ప్రతి గీతమందును ♦ జెలఁగు నలరుఁ
బోండ్ల డోలావిహారముల్ ♦ పొసఁగ నపుడు, క్రీడచేసెను వనలక్ష్మి ♦ కూడి చెలుల.

సీ. ప్రజ్వలించినమాడ్కిఁ ♦ బరఁగఁ గంకేళులు హుంకరించినరీతి ♦ నొప్పఁ బికము
గానంబు చేసిన ♦ కరణిఁ దేఁటులు దగఘూర్ణించి నటు గాలి ♦ కొమరు మిగుల
నాకాశ మెగిరిన ♦ యట్లుగాఁ గన్పడఁ బూలు తేనె కురియు ♦ పోల్కిఁ దనరఁ
జెట్లు నాట్యంబులు ♦ చేయునట్టులు తోఁప వావిలి నవ్విన ♦ పగిది మెఱయఁ
బ్రౌఢాతపస్విన్నత ♦ వలెను జంపక యష్టి పుష్పించి సొంపుగఁ ♦ బొలుపుమీఱఁ
ఆ. బూచి కొండగోఁగు ♦ పూన్కిఁ బీతాంబర, ధారి యట్ల చెలఁగఁ ♦ జారుభంగిఁ

1 చంపక యష్టులు=సంపెఁగచెట్టుకొమ్మలు. 2 శీధురత్నాకరంబులు=పక్వమైనయిక్షురసముతోఁ జేసిన మద్యసముద్రములు.

బ్రియనఖక్షతాళి • రీతిఁ [1]బింగళపాళి, యొప్పరఁగా వసంతుఁ • డప్పుడు తనరెఁ. 676

వ. ఇట్లు వసంతుఁ డనంతనిజాకారంబులఁ బొల్చి విజృంభింప నవ్విజృంభణంబున సమస్తజంతువులు ప్రమత్తులవలె నొప్ప శృంగారోత్తమరూపంబున వసంతుం డొప్పె. అత్తఱి నందందు జెలంగు తపోధను లెల్లఁ బెల్లుగ మధుసంరంభ సంపదల [2]నకాండంబుగ నస్వతంత్రస్వాంతులై యకారణరాగకల్లోలవికృతి నొంది జగంబంతయు స్త్రీమయంబుగాఁ జూచుచు నిటునటు సంచలించుచు నీశ్వరభీతితు లయ్యుఁ జంచలమానసులై కిన్నరీగానంబులకుఁ జెవు లొగ్గిరి. మఱియు స్వప్నంబుననైన వనితావార్తయందుఁ బరాఙ్ముఖం బగు నమ్ముని మానసంబును వసంతుం డున్మాదంబు నొందించె. స్త్రీధ్యానధారలచే గళితంబై మునినియమంబు నష్టం బయ్యె. సమాధినియమంబుఁ బాడయ్యె. అంత స్థాణ్వాశ్రమంబున నున్న ప్రమథగణంబులు మదోద్ధతులై వసంతపుష్పసంభారంబు నాఘ్రాణింపుచు, నాట్యంబులు సేయుచుఁ బాడుచు నితరేతరవాక్యప్రతివాక్యంబులఁ జెలంగి యీశ్వరవరశాసనంబును మఱచి స్వేచ్ఛాచారపరాయణులై నానావిధ సుమధూళిపాళిచే భస్మానులేపనంబు నొనరించుచు, మధుమత్తులై నాట్యంబు సల్పిరి. మఱియును [3]స్వేదజజారాయుజౌద్భిజ్జాండజజాలంబంతయు మదమత్తం బయ్యె. ఇట్లున్మాదంబున విజృంభించు ప్రమథగణంబుల నవలోకించి దురాచారపరాయణులై విగతభయులగుట కెంతయుఁ జింతించి కట్టా! యిట్టిచాపల్యం బకారణంబ యెట్లుకలిగె. జగదధీశ్వరుం డగు శంకరుండు సంయమైకపరాయణుండై వికారరహితుండై యాత్మచే నాత్మను జూచుచు సమాధియం దున్నవాఁడు. నిష్కంపయోగ సంపన్నుండును, నిరస్తాశేషవాసనుండును నగుమహాదేవుని తపంబునకు విఘ్నం బొనరింప నెవరేని దుర్మతులు గడంగి ప్రమథగణంబులఁ బరస్పరవ్యర్థోత్తరంబులను గానొనరించి శివాస్వాధీనులం గావించిరని యెంచి నందీశ్వరుం డాగ్రహించి నాసాగ్రన్యస్తతర్జనంబుల నదల్చిన హుంకారగర్భవక్త్రుండును, భ్రుకుటీకుటిలభ్రూయుగళుండును నగునతని యాజ్ఞను నెఱప సమకట్టి ప్రమథవరు లెల్ల యథాపూర్వంబుగాఁ జరించిరి. అంత నాతని హుంకారంబున బ్రమథగణంబులే కాక తపోవనం బంతయు నిష్కళంకం బయ్యె వృక్షంబొక్కటియుఁ

---

1 పింగళపాళి=కుఱువేఱు. 2 అకాండంబుగన్=కారణములేకయే 3 స్వేదజ...జాలంబు=స్వేదజ=చెమటవలనఁ బుట్టినది, జారాయుజ=మావివలనఁ బుట్టినజంతువులు. ఔద్భిజ్జ=చెట్లు మొదలవి. అండజజాలము=చేఁపలు మొదలగువానిగుంపు.

గదలకుండె. పరభృద్గణంబులు ముద్రితాననంబు లై మూకతనొందె. అటు నిటుసంచరించు మృగంబులు నిష్కంపితంబులయ్యె. మందమారుతస్పందనంబున వల్లీతతులు చాపల్యంబును మానుకొనియె. శంకరప్రధానకింకరుండగునందీశ్వరుని యాజ్ఞచేఁ జిత్రార్పితమ ట్లరణ్యంబంతయుఁ దూష్ణీభావంబు నొందె.అంత మధుపూరితం బగువనంబున మత్తచిత్తంబులఁ గొందఱుక్రీడింప దేహచాపల్యంబున విజృంభింప మన్మథానలంబు ప్రదీపింప నాసమయంబున స్థాణ్వాశ్రమంబున. 677

మన్మథుఁడు స్థాణ్వాశ్రమమును బ్రవేశించుట.

మ. హరిణాక్షీయుతిదర్పమంథరగతిన్ • హస్త్యద్యమం బొప్పఁగా
స్మరుఁ డంతం బ్రతికుంజమందుఁ గడుఁ బ్ర•చ్ఛన్నుండు నై పూని త
స్కరుచందంబున నీశుఁగెల్వ నవకా•శంబు న్విలోకించుచున్
గిరిశానేకభటాక్షివంచనమునం • గృత్యంబు గావింపఁగన్. 678

ఆ. మమతనెంచి యపుడె•[1]మాధవీకుంజంబుఁ, జేరనెడమకన్ను•చిత్తజునకు
నదరె మరల మరల•నది దుర్నిమిత్తంబు, గాఁ దలంచి శంకఁ • గళవళించె. 679

వ. అంత. 680

తే. రతికి [2]సాధ్వసతరళతా•రకము దక్షి, ణాక్షి మాటికిమాటికి • ననిలనిహత
పంకజముమాడ్కి నదరె న•భ్భంగినెఱిఁగి, సంశయాకులయయ్యె నా• సారసాక్షి.

క. దానికి మదిలోఁదలఁకక, సూనాస్త్రుఁడు చొరవఁ దగని • చొప్పునఁ బత్త్రి
నూననిబద్ధము సాంద్రము, నౌ నొక గురువిందపొదను • నటఁ గనుఁగొనియెన్.

వ. కాంచి యానికుంజంబును బ్రవేశించి తత్పురోభాగంబున. 683

సమాధియందున్న పరమేశ్వరుస్వరూపవర్ణనము.

తే. వ్యాఘ్రచర్మావకుంఠిత•వర[3]నమేరు, మూలధిష్ణ్యపరిస్థిత•మూర్తిఁ బ్రజ్వ
లిత హుతాశనుభంగి ని•ర్లిప్తతేజుఁ, డైన చండాంశుఁడునుబోలె • నలరువాని.

చ. అలరుతరంగహీనమగు • నంబుధిపోల్కిన వాత సంహతా
మలతర దీపమ ట్లతుల • మానిత తేజముచేతఁ బొల్చి ని
ర్మలగతి నింద్రియంబుల వి•రాజితయోగమునం బ్రసారణా
కులములు గాక యుండఁగను • గూఢముగా బిగఁగట్టిపూన్కిచేన్. 685

తే. ఇంద్రియద్వారసంతతి • నెల్ల నట్టె, వేగబంధించి సంరుద్ధ•వృత్తిచిత్తు

---

1 మాధవీకుంజంబున్ = పువ్వులగురివెందపొదను. 2 సాధ్వసతరళతారకము=భయముచేఁ జలించుచున్న కనుపాఁపగల. 3 నమేరు=పొన్న చెట్టు.

బద్ధపద్మాసనుని ననిరుద్ధయోగు, నంకవిన్యస్తకరయుగు హరునిఁ బరుని. 686

సీ. ద్విగుణాక్షమాలిక సొగసుగాఁ గర్ణభాగమున వహించి భస్మమున సర్వ
తనువు చెలంగఁగా దండశూకాయతపర్యంకబంధనప్రౌఢి మెఱయఁ
గ్రాలి యపూజ్యుల కనుదోయిఁ బడక దుష్టాంతరంగుల కదృశ్యత వహించి
కుమతుల [1]కప్రతర్క్యుండు నై కాయహృద్వాగగోచరుఁడు నై వఱలువాని

తే. వేదరాసులచేతను వెతకఁబడుచు, జగదతీతుఁడు దివ్యతేజస్సమూహ
మును సుషుమ్నాఖ్యనాడీస్థభూరికాంతి, రేఖఁ జూచెడువానినామృడునిహరుని.

క. చిన్మాత్రశేషుశాంతుని, సన్మానితు నద్వయాత్ము సర్వాత్ముని నే
తన్మాత్రుఁ డనివచింపఁగ, నన్మహి నవకాశమిడని నాకేశవిభున్. 688

వ. మఱియు నచింత్యుండు నహమ్మానవివర్జితుండు నై [2]యహంతేదంతంబుల నైక్యము నాత్మయం దనుభవించుచు యుగపత్ప్రోత్థితానేకసహస్రాంశుసమానమగు దేహతేజస్సంహతిచే విష్టపత్రయంబును బానముచేయునట్లు చెలంగుచు, నాకసము శోషింపఁజేయునట్లును, శత్రువులఁ జూర్ణ మొనరించునట్లును మెఱయుచు, ధైర్యత్యాగకథామాత్రవిరహితుం డై నిశ్చలాకారుండును, బ్రహ్మరంధ్రసముద్భూతజ్యోతిఃప్లుష్టనిశాకరుండును నగుమహేశ్వరుం గాంచి మఱియు నమ్మన్మథుండు. 689

సీ. ప్రళయార్కబింబంబుపగిది క్రూరంబును గాంతంబు నౌ ముఖకమల మమర
స్వానందభూర్యభ్రమ్మందునఁ బలుమఱు లబ్ధైక్యమట్లు లుల్లసదనూన
[3]తేజోధనంజయదీప్తులచే విశ్వమంతయుఁ గాల్చి స్వీయమగుచున్న
సర్వేశ్వరత్వంబు స్పష్టము చేయంగ మది నెంచి యున్నట్టి మూఁడ్కి మీఁద.

తే. మీఁద వర్ధిల్లు యోగసమృద్ధవహ్ని
శిఖలు వెలయ విరక్తత చెలఁగుచుండ
స్వాయతద్యుతిజగముల నస్వతంత్ర
ములుగ నొనరించు నత్యుగ్రమూర్తి హరుని. 690

వ. అన్యథాకృతకాననంబులును, మోహితాశేషచేతస్సులును, మధురంబులును నగుమధుసంరంభంబుల నస్పృష్టనిజప్రక్రముం డై మెఱయుచు మఱియు.

తే. శాంతులందును శాంతుఁ డత్యంతభీమ, కాళిభీషణుఁ డై యొప్పు నట్టివాని
వెస గభీరులలోన గంభీరుఁ డగుచు, నన్యసంప్రాప్తిహీనక్రియాత్ముఁ డగుచు.

---

1 అప్రతర్క్యుఁడు=ఊహింప సాధ్యుఁడుకానివాఁడు. 2 అహంతేదంతంబులను=నేను ఇది యనెడువానికి. 3 తేజోధనంజయదీప్తులచేత=తేజస్సనెడి యగ్నికాంతులచేత.

మ. ఇతరాగోచరమామహామహిమచే ♦ నెంతేని భాసిల్లి య
[1]ట్లితరాధర్షిత సంయముం డగుచు హృ♦ద్దృష్టిం దనుం దానె చూ
చి తగన్ శాంతమునూని ప్రజ్వరిలు నా♦ శ్రీకంఠునిం గాంచె జిం
తితకార్యుం డగుమన్మథుండు భయతం♦ద్రీభూతసర్వాంగుఁ డై. 693

రతిమన్మథు లీశ్వరదర్శనంబున వివశు లగుట.

ఆ. కాంచి యమ్మహేశుఁ ♦ గడు భయోద్విగ్నుఁ డై
త్రాసజనితపులక♦తతులు దనర
వేపమానదేహుఁ♦డై పడంపడి యేమి
చేయఁ దోఁచ కతఁడు ♦ చింతనొంది. 694

క. నాలుక నీరసమై తగఁ, గ్రాలెడు ధైర్యంబు చెడిన♦కతన నిజాంగం
బాలోల మగుటచే బా,హాలత వలనన్ ధనుస్సు ♦ నవనింబడినన్. 695

క. తలఁపక నిజబల మియ్యెడ, కలరుచు వచ్చితి నటంచు ♦ నతఁ డెంతయు లో
పలనిముడని భయమునగతఁ,బలుఁడై చ్యుతచాపుఁ డగుచుఁ♦బలుమఱువగచెన్.

చ. హరుని మునీంద్రవందితు మ♦హామతివేగ జయింపఁబూను పా
పరతిదృఢంబునై చెలఁగు ♦ పాశముఁబోలి కడంకఁ గట్టి న
ట్లురుదుగఁ గంపితాంగుఁడయి ♦ హర్షము ధైర్యము లేమి స్తంభమై
పరఁగిన మానసంబున న♦పారము నొవ్యథ తొంకలింపఁగన్. 697

తే. త్రాసమూర్ఛితుఁ డై మహా♦భాసమాన
సంయముని శంకరునిగాంచి ♦ నరగఁ బంక
పతితుఁ డైనట్లు పవిచేత ♦ బహుళతాడ
నంబు లొందిన యట్టి చం♦దమున మఱియు. 698

క. హరు ఘోరతపంబున ని,ర్భరతాపము నొందినట్లు ♦ పల్మాఱు దనుం
బరమార్తునిగాఁ దలఁచుచు, స్మరుఁ డప్పుడె విగతపౌరు♦షంబునఁ బొదలెన్.

తే. మంగలమునందు నూగింజ♦మాడ్కి మిగుల
విహ్వలత నొంది విగళిత♦విపుల దర్పుఁ
డగుచు వీరోక్తులను మాని ♦ యట్లె యుద్ధ
కాంక్ష విడనాడి జిష్ణువా♦క్యంబు మఱచి. 700

తే. ప్రాణమాత్రావశేషుఁ డై ♦ పంచశరుఁడు
నిర్వికల్పసమాధి ని♦ర్నిద్రుఁబోలి

1 ఇతరాధర్షితసంయముండు=పైవారిచేఁ బోఁగొట్టఁబడని యాచారముకలవాఁడు.

యుం డెరతియును మును మున్నె • చండభీతి
చేత విహ్వలితాత్మయ•చిత్త యగుచు. 701

చ. స్మరుఁ డొనరించుసాహసము • మాటికి నెంచి తలంచుచున్ మనో
హరుఁ గని బాష్పపూరముల • నార్తినినించును నేమిచేయఁగా
నరయఁగ లేమి నూరుపుల • నంగము దూలఁ దపించుచున్ మహే
శ్వరకరిణేక్షణాళిఁబడి • భర్త నశింపక యుండఁగోరుచున్. 702

తే. కాయవాగ్ధిషణాపూర్వ•కంబుగాఁగ
భర్త విజయంబు నొందఁగా • వలయు ననుచుఁ
గాంక్ష నొందుచు శంకాగ్ని•కలితవోలె
నార్తి నొందుచుఁ బొగులుచు • నలసి యలసి. 703

తే. [1]త్రాసవేపథువిక్షిప్త•భాసమానగూఢమౌక్తికహారవ•క్షోజ యగుచుఁ
గామపత్నియు నిష్ఠచేఁ•గ్రాలు శంభు, వదనమీక్షించి స్తంభంబు•భఁగినుండె.

క. ఈరీతి నాసతీపతు, లారమ్యనికుంజమందు • హరు యోగపరున్
బీరమునఁ గెలువఁగోరుచు, భూరితపం బెన్ని భీతిఁ • బొగలుచు నుండన్.

పార్వతీవర్ణనము.

ఉ. భీతియుతిం బ్రణష్టనిజ • వీర్యమనోభవు పూన్కి కండఁగా
న్వాతతకాంతిపుంజములు • హారిగతిం జెలువారుచుండ నా
శీతగిరీంద్రపుత్త్రి హరి•సేవకునై చనుదెంచెఁ జిత్తజుం
డాతఱి సంతసిల్లి తన • కభ్యుదయం బగునంచుఁ బొంగఁగన్. 706

తే. రమణతనుకాంతిశృంగార•రసముఁ బిదుక
నలరి వాసంతసుమమాలి • కాత్యలంకృ
తతనులత యయి సుమశరు • వితతరాజ్య
లక్ష్మివలె నొప్పెఁ బార్వతి • లలితగతుల. 707

క. గతవీర్యుం డగుసుమశరుఁ, డతులితనిజశౌర్య మింక • ననువొందఁగ వృ
ద్ధిత నొందు ననుచుఁ దలఁచెను, సతిదివ్యతనూవిలాస•సరణిం గనుచున్. 708

తే. ధరణివిచ్యుతచాపంబు • దర్పకుండు, మరల సన్నద్ధుఁడై కొని • పురహరైక
విజయకాంక్షను జెలఁగెన•వ్వేళఁ దిఁ జూడఁ, దరళదృక్శౌర్యసంపదల్•దనరె మరల.

క. గిరిజయు మధుసంపన్నము, సురుచిరకాంతికము నైన • సుమమాలికఁ దా

1 త్రాసవేప...క్షోజ= భయకంపములచే నెగురఁగొట్టఁబడినవియు, మెఱయుచున్నవియు, ఁగియున్నవియు నగు ముక్తికహారములు గల పాలిండ్లు కలది.

ల్చి రమణఁ జెలంగె నెంతయు, నురుతర మగు రాజ్యలక్ష్మి • యొప్పమరంగన్.
తే. మాలతీదివ్యకుసుమౌఘ•మాలికాభి, వేష్టితంబును సౌరభ•విపులతరము
నైన హిమశైలపుత్త్రికా • [1]మానితాల, కస్తబక మప్పు డొప్పె ని•కామకాంతి.
తే. మగువచూర్ణాలకములందు • మమతఁ దాల్చు
[2]సిందువారంపు మొగ్గలు • సుందరముగఁ
జూచువారల చిత్తముల్ • చోద్యమంద
నలరె మౌక్తికజాలంబు • నట్టు లపుడు. 712
తే. క్రాలెఁ [3]గంకేళిసుమపత్త్రి•కంబురీతి, నవ్యకాశ్మీరపాటల• భవ్యమైన
రమణి సిందూరతిలకంబు•సుమహితంబు, ఫాలభాగంబునందునఁ•బ్రభలు చెలఁగ.
సీ. అంతరభ్రాంతభృం•గావళిపరభాగమంజుళంబయి తగు • మాలతీకు
సుమగుచ్ఛవరమును • శోభిలు కర్ణావతంసంబుగా దాల్చెఁ • దరళనేత్ర
మఱియు నశోకసు•మస్తబకచ్యుతగండధూళ్యోఘమ•కాండమద్య
రాగ సౌభాగ్యంబు • రంజిల్లఁగాఁ జేసె, మధుపుష్పసౌరభ్య • మహిమ నెల్ల
ఆ. ధిక్కరించి స్వీయ • దివ్య నిశ్వాససైక, గంధలోలత నళి•గణము మూఁగ
భాసమాన యగుచు•[4]భ్రమరకిర్మీర కే,సరసరోజ మట్టె • కరతలమున. 714
తే. ప్రీతి ధరియించె మఱియును • నాతి సిందు,వార కుట్మలములఁ జారు•భూరిమౌక్తి
కాభములఁ దుంగపీవర•శోభ నస్త,నముల భూషించి చెలువారె•సుమహితముగ.
తే. నవ్య కేతకపట్టంబు • భవ్యదోర్ల,తావిభాగంబుచే నంగ•దత్వ మొందఁ
జేసెఁ బార్వతి మఱియును•భాసమాన,సకల భూషణ యుక్తిచేఁ•బ్రకట యయ్యె.
క. అతివ నవవకుళమాలా, కృతమును భృంగౌఘయుతము • నెసఁగు విభూషా
వితతము నగు మొలనూలును, జతనంబుగఁ దాల్చి యొప్పె • సమ్మోదమునన్.
సీ. అలకనివేశితం•బుల వసంతపు మల్లెపూవులచేత న•ప్పువ్వుఁబోఁడి
ధ్వాంతశబలితభా•తారకంబులచేత బలెఁ బ్రకాశించె; భ•వ్యంబులైన
నాయాస్థలంబుల • నలరంగఁ జేసిన పుష్పౌఘసంభార • భూషణములఁ
దనరుచుఁ గామ మం•త్రిని వసంతుని గృతార్థునిగా నొనర్ప నెం•చిన విధమునఁ

1 మానితాలకస్తబకము=యోగ్యమగు ముంగురులను పూవులగుత్తి. 2 సింగువారంపు మొగ్గలు =వావిలిచెట్టుయొక్క మొగ్గలు. 3 కంకేళిసుమపత్త్రికంబురీతి = అశోకవృక్షము పూవు రేకువలె. 4 భ్రమరకిర్మీరకేసరసరోజము = తుమ్మెదలతోఁ గూడి చిత్రవర్ణముగల కింజల్కములుగల పద్మము, కిర్మీరము=చిత్రవర్ణము. "కౄ విక్షేపే. ఇతిధాతోః గంభీరాదయశ్చేతి ఈరన్ ప్రత్యయః. తస్య ముడాగమశ్చ. ౠత ఇత్వమ్." అని యమరసుధ. దీనిని కిమ్మీరమని కొందఱందురు.

ఆ. చిత్రవేషమునను ♦ జెలఁగుచు స్వసమాన,సఖులఁ గూడి భక్తి ♦ సరణి నిత్య
సేవచేయ వచ్చెఁ ♦ జెన్నుగఁ బార్వతి, శంభు సముఖమునకు ♦ సత్వరమున.
సీ. శృంగారసీమాతి ♦ రంగద్ద్రిమారూపమును సురాగావలం♦బనమును గడు
నుత్కంఠకమల మై ♦ యొప్పు నాధారంబు నానందరసమున ♦ కాకృతియును
దారుణ్యమునకు సం♦స్థానంబు నై యొప్పు పర్వత పుత్త్రిక ♦ ప్రథమబలము
గాఁగ సన్నద్ధుఁడై ♦ కడఁగెఁ గందర్పుండు వాసంతకాంతిసం♦పర్కమునను
తే. జాల నున్మాదకాకృతి ♦ సహజ సుంద,రాంగియు నగు గిరిప్రభుఁ ♦ ననుఁగుఁ బుత్త్రి
పుష్పముల హంస దంపతి♦వోలె వివిధ, శిల్పిభేదంబు నొనరించి సేకరించి. 719
క. నవపుష్పమాలికలఁ గొని, నవహరుదర్శనము చేయఁ ♦ జనుదెంచి మహో
త్సవయుక్తి నొప్పునందిని, శివభక్తుని గాంచె ద్వార♦సీమనుగడఁకన్. 720

పార్వతి యీశ్వరదర్శనంబు చేయుట.

చ. కని వినయంబు భక్తియును ♦ గ్రాలఁగ నాతనితోడఁ బల్కె నో
ఘనగుణ! నందివర్య! శివుఁ ♦ గానఁగ వచ్చిన నన్నుఁ గింకరా
జని సమయంబుఁ గాంచి శివు ♦ సన్నిధి విన్నప మాచరింపు మీ
కనుఁగొనువాంఛ నామదిని ♦ గ్రమ్మి ననుం ద్వరపెట్టు నెంతయున్. 721
మ. చిరకాలంబున కేను స్వర్గతటినీ ♦ సీమంతినీస్వర్ణపం
కరుహాళిం గల [1]బీజకోశకములం ♦ గాంతంబులం దీసి [2]తీ
క్ష్ణరుచిస్ఫారతరాతపంబులను శో♦షత్వంబు నొందించి యు
ద్ధురసూచీవరవేధరంధ్రముల నెం♦తో పూన్కిఁ గావించుచున్. 722
ఉ. హారితరంబు శుభ్రమును ♦ నై [3]విధివత్పరిసంఖ్య నొప్పఁగా
నీరజమాలికావరము ♦ నేర్పునఁ గాంచిటు వచ్చితిన్ మహో
దారుని శంభు నవ్యయుని ♦ దర్శన పుణ్యముఁ గాంచి భక్తిచే
శ్రీరమణీయపాదముల ♦ సేవ యొనర్చెడు నట్లు చేయుమీ. 723
తే. నాదు వృత్తాంత మెల్లను ♦ నందివర్య!
శూలి కెఱిఁగించి భవు నాజ్ఞ ♦ చొప్పు నెఱిఁగి
నాకు నెఱిఁగింపు మిప్పుడు ♦ నీకుఁ దెలియ
నౌను సమయంబు నికటంబు ♦ నందు నుంట. 724
వ. అని ప్రార్థించుటయుఁ గరోద్ధూతహేమవేత్రోజ్జ్వలుం డగునందియు నట్లగుఁ

1 బీజకోశకములన్ = తామరపూసలను. 2 తీక్ష్ణ...పంబులను=సూర్యునియొక్క మిక్కిలి ...ధములైనయెండలచే. 3 విధివత్పరిసంఖ్యనొప్పఁగాన్=యథాశాస్త్రముగా లెక్కతోఁగూడిన.

గాక యని మెల్లన శంకరుసంస్థానంబు నొందె నాసమయంబునఁ జిరధ్యాన సమాధి గల శంకరుం డవ్యయం బగుతత్త్వంబు నవిలీనం బగుమానసంబు నాకర్షించి ప్రసంఖ్యానప్రబంధంబులనుండి విరమించి మూలాధారస్థపవమానునివలన నుత్తోలనవంశంబున దివినుండి సమాధివిరమంబున మరల భూభాగంబు నొందె. అంత యోగవిశ్రాంతి నొందిన శంకరుఁ జతుర్దశజగత్సమం బగు మహాభారంబును వహింపఁ గూర్మేశుండును, దిగ్నాగంబులును, కులశైలంబులును, సప్తభోగులును, సమర్థులుగా నైరి. ఆసమయంబున [1]శైలాదిమహేశ్వరుసాన్నిధ్యంబు నొంది యిట్లనియె. 725

క. [2]ఉపఢౌకనకరపార్వతి, త్రిపురాంతక! నీదుసేవఁ • దృప్తిగఁ జేయన్
సపరిజన యగుచు నున్నది, వ్యపగత నిజకార్య యగుచు • హర్షమున ననన్.

సీ. శితి కంఠుఁ డుచ్చల • చ్చిల్లివల్లీపల్లవోల్లాససంజ్ఞచే • నుల్లమలర
రమ్మని చెప్పంగ • రయమునఁ గందర్ప మోహినీశక్తియు • మూర్తి నొంది
నట్లు కాంతుల నొప్పు•నట్టి పార్వతి ఝులఝ్ఝులితమంజీర శిం•జాని నాద
మున నొప్ప నంది రమ్మనఁ గుంతలస్రంసిమాలతీకుసుమంబు • మహితశేఖ
తే. రముగఁ జెలువార సవిలాస • సుమహితైక
భక్తి లజ్జలు పెనఁగొనఁ • బ్రణుతిచేసి
సంతతామోదకర ఝణ•ఝ్ఝణిత భూష
ణాళి యయి దోసిలి యొనర్చె • హరున కంత. 727

తే. అంజలిని జేయ నెత్తిన • హస్త సరసి, జంబు వలనను బైఁటయు • జాఱ దాని
వలన వ్యక్తీకృతోరోజ•లలిత విభవ, యగుచు నప్పైఁట సవరించి•యద్రిపుత్త్రి.

ఆ. హరుని యగ్రభాగ•మందు సుందరకుచ, స్థగన కేళికోఱకుఁ • జాపఁబడిన
హస్తపంకజాత • మలర సిగ్గునఁ దల, వంచి యుండె నపుడు • చంచలాక్షి.

మన్మథుం డీశ్వరుని జయింప నుద్యమించుట.

ఉ. ఆసమయంబె యాఁ దనకు • హర్షద మంచు మదిం దలంచి యి
ష్వాసము నాశ్రుతి ప్రకట • వైభవ మొప్పఁగ లాఁగి యుద్యమో
ద్భాసితమూ గుణంబు తెగ•వాపి తదంతరపుష్పరూప బా
ణాసిని గంకణాదిరుచి•హారికరంబున మాటిమాటికిన్. 730

క. ఆకర్షించుచు రయమునఁ, బ్రాకటపుండ్రేక్షుచిహ్న•భాసితచాపం
బాకరణిని మ్రోయించుచు, శ్రీకంఠు జయింప నెంచి • చిత్తజుఁ డంతన్. 731

1 శైలాది=నంది. 2 ఉపఢౌకనకర=కానుకలు హస్తమందుఁ గలవి.

వ. లక్ష్యప్రవృత్తం బగు చక్షుస్సుతో సంహితకలంబ సంస్థానంబును బరిశోధించుచుఁ బ్రత్యాలీఢప్రకారంబున దక్షిణచరణంబును మెల్లన జానుసీమయందు సంకోచింపఁజేసి యితర పాదజానువుచే భూమిని స్పృశించుచు మథ్యమానమహీతలుం డై వక్షఃస్థలోన్నతి శాలియు,ధనుష్కర్షణవిన్యాసవిశాలంబును నగు తిర్యగ్వివృత్తహారంబుచే మహారాజనుం డగు నీశ్వరుని ధైర్యముద్రావిద్రావణంబును గావింప నెంచి మన్మథుండు ప్రవృత్తుం డగుటయు నీశ్వరుండు. 732

ఈశ్వరునకు మన్మథవికారము గల్గుట.

తే. యోగి చిత్తాబ్జవాసుఁ డయ్యును విధూద
య ధృతవిక్షోభ వారాశి యట్టు లధిక
చపలతను బొంది హృదయంబు ఖండడింపఁ
గంపమానాంగుఁ డై కొంత కళవళించి. 733

చ. క్రమముగ వృద్ధినొంది తగు రాగ విఘట్టనలం, గదంబగో
ళము గతినొప్పు దేహము విలాసగతి న్మెఱయంగఁ దాల్చి స్వే
దము ఘనబిందురూపమునఁ దద్దయు హస్తమునం జెలంగఁగాఁ
బ్రమథపుఁ డక్షమాలికయుఁ బల్మఱు భూమిఁ బడంగఁ జూచుచున్. 734

వ. ఎద్దియేనియుఁ జెప్ప నుద్యోగించి స్ఫురితాధరపల్లవుం డై చెప్ప శక్యంబు గామి నూరకుండి ప్రస్వేదప్రసరస్పృతం బగు ప్రవేపమానాంగుళిచే నభ్యర్ణవర్తిని యగు భస్మకుండికను స్పృశించుచు నత్యంతధైర్యవిభ్రంశంబు వలనఁ దన్నుఁదాను మఱచుచు నుత్కలికాసింధువుఁ బోలి చలద్భ్రూవిలసన్మందహాసితశ్రేణిమనోహరం బగు దృష్టిత్రితయంబునఁ బార్వతిం గాంచె నంత. 735

. గౌరియు నుద్భిద్యత్పుల,కారమణీయాంగియగుచు నాపాదశిర
స్స్ఫురప్రస్వేదధునీ, వారిపరిప్లుష్టయు నయి వఱలుచు నుండెన్. 736

తే. రాగకంపంబు భయకంప మై గణింప
నుభయ సమ్మిశ్ర మై పూర్వ మొకటఁ బుట్ట
నట్టి దైవప్రకల్పితా త్యమలదృష్టి
చారమునఁ గృతకృత్యగా సాధ్వి తలఁచి. 737

సఫలిత సౌభాగ్యసామ్రాజ్యగాఁ దన్నుఁ దలఁచుచు మదిలోనిచిత్తఱమునఁ జనఁ బ్రణామాంజలి సంధాన నువ్యక్త కరమూల దర్శన మరసి మరలఁ జార్వంబ రాంత సంఛాదనోరోజనాళీకకుట్మల యయి లీల మెఱయఁ బ్రత్యూహసంత్రాన రాగమందాక్ష సమ్మదము లేకత్వంబు మమత నొంద

నాకులిత స్వాంత • మై ముఖంబును జారు [1]శరదబ్జరిపుసహో • దరము వంచి
తే. మరల [2]సాచీకృతం బగు • మహితదృష్టి
నీలకంధరుఁ దూలించి • నెమ్మి నవ్య
దేశికుండును మత్తుండు • దీప్తిశాలి
యైన కందర్పు శిక్షచే • నతివ మిగిలి. 738
క. భావాంతరముల గూఢము, లై వఱలెడు వాని శిక్ష • నమరిన మూఢ్కిన్
భావించుచు సంతసమున, శ్రీవిశ్వేశాంఘ్రియందుఁ • జేర్చెన్ దృష్టిన్. 739
చ. అలరెడు సిగ్గుచే మరల • హారికటాక్షములన్ [3]జలభ్రమం
బుల వలె మాటిమాటికిని • బొంకముగాఁ బ్రసరింపఁ జేయుచుం
జెలఁగుచుఁ బుష్పసాయకవి•శృంఖల వీరు స్థిరస్వ మైన పే
శలతను వెంతయుం బులక•సంఘ విభూషణ యుక్త మై తగన్. 740
మ. పురసంహారకు నగ్రభూమి నిటు లు•ద్భూతస్మరస్ఫారని
ర్భర తీక్ష్ణాంబకఘాటిచేత మిగులన్ • భాసిల్లుచున్ శీతభూ
ధరవంశస్ఫుటరత్న మైన యుమ య•త్యంతక్వణత్కంకణో
త్కరరమ్యస్వనపాణిఁ జాపి హరు న•గ్రస్థానమం దర్మిలిన్. 741
తే. సత్రపాస్మిత మొప్పఁగాఁ • జారుపుష్ప, శిల్పకృతహంసమిథునం బ•నల్ప మైన
యక్షమాలిక స్వర్ధునీ • హారి కమల, బీజకోశకృతంబును • బెట్టి నిలిచె. 742
క. శితికంఠుఁడు రాగతరం, గితుఁ డై యుపఢౌకనాభి•కృతి నక్షగుణం
బతులితగతిఁ గనుఁగొనితం, ద్రితమతి యై మఱచెఁ యోగ•రీతుల నంతన్. 743
క. హరుఁ డిటు విగతస్మృతుఁ డై, సరాగనేత్రప్రచార•సరణిన్ మదిలో
నరసి గిరి కన్యకాముఖ, సరసిజమును జూచు దృష్టిఁ • జయ్యనఁ ద్రిప్పెన్.
వ. ఇట్లు దృష్టిని మరలించి శంకరుండు. 745
చ. మనమున ధైర్యవిప్లవము • మానుగ నెంచి నిబద్ధధైర్యుఁ డై
కనుఁగొనఁ జోద్య మయ్యెడిని • గానఁగఁ జాలను గారణంబ యో
యనితరసన్నిభం బయిన • దయ్యును ధైర్యము లీన మయ్యె నం
చును మదిలోన నెంచి కడు•శూరత మీఱఁగఁ జూచె దిక్కులన్. 746
క. కాతరకంధరుఁ డై యిటు, లీతఱి ధైర్యంబు దూల • నేమొకొ యని య
త్యాతతదృష్టులఁ గనుఁగొనె, హేతువు నరయంగఁ గోరి • యీశుఁడు కడఁకన్.

1 శరదబ్జరిపుసహోదరమున్=శరత్కాలచంద్రునకుఁ దోఁబుట్టు వగు దానిని. 2 సాచీకృతమ=స్వభావమగు దృగ్భేదము. 3 జలభ్రమంబులు=సుడులు.

## కామదహనము.

సీ. విక్రమంబున మాధవీమండపోదరమునఁ గుంజమునయామ్యమున సుమాస్త్ర
కలితకోదండుఁడై కడఁకఁ బ్రత్యాలీఢపాదుఁడై దోర్దర్పబలముచేతఁ
దను నొంప యత్నించిఘనబలంబున మించి శంకాభయాకులస్వాంతయగుచు
రతిచలద్దృష్టిచే రమణుని గాపాడ యత్నించి పార్శ్వంబునందు నొప్పఁ
తే. జాలశౌండీర్య దుర్మదశాలి యగుచు
మాటి మాటికిఁ జాపంబు దీటు కొలిపి
మ్రోయఁ జేయుచు నసమానరోష మడర
నలరు మన్మథు నటఁ గాంచె హరుఁడు పూనిక. 748
చ. తనదు సమాధిభంగమునఁ దద్దయు రోషరసంబు పొంగఁగాఁ
గనుఁగవ నిప్పులొల్కఁ గవిగాఢనిబద్ధపు భ్రూకుటీచ్ఛయల్
ఘనతరభీకరంబు లయి క్రాలె ముఖంబు మహోగ్రప్రాణేశ!
దనరుచు దవ్వగాఁ బొలయు దారుణదృష్టులఁ బ్రజ్వరిత భావ 749
క. హరుఁ డొప్పె విలయకాల, స్ఫురదుద్యజ్జ్వాలనుమాడ్కి దరి యంతన్
హరు వక్త్రంబున రోషో, ద్ధురచిహ్నము నరసి భీతిఁ ద ఁగనంతన్
మ. పురవైర్యాయతఫాలభాగనయనోద్భూతుండునై యంబర
తరరాజత్తరరశ్మి మాడ్కిఁ గడు నుద్దండాకృతిం బొల్చి ని
ర్భరరోషంబున వీతిహోత్రుఁడు సురల్ భవ్యాత్మ! కాపాడుమీ
హర! యంచార్తిని బల్క నెంచుతతి నత్యంతోగ్రతుల్ మీఱఁగన్. 751
ఉ. మండుచు మన్మథాంగమును మానితమున్ క్షణమాత్ర జ్వాలలం
జండజవంబు మీఱఁగను సాధ్వసులై సుర లెల్లఁ జూడ ను
ద్దండతఁ జుట్టికాల్చెను నితాంతభయంబున ఖేచరోత్తముల్
గుండెలు తల్లడిల్ల మదిఁ గుందుచుఁ బాఱిరి దీనవక్త్రులై. 752
వ. రతిపతి మండిపోవుటయు రాజధరుం డు[1]రుడగ్నిదీప్తుఁడై
యతులితదుర్నిరీక్ష్య మగు నట్టివిధంబున నుంటయున్ మహో
ద్ధతగతి దేవతావ్రజము తద్దయుఁ బాఱుటయున్ గిరీంద్రపు
త్రి తగ నెఱింగి భీతిఁ దన దృగ్ద్వయమున్ వడిమూసె నార్తయై. 753
ఎ. హర సంరంభసమృద్ధభీతి రతిదానాత్మేశ్వరుం డిట్లు శం

1 రుడగ్నిదీప్తుఁడు అయి=కోపాగ్నిచేఁ బ్రకాశించువాఁడై.

కరకోపాగ్నిని మండిపోవుటయు నా•కస్వామియున్ వాని నా
హరకోపాగ్నికి దూర మా గతిని జే•యం జాల కెంతే వడిం
బురికిం బోవుటయుం గనుంగొని సము•ద్భూతార్త యై యేడ్చుచున్. 754

తే. క్ష్మాతలంబునఁ గూలి మూ•ర్ఛను మునింగి
మరల క్షణమాత్రమునకు నా • మదను సుదతి
తెలివిఁగని భర్తృమరణంబు • దివ్యచిత్త
సరసిజంబును గాల్ప [1]వి•సంజ్ఞ నొందె. 755

వ. పార్వతియుఁ గంపితదేహవల్లి యై సాధ్వసంబున నిమీలితాక్షి యై స్తంభాకారంబున నుండె. పదంపడి యదృష్టపూర్వసంరంభంబుఁ గనినకతంబునఁ బార్వతీదేహంబు కంపించె. పక్షం బదరఁ జొచ్చె. అంత శిఖిజ్వాలావజ్రదగ్ధకందర్పభూరుహం [illegible]లకంధర మేఘుం డాకసంబున నంతర్ధానంబు నొందె. మఱియుఁ ద[illegible]జనకం బగు వధూసంగమంబును బరిహరింపఁ దలంచి శంకరుండు [illegible]తి యై సర్వప్రమథగణంబులతో నదృశ్యుం డయ్యె.

[illegible] హారసంరంభ[illegible]మున, ధరణీరుహసముదయములు•దనరు వసంతుం
డుడుగఁ [illegible]ంబులతో, సరిగ విశేషంబు నొంది•సరసత వదలెన్. 757

మ. పరభృత్కం[illegible]ము ముద్రితంబు గతి భ•వ్యస్వానహీనంబు న
య్యె; రయం బొప్పఁగఁ బల్లవాళిసుమముల్ • హీనస్థితిన్ మ్లానతం
బొరసెన్ వృక్షవిభూతి సన్నగిలె న•బ్జాభిమాధ్రివర్యుండు స
త్వరుఁ డై పుత్త్రిని వేళ్లమానహృదయన్ • భావించి దుఃఖించుచున్. 758

మ. తనయా! కోర్కెలు చాలవిఘ్నములచే•తం గొంతకాలంబునం
గను సాఫల్యము; మంచికార్యములకుం • గన్పట్టు విఘ్నౌఘముల్
విను పుష్పంబుల కన్న మెత్తని [2]స•ద్వృత్తాంతరంగంబు లా
య్యన వజ్రంబున కన్న వాడి యగునా•యాకాలభేదంబులన్. 759

ఉ. అక్కట! భ్రూకుటీకుటిల • మై నిటలాంబక మైనమోము దా
నెక్కడ? పేశలం బగుచు • నింపులు గుల్కు త్వదంగవల్లి తా
నెక్కడ? యోర్వఁగాఁ దరమె • యింతియ చాలును రమ్ము పార్వతీ
చక్కఁగ [3]గేహదేవతలఁ • జయ్యన వేఁడుము కార్యసిద్ధియౌ. 760

1 విసంజ్ఞ నొందె=మూర్ఛ నొందెను. 2 సద్వృత్తాంతరంగంబులు=మంచివారిమనస్సులు.
3 గేహదేవతలన్ =ఇలువేల్పులను.

మ. అని [1]మందాక్షము భీతియుం బెనఁగ న॰త్యంతంబు కందోయి మూ
సిన పుత్త్రిం దన మూఁపు పై నునిచి యా॰శీతాచలేంద్రుండు వే
చనియెన్; శంభుమహాపరాధమున సా ॰ శంకాత్ములై దేవతల్
చని రుద్వేగమనంబులన్; రతియు నీ॰శస్ఫారనేత్రాగ్నిచేన్. 761

—॰ రతీదేవి విలపించుట ॰—

చ. పతి యిటు బూది యౌటఁ గని ॰ పల్మఱు భస్మచయంబుఁ జూచి సం
హృతనిజధైర్యసార యయి ॰ యెంతయు శోకరసంబు పైఁ బయిన్
జతనము మీఱఁ బర్వ వివ॰శత్వము నొంది క్షణంబులోన లే
చి తగపతిం దలంచుచును ॰ జింత నురంబును జేత మోదుచున్. 762

సీ. క్వణదుల్లసన్మణి ॰ కంకణహస్తనీరజములు సాచుచు ॰ రతి వికీర్ణ
చారుకేశ భ్రష్ట ॰ సరసవసంతసుమావళి యై భూమి॰యందుఁ బొరల
ధూళిచేఁ దను వెల్ల ॰ ధూసరితంబు నై యొప్ప నో ప్రాణేశ ! యోసురేశ !
లోకమోహనరూప! ॰ పాకశాసనముఖప్రార్థిత ! సూనృత ॰ భాషణరత
తే. దీనసశరణ్య నగు నన్ను ॰ మానినినిట
విడిచి యెటుపోయినాఁడవో ॰ వీర ! మార
యనుచు నేడ్చుచుఁ దిరుగుచు ॰ నవనిఁ బడుచు
ఱాలచే మోదుకొనుచు వి॰లోల యగుచు. 763

క. వనరుచు నున్న రతిం గని, తనమిత్రప్రియను జేరి ॰ తాను వసంతుం
డును నూరడించుచుండెను, మనమున విధి శాప మెన్ని ॰ మఱి మఱి చింతన్.

—॰ మన్మథునకు బ్రహ్మశాపము కల్గుట. ॰—

వ. అని హయవక్త్రుఁ డెంతయు మ॰ఖారిపరాక్రమ రీతిఁ జెప్ప న
మ్మునివరుఁ డంత బల్కె నిటు ॰ భూరికుతూహల మొప్పనో మహా
త్మ ! నిఖిలవేదశాస్త్రగణ॰ధామ ! హయానన ! ప్రాజ్ఞవర్య ! నా
మనమున నొక్క సందియము ॰ మైకొనె దానిని దీర్పఁగాఁ దగున్. 765

. విషమసాయకుండు ॰ విక్రమధుర్యుండు, శాప మెట్లు పొందె ॰ సరసిజుండు
శాప మేల యిచ్చె ॰ సందేహమును దీనిఁ, బాపి తృప్తిఁ జేయవలయుననిన. 766
హరివదనుండు పల్కె నిటు ॰ లాదర మొప్పఁగ మౌనివర్య ము
న్నరుదుగ బ్రహ్మకల్పమున ॰ నయ్యెను జాక్షుషనామకుండు ను

2 మందాక్షము=సిగ్గు.

స్థిరమనుధామమందు నట • దివ్యులు పూర్వము రీతి నొప్పి రెం
తొ రమణ మయ్యెఁ గాలము వి•ధూతసురారికదంబ మాటచేన్. 767

వ. అంత గొంతకాలంబునకు. 768

మ. ధరనుద్దీప్తతపోబలాఢ్యు లయి దై•త్యస్వాము లై సర్వ ని
ర్జర భీతిప్రదు లై సహోదరులు నై • సన్మార్గవిద్వేషు లై
పరబాధాకరకార్యలోలు రయి శుం•భద్దర్పయుగ్బాహుసం
స్ఫురణం బొల్చిరి సర్వలోకభయదుల్ • సుందోపసుందుల్ గడున్. 769

ఉ. భూరితదీయకార్యపరి•భూతజగత్త్రితిఁ గాంచి తన్మహో
దార విజృంభణంబు సుర•ధామము భీతిలఁ జేయఁ దద్భుజ
స్ఫార బలంబు నెంచి సుర•సత్తము లద్ది సహింప రామి వి
స్తార మనోవ్యధంజివికి • చాలభయంబున నార్తు లైరిసూ. 770

ఉ. వారు పరస్పరప్రబల•భవ్య ముదంబుల నొప్పి తుల్యవి
స్తారబలఁబుల న్నెఱసి • సర్వజగంబులు క్షోభ మొందఁగాఁ
గోరికమీఱఁ జేయఁ గవి•కుంఠితయజ్ఞముఖాదికృత్య మై
ధారణి వేదశాస్త్రసము•దాయనురార్చన హీన యౌటయున్. 771

ఆ. అతివిషణ్ణ దేవ•తాయతనంబుగ, నాజ్ఞచేత జగము • ననువు మీఱఁ
జేసి దివిజవార • సీమంతినుల నెల్ల, బలిమి మెఱయఁ బట్టి చెలఁగి యంత.

సీ. కల్పవృక్షంబులఁ • గడువడిఁ బెకలించి సురవర్యు లనువేగ • క్షోభపఱచి
దేవతాలయములఁ • బావనములఁ జెండి మానుల యోగుల • మ్రందఁ జేసి
సాధ్యుల సిద్ధుల • సత్త్వహీనులఁ జేసి గంధర్వ యక్షుల • గర్వ మణఁచి
బ్రాహ్మణప్రవరుల • భంగ మొందఁగఁ జేసి మహితయాగంబుల•మట్టు పఱచి
తే. బహువిధంబుల నీరీతిఁ • బ్రబలి లోక
పీడ నొనరించి దానవుల్ • విక్రమింపఁ
ద్రిదశవరు లెల్ల యోచించి • తెంపు మీఱ
మేరుపృష్ఠంబు నొంది సం•మృద్ధభంగి. 773

చ. సరసిజసూతి యున్నెడకుఁ • జయ్యనఁబోయి మహాత్ము నాతనిఁ
శరణము వేఁడ నియ్యెడరు • సత్వర మాఱునటంచు నెంచి పం
కరుహాభవుంగనంగఁ జని • కాంచిరి యంతట సత్యలోకముఁ
వరసుకృతైకభోగపరి•పాకము, నిర్జిత సర్వలోకముఁ. 774

వ. అది మఱియు నిరంతరవేదఘోషనినాదితంబును, మూర్తిమద్యజ్ఞతపస్సంయు

తంబును, మనోహరధవళచ్ఛదవిధివాహనహంసకులజనితపత్త్రిసంకుల దివ్య సరస్సందోహసమావృతంబును, సావిత్రీ గాయత్రీ సరస్వతీసంసేవితంబును, సకలనిగమాగమసేవ్యంబును, సప్తకోటిమహామంత్రపరివారతంబును, కృష్ణాజినావరుద్ధాంసులు, శ్మశ్రులాననులు, వేదపూతముఖాంభోజులును నగు జటిలవర్యులచే నధిష్ఠితంబును, కమండలు విలసత్కరతలలలితులును, నిరంతర పరబ్రహ్మానుసంధానసిరతులును నగు యతిప్రవరులచే సేవితంబును నగు బ్రహ్మలోకంబు నొంది మందమందగమనంబున శతానందు మందిరంబును బ్రవేశించి యందు. 775

సీ. [1]గవ్యూతిమాత్రదీర్ఘంబులై తగు వేయిపత్త్రముల్ చెలువార • భవ్యరీతి
దీర్ఘాగవిస్ఫూర్తి • దీప్తమాకర్ణికయుఁ దదర్ధసత్కేస • రోచ్చ్రయంబు
నై మనోహరరీతి • నమరు నాళంబును సతతదివాకర • సన్నిధాన
మున వికసించిన • ఘనపద్మసింహాసనంబు నద్దాని మ • ధ్యంబునందుఁ
తే. జెలఁగు చతురానుని సుస్మి • తలలితాస్యముఖచతుష్కవినిష్ఠ్యూత • భూరిసర్వ
వేదవేదాంగవిద్యాళిఁ • బింగళరుచి, విలసితశ్మశ్రువదనుని • విధిని నజుని. 776
సీ. ఈషత్కపిలనేత్రు • భూషితాంగుని విద్రుమాతామ్రదేహుని • నమలచిత్తు
సజ్జటామకుటభా • స్వచ్ఛిర్షశోభితు యోగి సంస్తుతుని ని • త్యోత్సవాఢ్యు
సపత్త్రి కైలాస • శైలసంకాశవాహనహంససేవితు • ఘనదయాఢ్యుఁ
ద్రైలోక్యభవ్యగం • ధర్వపత్తనవిని ర్మాణయోగోద్యము • మహితతార
తే. కావలయు మైనజ్యోతిని • గడఁక దృగ్ద్వయంబునను దాల్చి భాసిల్లు • నట్టివానిఁ
గడుఁ బ్రసన్నుని శాంతుని గాఢకరుణు, సర్వ జగదుపకారుని • సారసభవు.
చ. తనువులఁ దాల్చి యంజలులు • తద్దయుఁ బర్వఁగ విద్య లెల్లెడన్
వినయము దోఁప దన్పొగడ • వృద్ధి నెసంగెడు వాని నిర్జరున్
మునిజనసేవ్యు నిర్మలుని • భూరికృపాకరునిన్ నిరామయుం
గని రట దేవతావరులు • కంజభవుం గడు సంతసంబునన్. 778
• మ్రొక్కి మలర మ్రొక్కి • ముదమున వినుతించి, ఘోరదానవైక • వీరయుగళ
బాధ నెఱుకపఱచి • భవ్యబద్ధాంజలిపుటము లొప్ప సురలు • పూన్కి మరల.
• కరుణావృష్టిదుఁడవునీ, వరయఁగ లోకాళికర్త • వయ్యును మాకుం
బరఁగిన కష్టము మాన్పక, సరసిజభవ! యూరకుండఁ • జనునే నీకున్. 780
తే. చెలఁగి సుందోపసుందులు • స్వేచ్ఛఁదిరిగి

---

[1] గవ్యూతి మాత్రదీర్ఘంబులు=రెండుక్రోశములమాత్రము పొడవుగలవి.

క్రూరకృత్యంబులను జేయఁ•గూలె నయ్య !
సకలలోకాళి; ధర్మముల్ • నమసె దుష్ట
కార్యసంఘంబు లెల్లెడఁ • గ్రాలఁజొచ్చె. 781

ఉ. అసురవైరియుగ్మము న•హార్యపరాక్రమ మొప్పఁ ద్రుంచినన్
గాసిలు చున్నలోకము, ల•ఖండవిభూతి నెసంగు నంచు న
ట్లాసురవైరిబాధల సు•రాళియెఱుంగఁగఁ జెప్ప మందహా
హాసము మోమునం జెలఁగ • నబ్జజుఁ డిట్లని పల్కె వారితోన్. 782

చ. ఎఱుఁగనె రాక్షసద్వయము • నెక్కుడు బాధ నొసంగుచుంట వా
రతిముఱిలోకజాలముల • నద్భుతరీతిగ నాక్రమించివే
నెఱపుట స్వీయశౌర్యముల • నేనును వారిని జంప నెంచితిన్
మఱి మఱి యాలకింపుఁ డొక•మాటను జెప్పెద మీరలందఱున్. 783

ఆ. పరులచేతవారు • పడరని ననుసంది, యంబు కలదు కార•ణంబు వినుఁడు
దేవవర్యులార! • పావననియమంబు, చెలఁగ మున్ను వనముఁ • జేరి వారు. 784

క. ఘోరతపంబున ననుఁ గడు, నారాధించిన యవార్య•ముగు తత్తపమున్
గారవమున మది మెచ్చుచుఁ, జేరితి వా రున్నవనము • స్థిరకృప మెఱయన్.

క. సాన్నిధ్య మొసఁగి వా రట, నున్న తెఱంగెల్లఁ జూచి • యుద్దామతప
స్సోన్నతి కచ్చెరుపడివే, మన్ననతో నిట్టు లంటి•మహాత్ములతోన్. 786

తే. వరముఁ గోరుండు మంగళ•ప్రదము దాని
నిచ్చు వేడుక నిచటికి • వచ్చినాఁడ
ననిన నాదానవులు మ్రొక్కి • యతులవినయ
మొప్పఁ బ్రార్థించి రిటు నన్ను•నుద్యమమున. 787

సీ. సరసిజాసన! మేము • సతతసంప్రీతుల నెసఁగుచుండఁగవలె • నిరువురకును
వైర మెప్పుడును సం•భవము గా కుండంగవలయు మా కెచ్చట•విలయమన్య
కారణంబున నెప్డు • కల్గ కుండఁగ మఱి యితరేతరంబును • మృత్యువైన
గానిమ్ము యివ్విధి • గరుణచే వరమిమ్ము నా విని వారి వి•నతికి భక్తి

తే. కలరి యి ట్లంటి మీ కెల్లె • కలుగు మృత్యు
వన్యుఁ డెవ్వఁడు మిముఁజంప• నర్హుఁ డుండఁ
డవని నితరేతరంబు మీ • రడఁగు వార
లనుచు వర మిచ్చినాఁడ ము • న్నమరులార. 788

క. కావున వారలఁ జంపఁగ, నే వీరుఁడు లేఁడు జగతి నెందును నేనున్
భావజ జనకుఁడు శంకరుఁ, డావీరులఁ జంపజాల మని లో నెపుడున్. 789

ఆ. అట్టు లౌటఁ గాదె యవ్వీరులను జంప, నరయుచున్నవాఁడ నమరులార
సకలసుదతులందుఁ బ్రకటమౌ సౌందర్య, సార మెల్లఁ బూని సంగ్రహించి.

క. తరుణీమణి నొక్కర్తుకఁ, బరమాద్భుత మందు నట్లు ప్రౌఢత మెఱయం
బరమప్రీతి సృజించెద, నరుదుగ నీరమణిఁ గాంచి నంతనె దనుజుల్. 791

క. మోహితులై సుదతిన్ మద, నాహవమునఁ దృప్తిపఱుచు నాకాంక్షలచే
బాహాబాహిఁ బరస్పర, మూహింపక పోరి చత్తు రొగి దనుజవరుల్. 792

చ. అని యొక యుక్తినారసి సురావళి కన్గొనుచుండఁ బద్మజుం
డనుపమయోగశక్తి వనితావళి రాజులు కాంతకాంతి నొ
క్క నిముసమాత్రఁ దీసి కడఁకం దిలమాత్రము కామినీమణిం
గనదురు కాంతిదేహను నికామ ముదంబున సృష్టిచేసినన్. 793

క. ఆతరుణి తిలోత్తమ యను, ఖ్యాతిం గనె నమరులెల్లఁ గాంతామణి వి
ఖ్యాతతనూలతఁ గని ని, శ్చేతనులై యుండి రంత సీమంతినియున్. 794

తే. దీప్తలావణ్యసంపూర్ణ దేహయు సవి
లాసపాదక్రమయు నయి భాసమాన
మూర్తికాంతులఁ బురుషుల మోహ మొందఁ
జేసి చూడ్కుల కతితృప్తిఁ జేసె మఱియు. 795

వ. అతిదృఢతుంగపీవరకుచాయతనమ్రసుమధ్యవల్లరీ
వితతమనోజ్ఞరూపయు సువృత్తయు, శీతమయూఖచంద్రికా
ప్రతిహతకృన్ముఖప్రభయు [1]వాతహతచ్ఛదనీలనీరజా
యతచలదక్షియున్ సకలహారవిభూషణశోభితాంగియున్. 796

సీ. ఘనతరలావణ్యమునఁ దటిన్మయివలె సారసమయి యట్లు చారుదృష్టిఁ
జంద్రికామయి భంగి సాధుదంతావళి; ఘనపింఛమయి పోల్కి గచమునందు
నక్షమాలామయి యట్ల పాణ్యంఘ్రినఖాగ్రంబులందు నొప్పారి మహిత
కాంతిపుంజంబుచేఁ గాంతప్రకాశించె; నంత నా రమణిని నంచయానఁ

తే. కుటిలకుంతల శుభదృష్టిఁ గోమలాంగిఁ, గాంచి నీరజగర్భుండు కామబాణ
హతనిజస్వాంతుఁడై దృష్టు లతివదివ్య, కాంతిపంకంబునమునుంగఁ గళవళించె.

1 వాతహత...క్షియున్ = వాయుహతము లగు పత్త్రియుగల నీలపద్మమువలె విస్తారమైన వు, చలించునవియు నగు నేత్రములు కలదియు,

తే. మున్ను భారతిఁ బుట్టించి ♦ ముగ్ధఁ గాంచి
కామమోహితుఁ డయ్యె న♦క్కమలసూతి
కాన నీచానఁ గనుఁగొని ♦ కదురయమునఁ
బట్టి భోగింప మదినెంచెఁ ♦ బలుకులేల. 798

చ. మునివర! మన్మథప్రబల♦భూరిశిలీముఖసంహతాత్ముఁడే
ఘనమతి యైననంధుఁ డయి ♦ కానఁ డధర్మము ధర్మమెల్ల నా
తనికిని దల్లి సోదరి సు♦తామణి యన్న తెఱంగు లేదహో!
విను మట మీఁదివార్త స్మర♦వీరుని వ్రేటులఁ జంచలాత్ముఁడై. 799

చ. వనితనుగూడ నెంచుటయు ♦ వారిజసూతి యభీష్టమెంచి తా
మనమునఁ జంచలించి సుర♦మానిని భీతిలి చంచలాత్మయై
తనుబలవద్విధిం గొనును ♦ ధాతయటంచును సంశయించి వే
వనిత కురంగియై యపుడ ♦ పాఱె, విరించియు సంభ్రమంబునన్. 800

క. సారంగరూపమున నా, సారసముఖిఁ బట్టుకొనఁగఁ ♦ జయ్యనఁ బాఱెన్
నీరజగర్భుని చిత్తవి,చారము మది నిశ్చయించి ♦ శంకరుఁ డంతన్. 801

సీ. కైరాతవేషంబుఁ ♦ గైకొని [1]సారమేయాకృతి వేదంబు ♦ లనుసరింపఁ
బింఛావతంసుఁడై [2]పృథుతరగుంజాభరణమండితాంగుఁడై ♦ రయము మెఱయఁ
[3]జొల్లియమలరార ♦ శ్రోణికిఁ జుట్టిన వ్యాఘ్రచర్మము రమ్య♦మై చెలంగ
సజ్జీకృతం బగు ♦ చాపంబు కైనంది బాణ మొక్కటి దానఁ ♦ బదిలపఱచి

ఆ. కామమోహితుండు ♦ కామినీసక్తుండు, ధర్మభిన్నమార్గతత్పరుండు
దుష్టకార్యరతుఁడు♦దోధూయమానహృ,దయుఁడు నైన బ్రహ్మ♦తలఁపు మాన్ప.

సీ. పల్లవాబద్ధస♦త్పటయు గుంజాహార భాసురాంగియును దూ♦ర్వామనోజ్ఞ
వర్ణమృద్వంగియు ♦ వరపింఛికోత్తంసతను కాంతియును మత్త♦దంతిదాన
నిష్యందతిలకవి♦నీలకాంతిస్ఫురత్ఫాలయు గరిదంత♦భవ్యవిపుల
నిక్వణత్కంకణ ♦ నికురుంబహస్తయు నాత్మతుల్యకిరాత♦కాంగనాళి

తే. పరివృతయునై వెలుంగుచు♦ భవ్యరీతి, రమణస్వచ్ఛందకైరాత ♦ రమణిపోల్కి
వెంటఁ జనుదెంచు పార్వతి♦ వేడ్కనింపఁ, జనియె స్వేచ్ఛాకిరాతుండు♦శంకరుండు.

చ. చని చని ముందుఁ బుత్త్రికను ♦ జారువిలాసతనూలతన్ గనుం

---

1 సారమేయాకృతిన్=కుక్కలయొక్క రూపమున 2 పృథు...గుఁడై=మిక్కిలి గొప్పవియగు గురిగింజలచేఁ జేయఁబడిన యాభరణములచే భూషింపఁబడిన దేహము కలవాఁడై. 3 చొల్లియము=జడతోఁ జుట్టినచుట్టు.

గొని వెనఁబట్టఁగాఁ దలఁచి • కూరిమిఁ బాఱెడు పంకజోద్భవుం
గని శివుఁ డంతబాణమును • గ్రన్నన లస్తకమందుఁ గూర్చ నొ
య్యన శబరాకృతిన్ ఖలజ•నాంతకు శంకరు గాంచి భీతుఁ డై. 804

చ. సరసిజసంభవుం డపుడె • శంకరుపాదములందు వ్రాలి ని
ర్భరమగు భక్తి నిట్టి యప•రాధము సైపుము నన్నుఁ బ్రోవు మీ
శర ముపసంహరింపు మిఁక • శంకర! యంధకకాలులొండె న
ప్పురములు మూఁడునొండె నగుఁ • బో శరలక్ష్యము లంచుఁ బల్కినన్. 805

చ. హరుఁడు విరించి ప్రార్థనము • నాదర మొప్పఁగ నాలకించి యా
శర ముపసంహరించి యతి • సాంత్వనరీతులనూరడించి ధ
ర్మరహిత మైనమార్గమును • మాను మటంచు వచించి యెంతయుం
గరుణ బహూకరించి నిజ • కామినితోఁ వెనఁబోయె నింటికిన్. 806

తే. హరుఁడు చనిన విరించియు • నంతఁ బోయె
సత్యలోకంబునకు వేగ • స్మరునిక్షోభ
మాఱుటయును దిలోత్తమ • యువ్విరించిఁ
గానఁ జని పాదములవ్రాలి • కరముభక్తి. 807

తే. ప్రార్థనము చేసె నిటుదీన• పాలకా మ, హాత్మ! యనుమతి నీయ వే• యాదరమున
నేపనిని జేయఁగాఁ దగు•నిపు డొనర్తు, ననిన సుందోపసుందనా• శార్థమజుఁడు.

క. పనుపంగ నాతిలోత్తమ, చనియెను దివిజాళిఁ గూడి • చయ్యన దితిసూ
నునగరబాహ్యోద్యానం,బున వాసం బొప్పఁ జేసి • పూన్కి దలిర్పన్. 809

క. విచికిలగంధియు డోలిక, నచటం గల్పించి కాంచ•నాభం బగు నా
ప్రచలిత డోలిక నెక్కి పి, కచయమునకు లజ్జగలుగఁగాఁ బాడెఁ దమిన్. 810

సీ. మహితగాంధార స•న్మధ్యమషడ్జమగ్రామత్రయంబును • గ్రమసరణిఁ
గాల మింతయుఁ దప్ప•కయె విస్తరిల్లంగఁ జేయుచుఁ దమి మీఱఁ • జిగురుఁబోడి
తగురీతి నాకంపి•తస్ఫురితప్రతిహతహతముల వీణె • నలరి మీటు
చును మనోజ్ఞంబులై • శోభిల్లుచును స్వరఘట్టనాకరములై • క్రాలుమూర్ఛ
తే. నలను మోహింపఁజేయుచు•లలితరాగ, తతులనాలాపనక్రమ•తయు వెల్లుంగఁ
బాడె వీణాస్వనైక్యంబు • భాసురముగ, నొప్పుచుండంగ సంతోష• ముప్పతిల్ల.

క. వనపాలకు లా గానము, విని చని సుందోపసుంద•వీరుల కెఱిఁగిం
చిన నవ్వీరులు సంభ్రమ,మునఁ జని రాత్మైకభోగ•మునఁ గోరి తమిన్. 812

క. చని యచ్చోట మెలంగెడు, వనరుహలోచనను గాంచి • వారలు మోదం

బునఁ బొదవి కలహతత్పర, మనముల నలరారి రకట! • మన్మథునార్తిన్. 813

తే. అంత సుందుండు తమ్మున • కనియె వత్స!, భ్రాతృపత్నిని జూడకు • భ్రాతజన
సముఁడు తత్పత్ని తల్లియౌ • నమలరాగ, సహితదృష్టినిజూడ దో • షంబు పొసఁగు.

చ. అన నుపసుందుఁ డిట్లనియె • నన్నవు కావునఁ దండ్రివౌదు నీ
వనరుహగంధిని న్మొదట • భవ్యతమేక్షణ దృష్టిఁ జూచితిం
గనుక సహోదరప్రమద • కాదె న్నుపాసమ యిద్ది నీకు నె
మ్మనమున మత్సతీమణిగ • మానిని నెంచుము ధర్మమార్గతన్. 815

మ. అని యిబ్భంగిఁ బరస్పరంబుఁ గ్రుధ పెం • పారన్ మహాఘోరతం
దనువుల్ పొంగఁగ దీవ్రవాక్యముల నిం • దా పూర్వకం బొప్ప నా
కనివాసుల్ మది సంతసిల్లి కన హుం • కారంబులున్ మించ న
ద్దనుజుల్ వాక్కలహంబుఁ జేసి మఱియున్ • ధైర్యంబు భాసిల్లఁగాన్. 816

తే. పట్టుదలచేఁ గచాకచి • బెట్టుఁ బోరి
బాహుయుద్ధంబు చేయఁగాఁ • బైకొనిలయ
కాలదండప్రమాణదీ • ర్ఘతరగదలఁ
గొట్టుకొని చచ్చి రప్పు డ • ఘోరభంగి. 817

తే. ఆతిలోత్తమ దేవకా • ర్యంబు నిట్లు, సార్థకంబుగ నొనరించి • యబ్జభవుని
పాలికనిబోయికార్యంబు • భంగిఁ జెప్ప, విస్మయంబునఁ బొదవియ • వ్విధియుఁ బ్రీతి.

వ. ఆతిలోత్తమ కప్సరోభావంబును, [1]దేవలోక నిర్వృతియు, లోకోత్తర సౌంద ర్యంబు, నప్సరోగణ శ్రేష్ఠతయు నొసంగి స్వర్గంబున కనుపి యీతిలోత్తమ మదీయదుహితయౌట నీతరుణియందు నాకు మోహంబు గలుగునట్లు దురాచార ప్రవర్తకుం డగు కాముండు కావించె నింకమీఁద వీఁడు సజ్జనుల కెల్ల నిట్టి యపకారంబుఁ గావించి తపోవిఘ్నం బొనరించుఁ గావున నీమన్మథుని శాపంబున నడంచెద నని కందర్పుని స్మరియించి పురోభాగంబున నున్న మన్మథుని గాంచి దుష్టాత్మకా! నన్ను దుహితృభోగమోహితునిగా నొనరించి యన్యాయప్రవర్తనునిగా నొనరించితివి. కావున క్రుద్ధుం డగుఖండపరశులలాటలోచనాగ్నిజ్వాలామాలికలభస్మమాత్రతనుండవు గమ్మని శపించిన భీతాత్ము లగు రతీకందర్పులు ప్రార్థించి శాపాంతకాలం బడుగుటయు నెప్పుడు నీవు మహేశ్వర నేత్రాగ్నిదగ్ధుండ వగుదు వప్పుడు భండాసురునిచే లోకంబులెల్ల బాధింపఁబడు. తద్బాధానివారణార్థ మమర్త్యు లభ్యర్థించి మహాయాగప్రకారంబున జ్వాలనోదరం

1 దేవలోకనిర్వృతియు = దేవపురసౌఖ్యము.

బున లలితాంబికను బుట్టింతురు. అమ్మహాదేవి కామేశ్వరాంకనివాసిని యై నిన్నుఁ మరలఁ బుట్టించు. నాశాపంబు తప్పదు. నీకుఁ బునర్జన్మంబు మదనుగ్రహంబునఁ గలుగు నని సరసిజాసనుండు పలికె. అక్కారణంబున మన్మథుండు [1]చంద్రచూడాలభాలానలపతంగత్వంబు నొందె. అగస్త్యమునీంద్రా! హరిహర హిరణ్యగర్భదివిజులచే శాపంబు భోక్తవ్యంబ యగు. మన్మథశాపంబు తెఱంగు విస్తరించి వచించితి. ఇంక నేమి వినవలయు నడుగు మని హయగ్రీవుండు వల్కుటయుఁ గుంభసంభవుండు. 819

భండాసురాదులు పుట్టుట.

క. తురగానన! విద్యావి,ద్వరసన్నుత దివ్యచరిత•భండాఖ్యమహా
సురజననము విస్తరముగఁ, గరుణించి వచింపు మనినఁ • గడుఁ బ్రీతి మెయిన్.
తే. పలికె గంధర్వవదనుండు • పంచబాణుఁ, డెచట శంకర ఫాలాగ్ని•నీఱై నచటఁ
బుట్టెఁ దద్భస్మతలమున • భూరిభయద, దానవేశ్వరుఁ డొక్కఁడు•ద్దామభంగి.
క. ఆతఁడు భండాఖ్యను వి, ఖ్యాతుం డయి నిత్యషండుఁ • డై వజ్రసమా
నాతతఘోరాకారుం, డై తగు భుజదర్ప మలర • నవనిఁ జెలంగెన్. 822
క. లోకత్రయము వడంక మ,హా[2]కంథిధ్వానమలర • నతిశయమాయా
ప్రాకట్యై జాచారుం, డై కడుశౌర్యోన్నతుండు • నై యసదృశుఁ డై. 823
తే. దీర్ఘసూక్ష్మస్వకీయాకృ•తియుఁ ద్వగస్థి, శేషతనుఁడు [3]సిరాలుండు స్ఫీతరుచియు
నగుచుఁ బాతాళకర్దమ•శ్యాముఁ డై [4]క,రాళదృగ్ద్వయుఁ డై యొప్పి• రాక్షసుండు.
వ. స్వీయదృష్టిపాతమాత్రంబున జగత్త్రియంబును గాల్చుచున్నట్లు మెఱయుచు నాభీలరథారూఢుండును, యాతనాఖడ్గధారకుండును నై మన్మథభస్మజనితుం డగు భండాసురుండు వెలింగె. ఆతనిఁ జిత్రకర్మగాఢాలింగనం బొనరించి సంతోషంబున నిట్లనియె. 825
క. వినుతింపుము శ్రీశంకరు, ననుపమకరుణాంతరంగు • డాతం డీడు నీఁ
మనమునఁ గలవాంఛితముల, ననిశతరుద్రీయ మిచ్చె • నాతనికిఁ దమిన్. 826
క. అతఁడును శతరుద్రీయము, నతిభక్తి స్మరించి యీశు•నమలాత్ముహరున్
శతవారంబులు పొగడిన, నతికరుణఁ బ్రసన్నుఁ డయ్యె • హరుడు రయమునన్.
తే. భాసమానవృషధ్వజుఁ•బరునిజంద్ర

1 చంద్రచూడాలభాలానలపతంగత్వంబున్ = చంద్రధరుం డగు నీశ్వరుని నుదుటియందలి యగ్నియందుఁ బక్షిధర్మమును. 2 కంథిధ్వానము = సముద్రముచప్పుడు. 3 సిరాలుండు=పుట్టుమచ్చకలవాఁడు. 4 కరాళదృగ్ద్వయుఁడు ఐ = వెఱపునుపుట్టించునట్టి నేత్రముల జంటకలవాఁడై.

ఖండమండిత మకుటుని • ఖండపరశుఁ
గాంచి భండాసురుండు నుత్కంఠ మమర
భక్తి వలగొని కాంక్షించె • వరము వరము. 828

తే. అస్మదీయబలంబుతో • నరిబలార్ధ
మని జవంబునఁ జేరెడు • నట్లు వైరి
యస్త్రశస్త్రౌఘములు వృథ • యై యడంగు
నట్లు వర మిమ్ము నా కని • యతఁడు మఱియు. 829

క. నాబలమును నాయస్త్రము, లేబవరమునందుఁ జెడక • యెసఁగి యరుల నెం
తో బరవసమునఁ జంపంగా బహుళదయన్ వరంబుఁ • గడువడి నిమ్మా. 830

చ. అని యడుగన్ మహేశ్వరుఁడు • హర్షము మీఱఁగ నిట్లు పల్కె నీ
వని యొన దేవదానవుల • నద్భుత రీతి జయింతు వీవు కో
రిన వరబృందమిచ్చితి ; విశృంఖలవృత్తిఁ జరింపు మెల్ల లో
కనుతులఁ గాంచి మించు మని • క్రమ్మఱ నీశ్వరుఁ డిట్లనున్ దయన్. 831

వ. వత్సా! నీతిగలిగి మెలంగుము. నీవడిగిన వరంబు లిచ్చితి. నీభక్తికి మెచ్చి వచ్చె. నీవభ్యర్థింప కున్నను షష్టివర్షసహస్రంబులు నీకు రాజ్యం బొసంగితి నజేయుండవై ప్రవర్తిల్లు మనియె. ఆవృత్తాంతం బంతయు విని సరసిజాసనుండు 'భణ్డో, భణ్డ' అని పలికె. ఆకారణంబున వాఁడు భండాసురుం డయ్యె. శంకరుం డిట్లు వరంబులను దివ్యాస్త్రంబులను గూడ నిచ్చి చెచ్చెఱ సకల మునిగణసంయుతుండై యంతర్ధానంబు నొందె నంత భండాసురుని యనుసరించి విశుక్రుం డనుదుష్టదానవుండు నాతనికిఁ దోడుగ విషంగుండను వాఁడును బుట్టె. విశుక్రుండు భండాసురసమాచారుండును, దీక్ష్ణజ్వాలామయేక్షణుండు నై యుండె నిట్లనుజద్వయంబుతోడ భండాసురుండు వెలింగె ననంతరంబున.

తే. పాపలోభంబులనుగూడి • ప్రబలుమోహ
మట్లు భండుండు వెలసె న • య్యసురుఁ బోలి
శుష్కదేహంబు లొప్ప న • సురులు గొంద
ఱట్లె పుట్టి చెలంగి రు • ద్యమము మెఱయ. 833

సీ. క్రాలిరద్దానవుల్ • [1]గర్తకూపగభీర గల్లకాక్షులును వి • కటవదనులు
వికటనిమ్నోన్నత • విపులోగ్రదంతౌఘ భీషణాకృతులయి • వితతశౌర్య

1 గర్తకూపగభీరగల్లకాక్షులు=గొయ్యవంటియు, కూపమువంటియు, చెక్కిలియు నేత్రములను గలవారును.

దుర్మదోద్ధతులు నా ♦ దుష్టాసురులు త్రిసహస్రకాక్షౌహిణు ♦ లమరభండుఁ
డతిబలశాలి యై ♦ యలర నాతని దైత్యు లట్టె పట్టంబును ♦ గట్ట నెంచి
తే. చండశాసనబిరుదప్ర♦చండు భండుఁ, బట్టభద్రుని గాఁ జేసి ♦ ప్రతిదినంబు
సేవచేయుచు నుండ సం♦సిద్ధరాజ్య, కలితుఁ డై యాతఁ డుండె న♦క్కాలమందు.

ఉ. నక్కలు గూసె ఘోరముగ ♦ నాల్గు[1]వలంకుల ధూసరద్యుతుల్
నెక్కొనె రక్తధారలను ♦ నీరదముల్ గురిసెన్ మహోల్క లే
దిక్కునఁ జూచినం బడియెఁ ♦ దీవ్రముగాఁగ వణంకె భూమి పెం
పెక్కిన రీతి దిక్తతుల ♦ నెల్లను గాల్పఁగఁ జొచ్చె నగ్నియున్. 835

సీ. పాతాళభూనభో♦బహుళతరోత్పాతములు గానఁబడె; దేవ♦తల మనస్సు
లతిమలినంబుల ♦ యయ్యె; నంతట మహేంద్రాద్రిచెంగటను శూ♦న్యక మనంగ
రాజిల్లు పూర్వాంబు ♦ రాశి తీరస్థంబు నై నపురంబు న♦య్యసురవరుఁడు
రాజధానిగ సమ♦గ్రరథాశ్వమదహస్తి భటసంతతినిగూడి ♦ పరసురౌఘ
తే. దేవజాతుల కెల్లను ♦ దేఱిచూడ, నలవి గాకయె చెలఁగుచు ♦ నతివిశాల
సాలపరిఖాసురక్షిత♦సాంద్రగేహ, బహుళమగు నప్పురం బేలె ♦ భాసురముగ.

తే. చాల ప్రియదర్శనులు గుణ♦శాలినులును
నైన సమ్మోహినియును జి♦త్రాంగి, కుముది
నియును సుందరి యన నొప్పు ♦ నెలఁత లసుర
పత్ను లై రంత నాతండు ♦ ప్రబలు వేడ్క. 837

క. ఘనవిభవంబున నచ్చర,లను గూడిన వజ్రిరీతి ♦ లలిలలనౌఘం
బును గూడి దానవేశ్వరుఁ, డనుపమ వైభవము మెఱయ ♦ నలరుచు నుండెన్.

క. జితశత్రువు లతికాయులు, వితతమహాటోపయుతులు ♦ భృగుపుత్త్రి మహా
మతహితులు నైన రాక్షసు, లతిశౌర్యము లొప్పఁ జెలఁగి ♦ రబ్బండపురిన్. 839

క. హరుఁ దలఁచుచుఁ బూజించుచు, హరుఁ బాడుచు నహరహంబు ♦ హరుసేవాత
త్పరు లై సుతపౌత్రధనో, త్కరు లై రాక్షసులు వృద్ధిఁ ♦ గాంచిరి వీటన్. 840

చ. ప్రతిగృహమందు యజ్ఞములు ♦ భాసిలె వేదచయంబు శాస్త్రముల్
సతతము వృద్ధిఁ గాంచెఁ గడు ♦ సంతస మొప్పఁగ రాక్షసోత్తముల్
శితిగళపూజనాదికముఁ ♦ జేయ విశుక్రవిషంగభండులు
ద్ధతి నొకచోటఁ గూడి హిత ♦ తంత్రము నెన్నుచు నుండ వారలోన్. 841

శా. భండాఖ్యుం డనునన్నలార! మనకున్ ♦ వైరుల్ మహాకృత్త్రిమో
ద్దండప్రక్రము లుద్ధతాత్ములు వృథా ♦ దర్పుల్ మహావంచకుల్

1 వలంకులన్=దిక్కులను.

చండాస్త్రప్రబలప్రతాపవిముఖుల్ • స్వర్గైకవాసుల్ గదా
ఖండింపం దగువార లన్నదధిక • క్రౌర్యానలజ్వాలలన్. 842

క. కాకోదరమర్త్యస్వ, ర్లోకంబుల నేని సర్వ•లోకేశ్వరకీ
ర్త్యాకలితుం డగు నింద్రుఁడు, ప్రాకటసుఖరీతి నున్న•వాఁడు గడంకన్. 843

ఆ. కాన వాని నొంపఁ • గాలంబు నవకాశ,మిచ్చె మనకు వినుఁడు• చచ్చెఁ గాదె
కాముఁ డమ్మహేశు•కంటి మంటను మున్ను,మనలఁ జెఱిచెఁ గాదె• మన్మథుండు.

వ. మున్ను మనము కామపీడితులమై యైహికసుఖంబుల మెలంగితి మిప్పుడు చండపరాక్రముం డగు మన్మథుండు దైవవశంబున నడంగె. మరల నాతని దేవతలు పుట్టింపక మున్న మనము దేవతలం గిట్టి నెట్టన జయించి హతవీర్యుల నొనర్పవలయు. నేను దేవలోకంబు నాక్రమించి వారల నొంచెద. మీ రిరువురును సైన్యంబులం గూడి భూమి రసాతలంబుల నాక్రమింప వలయు. మన మీరూపంబులం బోయిన దేవతలు కనుఁగొందురు. కావున వాయురూపులవారలమై దేహంబులఁ బ్రవేశించి ప్రతిదేహంబును రక్తశుక్లంబులు లేకయుండ శోషింపఁజేయుదము. తేజస్సు లెల్ల శుక్లాశ్రితంబులు కదా కావున నవి చెడినదేహంబులు చెడు. కావున నారసంబుల భక్షింతము. భూమి భూరుహసకలస్థలజజలజాదులనుబ్రాణు లనప్రాణులను గూడ శోషింపఁజేయుద మని పలికిన భండాసురువాక్యంబులు విని విశుక్రవిషంగులు బద్ధాంజలిపుటులై మీ వాక్యంబు లెంతయు మనోహరంబు లట్లు కావింపవలయు నని వారిరువురును లోకనాశనతత్పరులై యొక్కొక్కరు సహస్రాక్షౌహిణీసహితులై వెడలి రంత. భండాసురుండును సహస్రాక్షౌహిణీసహితుండై స్వర్గలోకంబును మర్దింప సమకట్టి ప్రయాణం బయ్యె నప్పుడు. 845

భండాసురుండు స్వర్గలోకమును బీడించుట.

తే. పర్వె సురపురినుత్పాత•పంక్తు లపుడు, దారుణక్షోభతుములీక్ర•తస్వకీయ
చిత్తులగు దేవతల కెల్లఁ•జెడుగు గలుగు,నని మనంబునఁ దోఁపఁగ•నంతలోన.

క. శిక్షితరణపరిచయు లగు,నక్షౌహిణు లపుడు వేయి • యమరుల కెల్లన్
వీక్షింప రాకయుండఁగ, నాక్షణమునఁ జేరె భండుఁ • డమరపురంబున్. 847

క. సురల కదృశ్యుడై తన, పరివారము నట్లె రాఁగ • భండుఁడు శక్తిన్
నురచిత్తంబులఁ జేరి త,దురురసమును శోష మొంద • నొప్పఁగఁ జేసెన్. 848

తే. ఆననంబులు మథితంబు• లైనరూప,హైన్య మొందిరి చాల న•య్యమరు లట్లె

రుధిర మెల్లను నానీల • రూప మొంద, నిర్గతశ్రీకులై రంత • నిఖిలసురులు.
తే. మఱియు నుత్సాహశక్తులు • మట్టు పడిన, కతన నాలస్యవర్తన•మతిశయించె
మ్లానవక్త్రంబులనుబొల్చి•మాని రెల్ల, కార్యములఁ జేయుటనుసత్వ•కాంతి లేమి.
క. దనుజుఁడు తమ్మావేశిం,చిన కతమునఁ బుంస్త్వ మెల్లఁ • జెడిన సురౌఘం
బు నపుంసకవృత్తిని గని, వనజాక్షుల పొందు మాని • వర్తిలె నంతన్. 851
క. ఇతరేతరసాహాయ్యం, బితరేతరసంగమంబు • హీనం బగుటన్
వితతబలంబు నడంగుట, నితరసహాయంబు లేక•యే సురలెల్లన్. 852
తే. కర్మవుల నెల్ల మునుపటి • కడఁకపోవ, దైన్యమాలిన్యదుఃఖసం•తతులఁ గర్మ
ముల నొనర్పంగ నాసక్తు•లలర మెలఁగి,రంత భండుని సుభటులు•నతివ లందు.
తే. ఆవహించినవారు వం•ధ్యాత్వవీత, రాగధర్మంబులను రతి•ద్రవవిహీన
తను దగం బొంది లావణ్య•మునఁ జెలంగ, కంగనామణు లెల్లెడ•నార్తిఁ గనిరి.
క. ఆలోకనవైరూప్యము, నాలోనన వృద్ధిపఱచి • రసురభటులు నే
లోలాక్షియు రమణుని దమి,నాలోకింపకయె మెలఁగె • నార్తులు కలిగెన్. 855
క. మునివర! ప్రమదలు సుఖఁ ద్రా,వినమత్తత నొంద రేమొ • పీయూషమదం
బును నిలయ మొందె భండుని,ఘనశక్తిని; వినుము మీఁది•కార్యపు సరణిన్.
క. సురయోషిద్ఘనదృఢ ని,ర్భరకుచములు నాతపమున • వాడి మెఱయుచు
న్న[1]రవిఫలకర్కశత్వము, నిరతము ధరియించి యొప్పె • నిగ్గు దొలంగెన్. 857
క. సురనారీముఖము [2]వలీ, పరియుక్తము మందహాస•వర్జితము రమా
విరహితమును నై కడువా,నరముఖసమ మయ్యె మాని•నాయకచూడన్. 858
వ. మఱియు దుర్భగలును, నిస్సంతానలును, నిర్భోగలును నైరి. భండాసురపీడ ప్రాణులకే కాక నందనోద్యానవృక్షంబులకుఁ గూడఁ గలుగుటయు నవ్విశోషించె. పల్లవంబు లంకురింప వయ్యె. పుష్పంబు లుద్భవింప వయ్యె. మంజరుల యందు భృంగాంగనాసంగమంబు శూన్య మ్మయ్యె. కోకిలాలాపంబులు వనంబున వినఁబడ వయ్యె. సౌరభసంపద గగనసామ్యం బయ్యె • నీచందంబునఁ బ్రాణులకును వృక్షలతాదులకును రసవిహీనత్వంబు సిద్ధించె. అంత భండాసురుండు మరలి శూన్యకపురంబు నొందె. ఆతని తమ్ముం డగువిశుక్రుం డదృశ్యరూపంబున భూలోకంబుఁ జొచ్చి మనుష్యుల నావేశించె నంత భూలోకంబున. 859

1 రవిఫలకర్కశత్వము=జిల్లేడుకాయలవంటి కఠినత్వమును. 2 వలీపరియుక్తము=ముడతలతోఁ గూడినది.

క. మనుజులు భిన్నాకారం,బును బొంది జడాత్ము లగుచు • మోహము లేమిన్
దనయవిహీనత నొందుచు, వనరుచు నభివృద్ధి లేక • వర్తించి రొగిన్. 860

విశుక్రుండు భూలోకమును బీడించుట.

సీ. పీతశుక్లుండు నై • విక్రమితాక్షౌహిణీసంయుతుండు నై • నిఖిలలోక
శూరుండు నై నవి•శుక్రుచే బాధింపఁబడి సిరానద్ధవి•భవవిహీన
గాత్రు లై పీతశు•క్లతను లై వర్తిల్లి రింతులు సంభోగ•హేతు వైన
శోణితపూరం బ•సురభటుల్ ద్రావంగ నద్ది శోషించుట • నలఁత నొంది
తే. భవ్యరాగంబు సౌహార్ద•భాషణంబు
నెఱుఁగ కుండిరి దౌర్మ్ముఖ్య • మెసఁగ వారి
కవని రక్తంబు శుక్లంబు • నలరు నెందు
నందె జంతువు లభివృద్ధి • నొందుచుండు. 861

ఆ. అవ్వి చెడిన నసమ•యంబున విప్లవ, మగును భోగలక్ష్మి • యలరు రక్త
శుక్లములను బొంది • సొరిది నవ్వి నశింప, భోగలక్ష్మి చెడియె•భోగ మడఁగె.

తే. సూత్రపుత్తళికాకృతుల్ • సొరిదిఁ దాల్చి
నిర్వికారలు నై రంత • నెలఁతల ముఖ
మెద్ది భ్రూవల్లితాండవ • మెసఁగ నలరు
నద్ది నశియించె మఱియును • నాలకింపు. 863

సీ. వివిధవిలాసముల్ • వ్రీడావినమ్రత వల్లభాగమనసం•భ్రమము దేహ
సౌందర్యమును దనూ•చారువల్లీపుష్టి, యౌవనారంభంబు • నమలరాగ
గీతముల్ నాటక•కేళికల్ భవ్యలక్షణములు దూతికా•చారు వాక్య
వర్తనంబులు మఱి • పద్మినికాముఖ్యజాతి తద్భావైక • సతతవర్ణ
తే. నంబు లిబ్భంగి నలరారు • శంబరారి, శరములను బోలు వనితల • సరసచేష్ట
లన్నియు విశుక్రుఁడు రసంబు•నట్టె త్రాగెఁ, జెడియెఁ గుంభజ యేమని•చెప్పవచ్చు.

క. విను మవ్వలికతకుంభజ, మునివర! రాజాన్వయములు • మునుకొని నష్టం
బును బొంద రాజ్యలక్ష్మియుఁ, జనియెను నందుండ లేక • చయ్యనఁ గడఁకన్.

క. సంతతినష్టం బగుట ని,తాంతము గృహశేష మయ్యె • ధాత్రి మఱియు సం
క్రాంతాఖిలజంతువు నై, యెంతయుఁ జూడంగ ఖేద • మెసఁగె ధరిత్రిన్. 866

వ. మఱియుఁ [1]గర్కశార్కతిలకటబాలతృణంబులచేతను, గంకగృధ్రజంబూకంబుల

---

1 కర్కశార్క... చేతను-కర్కశ=కఠినములగు, అర్క=జిల్లేళ్ల చేతను, తిలకట=నువ్వుచెట్ల నూఁగు చేతను, బాలతృణంబులచేతను.

చేతను, గృహంబు లావరింపఁబడినకతంబున మిగిలి యున్నమనుష్యులు శోకంబు నొందిరి. మఱియు బాలప్రవాళహృద్యంబులు, మంజుమంజరీపుంజరంజితంబులును, షట్పదీనికురుంబమనోజ్ఞంబులును నగు వనంబులు శుష్కించె. సస్యాదులు నశించె. ఉద్యానంబులు శూన్యంబు లయ్యె. కమలాకరంబులు శూన్యపద్మోత్పలంబులును, నిర్మరాళంబులును, నిర్మృణాళంబులును, నిర్నీరంబులు నై పంకశేషితంబు లయ్యె. మఱియును. 867

ఆ. వెముడు వెదురుటేకుఁ • జిత్రవిషద్రుమ, పంక్తి వనములందుఁ • బర్వెఁ బుణ్య
భూరుహములు చచ్చె • భుక్తికిఁ గఱ వయ్యె, నన్నమింత తినిన•నయ్యె విషము.

సీ. భోజ్యవస్తువులందు • నాజ్యముఖాదుల నరుచియె కన్పడె • నపుడు నరులు
విశ్మశ్రువదనులు • విరహితసాయకుల్ రణపరాఙ్ముఖులు మా•ర్దరణహీను
లును నపుంసకులు నై • తనరిరి గతసస్యయును శుష్కకాసార•యనయు మఱియు
సర్వదాంతర్దాహ•శాలినియును, నూషరక్షేత్రకలితయు • రహితపుణ్య

తే. జననికాయయుఁ దీవ్రపా•షాణసికత
యును, లతాకుంజవర్జిత•యును నితాంత
కాండశేషమహాద్రుమ•కలితయు నయి
భూమి పాడయ్యె నక్కాల•మునను జూడ. 869

వ. మఱియు రక్తాంకురవిహీనయు [1]వీరణసంఛన్నయు నై యుండె. ఇట్లు విశుక్రుండు భూలోకంబును బాధించె నంత భండానురానుజుం డగు విషంగదానవుండు సహస్రాక్షౌహిణీసంయుక్తుం డై రసాతలంబున కరిగి సర్వక్షయంబుఁ జేయ నెంచి విజృంభించి యతండు. 870

విషంగుండు రసాతలమును బీడించుట.

తే. విషమువలెఁ బన్నగంబుల • విలయ మొందఁ
జేసెఁ బాతాళమందున్న • సిద్ధవరులు
తత్కళత్రంబులును బలి•దానవాదు
లెల్ల నన్యోన్యసంబంధ•హీను లగుచు. 871

ఁ. సంతోషవిరహిత•స్వాంతులు దుఃఖాకులాత్ములు నితరేత•రానపేక్ష
యలవడుటను శూన్య•మైనవృత్తులు గల్గి హతజనితక్రోధు • లగుచుఁ గలహ
పరులు నై రంతట • భండానురుం డిట్టు లనుజద్వయంబుతో • నలరుచు మఱి
మూఁడులోకంబులఁ•బోఁడిమి మెఱయంగ బాధించె రసమందుఁ•బ్రబలుచుండు

---

1 వీరణసంఛన్నయు=అవురుగడ్డిచే నాచ్ఛాదింపఁబడినదియు.

తే. ధర్మ మర్థంబు కామంబు • తద్రసంబు, విలయ మొందిన కతన ని • ర్వీర్యు లైరి
శుక్లశోణితములఁ ద్రావె • శూరుఁ డతఁడు, దాన నిర్బలు లై రెల్ల • మానవులును.

వ. వీర్యంబువలనఁ గాదె కాంతిపురోగమంబు లుదయించు. అట్టి కాంతియు, నుత్సాహంబును, ఉల్లాసంబును, విద్యయు, ధర్మంబును, గరుణయుఁ, బ్రీతియు, బుద్ధియు, శస్త్రంబులును, రణక్రమంబులును, శాస్త్రంబులును, గావ్యనాట్యగీతంబులును, లక్ష్మీవత్సర్వవస్తువ్రులును మఱియుఁ దక్కుం గల సర్వపదార్థంబులును భండాసురునిచే విలయంబు నొందింపఁ బడియె. మఱియుఁ గాష్ఠంబుల యందుఁ గూడ స్నేహశూన్యం బగుటఁ దల్లగ్నజ్వాలనుండువానిం గాల్చె. దేహంబులయం దెట్లు శుక్లాదు లట్లు వృక్షంబులఁ దద్రసం బుండు. ఎట్లు ప్రాణంబుల కుత్పత్తి యట్లు ఫలోదయంబును గలుగుఁ గావునఁ బ్రాణులకును దరుగుల్మాదులకును సమత్వంబు వెలయు. అక్కారణంబున మనుజులును వృక్షాదులును సమదుఃఖంబుల ననుభవించె. రసంబె పరబ్రహ్మంబు. రసంబె పరగతియు, రసంబె పురుషులకుఁ గాంతిప్రదంబు. రసంబె రేతస్సనియును జెప్పఁబడు. వేదప్రమాణసంసిద్ధం బగుట రసంబు ప్రాణత్వంబు నొందు. భండాసురుండు గాఢాంధకారసంవీతుం డై తుహినప్రావీతుండువలె నిశ్వాసమలినచ్ఛాయం బగు నాత్మాదర్శమును విస్తరింపఁ జేసె. చంద్రుండును బూర్ణతిథులయందును గూడ క్షయత్వంబు నొందె. తారకలు మాలిన్యంబు నొందె నాసమయంబునఁ బార్వతి వీతరాగయు, విన్యస్తభూషణయు నై దారుణతపంబు నొనరించె. విగతభర్తృ యై యేడ్చుచున్నరతీదేవి కాకాశవాణి భవిష్యత్కాలంబున మన్మథుండు భర్త యగు దుఃఖింపవల దని నుడువుటయుఁ బ్రాణపరిత్యాగంబున విరక్త యై వసంతుఁ డూరడింప నొక్కవనంబునఁ దపం బొనరింపఁ జనియె. మిత్రదుఃఖంబున వసంతుండును ఖిన్నుం డై చనియె నని హయగ్రీవుం డెఱింగింప నగస్త్యుండు. 873

### ఇంద్రాదులు విష్ణుసమీపమునకుఁ బోవుట.

చ. అనఘ మనీష! యశ్వముఖ! • యద్దనుజేశ్వరుఁ డైన భండ దై
త్యుని జననంబు లోకముల • నొయ్యనఁ బీడ యొనర్చుటల్ గదా
వినితిని భండనామకుని • వీరుఁ డెవండు వధింపఁ జాలెనో
యని విన వేడు కయ్యెడు మ • హాత్మ! సమస్తము నాకుఁ జెప్పవే. 874

సీ. అనిన హయగ్రీవుఁ • డనియెఁ బ్రజానాథు లైన బ్రహ్మాదులు • నట్లె మనువు
మొదలుగాఁగల మహా • త్ములు జిష్ణుముఖు లైన సురలు ప్రహ్లాదాద్య • సురగణంబు

వహ్న్యాదిదిక్పాల•వర్గంబుఁ జారణసిద్ధగుహ్యకులును • జెలఁగి తమ్ముఁ
జండప్రతాపుఁ డౌ • భండుఁడు పీడింప నిశ్శక్తశుక్లులు • నిర్గతాస్త్ర
తే. శస్త్రవైభవులై వైరి • సత్వయుక్తు, నని జయింపఁగఁ జాలక • మన మిఁ కేమి
చేయవలెనంచు దుఃఖంబు•చేత మలిన,చిత్తులై యందఱొక చోటఁ•జేరి పూనిక.

చ. హరిఁ గలశాబ్ధిశాయిని మ•హాత్ము ననాది ననంతు నచ్యుతున్
శరణము వేఁడు టొప్పు నని • చయ్యనఁ బోయి మహార్తులై పయో
ధరమును జాతకంబువలెఁ • దద్దయుఁ బ్రార్థనచేయ నాతఁడున్
స్మరవిరహంబుచేఁ దనదు • చాననులక్ష్మిని వీడి ఖిన్నుఁడై. 876

ఆ. ఘనసుషుప్తియోగ•కలితుఁడై శయనించి, యున్నవాఁడునయ్యు • నోగి ననేక
విబుధనుతులఁ దెలిసి • వేగమె దీనులఁ, గాంచి వారు వేఁడు • కార్య మెఱిఁగి.

క. సురవరులతోడ ని ట్లను, హరి కుశలమె దివిజులార • యగు నె ట్లది మీ
సురుచిరముఖములు మలినత, నురుతరముగఁ దెల్పె నిప్పు • డూహింపంగన్.

క. ము న్నున్నరీతి రుచిసం,పన్నములై మోములేమొ • భాసిల్లవు; నేఁ
డున్నత మగు నంగద మిముఁ,గ్రన్నఁ బొందెనొకో యేమి • కారణ మొకో.

తే. సంతతోష్మాయమాణదో•స్సారములును, గానఁ బడియెడి నిస్సార•కంబు లగుచు
నేత్రములునశ్రుపూరంబు•నిండఁగలుష,ములుగ నున్నవి దేహంబు•లలర వేమొ.

క. సిరి తొలఁగిన వారలు బలె, గురుతరదౌర్భాగ్యయుక్తిఁ • గొనినట్లు కటా!
సురలార మీరు కనఁబడఁ, గరము విచారంబు నాకుఁ • గలిగెడి మదిలోన్.

తే. సంతతానందజలనిధి•సౌఖ్యరూపుఁ, డౌ మహేశ్వరుఁడే వీర•మందు నెనఁగు
మన్మథాత్మక మయ్యది•మహితవీర్య, మది యదృశ్యతఁ గనిన భం•డాఖ్యుచేత.

తే. విలయ మొందింపఁగాఁ బడె • విక్రమాఢ్యుఁ
డైన భండుండు మాయావి • యతఁడు మదన
విలయసంభవుఁడై యిట్లు • వెలసి మీ యు
దారతేజంబుఁ దద్గుణ•తతులఁ జెఱిచె. 883

క. ఇదె యింద్రుని కులిశం బి,య్యది దానవగర్వములను • నతిహర్షమునన్
గుదియించు; నిపుడు తేజము, చెదురుటఁ గన్పడెడు [1]వివిష•జిహ్వాగరీతిన్. 884

క. హుతవహుని శక్తిచూడఁగ, వితతారిప్రకటబాహు•వీర్య మడఁగు న
ట్లతులితగతి మును మెఱయును, గతి యేది యడంగి యిపుడు•కనఁబడు నకటా!.

సీ. చండారిదోర్దండ•ఖండనోద్దండమై క్రాలెడు కాలుని • కాలచండ

1 వివిషజిహ్వాగరీతిన్ = విషములేనిపామువలె.

మప్రతిహతరీతి • నలరు కోణపుఖడ్గ మప్పతిపాశంబు • ననిలు ధ్వజము
యక్షాధినాథుని • యష్టియు నీశానుశూలంబు నీ యవి•చూడ నిపుడు
శాంత తేజంబును • సతతవికుంఠితంబును జాల దుర్బలం•బును వికాంతి
తే. కంబ,నుజ్వల, మతిశాంత•కంబు నయ్యెఁ, గటకటా! మీముఖంబులు• కాంతిదప్పి
రాహు సంఛన్నమూర్తి యౌ•రాజు పోల్కి, నున్నవిప్పుడు భండుని•యుగ్రపీడ.
వ. అదృశ్యుండును, దురాశయుండును నగు భండుని యదృశ్యాదివ్యాయుధంబుల చేత సర్వజంతుగాత్రంబులు కీలితంబు లయ్యె నితరులమాట యిట చెప్ప నేల నాకును లక్ష్మియందు వైరాగ్య మంకురించెఁ గావున భండాసురోద్దండశస్త్ర సంపాతమూర్ఛితంబుగాని శరీరం బీచరాచరంబులయందు లేదు. బ్రహ్మాండగోళంబున నున్న దేవతిర్యఙ్నరాకారు లెల్లను దుర్బలు లై యున్నవారు. నేనును బ్రహ్మయు రుద్రుండును గారణపూరుషుల మయ్యునుండ మధ్యంబున నుండుట భండుని బాధ మాకును నంకురించె. అండాతీతుండును, బరాశక్త్యావృతుండును, [1]జిద్ఘనశరీరుండును నగు మహాశంభుం డగు నొక్కపురుషుండు కలఁ డాతనికిఁ గాను నాశోత్థభండదైత్యపరాభవంబు లేదు. ఆమహాదేవుండు నిరాలంబుండును,నిర్వికారుండును,బరాత్పరుండును నగు. ఆమహాదేవుని యనుగ్రహంబున భండవధోపాయంబు మీచే నెఱుంగ నగుఁ గావున మన మందఱ మమ్మహాత్ముని వినుతింత మాతండు మనకిష్టం బెద్ది యైన నిచ్చు నని వారలం గూడి పంకజాక్షుండు చనియె. వారలందఱు బ్రహ్మాండభిత్తిసమీపంబున కరిగి తద్భేదనోపాయంబుఁ జింతించి దిగ్గజంబుల రావించిన మదక్లిన్నకటస్థలంబు లగు నాదిగ్దంతులువచ్చి కఠోరదంతపాతనంబుల నూఱుసంవత్సరంబులకు బ్రహ్మాండభిత్తిని భేదించె. ఇట్లనేకయోజనదీర్ఘం బగు నండభిత్తియందు రంధ్రంబు గనఁబడుట నమ్మార్గంబునఁ బోయి బహిరండంబు నాశ్రయించి రందుఁ జిన్మయంబును, నిరంజనంబును నగు నాకాశం బభూమియు నజలంబు నజ్వాలం బమారుత సమాగమంబు నై యుండె. అం దాకాశమయుం డగు శంకరుని హరి బ్రహ్మశక్రాదు లిట్లని స్తుతించిరి. 887

మహాశంభు స్తుతి.

సీ. అద్వయంబును శాంత•మతినిర్మలంబు మాయాతీతమును మహా•మజము నై ని
రస్తగుణాళిసం•ర్గంబు నై రాజిల్లు నట్టి మహాశంభు • నభినుతింతు
మాదిత్యవరులకు • నరయ శక్యముగాక యొసఁగి యోగులకు సం•ధ్యేయుఁడగుచు

1 చిద్ఘనశరీరుండు = జ్ఞానమయమై గొప్పది యగుదేహము కలవాఁడు.

వేదజ్ఞులకు నెల్ల • విదితస్వరూపుఁ డా శంభుని గొల్తుము • సంతతంబు

తే. సత్తసత్తులు గాకయు • సమధిక మయి, యలరి సదసత్తుగాకయు • నద్వయంబు
నద్వయంబునుగాకయు • నమరునెవని, తేజ మాశంభు శివు వినుతింతుమెలమి.

క. తనయందె పుట్టి తానే, తనునెఱిఁగి స్వయంప్రకాశ•తం దనరి యనం
జనుఁడై నిర్విణ్ణుండై, తనరు మహాశంభునెపుడు • దలఁతుము భక్తిన్. 889

సీ. వేద్యంబు వేత్తయు • విత్తియు ననునీ త్రిపుటివిస్మృత్వరియా త్రి•పుటియు నగుచు
నెద్దాని నంటక • యొసఁగు స్వయంప్రభ నట్టి శంభుని గొల్తు • మహరహంబుఁ
దనరు ధర్మాధర్మ•తద్విపాకంబుల సుఖదుఃఖముల నెద్ది • చొరఁగఁ బడదా
యట్టి పదంబున • కధిపతియగు శంభు శివు నుపాసింతుము • చెలఁగి భక్తి

తే. భాస్కరుఁడు సౌరులకు నెల్లబ్రహ్మవాదు,లకును బ్రహ్మముసౌగతు•లకును దలఁప
నెవఁడు విజ్ఞానమై వెలు • హితకరుఁ డగు, నటిశంభు నుపాసింతు•మాదరమున.

తే. లలితలోకాయతిక ముఖ్యు•లకు స్వభావ
మయనువిగ్రహుఁ డై యొప్పి • మఱియు క్షణికు
లకు క్షణాకారుఁ డై వెల్గు • ప్రకటరూపు
నమ్మహాశంభు గొల్తుము • హర్షమునను. 891

తే. మాధ్యమికులకు శూన్యుఁడై • మహితసాంఖ్యు
లకును బురుషాత్మకుం డయి • యకలుషాత్ముఁ
దనరి పాతంజలులకు శా•బ్దంబు నగుచు
నొప్పు నాశంభు సేవింతు • మొగి సుభక్తి. 892

ఆ. [1]కారువులకు విశ్వ•కర్మయై శైవుల, కెల్ల శివుఁడు నగుచు • నెసఁగి పాంచ
రాత్రులకును యోగి•రమణుఁ డౌ విష్ణువై, చెలఁగు శంభు సేవ•చేయుదు మొగి.

సీ. కామసూత్రులకును • గామేశుఁ డయి నిధివిదుల కర్థేశుఁడై • విమలుఁ డగుచు
వైద్యులలోపల • వైశ్వానరుం డయి వఱలు మహాశంభు • భక్తిఁ గొలుతు
మతిదయావంతుల • కతిధర్మదైవమై యుగ్రులలోపల • నుగ్ర దైవ
తంబునై కర్మఠ•తతి నుపాస్యాఖ్యమై యొప్పు శంభు నుతింతు • మురుముదమున

తే. బ్రాహ్మణుల కగ్నినిలయుఁ మై • భవ్యయోగి
తతికి హృత్సంస్థితుండు నై • తనరి జడుల
కెల్లఁ బ్రతిమాస్వరూపుఁడై • యొసఁగు నతని
గొల్తు మేము మహాశంభుఁ • గుతుక మలర. 894

1 కారువు = వడ్రపు పనిచేయువాఁడు.

వ. జంతువుల కాదిభూతుండును, సర్వాంతకుండును నై తానసంతుండు నై వెలయు సర్వేశ్వరు నుపాసింతు మని మఱియు దేవత లెల్ల మహాత్మా! మాకదృశ్యుండ వైనను ధ్యానావిషయుండ వైనను మాప్రాణంబుల రక్షణంబుకొఱకు మానేత్రంబులకు దృశ్యుండవు కమ్ము విపరీతసమాచారులును దుష్టులును నగు భండాదిదానవులు మమ్ముఁ బీడింప నీప్రాపున కరుదెంచితిమి. దుర్బలులము విభగ్నులము నీరసులము నగు మ మ్ముద్ధరింపుము. శత్రుపీడితులము భక్తులము నగు మ మ్ముద్ధరింపవేని నీకే కీర్తి హాని యగుఁ గావున దర్శనం బిమ్మని హరివిధిశతమఖాదులు వినుతింప నంత. 895

చ. పరశివుఁ డప్డు శక్తి తన•పార్శ్వమునం దలరార వారిదో
త్కరసమకాంతికంధయును • గాఢకపాలము శూలముల్ దగం
గరయుగ మొప్ప సుస్మితము•ఖంబు చెలంగఁగఁ దోఁచె ముందటం
బరశివ శక్తి శీలరుచి•భాసమ దేహుయు నై కనంబడెన్. 896

క. కరుణాకరు లాదంపతు, లరుదుగ దర్శన మొసంగి • యమరవరుల నా
దరమునఁ గని రంతట నా, పరశివుఁ డిట్లనియె వక్త్ర•పద్మం బలరన్. 897

పరశివుఁడు దేవతలకు భండవధోపాయమును జెప్పుట.

చ. క్రతుభుజులార మీరు కడఁ•కం జనుదెంచుటయుం బరాఘ మ
ర్దితు లయి యార్తు లౌటయును • దెల్లముగాఁగ నెఱుంగుదుర్ మహో
ద్ధతగతి భండదానవుఁడు • దౌష్ట్యము లోకవినాశకంబుగా
వితతభుజాబలంబు నురు•వీర్యముఁ బొంగఁగఁ జేయుటల్ మదిన్. 898

చ. ప్రళయము ముప్విధంబులుగ • వర్తిలు నందు నొకండు నౌ మహా
ప్రలయము కామనామకము • రాజిలు రెండవ దై యవాంతర
ప్రళయము నౌను మూఁడవది • పద్మభవాండమునందు నిత్రయం
బల రెడు దీనికిం బతులు • నైరి త్రిమూర్తులు వేఱు వేఱుగాన్. 899

తే. ఆద్య మైన మహాప్రళ•యమున కేన, పరఁగునుద్ధారకుండ న•వాంతరప్ర
ళయమునకుఁ జక్రియానుద•లంప నధిప,తియ దె రెండవదాముని•తిలక వినుము.

క. లలత చెలంగును గామ, ప్రళయోద్ధర్త్రి యయి యిట్లు • ప్రత్యండమునం
జెలఁగు నివు డిద్ది కాముని, విలయంబునఁ గానికావ్యా•విశ్రుత మయ్యెన్. 901

తే. అస్మదంశంబునను బుట్టి•నట్టి యీాశు,ప్రబలరోషాగ్నికీలల•భస్మ మయ్యెఁ
గాముఁ డాభస్మరాశిని • గలిగి నట్టి,భండముఖ్యులచే భువి • బాధ నొందె.

క. వినుఁడు జగంబు విసారం, బనయము నిర్గంధకుసుమ • మై నిహతం బై

కన నయ్యె మృతప్రాయము, గను గావున లలిత మరలఁ ♦ గడునూత్నముగన్.

క. లోకంబుల సృజియించెడు, నాకరణి నొనర్ప మీరు ♦ యత్నింపుఁడు నా
నాకేశముఖ్యు లిట్లని, రేకరణి జనించు లలిత ♦ యే స్థానమునన్. 904

క. ఏకర్మము చేసిన నగు, మాకార్యము దానిఁ దెలుపు ♦ మామీఁది కృపన్
శ్రీకంఠ! లోకపాలక, మా కెల్లను దిక్కు నీవ ♦ మహితాత్మ యనన్. 905

క. వినుఁడు మహాయాగం బనఁ, దనరు మహాహోమవిధిని ♦ దత్కార్యము చే
సినఁ గలుగు నిష్ట మవ్విధి, నొనరింపుఁడు దివిజులార! ♦ యుద్యమ మలరన్.

తే. అనిలరూపంబు ధరియించి ♦ యాగమందు
హోత నయ్యెద నాదు వి♦ఖ్యాత మైన వె
లుఁగు చిద్వహ్నియే యగ్ని♦లోకమందుఁ
దనరు నగ్నియు హవ్యవా♦ట్టనఁగ నెగడు. 907

ఆ. శుష్కసర్వజలవి♦శోభితసప్తమ, జలధి కుండ మౌను ♦ సాగరంబు
లాఱు యాగమందు ♦ నభిఘారమున కవుఁ, బంచసృష్టు లౌను ♦ బశువులందు.

సీ. పంచసృష్టుల వచి♦యించెద మానసి యవలజా గాయవి♦యాండి స్వేద
జయును నుద్భిజ్జయీ ♦ సరణిసృష్టులు నైదు నగుఁ బురోడాశత ♦ యజ్ఞమందు
సృష్టిపంచకభిన్న♦సిద్ధముల్ భూభూధరాంబు వాతాభ్రంబు ♦ లౌను హవ్య
కల్పనంబును జేయఁ ♦ గడు నొప్పు హవ్యనిచేత సామాన్యాగ్ని ♦ చిజ్జ్వాలనుని
తే. యందు నేకీభవించు ని♦ట్లమరులార
మీర లెల్లరు నాయందు ♦ మెలఁగు భక్తి
చేతఁ బ్రేరితు లయి జ్వాల♦చ్చిజ్జ్వాలనుని
యందుఁ బడిపోవ వలయు నె♦య్యమునఁ గడఁక. 909

వ. ఇట్లు సర్వపదార్థంబులు హోమంబు చేయఁబడుచుండ సూర్యాద్యోల్లంఘిత తేజస్సులవలన జక్రాభిధానరథారూఢయుఁ, దటిత్కోటిసమాకృతియు, సమస్తసౌందర్యమయియు నగు లలితయావిర్భవించు. అనంతరంబ యప్పరదేవి సిస్మితోన్ముఖశాలిని యై స్వాత్మవలనఁ బుంరూపంబును బుట్టించు. అదియే కామరాజాఖ్యం బగు పరబ్రహ్మంబును దత్పతియు నగు. ఆదంపతులవలన సర్వప్రపంచంబు పుట్టు. అటమీఁద సర్వంబును నవనవాకారం బై లలితాప్రసాద మాహాత్మ్యంబునఁ బూర్వంబుకంటె నత్యంతసుందరం బగు. ఇక్షువచాపంబును, బుష్పేషుపంచకంబును, దృతీయాస్త్రం బగు పాశంబును, దురీయాస్త్రం

బగు[1]మహాస్సృణియు ననఁబడు నస్త్రచతుష్కం బవతరించు. ఈ నాల్గుతెఱంగు లగు దివ్యాస్త్రంబులం బూని లలితభండాసురుని సంహరించు. అవలోకంబువలన మన్మథుని మరలఁ బుట్టించు. చిద్వహ్నిహవ్యరూపంబు లై త్యక్తప్రాణంబు లగు మీ దేహంబులు నవాకారంబు లయి విలసిల్లు. ఈరీతి మహాయాగం బొనరింప మీకు సమ్మతంబ యేని నేనును బ్రయత్నించెద. వేఱయుపాయంబున భండాసురపీతసర్వస్వతేజంబులు ప్రాణమాత్రశిష్టంబు లై నశించు. మీ మరణంబున బ్రహ్మాండంబునకు క్షయంబు గలుగు నిస్సంశయంబు. కావున మీ రీప్రయత్నం బొనరింపుఁ డని మహాశంభుండు పలుకుటయు దేవవరు లెల్ల ని ట్లనిరి. 910

చ. పరశివ! మీ యభీష్ట మగు • పద్ధతిఁ జేయఁగ సందియంబె మీ
కరుణఁ గృతార్థజన్మలము • కాఁ గల మింక భవచ్చిదగ్నియం
దురుగతి భ్రమంది వే మరల • నొయ్యన నూతనశక్తి రూపసుం
దరతఁ జెలంగు వార మది • నాకులకెల్లను క్షేమకార్యమే. 911

సీ. ఈరీతిఁ జేయంగ • నేముఁ బూనుదు మీశ! హోత వై యొనరింపు • ముగ్రమఖము
మీ యాజ్ఞచొప్పున • మెలఁగుదు మేమెల్ల నెఱుఁగ మేమియు సు • మహేశ! మాకు
క్షేమకార్యం బెద్ది • చేయంగ నగు దానిఁ జేయుము కరుణచేఁ • జెలఁగి యనుచుఁ
బ్రార్థింపఁగా వారి • పలుకుల నాలించి య ట్లగునని పల్కి • యాహరుండు
తే. దృష్టిగోచరుఁ డయ్యె స • తీయుతముగ, నంత దివిజులు దిగ్దంతి • దంతభిన్న
భూరి[2]విధ్యండభిత్తిని • బూర్వరీతి, వెడలి పర్వతముల దాని • వేగ కప్పి. 912

క. మునుపటివలె గృహములకును, జని యాగము సేయ నెంచి • శంకరునుతులం
దనుపుచునుండిరి శంకరుఁ, డును జగదుపకారమును గ • డుం దమిఁ జేయన్.

వ. యత్నించి బ్రహ్మాండబహిస్థితచిదాకాశమయగృహంబును బ్రవేశించి సూక్ష్మరూపుం డై యుండెనని హయవదనుండు పలుకుటయు. 914

## మహాయాగవిధానము.

చ. తురగగళుండు దేవతల • తో హరుఁ డిట్లు వచించె నంచు నా
దరమునఁ దెల్పఁ గుంభజుఁడు • తద్దయు విస్మయ మొంది యశ్వకం
ధరుని మహాత్ముఁ గాంచి గుణ • ధామ! విచిత్రముగాఁగ నెట్లు ల
వ్వరమఖ మయ్యె నే ఫలము • వారికి లోకహితార్థ మబ్బెనో. 915

క. వినవలతు వేడుకయ్యెడ్, ననుపమ మాయాగవిధము • నంతయుఁ జెపుమా
యని వేఁడిన నాకుంభజుఁ, గని హయవదనుండు పల్కె • గారుణ్యమునన్.

1 మహాస్సృణి=గొప్పదియగు నంకుశము. 2 విధ్యండభిత్తిని=బ్రహ్మాండముయొక్క గోడను.

చ. మునివర! యాలకింపు మిఁక ♦ బూన్కి మహోదయ మా మహామఖం
బును భయభక్తులం జదువఁ ♦ బోవు నఘంబులు విన్నమాత్రనే
జనికృత మైన పాపతతి♦ చయ్యన భస్మ మగుఁ వచింతు నే
మని పలుమాఱులుం జదువ ♦ నద్ది పరామృతభాజనం బగుఁ. 917

తే. ఎవ్వఁ డీ యాగవర్తన ♦ మేకవార, మతులభక్తిని వినిన న♦య్యనఘుఁ డపుడ
రాజసూయసహస్రవి♦రాజమాన, ఫలము నిస్సంశయంబుగఁ♦ బడయు నతఁడు.

సీ. శ్రీమహాశంభుండు ♦ చేరి స్వాలయమును దానుహోతయుఁ దన ♦ తరుణియజ్ఞ
పత్నియు నై యొప్ప ♦ భక్తిచే లలితైకవిద్యను స్వాత్మసం♦విత్తుఁ బూని
యుచ్చరించుచు దేవ♦తోద్యమమును దీర్పఁ గడఁగి సప్తస్కంధ♦ఘనసమీర
మయ మై స్వదేహంబు♦మహిత మై చెలువారఁ బరశక్తికినిగ్రియా♦ఫలము నౌట

తే. కతన నా పరశక్తిచేఁ ♦ గడఁగి శివుఁడు, వాయురూపంబుచే జగ♦ద్వార మెల్లఁ
జంచలత నొందఁ జేయంగ♦ జంచలించె, ద్రిజగములు శంభుపవమాన♦తీవ్రశక్తి.

చ. కనుఁగొని దేవవర్యులు మ♦ఖంబును దీక్ష నొనర్పు మంచు నీ
శుని బరువేఁడఁగా నపుడు ♦ శూలి జగత్త్రయముం గడంగి చ
య్యనఁ జలియింపఁ జేసి చెలు♦వారెడు సప్తమసీరసింధువుఁ
ఘనతమయాగకుండమును ♦ గా నొనరింపఁగ నెంచి యంతటన్. 920

ఆ. శుద్ధనీరజలధి♦ శోషింపఁ గాఁ జేయ, నద్ది శాంభవాగ్ని♦నజల మగుచు
నప్పు డారసాత♦లాతి గంభీరదీర్ఘఖనిగాఁ జెలంగఁ ♦ గాంచి హరుఁడు. 921

క. ఆసింధుఖనిని గుండము, గా సరగునఁ జేసి కాల♦కంఠుఁడు పూన్కిం
జేసెను నాల్గుతెఱంగులు, గా సకలోద్భిజ్జములను ♦ గడు నేర్పు మెయిన్. 922

వ. ఉద్భిజ్జాలచతుర్థాంశంబును రాశిగా నొనరించి యమ్మహాఖనియందు సింహాసన విద్యను జపించుచు హుంకారంబును జేయ నా ఘోరహుంకారశబ్దంబున [1]నాధ్మాతవిగ్రహుఁ డై చిజ్జ్వలనుం డామూలం బా బ్రహ్మబిలంబుగా మండె నా సంవిజ్జ్వలనుని నిజభాలక్రోడలోచనకోటరంబువలన నీశుండు వెడలించి యమ్మహాఖనియం దునిచి నంత సాగరకుండాంతంబు నుద్భిజ్జ్వాలసమాగతుం డగు శాంభవానలుండు వితతజ్వాలాజటాలుం డై ప్రజ్వలించె. ఇట్లన్వాధానంబుచేసి సద్విద్యాపూతంబును జిదాత్మకంబును నగు నగ్ని ప్రజ్వరిల్లుటయు.

సీ. తారకాపుష్పసం♦తతులచేఁ గుండంబుఁ బూజించి యగ్న్యష్ట♦మూర్తులను గ్ర
మంబున నర్చించి ♦ మఱియు షణ్మూర్తి యా నగ్ని నారాధించి♦యందు మధ్య

1 అధ్మాతవిగ్రహుం డై=ఊదఁబడిన శరీరముకలవాఁడై.

తలమున మూర్తిత్రి•తయము నారాధించి సంస్కార మీరీతి • జ్వాలను నందు
హోత యా శ్రీశంభుఁ • డొనరించెఁ గుంభజ! విను మగ్నిమూర్తుల• వే వచింతు

తే. జాతవేదుండు ప్రథముండు • సప్తజిహ్వుఁ
డనఁగ రెండవయగ్ని యా•హవ్యవాహ
నుఁడు తృతీయకుఁ డశ్వోద•రుఁడు చతుర్థుఁ
డల్లె వైశ్వానరుఁడు పంచ•మాగ్ని యయ్యె. 924

వ. కౌమారతేజుండు షష్ఠముండు. విశ్వేదేవముఖులు సప్తమాష్టమాగ్నులైరి. ఇఁక షణ్మూర్తుల నెఱింగించెద. సప్తార్చి, స్వస్తిపూర్ణుం డుత్తిష్ఠపురుషుండు, ధూమవ్యాపి, సప్తజిహ్వుండు, ధనుర్ధరుండును నన నొప్పుదురు. వైశ్వానరోత్తిష్ఠపురుషచిత్పింగళు లనువారు త్రిమూర్తు లనఁబడుదురు. విను మంత శంకరుండు సంవిదగ్నిజిహ్వాయందు సప్తప్రకారంబులఁ బూజించె నెట్లనిన హిరణ్యయుఁ, గనకయు, రక్తయుఁ, గృష్ణయు, సుప్రభయు, నతిరక్తయు, బహురూపయు ననునివి సప్తజిహ్వాలు నానొప్పు. ఈరీతిఁ బూజించి పుష్కలావర్తకంబులను దర్వులను గా గ్రహించి. 925

క. ఘృతనీరరాశి ఘృతమును, శితిగళుఁడు పరిగ్రహించి • చెలఁగుచు జలదా
కృతిదర్విని వేల్చెను భ,క్తితగం జిద్వహ్నియందుఁ • దీవ్రస్ఫురణన్. 926

సీ. రమణ శ్రీ శివరాజ • రంహస్విమారుతప్రేరితంబై యప్డు • పృథునినాద
పుష్కలావర్తకం•బును ఘృతోదధిఘృత మంతయుఁ ద్రావి స•హస్రలక్ష
కోటివిధంబులఁ • గురిసె ధారాకృతి భూధరంబులఁ బోలి • పొలిచె ధార
లయ్యాజ్యధారల•నగ్నియు శతయోజనాయతోర్ధ్వస్థల • మాక్రమించె

తే. మరల నుద్భిచ్చతుర్థాంశ•మాత్రము హరుఁ
డంత గ్రహియించి వైచి య•య్యగ్ని మఱియుఁ
బుష్కలావర్తదర్విచేఁ • బూని దధిప
యోధిదధి వేల్చె నంత నా•హుతవహుండు. 927

తే. ద్విశతయోజనపరిమిత•దీర్ఘశిఖల, మండె నుద్భిద్విజచతుర్థ•మహితభాగ
మునుసమిధగాఁ గైకొని•యనలునందు, వేల్చియిక్ష్వబ్ధిస్రుక్కుచే• వేల్చెహరుఁడు.

చ. హుతవహుఁ డిక్షుసాగరము • నొయ్యనఁ ద్రావుచు మత్తుఁడున్ బలెన్
జతనము మీఱ నాట్యమును • సల్పెడు నట్టులు పొంగిపొంగి స
ద్గతిఁ ద్రిశతైకయోజనము • గా వెస మండుచు నూర్ధ్వభాగ ము
ద్ధతిఁ దగ నాక్రమింపఁ గని • దారుణదీక్ష చెలంగ శంభుఁడున్. 929

తే. పూన్కి మధ్యసముద్రంబు ♦ భూరిదర్వి, చేత సకలంబుఁ గైకొని ♦ చిద్ధుతవహు
నందు వేల్చిననయ్యగ్ని♦యట్టైమండె, నుద్యమమునఁజతుశ్శత♦యోజనములు.

క. హరుఁ డుద్భిత్సముదాయం, బురుగతి నంతయు గ్రహించి ♦ యుప్పు కడలి పు
ష్కరమును వారిదదర్విని, ధరియించి చిదగ్ని వేల్చెఁ ♦ దగునియమమునన్.

తే. చటచటాత్కార నిర్ఘోష♦సాంద్రభయదుఁ
డగుచు నయ్యగ్ని మండిన ♦ నాక్షణంబ
భండముఖదైత్యచిత్తముల్ ♦ భయము నొంది
కంపనము నొందె నంతటఁ ♦ గాలగళుఁడు. 932

క. క్షీరమహాంబుధిని మహా, వారిదదర్విని గ్రహించి ♦ వడి వ్రేల్చిన న
మ్మారాంతకాట్టహాస, స్ఫారతధవళార్చు లలర ♦ జ్వలనుఁడు మండెన్. 933

ఉ. ఘోరరవప్రభిన్నబహు♦కూటలసత్స్ఫటికాద్రి యైన దు
ర్వారచిదగ్ని మండుటయు ♦ రాజధరుండు మహోద్ధతిన్ మహా
వారిధి సప్తకంబు స్థల♦భాగవిశేషము నొట నెంచి యా
ఘోరమహాగ్నిభీతి కర♦కుండమునందున లోకజాలమున్. 934

సీ. హోమంబు గావింప ♦ నుద్యమించి మహేశుఁడవనిని దాఁదాల్చె♦యట్లై శేష
ముఖు లైనపన్నగం♦బుల వాయురూపుఁ డై యాకర్షణముసేయ ♦ హరునితీవ్ర
రంహస్సమాకృష్ట♦రాజత్ఫణామణి ప్రభ లొప్ప నంజలి♦బంధములను
జెలఁగుచు నాకాశ♦సీమయు వెలుఁగంగ నలరుచుఁ గర్కోట♦కాదు లగ్నిఁ

ఆ. బడిరి పన్నగముల ♦ పంక్తుల నిటు వేల్చి, యష్టదిగ్గజముల ♦ నతిమదార్త
కటతటములఁ బిలువఁ ♦ గడుఁ దమిరక్తప, ద్మాకరమును బోలె♦నగ్నిఁ జొచ్చె.

తే. మఱియు భారతవర్షీయ♦మనుజ సముద, యంబు భద్రాశ్వవర్షీయ ♦ లైనవారి
నుత్తరకురుస్థజనులఁ బ్రా♦చ్యుల నుదీచ్య, మధ్యదేశస్థు లైనట్టి ♦ మనుజతతుల.

వ. మఱియు నానాద్వీపసమాశ్రితులను నాకర్షించి హోమంబుచేసె నిట్లు రసాతల
ద్వంద్వంబు నిశ్శేషఫణిమానుషం బగుటయు జ్యోతిశ్చక్రగతు లగుగ్రహంబు
లను నక్షత్రంబుల నశ్విన్యాదితారకంబులను దేవతలను హోమంబు చేసెనంత.

చ. హరిహయు దొట్టి దిక్పతులు ♦ నాసురకిన్నరచారణౌఘకిం
పురుషులు సిద్ధసాధ్యులును ♦ భూరిమదోద్ధతదేవజాతు లె
ల్లరమణ స్నాతు లై మృదుల♦లక్షణశుద్ధమహాంబరంబులన్
వరమణిభూషణంబులను ♦ భాసురరీతి ధరించి ప్రీతితోన్. 938

క. అలరుచు భక్తిని బద్ధాం, జలిపుటు లయి ప్రీతిహాస♦సంఫుల్లముఖా

బ్జు లగుచుఁ దమతమ వాహనములుఁ దమతమ పరిజనములు•భూషణవితతుల్.
ఆ. వెంటనుండవచ్చి • వెసభండదూషిత, తనువులను ద్యజింపఁ • దలఁచి జ్ఞాన
హవ్యవాహునియందు•నతిమోదమునఁ బడి, రశ్వినులును వసువు • లవ్విధమున.
క. ఆదిత్యులు పితృగణ మే, కాదశరుద్రులును జంద్ర•హారికిరీటుల్
శ్రీదర్పితగణసంయుతు, లై దహనునియందు బడిరి • హరు నాజ్ఞ మెయిన్ 941
చ. సనకసనందనాదిముని•సంఘముతో నిజభృత్యయుక్తుఁ డై
కనదురు పంచశస్త్రములఁ • గ్రాలుచు లక్ష్మియు భూమి వెంట రా
వనరుహనేత్రుఁ డెంతయును • వైఖరిమీఱఁగ సుస్మితాస్యుఁ డై
యనుచరయుక్తుఁ డై పడియె • నగ్ని జగత్తతిసమ్మదార్థ మై. 942
సీ. ఆనీలకంధరుఁ • డబ్జారిచూడుండు గంగావతంసుండు • భృంగి నంది
కరివదనాద్యనే•కగణపయుక్తుండు భోగిభూషణుఁడు వి•భూతికలిత
తనుఁడు నా శంకరుఁ • డనలుఁ జిద్రూపుని గాంచి భక్తిని బ్రవే•శించె నందు
నజునిచేఁ బ్రేరితు•లైన షట్షష్టికోటులు దేవతలు నచ్చ•రలును జొచ్చి
తే. రాహుతాశను నందు; దు•రాత్ము లైన, దారకాసురభండాది•దనుజవర్యు
లమ్మహాయజ్ఞమును దూష•ణమ్ముచేసి, యూరకుండిరి మత్తత • నొప్పి యపుడు.
ఉ. ధాతమరీచిముఖ్యులను • దాపసులన్ నిజవాహనంబు వి
ఖ్యాతము నైన హంసమును • గాంత సరస్వతి వేదసంఘముం
బ్రీతి దలిర్పఁ గూడి బహు•రీతుల లోకహితంబుఁ గోరి యే
భీతియు లేక కుండమును • వేగమ చొచ్చె హరుండు మే లనన్. 944
వ. ఆతనితోడ సావిత్రియు, గాయత్రియు నగ్నియందుఁ బడిరి. ఈప్రకారంబున సర్వజంతువుల నమ్మహాహోతహోమంబుచేసె నంతఁ గేవలభూమియు, నిర్వృక్షభూధరంబులును, మహాయాగహోత యగు వాయురూపశాంభవుండును, మిగిలిరి. తక్కిన సర్వం బాజ్ఞానహవ్యవాహునియందు వేల్వఁబడియె. మఱియు షడ్దర్శనంబులును, సకలవిద్యలును, నానావిధమతంబులును హోమంబు చేయఁ బడియె. నివ్విధంబున హోమంబు గావింప హుతవహుం డూర్ధ్వాండభిత్తిపర్యంతంబు వ్యాపించె. అప్పుడు హోమసమాప్తి నొనరించి శంభుండు స్వాకారంబు నొందె నిట్లు నిజరూపంబునొంది మహాశంభుండు చిదగ్నిస్థ యగు పరమేశ్వరిని గారికాష్టకంబున ని ట్లని స్తుతియించె. 945
తే. విశ్వభూతైకనాయికా • విశ్వరూప, సర్వగత, సర్వసంస్తుత•సర్వకర్త్రి
లలిత, పరదేవి, సంవిజ్జ్వ•లనునివలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

తే. సంతతానందరూపిణి • జగదనూన, విమల సంతోషదాయిని • విశ్వజనని
లలితపర దేవిసంవిజ్జ్వ•లనునివలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి. 947

తే. జ్ఞాతృరూపిణి జ్ఞేయాంగి • జ్ఞానరూప, జ్ఞానరూప ప్రకాశిని • మాననీయ
లలిత పర దేవి సంవిజ్జ్వ•లనుని వలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

తే. లోకసంహారకారిణి • లోకజనని, కాళి శ్రీ భద్రకాళికా • కామరూప
లలిత పర దేవి సంవిజ్జ్వ•లనుని వలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

తే. లోకసంత్రాణరసిక, వి•లోలనేత్ర, మంగళా సర్వమంగళ • మానితాంగి
లలిత పర దేవి సంవిజ్జ్వ•లనుని వలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

తే. విశ్వసృష్టిపరాధీన•విశ్వనాయి, కా విశంకటపౌరుష•కలితచిత్త
లలిత పర దేవి సంవిజ్జ్వ•లనుని వలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

తే. సంవిదగ్నిహుతాశేష•జంతుసృష్టి,సతతసంపాదనాకృతి•సాధుపూజ్య
లలిత పర దేవి సంవిజ్జ్వ•లనుని వలన,నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

తే. భండతారకముఖదైత్య•బాధితస్వ,భక్తసజ్జనతుష్టికై •పరమకరుణ
లలిత పర దేవి సంవిజ్జ్వ•లనుని వలన, నవతరింపుము దేవకా•ర్యార్థ మెలమి.

## లలితాప్రాదుర్భావము.

క. అని యిట్లు కారికాష్టక,మున శంభుఁడు లోకజనని • మోదం బొప్పన్
వినుతించినఁ జిద్వహ్నిని, జనియించెను లలితసాధు•సంతతిఁ బ్రోవన్. 954

సీ. ఒగివిస్తృతిని జతు•ర్యోజనమాత్ర మున్నతిచేత దశయోజ•నంబు నగుచు
నవపర్వయుక్త మై•నవనవరుచిమయాకార మై శ్రుతిగణా•కారచక్ర
మై చతుర్విధపురు•షార్థమహాశ్వ మై యానందకేతన•హారి యగుచుఁ
దప్తసువర్ణభా•ధామ మై సర్వాగ్రబిందుపీఠంబుచే • సుందరమయి

ఆ. ప్రబలి మేరు వనెడు • ప్రస్తారమున నొప్పు ,చక్రరాజరూప• చారురథము
నెక్కి లలిత మొదట•నెలమి మీఱి జనించె, సకల భూషణాళి • చౌకళింప.

క. తనయాత్మచేత నొకపురు,షుని వెసఁ బుట్టించె మహిత•శోభలఁ బురుషుం
డును శ్రీకామేశ్వరుఁ డనఁ,దనరెఁ బతిం జేసికొనియెఁ • దరుణియు నతనిన్.

క. ఆతనిచే నాశ్లిష్టయు, నై తరుణీమణి సృజించె • నప్పుడు వాంఛా
ప్రీతుల కనురూపంబులు,నై తగు చతురస్రములను • నమలములఁ గడున్.

సీ. అంకుశపాశపు•ష్పాంబకైక్షువచాపవిలసత్కరావళీ • లలితదేహ
యుద్యత్సహస్రాంశు•భోజ్జ్వలత్తనుకాంతి,చంద్రరేఖానద్ధ•చారుమకుట

హారభాసుర,స్మిత•సార ముఖాంబుజ, షోడశవర్షీయ•శుభ్రభూష
ణావళిశోభాఢ్య•భావజప్రతిరూప సౌందర్యరూపిణి • సంతతామృ
తే. తాకృతిస్ఫుటభాసుర•హారి వీక్ష,ణాళిలోకత్రయంబును • నాదరమున
దడుపుచున్నట్లు మెఱయంగఁ•దనరిశంభు, మౌళిల శ్రీదేవినిల్పిన•భూతపతియు.
ఉ. ఫాలమునం గరాంజలిని • భక్తి ఘటించి శ్రుతీరితోక్తులం
జాల నుతించి కార్యమును • జయ్యన నంతయు విన్నవించి యో
శ్రీలలితాంబికా కరుణ•చేత జగంబు సృజించి దేవతా
జాలము సంతసింప దను•జప్రకరంబులఁ ద్రుంపుమీ యనన్. 959
మ. హరువాక్యంబుఁ దలంచి లోకముల న•త్యంతంబు బాధించు క
ర్బురసంఘంబు నడంప నెంచి యతుల•స్ఫూర్తిన్ విజృంభించి యా
హరిసంక్రందనముఖ్యులన్ మనుజులన్ • హర్షంబు మీఱంగ ను
ద్ధురశక్తిన్ మరలన్ సృజింప మదిలోఁ • దొల్కాడునూహన్ దగన్. 960
ఉ. శంకరుఁ గాంచి పల్కె నటు • శర్వ! మహోద్ధత దైత్యవీరులన్
సంకటకారులన్ మదవి•శాలురఁ జంపెద ముందురీతి సా
పంకజగర్భముఖ్యసుర•వారముఁ బ్రీతి సృజించెదన్ మదిన్
శంక యొకింత లే దనుచు • సారసనేత్ర వచించి యంతటన్. 961
సీ. కామేశ్వరునిగూడి • కామసుందరి పరానందస్వరూపిణి • సుందరాంగి
సోమాత్మకం బగు • వామనేత్రంబున బ్రహ్మను లక్ష్మిని • భాస్కరాత్మ
కం బగు దక్షిణ•క్రమనేత్రంబున వనజాక్షుఁ బార్వతి • వహ్నిరూప
ఫాలనేత్రంబున • వాగ్దేవి రుద్రుని బరఁగ సృజించెను • బ్రహ్మ మయుని
తే. చంచలాద్యుతు లైరి యా • సారసాక్షు, పార్వతులు ఘనకాంతులు•భవసరస్వ
తులును శుభ్రమరీచు లై • వెలసి రబల, లంత వినిమయమున వారి•కాంత లైరి.
క. వనజాక్షునకును లక్ష్మియు, వనజజునకు శారదయును • భవునకు భూభృ
త్తనయయు సతు లై యొప్పిరి, తనుకాంతుల దిక్కు లెల్లఁ•దద్దయు వెలుఁగన్.
తే. భార్యలనుగూడి చెలఁగెడు•బ్రహ్మ విష్ణు, భవులకాయంబసృష్టియుఁ•బాలనంబు
సంహృతియుఁ గృత్యములుగ నా•జ్ఞనిడెవార,లంబికాజ్ఞను నాదల•లందుఁ దాల్చి.
వ. నవీననిజవిగ్రహు లై తమ తమ స్థానంబుల కరిగిరి. లలితాంబయు సర్వప్రపం
చంబును నిర్మింపఁ బ్రయత్నించె. అప్పుడు విశ్వం బంతయు నవనవాకారం బై
వెలింగె నని హయగ్రీవుండు పల్కుటయు, గుంభసంభవుండు భక్తి యలర
ని ట్లనియె. 965

లలితాంబ జగంబుల సృజించుట.

క. తురగాస్య మహాయోగం, బరుదుగ వింటి నిపు డంబ • యఖిలజగంబుల్
వరశక్తి సృజించిన యా, చరితము వచియింపు వినఁగ • సంతస మయ్యెన్. 966

మ. అనినం గుంభజమౌనిచంద్రునకు నా•య్యాశ్వాననుం డిట్లనున్
మునిచంద్రా! వినుమంతఁ జిజ్జ్వలనసం•భూతాత్మ యై యొప్పు న
వ్వనజాతాక్షి పరాంబ లోకతతులం • బ్రావీణ్య మొప్పన్ సృజిం
చెను సృష్టిక్రమరీతిఁ జెప్పెద మహా•చిత్రంబు నాలింపుమీ. 967

క. విచికిలగంధియు మొదటను, గచభారముచేతఁ దిమిర • గణము సృజించెం
బ్రచురాక్షి త్రితయంబున, సచంద్రరవివీతిహోత్ర•సంజ్ఞలఁ జేసెన్. 968

క. భాలావతంసముక్తా, జాలంబునఁ దారకౌఘ•సంపదలను న
త్బాలీవతంసమౌక్తిక, మాలికనవఖేటములను • మమత సృజించెన్. 969

క. పరమేశ్వరి భ్రూవల్లి, పరిపాటిని దండనీతి • భాసురలీలం
బరఁగెడు నాజ్ఞాచక్రము, నురుశక్తి సృజించె దేవ•తోద్యమ మలరన్. 970

సీ. నిశ్వాసమారుత • నిచయంబుచే నాల్గువేదంబులను స్వీయ•విమలమహిమ
మంత్రావళి సృజించె • మధురతరోక్తులఁ గావ్యనాట్యాద్యలం•కారములను
జిహ్వచే భారతిన్ • జిత్రశక్తి సృజించెఁ జుబుకంబుచేతను • శ్రుతుల కంగ
షట్కంబుఁ బుట్టించెఁ • జారుకంఠోర్ధ్వరేఖాతంత్రమునఁ జమ•త్కారరీతి

తే. ధర్మసంహిత న్యాయతం•త్రముఁ బురాణ
మమలమీమాంసను సృజించె • నఖిలజనని
కంఠమధ్యమరేఖచేఁ • గడఁగి వైద్య
శస్త్రవిద్యలఁ బుట్టించె • సారసాక్షి. 971

క. జనని గళాధస్థ్సితరే, ఖను ఘనశిల్పకము మఱియు • గాంధర్వంబుం
దనకంఠకూపభువిచే, నొనరఁ జతుష్షష్టివిద్య • లొగిఁ బుట్టించెన్. 972

తే. ఛందముల నంసతలమునఁ • జారుబాహు
మూలమున మన్మథాగమ•మును గుచద్వ
యంబుచే నష్టకులపర్వ•తాళిఁ బార్శ్వ
యుగళి నభమును దిక్కుల • నొగి సృజించె. 973

క. ఆనందశక్తి మనసున, జానుగఁ బాశాష్టకంబుఁ • జారుభుజమునం
బూని వెలయించె మఱియును, మానితరోమాళి సర్వ•మాన్యుల నెల్లన్. 974

ఆ. నిజకరాంగుళముల • నిర్మించెఁ గాముని, పంచబాణములను • జంచలాక్షి

కరనఖాగ్రములను • గడువడి మత్స్యకూర్మాదులను సృజించె • హర్ష మలర.

వ. మత్స్యకూర్మాదులు దశసంఖ్యచే నొప్పు. మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన పరశురామ శ్రీరామ బలరామ కృష్ణ కల్కినామంబుల నలరు. మఱియుఁ బ్రాతస్సాయంసంధ్యలఁ బాణిరక్తకాంతి నిర్మించె మఱియు. 976

చ. హరిహయు వీతిహోత్రు మృదు•లాస్యమునం బవమాను లోకసుం
దరి తనప్రాణరాజిఁ దన • నాభి వియత్తలసీమ స్వర్గముల్
శిరసున భూమిఁ బాదముల•చేత నధర్మము ధర్మముల్ విభా
సురగతి దృక్స్మితంబులను • శోభిలునట్లు సృజించె నేర్పునన్. 977

క. పరమానందము సుందర, తరచక్షువుచేతఁ బురుషుఁ • దతనాభిలస
ద్వరకుండంబునఁ బ్రకృతిని, బరమేశ్వరి స్వీయనాభి•వలన సృజించెన్. 978

ఆ. లలిత తన నితంబ•తలమున నొగి మహ, త్తత్త్వమును సృజించెఁ•దరుణి మఱియు
నూరుమూలమునను•నుద్యదహంకార,మును సృజించెఁ జాల • మోద మలర.

క. జానువులం దన్మాత్రలఁ, బూనిక జంఘలను బంచ•భూతంబుల నెం
తో నయముగ సప్తాబ్ధుల, మానిని గుల్ఫమునఁ జేసె • మహితస్ఫూర్తిన్. 980

వ. మఱియు నా సృష్టియందు. 981

సీ. పార్ష్ణిస్థలిఁ జక్ర•వాళంబుఁ బాదాబ్జతలమున నారసా•తలము గలిగెఁ
గాంతరోమావళిఁ • గలిగె గోవులు మఱి యజముఖంబులు దాన•నవతరించెఁ
బరదేవి ముఖమున • బ్రాహ్మణుల్ దీప్తప్రభాయతుల్ పుట్టిరి • యట్టులైన
కారణంబుననె ము•ఖంబునఁ బుట్టిన విద్య లెల్లను నేర్చి • వెలసి రవని
తే. బాహుతలమున క్షత్రియుల్ • ప్రబలి రెలమి, క్షాత్రజీవినులై రంత•[1]సక్థి జన్ము
లైన వణిజులు లాభంబు•చే నమరిరి, సక్థిదార్ఢ్యాసనంబుల • సంతతంబు. 982

చ. పదములయందు శూద్రులును • భాసిలుచుల్ జనియించి రందుచేఁ
గద యవనీసురేశ్వరుల • గ్రన్నన సేవను దృష్టి చేయుటల్
గుదిరెను శూద్రజాతులకుఁ • గుంభజ మౌనివరా! సమస్తలో
కదయిత యిట్లొనర్చెఁ దన • గాఢతరం బగు శక్తి పెంపునన్. 983

వ. మఱియుఁ బరమేశ్వరి రోమకూపంబులవలన నుద్భిజ్జంబులును, స్వేదజాలంబువలన స్వేదజలంబులును గలిగె. మధ్యంబువలన జారాయువీసృష్టియు, గుల్ఫపిండంబువలన నాందియును గలిగె. నాసికాభాగంబున నశ్వినీదేవతలును, దంత

1 సక్థి=తొడ.

ప్రభలవలనఁ గీర్తియు, నానందసంపదవలనఁ బుష్టియు, గండతలంబునఁ గాం
తియు, హృదయంబున నకలంకశశిప్రభయు, సమస్తమాతృకా రూపిణియుఁ బ
రాంబాతార్త్రీయరూపయు నగు బాలయు నవతరించిరి మఱియును. 984

మ. పరదేవీ ప్రియబుద్ధి శ్యామల మహా♦భవ్యాత్మ వీణా శుక
స్ఫురదుద్యద్వరపాణి, భూషణమహా♦శోభాంగి, సంగీత సా
గర నైజాకృతి పుట్టె నంతట నహం♦కారంబునం గోల వ
క్త్రి) రహిన్ వారిద నీలవిగ్రహ కడం♦కం బుట్టె [1]వార్తాళియున్. 985

చ. స్మితమున విఘ్ననాయకుఁడు ♦ సిద్ధరమాంకిత సక్థిభాగుఁ డు
న్నతమదయుక్కటస్థలుఁడు ♦ నైజభుజాబలసర్జితారిసం
తతి, యుదితార్కదీప్తి గణ♦నాయకుఁ డుద్భవ మందె; నంబికా
యతవరచక్రషట్కమున ♦ నప్డు జనించె షడంగమంత్రముల్. 986

తే. అవియ యామ్నాయషట్క వి♦ఖ్యాతి నలరు, శ్రీపరేశ్వరి క్రీడావి♦శేషమునను
ద్రయ్యక్షరాత్మిక యగు బాల ♦ యవతరించె, నంకుశమున సంపత్కరి♦యట్లె పుట్టె.

సీ. పరదేవి పాశంబు♦వలన నశ్వానన వరతాలుదేశంబు♦వలన నకులి
చండికాపరదేవి ♦ కుండలినీశక్తిఁ (ద్రిపద యాగాయత్రి) ♦ తేజరిల్లు
రశ్మిమాలయుఁ బుట్టి ♦ రాజిల్లెఁ ద్వగ్ధాతువున దేవజాతులు ♦ భూరిదేవ
తలును దిర్యగ్గణం♦బులు పుట్టె రక్తాఖ్యధాతువునం బుట్టి ♦ తనరెఁ బ్రాణ

ఆ. శక్తి మాంసధాతు♦జనిత మయ్యెను మహా,బలము మెదడునందుఁ♦గలిగె భూతి
సన్నతులును; నస్థి♦జనితంబు లయ్యెఁ బా,శాంకుశాదు లైన యాయుధములు.

తే. యజ్ఞవిద్యయు గుహ్యావి♦ద్యయును స్వాత్మ
విద్యయును మజ్జమునఁ బుట్టి ♦ వెలసె శుద్ధ
రజమునన్ సుధవారుణి ♦ రాజిలెఁ గడు
నంగసౌందర్యమున లక్ష్మి ♦ యవతరించె. 989

క. పరదేవి సత్కటాక్ష, స్ఫురణ మనోభవుఁడు మరలఁ ♦ బుట్టెను నెంతో
కరుణఁ బరదేవి యిట్లీ, వరుసన్ నిర్మించె లోకవారముఁ బూన్కిన్. 990

వ. మఱియు నమ్మహాదేవిపాదంబునఁ, బాదగుల్ఫంబున, జంఘాతలంబున, జాను
భాగంబున, నూరుప్రదేశంబున, నూరుమూలంబున, నితంబంబున, జఘనం
బున, మధ్యంబున, స్తనయుగ్మంబున, బాహుద్వయంబున, నంసప్రదేశంబున,
గంఠంబున, శిరస్సునఁ గ్రమంబుగా మహాపాతాళంబును, బాతాళంబును,

1 వార్తాళియున్ = వారాహి యను దేవత. ఈమె దండనాయిక.

రసాతలంబును, మహాతలంబును, సుతలంబును, వితలంబును, సతలంబును, భూలోకంబును, భువర్లోకంబును, సువర్లోకంబును, జనలోకంబును, తపోలోకంబును, సత్యలోకంబును గలిగె నంత. 991

తే. మఱియుఁ త్రైలోక్యమోహన • మహిత చక్ర
మునను బ్రాహ్మ్యాదు లణిమాదు•లును సముద్ర
లగుచు నలరారుదురొ వార•లను బరాంబ
తాలుమూలంబునను బుట్టి • తనరఁ జేసె. 992

తే. అట్టి యణిమాదులకు నెల్ల • నధిపతి యగు
త్రిపురస్వాంశంబుచేఁ బుట్టి • త్రిజగములను
వెలుఁగునట్లుగఁ జేసె నా • లలిత ; వార
లైరి ప్రకటాభిధానలు • భూరిరుచులు. 993

వ. ఆ దేవతలు వహ్న్యుత్పన్నం బగు దేవీచక్రంబున నవమపర్వంబు నాశ్రయించిరి. మఱియు సర్వాశాపూరణాహ్వయం బగు చక్రంబును సృజించి కామాకర్షిణి ముఖ్యదేవతలను గుప్తాఖ్యలను సృజించి స్వాధిష్ఠానప్రదేశంబున సుధాసూతికలామయి యగు లలితాదేవి కామాకర్షిణ్యధిష్ఠాన దేవత యగు పురేశిని బుట్టించె. ఆ దేవతలు చక్రరథాష్టమపర్వంబు నాశ్రయించిరి. మఱియు. 994

సీ. నాయిక మణిపూర•ణంబున సర్వసంక్షోభణచక్రంబు • శోభిలంగఁ
బుట్టించి తద్గత • భూరిదేవతలను గుప్తతరాఖ్యల•గూఢతనుల
దీపించు వారి కా•ధిష్ఠానదేవిని బురసుందరిని జేసెఁ • బొలిచి చక్ర
సప్తమపర్వంబు • సంశ్రయణంబుగా భాసిల్లి రంతటఁ • బ్రోఢశక్తిఁ
జార్వనాహతచక్ర • సరణిని సర్వసౌభాగ్యదంబును జేసెఁ • బదునలుగురు

తే. సంప్రదాయాభిధంబులఁ • జక్రరక్ష, త్రైకతత్పర లై వార • లతులకాంతి
షష్ఠపర్వంబునుం బొంద • సారసాక్షి, త్రిపురవాసిని వారికి • దేవి యయ్యె.

క. సుందరి యాజ్ఞాచక్రం, బందును సర్వార్థసాధ•కాహ్వయచక్రం
బుం దగ నిర్మించెను నట, నొంది కులోత్తీర్ణ లనఁగ • నొప్పిరి దేవుల్. 996

క. త్రిపురాశ్రీయన నొప్పెను! త్రిపురేశ్వరి యాజ్ఞఁ జక్ర • దేవుల నెల్లన్
గృపతోఁ బాలింపఁగ వా, రపు [1]డచ్ఛదరప్రభాప్తి • నలరిరి చాలన్. 997

తే. చక్రపంచమపర్వంబు • సారసాక్షు, లెల్లఁ బాలించుచుండిరి • హితము మీఱ
సాధురీతి విశుద్ధాఖ్య•చక్రజంబు, సర్వరక్షాకరాఖ్యంబు • చక్ర మలరె. 998

---

1 అచ్ఛదరప్రభాప్తిన్ = స్వచ్ఛమగు శంఖముయొక్క కాంతిని బొందుటచేత.

వ. ఆచక్రంబున నిగర్భయోగినులను పరివారదేవులు వెలింగిరి. వారి కధిష్ఠానదేవి
యై త్రిపురమాలిని చెలంగె. వార లెల్ల లలితాభ్రూసంజ్ఞచేఁ జక్రచతుర్థ
పర్వంబున నధివసించి యుండిరి. అంత లలితాబ్రహ్మరంధ్రసముద్గతం బగు
సర్వరోగహరచక్రం బొప్పె నందు రహస్యయోగినులను ప్రసిద్ధినొందిన వాగ
ధీశ్వర లగు దేవులును, దదధిష్ఠానదేవి యగు త్రిపురాసిద్ధయుఁ జక్రరాజరథ
తృతీయపర్వంబు నాశ్రయించి బాలార్కసంకాశకాంతిదేహ లై వెలింగిరి. మఱి
యు ద్వాదశాంతమహాచక్రంబునుండి స్వరసిద్ధికరంబు చక్రం బవతరించె. 999

తే. అతి రహస్యాభిధానంబు • లలర నందు, నాగిని గామేశి మొదలగు • నురుతరప్ర
భలను వెలుఁగొందు దేవులు • భాసిలి రతి, దీప్త త్రిపురాంబ వారికి • దేవి యయ్యె.

క. కాలానల సన్నిభభా, జాలముల ద్వితీయపర్వ • సంశ్రయణలు నై
పోలి వెలింగిరి దేవులు, శ్రీలలితయు నంత మదిని • జెలఁగెడు వేడ్కన్. 1001

సీ. ఆవల వినుము స • ర్వానందమయ చక్ర మవతరింపఁగఁ జేసె • నద్ది యాద్య
పీఠంబు మఱి బిందు • పీఠంబు శ్రీపీఠ మను నాహ్వయంబుల • నలరుచుండు
రాజిల్లునందుఁ బ • రాపరాఖ్య రహస్యయోగిని లలితాంబ • యొప్పు మీఱ
నాయంబ చక్రేశి • యాయంబయే మహాత్రిపురసుందరి మహా • దివ్యచక్ర

తే. రథసుమధ్యమ మైన ప • ర్వంబునందుఁ, జెలఁగు నవవిధ చక్రంబుఁ • జెల్వు మీఱ
భండనామకదైతేయుఁ • జెండ నంబ, శక్తిచే నిట్లు నిర్మించె • జయము గోరి.

తే. మరల మార్తాండభైరవు • మానితాత్మ
హృదయనభమున నిర్మించె • ముదిత యతని
బింబమునుండి యాకర్ష • ణంబు చేసె
నదియె తిథిచక్ర మనుకీర్తి • నలరు మఱియు. 1003

ఆ. షోడశస్వరములు • సొరిది నా చక్రంబు, వలనఁ గలిగె వాని • వలన నిత్య
కలు జనించి రెలమిఁ • గామేశి మొదలగు, దేవు లాపరాంబ • దీప్తిఁ బోలి.

మ. మునిచంద్రా! తిథి నిత్య లన్నప్రథచేఁ • బొల్పారి తిథ్యాదరం
బున నానందమయాఖ్యచక్రవలయం • బుం బూని పాలించి యా
ఘనచక్రాయత మధ్యపర్వమున కం • గస్ఫారదేవాళు లై
యనయంబున్ వెలుఁగొందుచుండి రిటు పై • నాలింపు మీ చెప్పెదన్. 1005

వ. పరమేశ్వరి హృదయశీర్షశిఖాకవచదృక్త్రియాయుధంబులవలన జ్వలత్కా
లాగ్నితేజస్కల మహాభాగ లుదయించి చతుర్దిక్సౌమ్యేశవహ్నీశాసురవాయు
భాగంబులను నీ షట్స్థానంబులయందుఁ దీక్ష్ణాయుధమండిత లై భండాసుర

వధప్రవృత్తయగు పరమేశ్వరిని రక్షించుచు నుండిరి. ఇట్లు శక్తిమయం బగు చక్రంబు రథోత్తమంబునఁ గల్పించి లలితాంబిక భర్త యగు కామేశ్వరుం గాంచి యి ట్లనియె. 1006

చ. పరశివ! భండనామసుర • వైరివధార్థము మీరు నేను య
జ్ఞరత కృతోద్యముల్ జ్వలన•సాంద్రశిఖాతిథు లైన దేవతా
వరులకు మేలుచేసి కడుఁ • బౌరుష మొప్పఁగ భండుఁ జంపఁ గా
నిరతము పూని చేయుదము • నెమ్మిఁ బ్రయత్నము సిద్ధిఁ గాంచెడిన్. 1007

తే. సృష్టిచేసితిఁ గోరిక • స్త్రీకదంబ
మింక మత్సంగతిని నీవ • యొసఁగి శైవ
చక్రవర్యముఁ బుట్టింపు • శంకరా! మ
హాత్మ! యన విని యౌ గాక • యనుచు హరుఁడు. 1008

సీ. మహితాస్య హుంకార•మాత్రంబుచేఁ జక్రవర్యంబుఁ బుట్టించె • వఱలె నద్ది
ఘనదివ్యసిద్ధౌఘ • మనుజౌఘభేదంబులను ; మూఁడుభేదంబు•లను వచింతు
విను తత్సనాథుల • విమలతేజుల వివిధాయుధోజ్జ్వలభూరి•హస్తులను మ
హాత్ముల వా రెన్న • నలరుదు రందుఁ బరేశ మిత్రేశాదు • లీశసములు

ఆ. సంప్రదాయకరులు • సన్మును లిరువది, మువ్వ రగుచు వెలసి • భూతనాథు
నక్షి సంజ్ఞచే మ•హానందమయచక్ర, పృష్ఠభాగమందు • వెలసి రపుడు. 1009

తే. బుధ్యహంకారజనితలఁ • బూజ్యమతుల
నెవరి నెఱిఁగించితినో పూర్వ • మెలమి వారి
శ్యామలాకోలశక్తుల•యందు నాద్య
దేవతను ముఖ్యమంత్రిణి • దేవిచేసి. 1010

క. అమృతరసంబున నభిషే,కము నొనరిచి శక్తి రాజ్య•కలిత మహాభా
రముఁ బూన నాజ్ఞ నొసఁగెను, మమతఁ ద్రిలోకైకజనని • మానిని యంతన్.

క. ఈనాయిక మద్రాజ్యము, పూనెడు నని తెలుపఁ బూను•పోల్కి నొసంగెన్
మానిని స్వీయ సుముద్రికఁ,జే నద్దానిని గ్రహించె • జెలఁగెడు భక్తిన్. 1012

ఆ. మమతఁ గోలముఖి న•మానుషవిక్రమ, దండనాథఁ జేసి • తగినరీతి
నప్పదంబు నొంద • నభిషేక మొనరించె, సకలతీర్థవారి•సంతతమున. 1013

ఆ. భూరియుగంబువలన • ముసలంబు [1]సీరంబుఁ, బుట్టునట్లు చేసి • పూజ్యమైన
[2]కోలముఖికి నిచ్చి • కూర్మి నాజ్ఞాచక్ర,వర్తినిగ నొనర్చె • భవునిపత్ని. 1014

1 సీరంబు=నాగలి. 2 కోలముఖి=వారాహి.

వ. మంత్రిణియు దండనాథయు సంగ్రామహేతువు లౌట నాలోచించి స్వీయచ క్రిరాజరథంబునుండి రథయుగ్మంబు విభజించి భండాసురవధార్థిని యగు లలిత వారల కొసంగ నా దేవత లిరువురును శ్రీచక్రిపర్వంబులందువలె నా చక్రంబుల నెక్కి సకలాయుధభాసమాన లై యొప్పిరి. ఆ యిరువురరథ నామంబులను వచింతు. దండనాథరథంబు కిరిచక్రం బనం బడు. మంత్రిణి దివ్యరథంబు గిరిచక్రిం బనియు గేయచక్రం బనియుఁ జెప్పఁ బడు. ఈరీతి భండుని జంపుటకు విధానక్రియంబు నొనరించి లలితమనంబున నీ రాక్షసుండు దురాత్ముండు మహావీర్యుండు దుర్జయుండు గావున బహుయోగినీదేవతలఁ బుట్టించెద నని నిశ్చయించి క్రోధహుంకారం బొనరింప నా హుంకారంబువ లనఁ జతుష్షష్టికోటియోగినులు నంతసంఖ్యగల భైరవులును, బరార్థసంఖ్య నతిక్రమించి నానా వేషభూషణలును, జ్వలద్భ్రమపరిహారణలును, దైత్యరక్త పానాసక్తలును నగు ననేకశక్తు లుదయించిరి. అంత నా మహాయోగినుల యుద్దండహాసంబువలనను ఘోరనిర్ఘాతభీషణంబు లగు నినాదంబులవలనను బ్రపంచంబంతయుఁ దుములితం బయ్యె. నాయోగినులు చక్రరథస్థిత యగు పరదేవిని బద్ధాంజలిపుటంబు లొప్ప సేవించిరి. అమ్మహాయోగినీచక్రంబు నాలోకించి సంతోషస్వాంత యయ్యె ననిపలికి హయగ్రీవుండు మరలఁ గుంభ సంభవునితో ని ట్లనియె. 1015

భండాసురవధకు లలిత ప్రయాణ మగుట.

క. పరమేశ్వరి లలితాంబిక, వరద జగత్త్రాణదక్ష • భండాసురునిఁ
సురవైరి లోకకంటకు, దురమునఁ జంపంగ వెడలెఁ • దోరపువేడ్కన్. 1016

తే. అంబసైన్యము నేడగు • నంబురాసు,లను మహాశక్తిచే మర్ద•శముగఁ జేసి
సంప్రవృద్ధతదీయని•స్వానములను, నంబరం బెల్లఁ బూరించి • యట్టె పూనిక.

వ. మృదంగ, మురజ, పటహ, ఢక్కా, లింగణంబులను; శేలుకంబులను; ఝల్లరీ సంఘు, హుడుక్కా, హుడువ, ఘటంబులను; నానక, పణవ, గోము, ఖార్ధ చంద్రక, యవమధ్య, ముష్టిమధ్య, డిండిమంబులను; ఝర్ఝర, చర్చరీ, తాళం బులను; అంకాలింగ్య, ప్రభేదకంబులను; ఊర్ధ్వక, తంపోట,నిస్సాణ, బర్బరం బులను; హుంకార, కాకతుండాదివాద్యవిశేషంబులను మ్రోయించె నంత.

మ. లలితా దివ్యమహాంకుశప్రభవ యై • లావణ్యసంపూర్ణ యై
జ్వలనాకారము పొల్పు మీఱఁ దగు నా•సంపత్కరీదేవి యు

జ్వలమాతంగతురంగసద్రథచమూ• వారంబుతో భండదై
త్యులనచ్ఛిద్రిహరణార్థ మేగె సుర లం•త్యంతంబు హర్షింపఁగన్. 1019

క. ఆసంపత్కరితోడ మ,హాసైన్యము రవముచేత • నరి వీరులకున్
గాసిఁ గలిగించుచును జనె, భాసుర కేతువులు మేఘ• పంక్తుల నడఁపన్. 1020

తే. పీనవక్షోజలసమాన• పృథుల వత్స, తలమునందున్న కంటక • మలరుచుండ
లలిత కామోద మొసఁగుచుఁ • జెలఁగి ముందుఁ, జనియె సంపదధీశ్వరి• శత్రులదగ

క. వరఖడ్గలతయు సంప,త్కరి హస్తమునందు వెలిఁగెఁ • గాలాంతకు ను
ద్ధురకుటిలం బగుభ్రుకుటీ,స్ఫురణన్ భయ మొసఁగుచున్ మ• హోద్యమ మొప్పన్.

చ. అరిగెను ఘోరవాతచలి• తాయత భూధరపంక్తులైన కుం
జరములు కోటిసంఖ్యలుగ • సంపదధీశ్వరితోడ నంత శ్రీ
పరశివ సత్కళత్ర ఘన• పాశమునన్ జనియించినట్టి సుం
దరి పరవారభీషణ ని• తాంతముదంబున నేగె నాజికిన్. 1023

సీ. అప్పు డశ్వారూఢ • ననుసరించుచుఁ బోయె హేషల నొప్పుచు • నేపు మీఱి
[1]నిజఖురకుద్దాల • నిర్దారితమహీతలంబులై కాంభోజ• లాటసింధు
బాహ్లీక టంకణ • పారశీకా రట్టముఖ దేశభవము లౌ • భూరి హయము
లెంతయు స్థైర్యంబు • నలరఁగ నిజనాథచిత్తాభిమతరీతిఁ • జెలఁగి పోవు

తే. చును రణంబుల సహనంబు • సొంపు మీఱ
బహుళ లక్షణముల నొప్పి • భాసురముగఁ
[2]బంచధారలు మెఱయంగఁ • బ్రమథమునకు
శత్రుహయసైన్య మెంతయుఁ • జంచలింప. 1024

వ. మఱియు నయ్యశ్వంబులు ఫాలశుక్తిభాసురంబులును, శ్వేతశుక్తిసమన్వితంబులును, దేవపద్మ, దేవమణి, దేవస్వస్తికా, ర్ధస్వస్తిక, శుక్తిమనోహరంబులును, బుంస్వర, పుష్పగంధికాది శుభలక్షణ లక్షితంబులును వాయువేగంబులును నై యశ్వారూఢ నాశ్రయించి చనియె నప్పు డశ్వారూఢయు నతి తేజో

1 నిజ ..తలంబులై = తమగొరిజలను గుద్దలులచేతఁ ద్రవ్వఁబడిన భూతలంబులు గలవియై.
2 పంచధారలు=అశ్వగతివిశేషము లయిదు. (1) అస్కందితము, (2) ధౌరితకము, (3) రేచితము, (4) వల్గితము, (5) ప్లుతము అనునవి పంచధార లనఁబడును. (1) ఆస్కందిత మనఁగా నతివేగము నతిమందమును గాక నడితరముగాఁ బాఱుట. (2) ధౌరితక మనఁగా నాస్కందితమునకంటె నధికమై చతురమైనది. (3) రేచిత మనఁగా వంకరలేక వేగముగాఁ బోవుట. (4) వల్గిత మనఁగా వేగముగా విడువఁబడి మీఁదికిఁ గాళ్లు కదలించుచుఁ బాఱుట. (5) ప్లుత మనఁగా వేగమున అంతమేరయు సమముగాఁ బోవుట.

భాసురంబును, నత్యంతోత్తుంగ దేహంబును, [1]గలికావిలసన్ముఖంబును, పార్శ్వ
ద్వయపతితస్ఫురత్కేసరమండలంబును, స్థూలవాలధివిక్షేపక్షిప్యమాణపయో
ధరంబును, జంఘాకాండసమున్నద్ధమణికింకిణీభాసురంబును, ఖురనిష్ఠురఘట్ట
నోచ్ఛలితభూతలంబును, విజయసమృద్ధికృద్ధేషారవంబును, సందర్శితగమన
క్రమంబును నై యాలోలచామరవ్యాజంబునఁ బక్షద్వయంబుచే మెఱయు
నట్లును, హేషాఘోషం బనుమిషచే నసురుల మ్రందించునట్లును నలరు నప
లాజితం బను పేరుగల మహాశ్వంబు నెక్కి పాశాంకుశవేత్రహయవల్గంబులను
గరచతుష్టయంబునఁ దాల్చి బాలసూర్యప్రభాభాసమానతనుకాంతి యల
రార నశ్వంబును దోలుచుఁ జనియె నంత. 1025

తే. దండనాయకపటహవా♦ద్యస్వనంబు
ప్రళయకాలంబు నను బొంగి ♦ పొఱునట్టి
సింధునిస్వానమును బోలెఁ ♦ జెలఁగి లోక
రాజి నప్పుడు కడు బధి♦రంబు చేసె. 1026

ఉ. కొండలు వజ్రబాణములఁ ♦ గోరిక దిక్కులు మ్రోయఁ జేయుచున్
స్పందితతీవ్రబాహుబల ♦ సంపద నొప్పుచు శక్తు లేగఁ గాఁ
గొండలు దండనాయికకుఁ ♦ గూర్మి జనింపఁగ నొక్క మ్రోతఁగా
ముందఱఁ బోయి రెంతయును ♦ భూరితరాయుధదోస్సమూహులై. 1027

తే. వేత్రసంతాడనంబుల ♦ వితతసైన్య, భూరిసంబాధ వారించి ♦ పొలిచి రెంతొ
వేత్రహస్తులు నొకచోట ♦ వేనవేలు, గాఁగ గుమిగూడి వార్తాళి ♦ బాగనంగ.

క. అరుదుగ మృగకాసరకే, సరిచిహ్నమహాధ్వజవ్ర♦జంబులఁ బూనికన్
ధరియించి శక్తు లరిగిరి, కిరిచక్రారూఢఁ గొల్చి ♦ కెలఁకుల భక్తిన్. 1029

క. శ్వేతచ్ఛత్రంబులతో, నాతఱి శక్తు లొకకొంద♦ఱరిగిరి తమి నా
శ్వేతచ్ఛత్రాచ్ఛాదిత, మై తనరె నసంఖ్యసోమ♦మై నభ మెల్లన్. 1030

క. ఇతరేతరసంసక్తా, యతవిమలసితాతపత్త్ర♦కాంతర్గత మై
తత మగు తిమిరము కాండ, ప్రతతిలసన్మణిమరీచి♦రాజి నడంగెన్. 1031

తే. వజ్రభాయుధనికురుంబ♦భాప్రపూరి, తాఖిలాశాముఖంబు లై ♦ యలరు నట్టి
తాళవృంతాళి కిరిముఖుల్ ♦దనరి రపుడు, చూచు ఖేచరు లెల్లరుఁ♦జోద్యమంద.

శా. చండోచ్చండముఖోగ్రభైరవులు పా♦శప్రస్ఫురచ్ఛూల స
త్కాండోదగ్రభుజంబు లొప్పఁగ పిశం♦గచ్ఛాయఁ గేశాళి యు

1 కలిక=కళ్లెము.

ద్దండం బై యలరారఁ దీక్ష్ణనయనో•ద్యద్ధవ్యవాహజ్వల
చ్చండజ్వాలల భండదైత్యముఖులం• జంచద్గతిం గాల్పఁగాన్. 1033

సీ. చని రంత భయదభూ•షణముల రాజిల్లి వార్తాళి సదృశభ•వ్యవరబాణ
హస్తలై తత్సన్ని•భాయతవాహనారూఢలై భీతికృ•ద్రూపవలగుచు
దీక్ష్ణదంష్ట్రోగ్రత• దీప్తాగ్నిధూమ్రాయి, తాంబరలై వరా•హాస్య లగుచు
భండవరూధినీ• చండదోర్దండదైకఖండ రాతురబాణ• కలిత లగుచు

తే. దండనాయిక వెనువెంటఁ• దగిలి నడచి, రెంతయును వేడ్క శక్తుల• హీనగతుల
వారి పౌరుషములఁ గాంచి•భూరి తుష్టి, నలరి వారాహి కడు వేడ్క•ననికిఁ గదలె.

మ. కిరిచక్రాకృతిఁ బొల్చి దేవరమణీ•కీర్ణంబు నౌ స్యందనం
బు రహిన్ గాంచి మదిం దలంచె ననికిం• బోవంగ నీ స్యందనం
బరయన్ సుందరమై చెలంగెడిని; ఘో•రాకార మౌ వాహనం
బె రణంబందు సహాయ మంచు సమరో•ద్వృత్తంబు చెల్వారఁగన్. 1035

ఆ. ఎంచి రథము డిగ్గి• పంచాస్యవర్యంబు, వజ్రఘోష మనఁగ• వఱలు దాని
నెక్కి కదలె ననికి• నెసఁగెడు కౌతుక, మంత కంత కలర• నద్భుతముగ. 1036

సీ. ధుతకేసరౌఘంబు• వితతఘోరాస్యంబు వికటదేహంబును• భీకరాక్షి
యుగళంబు భీతి కృ•దురుతరదంష్ట్రోగ్రకటకటా త్కారప్ర•కటనితాంత
బధిరీకృతాశమా•పాతాళసమ్మృజ్జిఘనకూర్మతీవ్రాస్థి• కర్పరోప
మానవఖావళి• క్ష్మాతలం బెల్లను బెకలించు నట్లొప్పి• సకలలోక

ఆ. భయద మగుచు మెఱసి• బవరంబుఁ గోరుచు, యోజనత్రయాత్మ•కోన్నతంబు
నై చెలంగుచున్న• యట్టి మృగేంద్రవా,హనము నెక్కి కదలె• నపుడు ప్రీతి.

చ. సురరిపు శౌర్యమెంతయును• స్రుక్కఁగఁ జేయఁ దలంచి పోవు న
క్కిరిముఖిఁ గాంచి లోకములు• కేవల భీతిని జెంది తమ్ముఁ దాఁ
గర మనురక్తిచేఁ దినునొ• గాఢమహాముసలాయుధాహతిన్
ధరణిని రెండుచేయునొకొ• దారుణరూపయిదంచు నెంచుచున్. 1038

తే. అంబరంబుననుండి య•య్యమరవరులు
భీతిచే నిట్లు తలపోసి• పృథులభక్తి
ద్వాదశాహ్వాయములను ద•ద్దయుఁ దలంచి
కేలుమోడ్చిరి పలుమఱు• కిరివదనకు. 1039

క. అన విని హయవక్త్రున కి, ట్లనియెం గుంభజుఁడు దేవ• యాద్వాదశసం
ఖ్యను బొల్చు నాహ్వాయంబుల,విన వేడుక యయ్యె నాకు• వివరింపు మిఁకన్,

ఆ. అశ్వకంతుఁ డనియె • ననఘ! యే నామాళి,
నొక్కమాఱు వినిన • నక్కిరిముఖ
సుప్రసన్న యగుచు • సుఖము నొసంగునో
యట్టి నామపంక్తి • నభినుతింతు. 1041

వ. పంచమియు, దండనాథయు, సంకేతయు, సమయయు, సీశ్వరియు,సమయసంకేతయు, వారాహియుఁ, బోత్రిణియు, వార్తాళియు,మహాసేనయు, నాజ్ఞాచక్రేశ్వరియు, నరిఘ్నియు ననునివి ద్వాదశనామంబులు. సంకటకాలంబున నేనరుం డీనామద్వాదశకం బను వజ్రపంజరమధ్యస్థితుం డగు నతండు దుఃఖంబు నొందఁడు. ఈ నామంబుల దేవతలు స్తుతించిరి. ఆదేవియు దేవతల ననుగ్రహించి దుష్టదానవనిర్మూలనంబుఁ జేయఁ గదలె నంత. 1043

క. సంగీతయోగినీబల, మంగద మకుటాదిభూష•ణావళి నెంతో
శృంగారమునఁ జెలంగి య,భంగురగతిఁ గదలె భండ•బలము నడంపన్.

క. సురరిపుమృతిసంసూచన, కరి యగు కాహళియు మ్రోసెఁ • గడుభయదం బై
వరవీణాసంభూషిత, కరతలముల నొప్పు శక్తి•కాండము గదలెన్. 1044

మత్తకోకిల. అందుఁ గొందఱు మత్తకోకిల•హారినిస్వన మొప్పఁగా
సుందరంబుగఁ బాడఁ గొందఱు • చోద్య మొప్పఁగ నాడఁగాఁ
గొంద ఱెంతయు మద్యపానము • కోరి చేసి కషాయితా
మందదృష్టుల వందివారము • మాడ్కి చేసిరి సంస్తుతుల్. 1045

క. వీణావారము మద్దెల, వేణువు మొదలైనవాని • వేడుక మీఱం
బాణితలంబులఁ దాల్చుచు, బోణిమి మెఱయంగఁ బాడ•భువనము లలరెన్.

ఉ. కొందఱు బర్హివాహములఁ • గొందఱు రాజమరాళబృందముం
గొందఱు మత్తకోకిలలఁ • గొందఱు వే [1]నకులంబులన్ మహా
నందము మీఱ నెక్కి తమి•నాకులు చూచి నుతింప నేగి రా
సుందరనీలమేఘరుచి•సొంపు వహించుచు నుండ వేడ్కతోన్. 1047

ఆ. కర్ణికారరథని•కాయంబు పై సైంధ,వాళి నెక్కి కొంద • ఱార్భటులను
మంత్రినాథఁ గూడి • మమతఁ బోయిరి భండ,దానవుండు మదిని • దద్దరిల్ల.

సీ. ఉత్తుంగగేయచ•క్రోత్తుంగరథ మెక్కి బాలదివాకర•భాసమాన
కవచయు, మదరక్త•గాఢనేత్రయు, లసత్స్వేదబిందుమనోజ్ఞ•దివ్యవదన
పద్మయు నై తన•బలము నంతయు నిజభ్రూవల్లితాండవం•బులను నలరు

[1] నకులము=ముంగి.

క్రిఁగంటిచూపులఁ • గెరలుచుఁ బోనంగ నాజ్ఞ సేయుచు [1]మహా • ర్హంబు నగుచు

తే. నలరు పింఛత్రికోణచ • కాగ్రిసనమున, నొప్పి వీణామృదంగాదు • లొప్పుచుండ
సంతసంబున నామహా • శ్యామమంత్ర, నాయికయుఁబోయె వైరుల • నాము మడఁప.

తే. అమ్మహాదేవి నతిభక్తి • నమరు లపుడు
వినుతిసేసిరి షోడశ • విమలనామ
ములను గుంభజ! యానామ • ములను దెలుపు
వాఁడ నని పల్కె నాహయ • వదనుఁ డెలమి. 1050

వ. సంగీతయోగినియు, శ్యామయు, శ్యామలయు, మంత్రినాయికయు, మంత్రిణి యు, సచివేశానియుఁ, బ్రధానేశియు, శుకప్రియయు, వీణావతియు, వైణికి యు, ముద్రిణియుఁ, బ్రియకప్రియయు, నీపప్రియయుఁ, గదంబేశియుఁ, గదం బవనవాసినియు, సదామదయు నను నీ పదియాఱునామంబుల నే నరుం డొ క్కపర్యాయము సంస్తుతించునో యతండు లోకంబులఁ దనవశంబున నునిచి కొను. అంత శ్యామలాదేవి కటాక్షం మెచ్చటఁ బ్రసరించునందందుఁ దత్సై న్యంబులు మెలంగుచుండు. లలితాంబా రాజ్యంబును శక్తిసైన్యచర్చయు నామహాదేవి కరతలంబున నుండె నప్పుడు. 1051

తే. కలిగె సంగీతయోగినీ • కరతలస్థ, బాలశుకవక్త్రముననుండి • భవ్యరీతి
సజ్యచాపంబు మెఱయంగ • సంతసమున, విమలరూపంబుతో ధను • ర్వేదమూర్తి.

చ. కరములు నాల్గుశీర్షములుఁ • గన్నులునుం దగ మూఁడు మూఁడు వి
స్ఫురదురుబాణసంతతియు • శోభిలుచుండ నతండు భక్తిచేఁ
గరములు మోడ్చి యో జనని! • కర్బురనాయకు భండనామకుఁ
దురమునఁ జంపఁ బౌరుషము • తో వడి నేగుట చూచి వేడ్కతోన్. 1053

తే. ఇంచుకంత సహాయంబు • నెంచి చేయ, వచ్చినాఁడను జిత్రజీ • వ మను పేరఁ
బరఁగు నీభూరికోదండ • వరము సకల, కర్బురాంతక మిద్దానిఁ • గడిమి గొనుము.

క. అక్షయశరతూణీరము, లీక్షణమున శత్రుతతుల • నెల్ల హరించుఁ
శిక్షితదానవనాయిక!, వీక్షింపు మటంచు నిచ్చె • వేడుకమెఱయన్. 1055

చ. వలగొని మ్రొక్కి యిచ్చిన వి • భాసురచాపము నక్షయాంబకో
జ్జ్వలవరతూణయుగ్మమును • సంతస మొప్పఁగఁ గైగ్రహించి శ్యా
మల తమి జిత్రజీవ మను • మానితచాపము కోటి మార్వినా
విల మయి రాక్షసోత్కరము • వేగము పాఱఁగఁ గూర్చె శక్తిచేన్. 1056

[1] మహార్హంబునగుచు=మిక్కిలి యోగ్యమైనదియయి.

తే. మంత్రిణీకరనిష్పీడ్య • మానమార్వి, కానినాదము జగములఁ • గలయఁ బర్వె
నపుడె నాకులమనములు • హర్షమొందె, లలితయెంతయు సంతోష • కలితయయ్యె.

తే. యంత్రిణియుఁ దంత్రిణియు నాఁగ • నలరు చేడి
యలు ముదంబున శుకమును • హారివల్ల
కిని శిరంబుల ధరియించి • వినయ మొప్పఁ
గొల్చి యాశ్యామలాదేవిఁ • గూడి చనిరి. 1058

క. ఆలోలవలయనిక్వణ, జాలవివర్ధిష్ణు నైన • జ్యానాదమునం
గ్రాలెడు చాపము దగ మృదు, చేల ధనుశ్శ్యామలాంబ • శీఘ్రము చనియెన్.

తే. చిత్రజీవశరాసన • శింజినీర, వంబుతో భూషితాంగియై • వఱలు శ్యామ
[1]కందళచ్ఛక్రకార్ముక • కలిత యైన, దివ్యకాదంబినియుఁ బోలెఁ • దేజరిల్లె.

క. కాళీతీక్ష్ణకటాక్షముఁ, బోలుచు నృత్యద్విషాక్త • భుజగోపమతం
గ్రాలుచుఁ దద్దక్షిణకర, భాలలితశిలీముఖంబు • భాసిల్లెఁ గడున్. 1061

తే: గీతిచక్రాధిరూఢ యా • నాతఁబోద, రిని గలంబధనుర్ధర • లును దదీయ
కాంతి తుల్యాత్మ తను కాంతి • కాంతలును స, గుచు మహాశక్తు లేగిరి • కూడి యనికి.

వ. మఱియు సహస్రాక్షౌహిణీసంఖ్య లగు సేనలం గూడి తీవ్రవేగంబునను గిలకి
లారవంబులను దిక్కులను బూరించుచు శక్తులు కొందఱు శ్యామాంబ ననుస
రించి చని రంత. 1063

సీ. వరచక్రరాజది • వ్యరథనాయిక, లస దంకుశఘనపాశ • హస్తజలజ
సాధునిస్వానేక్షు • చాపప్రదీప్తపుష్పాంబకపంచక • హారిబాహ
యైన దేవియు నుద • యత్సహస్రప్రభాపాటలనిజదేహ • భాసురంబు
దిగ్వదనంబులఁ • దేకువనింపుచు నబ్జారిమయ మైన • యభ్రమండ

తే. లంబుఁ బుట్టించి పదియోజ • నంబులకును
వ్యాప్తి నొందుచు ముక్తామ • యంబు నైన
దివ్యధవళాతపత్రంబు • తేజరిల్లి
చంద్రసఖతను బొందంగఁ • జనియె ననికి. 1064

తే. మఱియు నా చక్రనాయిక • మమత విజయ
లోనుగాఁ గల్గు చేడియల్ • పూని నూత్న
చంద్రికాపూర్ణ కాంతిచే • సాంద్రమైన
చామరచతుష్టయము వీవఁ • జనియె మఱియు. 1065

---

1 కందళచ్ఛక్ర... యైన=నూతనముగ నుదయించిన యింద్రధనుస్సుతోఁ గూడిన.

వ. శక్త్యైకరాజ్యపదవీసంసూచకసామ్రాజ్యచిహ్నశతమండితసైన్యదేశయు, విశదప్రకాశయు, సంగీతవాద్యరచనాత్మికామరవినుతయు నై మనోవాగగోచరంబున, నన్యతుల్యంబుసు నగు త్రైలోక్యగర్భపరిపూరితశక్తిచక్రసామ్రాజ్యసంపదను సూచించుచు నహమహంపూర్వికంబుగాఁ గరాంజలు లొప్ప బ్రహ్మేంద్రరుద్రహరిముఖ్యులు వినుతింప నిజశరపంచకప్రభల ముల్లోకంబుల వ్యాపింపఁజేయుచు, జయమంగళలాజవర్షంబులు గురియు నప్సరసలు ముందు నడువఁ, గామేశ్వరీప్రభృతిశక్తినికురుంబంబు సంగ్రామవేషమనోహరంబుగా సేవింప, దశయోజనాయతధ్వజోల్లిఖితమేఘమండలం బగు రథం బెక్కి యావరణశక్తులు పరివేష్టించి వెంట రాఁ బ్రపంచపాపప్రణాశనదక్షంబు లగు పంచవింశతినామంబుల దేవతలు సంస్తుతింప, సమరోన్ముఖి యై చనియె నని విని కుంభసంభవుండు మహాత్మా! లలితాపంచవింశతి నామంబుల నెఱింగించి కర్ణరసాయనంబు సేయవే యనుటయు హయగ్రీవుండు మానిచంద్రా! సింహాసనేశియు, లలితయు, మహారాజ్ఞియు, వరాంకుశయు, జాపినియుఁ, ద్రిపురయు, మహాత్రిపురసుందరియు, సుందరియుఁ, జక్రనాథయు, సామ్రాజ్ఞియుఁ, జక్రిణియుఁ, జక్రేశ్వరియు, మహాదేవియుఁ, గామేశియుఁ, బరమేశ్వరియుఁ, గామరాజప్రియయుఁ, గామకోటికయుఁ, జక్రవర్తినియు, మహావిద్యయు, శివానంగవల్లభయు, సర్వపాటలయు, వకుళానాథయు, నామ్నాయనాథయు, సర్వామ్నాయనివాసినియు, శృంగారనాయికయు ననునివి పంచవింశతినామంబులనఁబడు నీనామవర్యంబులఁ నెవండు లలితాపరమేశ్వరిని స్తుతించు నప్పుణ్యాత్ముం డష్టైశ్వర్యంబులనొందు. ఈ క్రమంబున భండాసురవధార్థ మయ్యంబిక సర్వసైన్యంబులఁ గూడి చనియె నని తెల్పుటయు నగస్త్యుండు. 1066

—— చక్రరాజరథపర్వదేవతావర్ణనము. ——

మ. పరమేశా! హయవక్త్ర! చక్రరథపర్వస్థానసంవాస మై
సురవైరిప్రబలప్రతాప మడఁపన్ శోభిల్లు దేవీ తతిం
గరుణన్ వారి మహాయుధంబులు తనూకాంతుల్ దగం జెప్పు మీ
శ్వరి చక్రంబున దేవతామహిమలన్ సంఖ్యాక్రమం బొప్పఁగాన్. 1067

క. అన విని హయవదనుం డను, విను తెలిపెద నవమపర్వవిమలతలమునన్
ఘనరీతి లలితఁ గొల్చుచుఁ, దనరెడు దశశక్తు లవ్విధము వినఁగఁ దగున్.

వ. వా రెవ్వ రెవ్వ రనిన, నణిమయు, మహిమయు, లఘిమయు, గరిమయు, నీశి

తయు, వశితయుఁ, బ్రాప్తియు, సిద్ధియుఁ, బ్రాకామ్యభుక్తిసిద్ధియు, సర్వకా
మయు ననఁ బరఁగుదురు. 1069

తే. కరచతుష్కంబుచే నొప్పి • వరకపాల
మును ద్రిశూలంబుఁ జింతామ•ణిని సుసిద్ధ
కజ్జలంబును దాల్చి ని•కామశౌర్య
మొప్ప సేవింతు రాదేవి • నుద్యమమున. 1070

వ. ఈ దశశక్తులు జపాకుసుమసన్నిభదేహకాంతిభాసమానలై యుందురు. తత్పర్వోర్ధ్వభాగంబున బ్రాహ్మియు, మాహేశ్వరియుఁ, గౌమారియు, వైష్ణవియు, వారాహియు, మాహేంద్రియుఁ, జాముండయు, మహాలక్ష్మియు నను నీ యష్టశక్తులు ద్విభుజులును శోణదేహలునునై కపాలోత్పలంబులను ధరించి రక్తవస్త్రభూషితలై యుందురు. ఈ యష్టశక్తులు బ్రహ్మాదిసదృశాకారలును, దత్సన్నిభాయుధలును, దచ్చిహ్నంబుల ధరించిన వాహనియును ధ్యానింప నగు. మఱియు నాస్థానంబునకు నూర్ధ్వభాగంబు నని వచించి ముద్రావిరచనాయుక్తకరంబులఁ జెలువారు ముద్రాశక్తులు గలరు. ఆ శక్తులు దాడిమీకుసుమసంకాశలును, బీతాంబరమనోహరలును, జతుర్బాహువులును, భుజద్వంద్వధృతచర్మకృపాణికలును, మదరక్తవిలోలనేత్రలును నై యుందురు. సర్వసంక్షోభిణియు, సర్వవిద్రావిణియు, సర్వాకర్షిణియు, సర్వవశంకరియు, సర్వోన్మాదనముద్రయు, సర్వమహాంకుశయు, సర్వఖేచరముద్రయు, సర్వబీజముద్రయు, సర్వయోనిముద్రయు, సర్వత్రిఖండికయు ననఁ బరఁగుదురు. సిద్ధిబ్రాహ్మ్యాదిముద్ర లగు నీ ప్రకటశక్తులు భండాసురసంహారంబు చేయఁ బూని చెలంగిరి. మున్ను గుప్తదేవతలుగాఁ గీర్తింపఁబడిన యా శక్తులనామంబులను వివరింతు. కామాకర్షిణియు, బుద్ధ్యాకర్షిణియు, నహంకారాకర్షిణియు, శబ్దాకర్షిణియు, స్పర్శాకర్షిణియు, రూపాకర్షిణియు, రసాకర్షిణియు, గంధాకర్షిణియుఁ, జిత్తాకర్షిణియు, ధైర్యాకర్షిణియు, స్మృత్యాకర్షిణియు, నామాకర్షిణియు, బీజాకర్షిణియు, నాత్మాకర్షిణియు, నమృతాకర్షిణియు, శరీరాకర్షిణియు నను నీ షోడశసంఖ్యాకశక్తులు శీతాంశుకలారూప లగుదురు. నిత్యాకలాశబ్దాంతముగ నీనామంబులఁ బఠింప వలయు. వీరు చక్రాష్టమపర్వంబు నాశ్రయించి గుప్తాహ్వయంబుల గీర్తింపఁ బడుదురు. మఱియు విద్రుమసంకాశలును, మందప్రహసితాననలును, జతుర్భుజలును, త్రినేత్రలును,

జంద్రార్ధమకుటోజ్జ్వలలును, చాపబాణచర్మఖడ్గధారిణులును నై దివ్యకాంతుల
మెఱయుదురు. 1071

చ. చరమమహీధరేంద్రగత • సారసమిత్రగభస్తితుల్యభా
సురవరదివ్యచక్రమయ • శోభితసప్తమపర్వమందు భా
స్కరసమకాంతిచే దనరు • శక్తులు గుప్తతరాహ్వయంబులన్
సురరిపుసైన్యవారముల • శూరతఁ ద్రుంప వసించి రెంతయున్. 1072

వ. అనంగకుసుమానంగమేఖలానంగమదనానంగమదనాతురానంగరేఖానంగవే
గానంగాంకుశానంగమాలినులను నీ నామాష్టకంబునఁ బరఁగి. 1073

సీ. పుండ్రేక్షుచాపంబుఁ • బుష్పశరంబులఁ బుష్పకందుకమును • భూరికువల
యంబును ధరియించి • యతుల విక్రమమున నలరుచు లలితా మ•హాజ్ఞచేతఁ
జండభండాసుర • ఖండనోద్భండపౌరుషమున జ్వలయని•రూప గులరఁ
జెలఁగిరి విను మంత • శ్రీచక్రరథషష్ఠపర్వంబునందు దో•ర్గర్వ మొప్ప
తే. సర్వసంక్షోభిణీముఖ్య • సంప్రదాయ, యోగినీపంక్తి చెలువారు•నోగి నిరక్త
తిలకభూషిత మై మహో•జ్జ్వలజటాక్ష, తకచ మై కాల శుచిభ మై•ధైర్యయుక్తి.

క. జ్వలనాంబకపంక్తిని ను, జ్వలదహనశరాసనాళి • జ్వలనాసితతిన్
జ్వలనాకారసుచక్రం, బలరఁగఁ జెలువారు శక్తు • లార్భటులఁ గడున్. 1075

తే. కామభస్మసముద్భూత • కర్బురేశ
గర్వహరణక్రియాధుర్య•గాఢశౌర్య
కలిత లై సంప్రదాయాహ్వ•ములను దనరు
చుందు రాజ్ఞాఖ్యశక్తు లై • యందుఁ గడిమి. 1076

సీ. సర్వసంక్షోభిణి • సర్వవిద్రావిణి, నెమ్మి సర్వాకర్షి•ణియును మఱియుఁ
బ్రకటసర్వాహ్లాది•నికయును, సర్వసమ్మోహినీశక్తియుఁ • బూజ్య యైన
సర్వసంస్తంభన • శక్తియు, సర్వజృంభణశక్తి, మఱియుః స•ర్వవశకారి
సర్వరంజనశక్తి • సర్వోన్మాదనశక్తియు, సర్వార్థ•సాధనయును
తే. సర్వసంపత్తిపూరణి • సర్వమంత్ర,మయియు మఱి సర్వ పూర్ణయై•మహితరూప
యైన ద్వంద్వక్షయంకరి•యనఁగ నిట్లు, సంప్రదాయాఖ్యచే నొప్పు•శక్తులెలమి.

వ. షష్ఠపర్వంబునందుఁ బ్రకాశింతురు. మఱియును జక్రస్యందన పంచమపర్వం
బునఁ గులోత్తీర్ణాహ్వయంబుల నలరుచు శుద్ధస్ఫటికవర్ణలును, బరశుపాశగదా
ఘంటామణులను దాల్చి భండాసురుని జంపఁ బూని భ్రుకుటీకుటిలాస్య లై
యుందురు. ఆ శక్తులు సర్వసిద్ధిప్రదయు, సర్వసంపత్ప్రదయు, సర్వప్రియంక

తిథినిత్యలంగూడి శ్రీపరాంబ దుష్టభండాసురుని జంపఁ బయనంబయి
నని హయగ్రీవుండు మరలఁ గుంభసంభవున కిట్లనియె.

గీతిచక్రపర్వదేవతావర్ణనము.

తే. శ్యామలయు గీతి నామమౌ • స్యందనంబు
నందుఁ జెలువొందెఁ దచ్చక్ర•మందు సప్త
పర్వములు చెన్నుమీఱుఁ ద•త్పర్వనికర
మందు వెలుఁగొందు శక్తుల • నభినుతింతు.

క. గీతిరథపర్వమధ్యని,కేతన యై శ్యామలాంబ • గీతాధిప యై
ఖ్యాతిగ లలితాప్రియసఖి, యై తమిఁ జెలువారె దేవ•తార్చిత యగు

చ. వినుము ద్వితీయపర్వమున • విక్రమసంపద పెంపు మీఱఁగా
వినుతచరిత్ర యౌ రతియుఁ • బ్రీతి మనోజలునుగా విపంచికా
ఘనతరకార్ముకంబులను • గై ధరియించి తమాలనీలది
వ్యనుతశరీర లై దనుజ•వారముఁ ద్రుంపఁ జెలంగి రెంతయున్.

సీ. మూఁడవదౌపర్వ•మున మనోభూబాణదేవత లొప్పిరి • ద్రావిణియు
శోషిణి బంధిని • సొరిది మోహినియు నున్మాదినియును నాఁగ • ఘ
కార్ముకపాణు లై • గ్రాలిరి మఱియు నప్పర్వమునకుఁ గ్రింది•భాగము
రాజిల్లి రటఁ గామ•రాజుఁ గందర్పుండు మన్మథుండును మఱి • మక

తే. నుండును మనోభవుండును • నూత్న కాంతి
చేతఁ ద్రైలోక్యమోహన • లై తనర్చి
మృగమదాయతతిలకంబు • మిగిలి భాల
భూషణము గాఁగ వెలసిరి • భూతి మఱియు. 1084

తే. కవచసంఛన్నసర్వాంగ•కంబు లలరఁ
గింశుకప్రసవాభు లై • కితవనివహ
మారణప్రక్రమముఁ బూని • మాఱుకొనుచుఁ
జెలఁగి రెంతయుఁ గడఁకతోఁ • జిత్రభంగి. 1085

వ. గేయచక్రరథచతుర్థపర్వంబు నాశ్రయించి పూర్వోక్తలగు బ్రాహ్మీముఖ్యలు
వెలయుచుందురు. ఆపర్వంబుక్రింద లక్ష్మియు, సరస్వతియు, రతిప్రీతికీర్తు
లును, శాంతియుఁ, బుష్టితుష్టులు నుందురు. ఆశక్తులు క్రోధరక్తనేత్రిలును,
గుంతచక్రధరలును నై పరాక్రమంబున నొప్పారిరి. మఱియును. 1086

క. ఐదవపర్వంబున వామాదులు షోడశపరాంబ • లాచక్రమునం
బాదుకొని రట్టి శక్తుల, శ్రీదేవీప్రియల నిపుడు • చెప్పెద వినుమా. 1087

వ. వామాజ్యేష్ఠారౌద్రీశాంతలును, శ్రద్ధాసరస్వతులును, క్రియాశక్తిలక్ష్ములును, దుష్టియు, మోహినియుఁ, బ్రమథినియు, నాశ్వాసినియు, వీచియు, విద్యున్మాలినియు, సురానందయు, నాగబుద్ధికయు, ననునాహ్వయంబుల నొప్పి కురువిందప్రభాభాసమానలై జగత్క్షోభణాలంపటంబులును నై వజ్రకంకటసంఛన్నలును, ఘోరాట్టహాసోజ్వలలును నై వజ్రదండశతఘ్నులను, ముసుంఠికను ధరించి యుందురు. మఱియును గేయచక్రరథషష్ఠపర్వంబున నసితాంగరురుచండక్రోధోన్మత్తకపాలభీషణసంహారభైరవులు త్రిశిఖపానపాత్రంబులఁ దాల్చి నీలకాంతులై యుందురు. సప్తమపర్వంబు నాశ్రయించి మాతంగియు, సిద్ధలక్ష్మియు, మహామాతంగికయు, మహాతీసిద్ధలక్ష్మియు ననువేరులం బరఁగి శోణవర్ణలై బాణధనుర్ధరలై యుందురు. ఆ పర్వంబునకుఁ గ్రిందిభాగంబున గణపతియు, క్షేత్రపుండును, దుర్గాంబయు, వటుకుండును, శస్త్రపాణులై యుందురు. అద్దాని క్రిందిభాగంబున లక్ష్మియు, సరస్వతియు, శంఖపద్మనిధులును, శస్త్రపాణులై లోకశత్రు వగు భండాసురుం జంపఁదలంచుచుందురు. ఆ క్రిందిభాగంబున శక్రాదివిష్ణ్వంతదశదిక్పాలకులు శక్తిరూపంబుల వజ్రశక్తికాలదండాసిపాశధ్వజగదాత్రిశూలదర్భాస్త్రచక్రంబులం దాల్చి శ్యామలాంబను సేవించుచు లలితాజ్ఞాపరాయణులై యుందురు. సర్వదేవతలును మంత్రిణిద్వారా లలితాంబకు విజ్ఞాపనంబు చేయుచుందురు. రాజ్ఞియు మంత్రిణ్యుక్తమార్గంబున భక్తులకును సేవకులకును మనోవాంఛల నిచ్చుచుండు. సంగీతయోగిని యగు శ్యామలయు లలితాతివల్లభయగు శ్రీదేవీరాజ్యభారంబు మంత్రిణ్యధీనంబ. శ్యామలయును గార్యంబులను జేయకుండుటకును జేయుటకు నన్యథాకరించుటకు సమర్థ యగుట దిక్పాలకాదులాశ్యామలాంబ నాశ్రయించిరి. కుంభసంభవా! చక్రరాజరథగేయచక్రరథపర్వదేవతలును వర్ణించితి నీదేవీ కీర్తనంబు నెవండు గావించు నాతండు పాపవిముక్తుండై జయంబు నొందు నని హయగ్రీవుండు. 1088

## కిరిచక్రరథపర్వదేవతావర్ణనము.

క. కిరిచక్రస్యందనమునఁ, బరఁగెడు నప్పంచపర్వ • భాసురదేవీ
పరివారదేవతావళి, సరగున నెఱిఁగింతు గుంభ • సంభవ వినుమీ. 1089

సీ. బిందురూపం బాద్య•విశ్రుతపర్వంబు దండాధినాయిక • తనరునందు
సకలజగద్వ్రాత•చండకంటకదైత్యవారఘస్మరి, దివ్య•బహుళశస్త్ర
నికురుంబదీప్తుల • నిజవిజయశ్రీల నాడించి వెలసెడు • నంబ తీవ్ర
పోత్రనిర్ఘాతసం•భూతాగ్ని నిర్దగ్ధచండదానవ, తీక్ష్ణ • శౌర్యకలిత
తే. పృథులదంష్ట్రోదితమృగాంక•విహసననిశ
ప్రావృషేణ్యపయోవాహ • వారనీల
వర్ణతనులత, పోత్రిణి • వఱలుఁ బుత్త్రి
కాయితాఖిలలోకవి•క్రమము మెఱయ. 1090

క. విను మవ్వల రెండవ దగు, ఘనపర్వము నాశ్రయించి • కడు శౌర్యమునన్
వనితలు జృంభిణి మోహిని,యును స్తంభిని యనఁగ మువ్వు•రొప్పుదు రెలమిన్.

చ. సులలితదాడిమీకుసుమ•శోభల నొప్పి కఠోరదానవా
వళిఁ దునుమాడు శౌర్యమున • వర్ధిలి భాసురరత్నకంకణో
జ్జ్వలకరసంఘమందు హల•[1]సర్పగుణంబులు లోను గాఁగ నొ
ప్పు లలిత భీషణాస్త్రములఁ • బొందుగఁ దాల్చి చెలంగి రెంతయున్. 1092

తే. మఱియు దీప్తకరాళాక్ష • మహితకాంతి
చేత నలరుచుఁ గర్బుర • వ్రాతములను
గాల్ప నెంతయు వారాహి • గారవమునఁ
గొల్చుచుందురు వారలు • కోర్కి మీఱ. 1093

సీ. కిరిచక్రతార్తీయ•వరపర్వమును నాశ్రయించి యంధిన్యాదు • లెసగుచుంద్రు
పంచమూర్తులు కిరి•వదనకు నాప్తలై కఠినాట్టహాససం•కలన లోక
ములు సంతసింపంగ•జెలఁగుచుఁ గల్పాగ్నిశిఖకదంబము పోల్కి • స్త్రీతనువుల
ధరియించి రాక్షస•తతిరుధిరప్లుతిఁ ద్రావ జిహ్వలఁ జాఁపి • దారుణముగ
తే. దండనాయిక సేవించి • చండవిక్ర, మమున నొప్పిరి కిరిశతాం•గమున నొప్పు
నట్టి నాలవపర్వంబు•నాశ్రయించి, బ్రాహ్మిమొదలగు దేవతల్•పరఁగుచుంద్రు.

వ. బ్రాహ్మియు, మాహేశ్వరియుఁ, గౌమారియు, వైష్ణవియు, నింద్రాణియుఁ, జాముండయు; నను నీ యాఱుశక్తులును జ్వలజ్జ్వాలాకళేబరలై దానవసంహరణోద్యోగంబున నొప్పుచుందురు. ఆ పర్వంబు క్రిందిభాగంబు నాశ్రయించి యాకినీరాకినీలాకినీవాకినీశాకినీఢాకినీశక్తులును వారి యైక్యస్వరూపిణి యగు హాకినియు దోర్దండవిక్రమంబుల భూతంబుల నాస్వాదించునట్లును, భూతంబుల

1 సర్పగుణంబులు=నాగపాశములు.

సాక్రమించునట్లును వెలుగొందుచు వైరిత్వగ్రక్తమాంసమేదోస్థిమజ్జాప్లీహాశు క్లంబులఁ ద్రాగుచు నిష్ఠురసింహనాదంబుల దిక్కులఁ బూరించుచు, ధాతునాథాహ్వయంబుల నణిమాద్యష్టసిద్ధులును దానవమోహన మారణ స్తంభన తాడనభక్షణామూలనికృంతనంబుల సమర్థ లైయుందురు. ఈ ధాతునాథలు సర్వధాతువులయందు నివసింతురు. మఱియు నూర్మిమాలాలోలసప్తసాగరంబులను క్షణార్ధంబునఁ బానంబుచేయ సమర్థతగలిగి శకటీచక్రంబు పోల్కి వృత్తభయంకరలోచన లై స్వస్వామిద్రోహులయు, స్వసమయద్రోహులయు, వైదికదేవయజ్ఞద్రోహులయు మాంసంబులను భక్షింప సమర్థ లై యుందురు. మఱియు నాపర్వపార్శ్వద్వయంబునందు. 1095

తే. అలరిక్రోధిని స్తంభినియను నిరువురు, చామరంబులు వీచుచు సాంద్రవలయ
నినదదోర్లత లొప్పంగ దనుజరక్త, పానమును జేయఁ గోరుచు వఱలుచుంద్రు.

చ. కిరిరథపార్శ్వయుగ్మమును గేవలవాసము గాహలంబు ను
ద్ధురముసలంబునుం దనుజదోర్బల మార్పఁ జెలంగు దేవతా
స్ఫురణను దండనాయికయు భూరితరాయుధయుగ్మముం మహా
త్తర కరయుగ్మమందుఁ దగఁ దాల్చి విషంగు వధించు నిచ్ఛచేఁ. 1097

వ. ఆపర్వంబునందు వారాహి ముందట. 1098

సీ. దంష్ట్రాతికటకటాత్కారైకబధిరీకృతాశాముఖుండు నుద్యత్త్రిశూల
పాశఖడ్గప్రేతబహుళాయుధోజ్వలత్కరచతుష్కుండు, నేత్రత్రయుండు
నైజచండోచ్చండనామంబు సార్థక మగునట్లు వారాహినాదరమున
సేవించెఁ గిరిచక్రపావనపంచమపర్వంబున వసించి వఱలునట్టి

తే. యష్టశక్తులు వార్తాళి కాదు లష్ట, శైలనిష్పాతినిర్ఘాతశబ్దములను
విషధరాష్టకభూషలవిపుల శౌర్య, ములను సేవించి జయకాంక్షఁ బూని రెలమి.

వ. ప్రకృష్టబాహుప్రకాండోష్మహతదానవకోటు లగు వారి నామంబు లెఱిఁగింతు. వార్తాళియు, వారాహియు, వరాహముఖియు, నంధినియు, బంధినియు, జృంభిణియు, మోహినియు, స్తంభినియు ననఁ బరఁగి రిపుక్షోభస్తంభనోచ్చాటనక్షమ లై యుందురు. ఆ పర్వవామభాగంబున దండనాథోపవాహ్యంబును, ధూసరాకారంబును, నర్ధక్రోశాయతశృంగద్వయంబును, క్రోశవిగ్రహంబును, ఖడ్గనిష్ఠురరోమజాలసంవృతాంగంబును, గాలదండసమోచ్చండవాలకాండభయంకరంబును, నీలాంజనశైలప్రస్థవికటోన్నతపృష్ఠభాగంబును, మహానీలగిరిశ్రేష్ఠగరిష్ఠస్కంధమండలంబును, ప్రభూతోష్మలనిశ్వాసప్రసరాకంపితాం

బుధియు, ఘుర్ఘురధ్వనిచేఁ గాలమహిషంబును హాస్య మొనరించుచున్నట్లు చెలంగు కాసరంబు మెఱయుచుండు. ఆ పర్వంబుక్రింద నుచ్ఛస్థానంబులందు. 1100

చ. హరిశుచికాలదైత్యవరు • ణానిలకిన్నరనాథశంకరుల్
సురరిపుదోఃపరాక్రమము • శూన్యకపత్త్రనరీతి నంబకున్
వరదకు విన్నవించుటకు • వచ్చి జగంబుల మేలుఁ గోరి య
వ్వరరథపంచమంబయిన • పర్వమున న్నివసించి రెంతయున్. 1101

తే. వారి నామంబులను దెల్పు • వాఁడ సంగ్ర, హముగ దేవాధినాయకుం • డప్సరసలు
కుంభజన్మా! చతుష్షష్టి • కోటిసిద్ధ, వరులు నగ్నియు సాధ్యులు • వఱలుచుంద్రు.

వ. విశ్వేదేవతలును, మయుండును, మాతృకలును, రుద్రానుచరులును, రుద్రుండును, బిశాచనిరృతిమిత్రులును, విశ్వావసుప్రభృతి గంధర్వులును, భూతగణవరుణవసువిద్యాధర కిన్నర మారుతేశ్వర చిత్రరథ తుంబురులును, నారదయక్షేశ్వరులును, దేవతలును, శ్రీమన్నారాయణుండు, నీశానుండును, జక్రరక్షకశూలభీషణబ్రహ్మలును, నశ్వినిపుత్త్రులును, ధన్వంతరియును, గటక్రోడగళద్దానసంతర్పితమధువ్రాతు లగు గణనాయకులును, మఱియు ననేక దేవతలును బ్రాగాదిక్రమంబుగా నివసించిరి. మఱియు శక్రాసురమరుద్దిక్కుల నాశ్రయించి తదధిష్ఠాన దేవత లగు జృంభినీ స్తంభినీ మోహినులు నివసించిరి. ఆపర్వమునకుఁ జేరువను గపాలంబు గదను దాల్చి యూర్ధ్వకేశుండును, బాతాళజలజంబాలబహుళాకారకాళిముండును, గఠినాట్టహాసకులిశదీర్ణబ్రహ్మాండమండలుండునై డమరుకధ్వనుల రోదసీకుహరంబుల భేదించుచు, ఫూత్కారత్రిఫణాయుక్తంబగు ఫణిపాశంబును గరంబునఁ దాల్చి వారాహిని క్షేత్రపాలకుండు సేవించెనంత. 1103

ఉ. భాసురభూషణాంబరవి • పాటలహారచయంబుఁ దాల్చి వే
కేసరి నెక్కి కోలముఖి • కేరుచు వచ్చిన దోర్బలాతిభీ
మాసురమారణోత్సుకత • నట్టితనూమృదులాంబరాదులన్
వాసిగఁ దాల్చి దోర్బలము • వర్ధిల శక్తిచయంబు వేడ్కతోన్. 1104

తే. మున్ను చెప్పినయప్పర్వ • మునకుఁ గ్రింద
నుండి రుద్దండదోర్బల • ముల్లసిల్ల
ముసలహలముఖదివ్యాస్త్ర • ములను బూని
శ్యామలాకార లైనట్టి • శక్తు లెల్ల. 1105

సీ. లలితాంబకును శ్యామ•లకు నిజనాథ యౌ వారాహికిని ద్రోహ•మీరనమున
నొనరింపఁ బూనిన • ఘనరాక్షసులఁ జంపి తద్ర్భక్తమును ద్రావ • దారుణముగ
నట్టహాసంబుల • నఖిలదిక్తటములఁ బూరించుచును జెలు• వారి రట్టి
శక్తిసాహస్రంబు • చయ్యన వారాహి నాశ్రయించుచు నేగె • ననికి వారి
తే. నామముల నెల్ల సాహస్ర•నామఘట్ట, మున నెఱింగింతువినుమంత • ఘనతరాంగ
మొప్పగాఁ గృష్ణసారంగ• మొకటి కోల,వదనముందట నివసించె • వైభవమున.
వ. ఆకృష్ణసారంగంబు పాదక్రోశాయత శృంగంబులును, శృంగచతుర్థాంశమిత ముఖఁబును, క్రోశ ప్రమాణపాదంబులును గలిగి యుదరంబున ధవళచ్ఛాయయు నొప్పఁ జెలంగె హసన్మారుతవేగం బగు నవ్వాహనహరిణపరాక్రమం బచింత్యం బవ్వాహనం బాపర్వంబున నలరారె మఱియు నాపర్వంబునందు.
క. అలరె సురాసింధువు ను, జ్వలశక్తితనూవిలాస•సంపద మీఱం
గలవిలపాటొందఁగ దను,జులు మాంసము చేతఁ దాల్చి • శుభ్రాంగమునన్.
ఉ. బంగరు తమ్మిదండను వి•భాసురవక్షమునందుఁ దాల్చి ర
క్తాంగదముఖ్యభూషణము • లాసురవైరుల మారణక్రియా
భంగురరీతిఁ దెల్ప సుర•వారము సంతసమంది చూడఁగా
సంగర మందు శక్తులకు • సాయ మొనర్పఁగ వచ్చి నిల్వఁగన్. 1109
తే. మద్యసాగర మీరీతి • నూనినీక, దంబమున కెల్ల సంతోష • దాయకంబ
యయ్యెరణమునలలితామ•హాజ్ఞతనదు,తనువు విలయింపఁగల్గెన• త్తరుణివినుము.
తే. సందియంబేలయాసురా•సాగరంబు,రమణిమై యుండఁ జూడఁజిత్రముగఁదోఁచె
నమర సంతతికెల్ల న•య్యబ్ధిచరిత, మెల్ల ముందుగఁ దెలిపెద • నుల్లమలర.
వ. ఆపర్వంబుక్రిందను, మీఁదనష్టదిక్కులయందును హేతుకాదిదశవిధభైరవులును దీప్తాయుధతేజంబుల సూర్యకాంతి నడంచుచు భయంకరులై త్రిశూలాగ్రంబులచే మేఘమండలంబు భేదించుచు నివసించిరి. హేతుక,త్రిపురా,ర్యగ్ని,భైరవ, యమజి,హ్వైకపాద, కాల,కరాళ, భీమరూప, హాట, కేశాచల నామములను వారు దశకోటిభటాన్వితులై నివసించిరి. ఇవ్విధంబున దండనాథా చక్రరథపర్వ దేవతలు పరాక్రమోపేతులై యుండిరి. జృంభిన్యాదులును నచలేంద్రాదులును మున్న నాచేఁ జెప్పఁబడిరి కాదే. మఱియు ననేక దేవతలు యుద్ధంబున కరిగిరి. ఏస్థలంబున శ్రీచక్రరథంబు సంచరించు నచ్చట శ్యామారథంబును, దాని పిఱుంద దండనాథాస్యందనంబును జరించు. ఈరథత్రయంబు జగత్త్రయం బునుభోలె వెలింగె. సేనామధ్యంబున నీరథత్రయంబు దిరుగునప్పుడు మేరు

మందరవింధ్యంబులవలెఁ గనుపించె. అట మీఁదివృత్తాంతంబు నాలకింపుము.

సీ. ప్రథమసారథి యయ్యెఁ • బరికింపఁగా నిర త్రిపురభైరవియు ద్వై • తీయ యయ్యె
సంహార భైరవ • సంజ్ఞుండు మఱి రక్తయోగిని వల్లభుం • డొప్పు సార
సాఖ్యుండు, చాముండ • యనఁగ నీయాఱ్వురు శ్రీదేవి సారథుల్ • చెలఁగిరంత
శ్యామలా సారథి • చారుహాసంతిక దండినీసారథి • స్తంభిని యన

తే. నొప్పి రెంతయు దశయోజ • నోన్నతంబు
చక్రరథమును సప్తయో • జనపరిమితి
శ్యామలాస్యందనంబును • సైన్యనాథ
రథము షడ్యోజనోన్నతి • రాజిలెఁ గడు. 1113

క. ముక్తామయాతపత్త్రము, శక్తీశ్వరి రథమునందు • సాంద్రవిభాసం
యుక్తంబై దశయోజన, యుక్తిని రాజిల్లె దేవ • తోత్తము లలరన్. 1114

తే. శక్తి రాజ్యైకసూచక • సరణి నొప్పె
నద్ది తక్కిన యిరువురి • యాతపత్త్ర
ములును నత్యుచ్ఛ్రియంబులై • చెలఁగె మింట
నమరసంఘంబు సమ్మోద • మందుచుండ. 1115

మ. ఇరుపార్శ్వంబుల మంత్రిణీకిరిముఖుల్ • వృత్రారిముఖ్యామరుల్
గరుడుల్ కిన్నరసంఘముల్ బలసి రాఁ • గామాక్షిభక్తైకహృ
త్పరమార్థప్రద, లోకనాయిక, హరి • బ్రహ్మాదిసంపూజిత
స్ఫురదంఘ్ర్యంబుజ భండదైత్యు ననిలోఁ • బోకార్ప నేగెన్ దమిన్. 1116

మ. పరమేశ ప్రియపత్ని యివ్విధిఁ జమూ • వారంబుతో భండదై
త్యరమాకర్షణలోల యై యమరు ల • త్యంతంబుఁ బ్రార్థింపఁ గి
న్నరు లెల్లన్ వినుతింప నచ్చరలు వి • న్నాణంబుతో నాడఁగాఁ
బరమాహ్లాదముతోఁ బ్రయాణమయి పో • వన్ దిక్తతుల్ ఘూర్ణిలెన్. 1117

చ. ధరణి చలించెఁ బర్వతవి • తానము లెంతయు నాకులంబులై
ధరఁ దొరఁగెన్ దురాత్ములు ని • తాంతము భీతిని బొంది రంత నం
బరమున దేవదుందుభులు • భవ్యరవంబున మ్రోసె గాయకుల్
కర మనురక్తిఁ బాడిరి వి • కారము లేక జగంబు భాసిలెన్. 1118

ఆ. పుష్పవృష్టిగురిసె • భూరిముదంబున, శారదయును బ్రీతి • నారదుండు
తుంబురుండు మదిని • దోరపువేడుకఁ, బాడి రంత విజయ • పద్యతతిని. 1119

తే. హర్ష సంఫుల్లవదన లై • యుప్సరసలు, జయజయాదిక మై యొప్పు • శబ్దవితతి
వినుతి చేసిరి త్రిపురేశి•విశ్వజనని, వేదముల సన్నుతించిరి • విప్రవరులు. 1120

వ. అధర్వణమంత్రంబుల హోమంబు గావించి పరమేశ్వరికి విజయం బగుఁ గాక యని సజ్జనులు వీతిహోత్రుని బ్రార్థించిరి. అంత లలితాంబ సకలసురనరసంస్తూయమాన యై భండపురాభిముఖి యై సకలపరివారసైన్యసంయుక్త యై చనియె నని చెప్పినఁ గుంభసంభవుండు తదనంతరవృత్తాంతశ్రవణకుతూహలి యై హయగ్రీవు నడుగుటయు. 1121

ఆ శ్వా సాం త్య ము.

క. నిరతాన్నదానతర్పిత, ధరణిసురా, సర్వదేవ•తాపూజితభూ
ధరకన్యకాంఘ్రిజలజా, తరతనిజస్వాంతషట్ప•దా సుగుణాఢ్యా. 1122

మాలిని. పతిహితనిజచర్యా • భక్తిసంతోషితార్యా
సతతనుతచరిత్రా • సాధుమాఙ్గల్యగోత్రా
వితతవిమలశీలా • విశ్వనాథాంఘ్రిలోలా
ధృతగుణమణిహారా • దివ్యచిత్తప్రచారా. 1123

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్తగీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయపవిత్రభవ, శ్రీజనమంచివంశాంబురాశికుముదినీమిత్ర సుబ్రహ్మణ్యమనీషిపుత్ర తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయప్రణీతం బగు బ్రహ్మాండపురాణోత్తర ఖండాంతర్గత హయగ్రీవాగస్త్యసంవాదరూపం బగు శ్రీమదాంధ్రలలితోపాఖ్యానంబునందుం బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

శ్రీసోమసుందరేశాయ నమః.

# శ్రీమదాంధ్రలలితోపాఖ్యానము

## ద్వితీయాశ్వాసము.



నాథ దివ్యతత్త్వ
జ్ఞానామృతపానలోల • సాధుస్వాంతా
మానితసద్గుణనికురుం
బా నిశ్చలబుద్ధివైభ•వా జోగాంబా. 1

వ. అవధరింపు మవ్వలికథాక్రమం బెట్టిదనిన. 2

శూన్యనగరంబున నుత్పాతంబులు పుట్టుట.

క. లోపాముద్రానాయక, శ్రీపతిముఖవినుతమైన • శ్రీదేవీయా
త్రోపక్రమనిస్పృహణ, వ్యాపారము నాలకించి • భండపురస్థుల్. 3

క. ఇదియేమి నిస్వనము యీ, యదనున నుత్పాతభంగి • నత్యుగ్రంబై
మదిఁ జొచ్చి కలఁచె నని భీ,తి దలిర్పఁగ నడలి రెంతో • దీనత దోఁపన్. 4

మ. అతిదుష్టుండు దురాశయుండు బహుళో•ద్యద్బాహుశౌర్యుండు సం
తతపీడాకరకృత్యుఁడై చెలఁగు న•ద్దైత్యేంద్రు నావాసమై
వితతంబై తగుశూన్యకాఖ్యపుర మా • [1]వృత్రారిభూభృత్సరి
త్పతితీరంబున వెల్గు దుష్టదనుజో•ద్దామప్రతాపోన్నతిన్. 5

క. శతయోజనవిస్తృతిచే, దితిసుతవర్యులకు నెల్ల • దివ్యాలయమై
జితదేవవిష్ణుపురమై, సతతము చెన్నారునట్టి • స్థానీయంబున్. 6

క. ధూమావృతమై యున్న, ట్లామూనిని యుద్ధయాత్ర • నత్యుత్పాత
స్తోమము మఱిమఱి యప్పుర,సీమలఁ గనుపట్టెఁ బురము • సిరి తొలఁగి చనెన్.

క. కారణము లేకయే గృహ, వారకవాటములు కుడ్య•పంక్తులు గూలెన్
బోరున నుల్కలు రాలెను, దారుణముగ నభమునుండి • ధరణీస్థలిపైన్. 8

1 వృత్రారి.....తీరంబునన్=మహేంద్రపర్వతముచెంత సముద్రతీరమందు.

క. ఆతఱి ఘోరోత్పాత, వ్రాతమునకు మొదటిదయ్యె • బహుభీతిదమౌ
భూతలకంపము మఱి ధర, నీతల మట మండె నగ్ని • నిర్గతశిఖలన్. 9

క. ఆకస్మికముగ నాతఱి, నాకర్బురహృదయపంక్తి • యట్టె చలించెన్
గాకాదిదుష్టఖగములు, వే కేతనపంక్తి నెక్కి • విషమూర్ఛటులన్. 10

చ. ఖరకరుతీవ్రమండలముఁ • గాంచుచు నేడువసాగె; నంతఁ గ
ర్బురులకు సర్వవస్తువులు • పొల్పుఁగ సాధ్యము గానియట్లుగా
నరుదుగ దృష్టులొప్పె గగ•నాంతరమందున ఘోరరావముల్
వరుస వినంబడెన్ దితిజ•వారము లెంతయు భీతి నొందఁగన్. 11

క. కేతనము లన్నిదిక్కుల, నాతఱి మలినంబు లగుచు • నతిచంచలతన్
భూతభయంకరధూమ, వ్రాతముచే నావరింపఁ • బడియెఁ బురమునన్. 12

క. దితిసుతకాంతాభూషణ, వితతులు భూభాగమందు • విచ్యుతసూత్రో
ద్ధతి రాలె శోకజల మా, సతులకు నెడలేక కాఱ•సాగె మునీంద్రా. 13

క, ముకురంబులఁ, గేతనములఁ, నకలంకపుఁ గవచతతి గృ•హంబులను, మణీ
నికరంబుల, ఖడ్గంబుల, సకలుషకాంతులు చెలంగె • సాంద్రము లగుచున్. 14

సీ. సౌధపంక్తిని జంద్ర•శాలలఁ గేళికావేశ్మమ్ములందును • విపణులందు
[1]నట్టాలకములందు • నాలోచనార్థమై నిర్మించి యున్నట్టి • నెలవులందుఁ
[2]బ్రగ్రీవకాళింద • పటలచతుష్కికాసముదయంబుల [3]స్వస్తి•కములయందు
గోపురంబులయందుఁ • గుడ్యంబులను మనోహరములౌ శుద్ధాంత•వరములందు

తే. మఱియు బహువిధగృహముల•నఱిముఱిఁ బుర, వాసరాక్షసవితతికిఁ•బరుషభూత
భూషితంబులు వినవచ్చెఁ•బ్రబల మయ్యెఁ, [4]జేకొణుజు ఘోరవర్ణమై • చిత్రభంగి.

ఉ. కప్పలు ఘోరనాదములఁ • గ్రాలి దివాకరుఁ జూచి యార్చె వే
కుప్పలుగాఁగఁ గీకసపుఁ • గోటులు భూమిని రాలఁ జొచ్చె నె
ల్లప్పుడు వేదిమధ్యముల • నట్టె యసృగ్జలబిందువుల్ పడెన్
జెప్పెడిదేమి మానివర! • చిందఱవందఱ లైరి రాక్షసుల్. 16

క. ధరణిని [5]కేశోండ్రకములు, పరితస్సంవ్యాప్తధూమ•పటలము లగుచుం
దొరఁగెన్ బహుళోత్పాతని,కరములు కనుపట్టె వానిఁ • గనుఁగొని దితిజుల్.

---

1 అట్టాలకము=కోటబురుజు. 2 ప్రగ్రీ...సముదయంబులన్-ప్రగ్రీవ=కిటికి, అళిందపటల=తలవాకిటి ప్రక్కనున్న చిన్నగదులగుంపు, చతుష్కికాసముదయంబులన్ = పెద్దకోనేఱులగుంపునందు. 3 స్వస్తికములన్ = తూర్పువాకిలిగల రాజగృహములందును. 4 చేకొణుజు=పచ్చవర్ణముగలచెదలు. 5 కేశోండ్రకములు=బూఁజుపట్టులు.

క. భండాసురునకుఁ దెల్పినఁ, జండతరప్రబలశౌర్య•సారుం డగుటన్
బెండువడ కతఁడు సోదర, మండనుఁడై కొలువు చేరె • మంత్రులు గొలువన్.

చ. కొలువున కేగి రత్నచయ • గుంభితచిత్రరుచిప్రపూర్ణమై
వెలయు మృగేంద్రవక్త్రరుచి • విస్ఫుటభర్మమయాసనంబు ను
జ్జ్వలకనకాద్రిఁ బోలి చెలు•వంబు తగన్ వెలుఁగొందుదాని ని
ర్మల మగుదాని నెక్కెఁ బ్రియ•మంత్రులు లోనగువారు గొల్వఁగన్. 19

చ. వరరుచిమత్కిరీటతట • భవ్యమణిప్రభ లొక్కటన్ దిగం
తరములయందుఁ జేరి యట • ధ్వాంతము వాపి యహస్కరుండు నాఁ
బరినుతిచే వెలుంగ సచి•వవ్రజ మెంతయుఁ జేరి కొల్వ సుం
దరసురనాథుపోల్కిని ని•తాంతము భాసిలె నంత నాతనిన్. 20

తే. యోజనం బగువిస్తృతి•నొప్పి యున్న, తంబునై వెల్గు సింహాస•నంబుమీఁద
దేవతానాయకునిభంగిఁ • దేజరిల్లు, భండదైత్యుని దోర్దండ•చండు నపుడు. 21

చ. బలము పరాక్రమంబు, గడు • భాసురతేజము సాహసంబు ని
స్తులసమరోద్యమంబు మది • శోభిలు సంతతసమ్మదంబు ప్ర
జ్వలితహుతాశనప్రభల •. భంగి వెలింగెడు దివ్యసాయకం
బులు నొకరీతి నొప్పఁగను • బూనిక విషంగవిశుక్రదానవుల్. 22

శా. ముల్లోకంబుల నొంచి దేవవిభులన్ • భూతేశు మెప్పించి య
త్యుల్లాసంబునఁ గన్నకీర్తి శశిచే • నొప్పారి భండాసురో
ద్యల్లక్ష్మిన్ వెలయింప నగ్రజునిపా•దాబ్జంబులన్ వ్రాలి రా
జిల్లన్ దనుజేశునాజ్ఞఁ గొని చం•చద్రత్నభూమిస్థలిన్. 23

ఆ. ఉపవసించి రంత • నొయ్యన దైత్యేంద్రు, లరుగుదెంచి రట్టి • యసురవరుల
గణనసేయ నాకుఁ•గాదు శక్యము మౌని, చంద్ర వినుము వారి • చరితమంత.

ఆ. పేరు లుచ్చరించి • వారలు కైమోడ్చి, మ్రొక్కి నిలువ వారి • ముత్కనీని
కముల నాదరించి • సుమహితపీఠంబు, లందు నుపవసింప • నాజ్ఞచేసి. 25

క. దానవనాయకుఁ డంతట, మౌనంబు నహించి యుండె • మదిలో నపు డ
మ్మానినిరాకకు నశుభవి, తానము గలుగుటకు నడలు • దనుజులఁ గనుచున్.

భండాదులు యోచించుట.

ఉ. మానము నూని యున్నగుణ•మాన్యుని నగ్రజు ధైర్యశోభితున్
దానవనేత భండుఁ గని • తద్దయు వేడుక మధ్యమానమై

మానితమైన నీరనిధి • మాడ్కి గళస్వన మొప్పఁగా వచో
జ్ఞానమునన్ విశుక్రుఁ డను • సంతసమంది సురారు లెన్నఁగాన్. 27

సీ. ఆలకింపుము యుష్మ • దాయతదోర్దండవిధ్వస్తశౌర్యులు • వీతబలులు
పామరాచారులు • పాపులు దుర్బుద్ధు లౌ సురాధములెల్ల • నాకులమున
నన్యశరణ్యంబు • నరయంగఁ జాలక ప్రజ్వలజ్జ్వాలుఁడౌ • వహ్నియందుఁ
బడి నాశ మొందిరి • బలశౌర్యగర్వితకాంత యొకర్తుక • కలిగె దాని

ఆ. వలనఁ బుట్టి రెల్ల • వాసవాదులు వారి, యుద్యమమున రేఁగి • యొప్పి వివిధ
శస్త్రనికరములను • జానప్రకాశించి, వనితలెల్లఁ గొలువ • బరవసమున. 28

చ. మనల జయింపవచ్చె నఁట • మానిని హా! విధివైశసంబు నే
మనఁదగు నింక రాక్షసుల • నందఱఁ జంపఁగఁ జాలెనేని చ
క్కనియొకపల్లవాగ్రమున • గాఢతరోపలముల్ హరించిన
ట్లనువుగఁ జెప్ప నొప్పుకొన • నౌ నెటు లయ్యెది హాస్యమేకదా. 29

ఆ. చింత నొందనేల • సిగ్గగు నివ్వార్త, నాలకింప శతమ • ఖాదిగణము
మనసు సైన్యభటుల • మార్కొనఁ గాలేక, పఱచె నీదు బాహు • బలభయమున.

సీ. మద్బాహుబలమున • మాఱుమాటాడక బ్రహ్మాదు లేగిరి • పంకజాక్షు
చక్రంబు వృథయయ్యె • శంకరుండును బాఱె నితరులమాట నే • నేమిచెప్ప
దేహంబులను గాఁడి • దృశ్యంబులును గాక తీక్ష్ణంబులైన మ • ద్దివ్యబాణ
తతులచే విద్ధులై • శతమఖాదులు పాఱి రట్టిశూరత మీఱు • నట్టి మనల

ఆ. నని జయింప నొక్క • యంగన రా వెఱ, పేల మనకు నైన • నెప్పుడైన
శత్రుశబ్దమునకు • జంకి నిశ్శేషంబు, చేయవలయు దాని • సిద్ధమిద్ది. 31

క. తరుణి యని లక్ష్యపెట్టక, బరవసమున నుండరాదు • భామినికై కిం
కరులను బంపుద మాభటు, లరసి కచగ్రహణ మొప్ప • నంగన నిటకున్. 32

క. కొనివత్తురు మదశీలను, దనుజాధిప! యవ్వెలంది • త్వచ్ఛుద్ధాంత
స్థనళిననేత్రల కెంతయు, ననుకూలము గాఁగఁ జేటి • యై మెలఁగ నగున్. 33

క. మనకుఁ గల సైన్యమం దొ,క్కనియార్భటి లోకమెల్ల • గడగడ వణఁకున్
వనితకయి శంక యేటికి, మనమున నిఁక దేవ! నీదు • మనసని యంతన్. 34

తే. దురభిమాని విశుక్రుండు • దుష్టబుద్ధి, నిట్లు సర్వంబు నెఱిఁగించి • రొసఁగుభండు
గాఢకోపాగ్ని నణఁగించెఁ • గర్బురాధి, పతియు దానికిఁ దలయూచి • పలుకకున్న.

క. నీతిపరుండును సత్యో, పేతుఁడు శాస్త్రార్థ వేది • విధ్యవిధివిదుం
డాతతనృపధర్మజ్ఞుం, డై తనరు విమంగుఁ డనియె • నన్నకుఁ బ్రీతిన్. 36

చ. అనిహతవిక్రమాఢ్యుఁడవు • హారిగభీరనృపాలధర్మవి
ద్ఘనుఁడవు నీవెఱుంగనివి • కల్గునె ధర్మములైన నాకుఁ దోఁ
చినగతిఁ దెల్పువాఁడ నటు • చేసినఁ జేయుము లేకయున్న నీ
మనమునఁ దోఁచినట్లుగ స • మాహితరీతిని జేయుమీ తగన్. 37

క. వినుము విచారణచేఁ జే, సినకార్యము సిద్ధినొందు • శీఘ్రమ యెపుడై
నను హీనబుద్ధి నరయక, యొనరించిన కార్యమెల్ల • నొగి నిష్ఫలమౌ. 38

క. అవిచారితకర్మము భూ, ధవునకు హానియ యొసంగు • ధరణీశునికీ
ర్తివిభవములఁ బోకార్చును, సువిహితమతి నెంచి చేయ • శుభ మొనఁగూడున్.

క. పరకటకమునకుఁ జారని, కరమును వేగంబ పనిపి • క్ష్మాధవుఁ డరిని
ర్భరబలము నరయఁగాఁ దగు, సిరిచే దీపించునట్లు • చేసినమాత్రన్. 40

సీ. సర్వదా శంకిత • స్వాంతుం డశంకితా • కారుండు వరమంత్రి • కలితుఁడు దృఢ
తరవరప్రజ్ఞుండు • గురుచారచక్షువు, గుప్తమంత్రుఁడు నైన • కువలయేశుఁ
డభివృద్ధివిజయంబు • నధికసంపద నొందు షడుపాయముల వీని • నరిగ నెఱుఁగ
వలయును మఱియాయు • పాయంబులను వీడి [1]జాల్ముఁడైనను వేగ • క్షయమునొందు

తే. నట్టులౌట విమర్శించి • యాచరించు, కార్య మతిశయ ఫలమిచ్చుఁ • గార్యసరణి
నెంచకయె యాచరించిన • నెట్టివాని, కైన నపజయ మగుసుమ్ము • దానవేంద్ర.

క. తరుణియని స్వల్పధరణీ, శ్వరుఁ డని తిర్యక్కు లనియు • వైరియెడల నే
ధరణీశ్వరుఁ డూహించునొ, పురుషార్థము లొంద కతఁడు • పొలియు గుణనిధీ.

తే. శక్తి యందఱియందును • సంభవించి
యుండుఁ గావున నూరక • యుండరాదు
స్తంభమునఁ బుట్టినట్టి కే • సరిముఖుండు
రమణఁ బరిమార్పఁడొకో హి • రణ్యకశిపు. 43

క. మును చండిక యనఁబరఁగిన, వనిత విజృంభించి చంపె • వైరిసశుంభున్
ఘనుశుంభుమహిషు మఱియును, దనుజులఁ బలువురను; వినమె • తచ్చరితంబున్.

చ. దనుజవరేణ్య! యొక్కటి హి • తంబు వచించెద నాలకింపుమీ
వనితయటంచు నెంచు టది • భావ్యము కాదు జయంబు నొంద నొ
య్యన ఘనశక్తియే ప్రబల • మై తగుహేతువు, శక్తి కల్గినన్
వనితయుఁ బూరుషుండు నొక • భంగియె సంపద గాంతు రెంతయున్. 45

తే. అట్టులౌటను శక్తిచే • నలరునట్టి, వనితయందును శంకింప • వలయుఁ జుమ్ము

1 జాల్ముఁడు=యోచింపక పనిచేయువాఁడు.

శక్తియే ముఖ్య మటుగాన ♦ యుక్తిచేత, నానితంబిని యుద్యమ ♦ మరయవలయు.

ఉ. ఎయ్యది జన్మభూమి కత ♦ మెయ్యది పుట్టఁగ నెద్ది యాశ్రయం
బెయ్యది తోడు బాహుబల ♦ మెట్టులు సాహసభంగి యెట్టులో
నెయ్యము మీఱ వీనిఁ గడు ♦ నెమ్మది నెంచిన మేలు గల్గుఁగా
కియ్యెడ భామయంచు భయ ♦ మేటి కటంచుఁ దలంపఁ బాడియే. 47

చ. అనుచు విషంగుఁ డాడుటయు ♦ సక్కటికంబును వీడి వీలచే
వనితను గూర్చి యిట్టు లిటఁ ♦ బల్కుట చాలును మెచ్చవచ్చు నం
చని మది నూనుకోపమున ♦ నాతనిపై భ్రుకుటిస్ఫుటక్రియం
గనఁబఱచెన్ మహోద్ధతిని ♦ గర్బురనాయకుఁ డొక్కమాఱుగన్. 48

వ. ఇట్లు క్రోధంబును వెలువరించి తమ్మున కిట్లనియె. 49

క. దనుజాధమ! శౌర్యాదులఁ, దన కీడగు వానియందుఁ ♦ దగునిది యెందున్
వనితామణియందున ని, ట్లనువుగ యోచింపఁ దగునె ♦ యసురవిభులచేన్. 50

క. కల రక్షౌహిణ్యధిపులు, విలసితబాహాబలైక ♦ విక్రమధుర్యుల్
పలువురు నీరధినీరము, నులువుగఁ ద్రావంగఁ గాల్వ ♦ సురపట్టణమున్. 51

తే. పాపవర్తన; యోరోరి! ♦ పడఁతి కిట్లు, సంశయించెద వేలొకో ♦ చారగణము
నంపి వృత్తాంతమెల్ల నే ♦ నరసితి నిఁక, భీతి నొందఁగఁ బనిలేదు; ♦ వెలఁది యోర్తు.

చ. హుతవహునందుఁ బుట్టి మహి ♦ మోజ్జ్వలయై లలితాహ్వయంబుచే
నతిశయసుందరత్వమున ♦ నాహ్వము సార్థకమై చెలంగ న
య్యతివ మనోహరంపుఁబువు ♦ నందముచేఁ దగురూప మొప్ప దే
వతలకు మేలు గోరి యిట ♦ వచ్చె బలోద్ధతి లేదు సుంతయున్. 53

మ. కరకౌశల్యము శూన్య మస్త్రచయముల్ ♦ గన్పట్ట వేమాత్రమున్
బురుషుం డొక్కఁడు లేఁడు సుందరవతుల్ ♦ పూఁబోఁడు లత్యుద్ధతిన్
దురముం బూన్కి నొనర్ప వచ్చి రిటకున్ ♦ దోస్సాహసం బొప్ప నా
తరుణీరత్నము మాయలాడి యనువృ ♦ త్తాంతంబు నాలించితిన్. 54

క. తనబలముచేత యువతీ, జనముల నుత్సాహపఱిచి ♦ సమరంబునకుం
జనుదెంచె ననఁగ నేలొకొ, మనమున భయమొంద సహజ! ♦ మన కీయెడలన్.

ఆ. బలముగలుగుఁగాక ♦ చలమున ననికినై, వచ్చుఁగాక దేవ ♦ వారమెల్ల
సాయపడును గాక ♦ జంకునే భండుండు, విజయశాలి విజిత ♦ విష్ణు వితఁడు. 56

చ. అదియటులుండె నిప్పటికి ♦ నైనను మద్భుజదర్పసంహతిం
త్రిదశులు తాళఁజాలకయె ♦ దీనతనొంది వసించుటెల్ల నీ

ఇదివఱకే యెఱింగినది • యే కద దేవత లొక్కపెట్టునన్
గదిరినభీతిచేఁ బఱువఁ • గాఁ గనలేదొకో మున్ను తమ్ముఁడా. 57

క. కొందఱధోభువనమునకుఁ, గొందఱు కకుబంతములకు • గూఢతనువులం
గొందఱు జలనిధిలోనికిఁ, గొందఱు గోత్రాంతరముల•కుం జని యమరుల్. 58.

చ. సుతులను భార్యలన్ విడిచి • సొంపగు మందిరముల్ త్యజించి ని
ర్గతసుఖులౌచు గూఢనిజ•కాయులునై చరియించుచున్నవా
రతివయు నిట్టిశౌర్యము న•హార్యపరాక్రమముం జెలంగను
న్నతపదవిన్ వసించు నను • నాథునిగాఁగ నెఱుంగ లేదొకో. 59

చ. ఎఱుఁగదు నన్ను నూత్నయగు • ఏర్పడ భామలు నిష్ఫలోద్యమల్
ఒఱపున సాహసంబునను • నొయ్యన నొంపఁ దలంచెనేమొ చిం
దఱగొని యుద్ధభూమి నను • నాకులు యక్షులు సిద్ధసాధ్యులున్
మఱియు మహోరగాదులజ • మాధవరుద్రులు నైన నొంతురే. 60

వ. మఱియును మదీయసేనాధీశ్వరులు శత్రువుల పక్వకర్కటికాపేషంబు నపేక్షించి
యున్నవారు, మహాబలపరాక్రములగు కుటిలాక్ష, కురుండ, కరక, కాకవాశిత,
వజ్రదంత, వజ్రముఖ, వజ్రలోములును; వలాహక, సూచీముఖ, ఫాలముఖ,
వికర్ణ, వికటానన, కరాళాక్ష, కరటక, దమన, దీర్ఘజీవక, హులుంబేక, హులు
ముల్ల, కల్కస, కల్కివాహన, పుల్కస, పుండ్రకేతు, చండబాహు, కుక్కుర,
జంబూకాక్ష, జంభన, తీక్ష్ణశృంగ, త్రిఖండక, చంద్రగుప్త, చతుర్బాహు,
చకోరాక్ష, చతుశ్శిరస్కులును; వజ్రఘోష, ఊర్ధ్వకేశ, మహామాయ, మ
హాహను, మఘశత్రు, మఘాస్కందులును; సింహధాతు, సిరాళ, కాంధక,
సింధునేత్ర, కూపక, కూపలోచన, గుహాక్ష, గండగల్ల, చండవర్మ, యమాం
తక, లట్టణ, పండసేన, పురుజి, త్పూర్వమారక, స్వర్గశత్రు, స్వర్గబల, దుర్గాఖ్య,
స్వర్గకంట, కాతిమాయ, బృహన్మా, యోపమా, యోలూక జిత్తులును; పురు
షేణ, విషేణ, కుంతిషేణ, కుహూషక, మలద, కశూర, మంగల, దృఘణ,
కోల్లాట, కుటిలాశ్వ, దాశేర, బభ్రువాహన, దుష్టహాస, ధృష్టకేతు, పరిక్షి,
త్పాపకంచుక, మహామోహ, మహాదంష్ట్రులును; దుర్మతి, స్వర్గమేజయ, శరకేతు,
శరవసు, శరదంత, శరప్రియ, దుశ్శర, దుర్వినీత, భిన్నకర్ణ, చమూరు, కాట్ట
హాసి, మహాహాసి, సింహహాసి, మదోత్కట, కుంభోత్కచ, కుంభనాస, కుం
భగ్రీవ, కుటోదర, హస్తిమేఢ్ర, మహాండ, కుంభాండ, పూతినాసిక, పూతి
దంత, పూతిచక్షుః, పూత్యాస్య, పూతిమేహనాద్యులగు సేనాధీశులు హిర

ణ్యాక్ష హిరణ్యకశిపుతుల్యులు. మఱియు నాతనయులు మహాబలులు గల రం దొకొక్కనికి శూరాగ్రేసరులు నూఱుగురు తనయులు గలరు. సేనాధీశులు మత్పుత్రసములు. సమరంబున దుర్వృత్తులగు నమరాధముల నశింపఁ జేయుదురు. మదీయసహస్రాక్షౌహిణీశ్వరు లాగ్రహించిన యుద్ధము భస్మశేషంబ యగు నింక వనితమాట చెప్పనేల? అయో! అమ్మానిని పన్ను మాయ మహామాయా శీలురగు నాబలంబుల కామిషంబగు. కావున నీవు ఖేద మొందఁ బనిలే దని పలికి భండాసురుండు సింహాసనంబు డిగి సేనాధిపతి యగు కుటిలాక్షునిఁ బిలిచి యి ట్లనియె. 61

తే. లెమ్ము వేగంబ సర్వబ • లమ్ములను బు,రంబుచుట్టును నిలిచి య • రాతులకును జొరవ కవకాశ మీయక • శోభిలంగ,నిలుపు దుర్గములం దీవె • నిలిచియుండు.

క. అరివర్గము రాకుండఁగ, నరయుము క్షేపణికలను శ • తాధికముల ను ద్ధురభంగిఁ బన్ను మీ విఁక, బరవస మొప్పంగ నిలుపు • బలముల నెల్లన్. 63

సీ. దుష్టాభిచారముల్ • దురమునఁ దోడ్పడ మంత్రిపురోహిత • మహితజనుల
చేతఁ జేయింపు వి • ఖ్యాతశస్త్రంబుల సజ్జీకరింపుము • సమర మిదిగో
యాసన్నమయ్యె సే • నాధిపు లందొక్క బలశాలి ముందుగాఁ • బనుపు మతఁడు
బలసంతతులఁ గూడి • పద్మాక్షి మారొక్కనిక చమునుగ్రహియించి • కడురయమున.

తే. దోడి తేరంగఁ బనుపుము • తోయజాక్షి
దేవతాలాపములచేత • నీవిధమున
సంగరంబున కేతెంచె • సత్వరమునఁ
గొప్పుపట్టి యీడిచి తెచ్చు • టొప్పుమనకు. 64

వ. అని కుటిలాక్షున కాజ్ఞాపించి యంతఃపురంబున కరుగుటయు సహస్రత్రితయ సేనాధిపుండగు నాకుటిలాక్షుండు సమరసన్నాహంబు చేయుచుండ నచ్చట మహాదేవి యాత్రానిస్సాణస్వనంబు దనుజేంద్రకర్ణజ్వరావహంబుగా వినవచ్చె నని చెప్పి కుంభసంభవునకు హయగ్రీవుండు మరల ని ట్లనియె. 65

భండాసురసేనాసన్నాహము.

మ. విను మామీఁద మహేశ్వరీబలమహా • విస్తారనిస్సాణని
స్వనసంకాశసురారిదుందుభిహతి • స్ఫారస్వనం బెల్లెడం
దనరెన్ మర్దితదిక్కమై క్షుభితసాం • ద్రధ్వానవారాశియై
ఘనమై యొప్పెడు నాస్వనంబునకు నా • కంపించె లోకావళుల్. 66

తే. కడఁగి బధిరీకృతత్రిజ • గంబునైన, దైత్యనిస్సాణరావంబు • దశదిశలను

మోఁగఁ జేయుచు భూధర•భూరికంద,రముల భేదించి నభమున•రాజిలెఁగడు.

క. నరసింహాక్షోపహుంకృతి, సరిసేయఁగఁ జాలు భండు • [1]ఝల్లరి మోఁగెన్
విరసంబగు నారవమున, సురముఖ్యులు బెగ్గడిల న•సురులు చెలంగన్. 68

తే. కిలకిలారావముఖరులై • చెలఁగి దైత్య
కోటు లొక్కట మనములఁ • గ్రోధవహ్ని
ప్రజ్వలింపఁగ లలితాంబ•బలముమీఁదఁ
గవిసి రత్యుగ్రసాధన•కలితు లగుచు. 69

క. సురవైరి యొకఁడు మణిసుం,దరచిత్ర[2]తనుత్రపిహిత•తనుఁడై చూడం
బరఁగెను నారోహణభూ,ధరయుత జంగమునికరణిఁ • దత్సమయమునన్. 70

ఆ. కాళరాత్రిభంగిఁ • గడు నుదగ్రంబయి, శస్త్రతనువుభాతి • సాంద్రగోపి
తంబు నగుచు మిగుల•ధౌతమై యొప్పుకృ,పాణికను ధరించె•భటుఁ డొకండు.

క. ఒకభటుఁడు కుంతపల్లవ,ము కరాగ్రంబున వెలుంగ • ముదమున వరఘో
టక మెక్కి చారిభేదము, సకలము గనబడఁగఁ దిరిగ • సరభస మొప్పన్. 72

క. ఆతతిఁ గొందఱు యోధులు, మాతంగోత్కరము నెక్కి • మహి నుత్పాత
వాతానిలసంపాతో,ద్ధూతమహీధ్రములభంగి•తో నొప్పి రొగిన్. 73

సీ. పట్టసంబులు భిండి•వాలకములు ముద్గర, శీణయు, ద్రుఘణంబు•లు శరగదలు
ముసలశతఘ్నులు • భూరిముసుండులు త్రిశిఖమహాచక్ర•విశిఖములును
వక్త్రాస్త్రభుజగాస్య•ఫణిశీర్ష భేదముల్ శార్ఙ్గచాపంబులు • చండదండ
వజ్రబాణక్షురట్ట•వలయార్ధచక్రముల్ యవమధ్యఖండలా•త్యంతతీవ్ర

ఆ. ముష్టికోణమధ్య•ములు పరశ్శతములు,పాశ పాశతుండ•ఫణిసుదండ
కాకతుండముఖ్య•కఠినాయుధంబులు, కరములందు వెలుఁగఁ • గదలి యపుడు.

మ. ద్విరదాశ్వోష్ట్రికసారమేయవృకస•ద్వైరుండపంచాస్యసూ
కరశార్దూలకవాయసాహివిలస•ద్గంధర్వకంకాదిభీ
కరనానావిధజంతుజాలములపై • గాఢాదరం బొప్ప నా
సురవైరుల్ దమిఁ గూరుచుండి మిగులన్ • శోభిల్లి యుద్వృత్తితోన్. 75

చ. కరముల నాయుధాళి వెలుఁ•గం గడకన్నుల,నిప్పులొల్క ను
ద్ధురపరమారణోత్సుకము•తో లలితాంబను బట్టి తేరఁ గ
ర్బురు లరుగంగ సైన్యపతి • భూరిముదంబునఁ దేలి సోలి భీ

1 ఝల్లరి=గొప్పదియగునొక్క యుద్ధవాద్యము. 2 తనుత్రము=కవచము.

కరుఁ డగు దుర్మనుం డనెడు • కర్బురవర్యుని బిల్చి యిట్లనున్. 76

క. చనుము దశాక్షౌహిణులను, దనుజులఁ గైకొనుచు వేగ • తరుణీమణిఁ గై
కొని రమ్ము పొమ్ము పొమ్మన, దనుజవరేణ్యుండు శౌర్య•దర్పితుఁ డగుచున్.

చ. దనుజుల శౌర్యసారభుజ•దర్పసమగ్రులఁ గొంచు దేవతల్
మనమున భీతి నొందఁగ న•మానుషవిక్రమ మొప్పఁ బోవఁగాఁ
గని జగముల్ చలించె రవి•కాంతులు శాంతము లయ్యె నంబుధుల్
వనములు పర్వతంబులు న•భంబును ఘూర్ణిలె నంత నుద్ధతిన్. 78

సీ. చండభండునియాజ్ఞ • జవమునఁ గుటిలాక్షుఁ డప్పురప్రాగ్ద్వార•మందు నునిచె
నెమ్మితో నక్షౌహి•ణీదశకోపేతుఁ దాళజంఘుని నట్టి • దళముతోడ
దక్షిణదిక్కునఁ • దాళభుజాహ్వయు నంత సైన్యముతోడ • నలరునట్టి
బలుని దాళగ్రీవుఁ • బడమరదిక్కునఁ దాళకేతుని నంత • దళముతోడఁ

తే. దనరు బలశాలి నుత్తర•ద్వారమందు
రక్షణార్థము నియమించి • రయము మెఱయ
సాలకటిశీర్షకాలయ•జాలమందు
మమత నక్షౌహిణీదశ•కమును నిలిపె. 79

క. సాహసమున నేఁబది యక్షౌహిణులను నివ్విధమున • జతనంబునఁ బా
నూహించి నిలిపి యంతట, బాహాబల మొప్పఁ బోయి • భండునితోడన్. 80

చ. దనుజవరేణ్య! నీపనుపు • తప్పక శూన్యకరక్షణార్థమై
ఘనభుజదర్పశౌర్యములఁ • గ్రాలిన వీరుల నిల్పినాఁడ న
వ్వనితను బట్టి యీడ్చికొని • బల్మిని రమ్మని దుర్మదాహ్వయుం
గనదురుశస్త్రతోమరసి•కాయుని బంపినవాఁడ ముందుగన్. 81

ఉ. కింకరుఁ డొక్కరుండె చని • కేవలశౌర్యముతోడ బల్మి న
ప్పంకజనేత్ర నీడ్చికొని • భాసురతావకగేహమందు ని
శ్శంకత నుంచువాఁ డనిన • సందియ మొందఁగనేల దేవ! నా
బింకము మీ రెఱుంగుదురు • పెక్కులు మాట లికేల చెప్పఁగన్. 82

చ. అని వచియించి స్వీయబల • మంతయు నుద్ధతి శత్రుసేనలన్
మనమునఁ గొంకులేక పరిమార్పఁగఁ జాలెడు నట్లమర్చి పే
ర్చినఁ గని భండదానవుఁడు • సేనల యుద్ధతి కెంతయేనియున్
మనమున సంతసిల్లె; నట • మార్గమునం బోయిన దుర్మదాఖ్యుఁడున్. 83

సంపత్కరి దుర్మదుని జంపుట.

చ. బలములతోడఁ గూడి చని • బంధురయోషిదుదారసైన్యముల్
విలయకృతాంతశౌర్యభుజ•విక్రమరీతుల నొప్పఁ జూచి యు
జ్జ్వలరథకింకిణీధ్వనుల • సర్వదిశల్ బెగడొందఁ జేయు దో
ర్బలములనొప్పుమీఱు భట•వారముఁ బంచెను వాని మార్కొనన్. 84

తే. కిలకిలారావమొప్పంగఁ•జెలఁగిభటులు, కుంతముసలాదులనుద్రిప్పు•కొనుచుశక్తి
సైన్యములనట్టె మార్కొని•సంభ్రమించి, వెగడుపఱచిరి భుజబల•విక్రమముల.

తే. అతివ లుద్దండసంస్ఫురి•తాట్టహాస, శబ్దములచేత నత్యుగ్ర•శస్త్రనికర
ములను దానవవీరుని•బలమునెల్లఁ, జించి చెండాడి రప్డు క్షో•భించె జగము.

క. ఇతరేతరబాణసమూ,హాతులను రథపంశములను•హస్త్రిశ్రుతిసం
తతచాలనముల నశ్వో, ద్ధత నిశ్వాసముల రజము • దద్దయుఁ గలిగెన్. 87

వ. అప్పుడు దానవవీరుల దశాక్షౌహిణులం గాంచి యతిక్రోధంబున సంపత్కరీదేవి వేగంబ చని మార్కొనియె. సంపత్కరిం బోలిన శక్తిసముదాయం బశ్వంబుల మదద్విపంబుల నెక్కి మార్కొనియె నప్పుడు మదహస్తిఘోటకంబులు చెలరేఁగి దానవసైన్యంబులఁ ద్రొక్కి చంపిన రాక్షసవీరులు కిలకిలారవంబుల మార్కొనుటయు ద్వంద్వయుద్ధంబు చెల్లె నాసమయంబున రక్తప్రవాహంబు ప్రవహించె. పదంపడి శక్తిసేనలు సందడించి హుంకరించి తీక్ష్ణశిలీముఖంబుల దానవసహస్రంబుల నంతకునిగృహంబున కతిథులఁ జేయుచు ధ్వజంబుల విదళించి ఛత్రంబులఁ బొడిసేసిన రక్తారుణవర్ణ యగు యుద్ధభూమి సంధ్యారాగభాసమాననభంబుభంగి మెఱసె. అంత దానవులు రోషంబునఁ గల్పాంతాగ్నిజ్వాలాకలాపంబులు పయోనిధిజలంబును వలె శక్తి సైన్యంబు నావరించి నొప్పించుటయు. 88

ఉ. వారును పౌరుషంబున న•వార్యమహాస్త్రకదంబశక్తి దే
వారులకంఠముల్ దునుము • నప్పుడె ముండము లెల్ల భూమిపై
బోరన డొల్లెఁ జూడ నవి • భ్రూకుటులన్ గురుకోపవహ్నివి
స్ఫారసురక్తనేత్రములఁ • దద్దయు భీతి నొసంగె నంతటన్. 89

మ. ప్రమదాసంఘము విక్రమింప భయకృ•త్ప్రారంభతన్ రాక్షసుల్
సమరోద్దామత మీఱి మానినులతోఁ • జండాస్త్రసంధానముల్
గమనింపంగ నసాధ్యమౌనటుల వే•డ్కం బోరి శక్తివ్రజో
ద్యమముం గాంచి భరింపరామిఁ దమచి•త్తంబందు నూహించుచున్. 90

క. ఖరశరశుచిశిఖలం బడిఁ, గురుమూర్ఛల మున్గి యక్లె • కోపంబుననుం
దరులను మార్కొని వారల, శరములచే నొచ్చి యసుర•సైన్యముపాఱెన్.
వ. అప్పుడు దుర్మదుండు. 92

ఉ. దారుణశక్తిసైన్యహతిఁ • దాళఁగఁజాలక పాఱుచున్నయ
వ్వీరులఁ జూచి పౌరుషము • విక్రమముం జెలువార ధీరతన్
వారల నిల్పి యూరడిలు • పల్కులు పల్కి మహోష్ట్రి మెక్కి దో
స్సారము వొంగ శక్తి వర• సైన్యముఁ దాఁకి కలంచె వేడ్కతోన్. 93
తే. దుర్మదునితోడ నిష్ఠుర•తోదనంబు
మెఱయఁగా దీర్ఘకంఠుండు • మిగులుశక్తి
నుష్ట్రిమును దోలె నసురు ల•య్యుష్ట్రివరము
ననుసరించుచు నేతెంచి • రనికి నపుడు. 94

ఉ. దుర్మదుఁ డంతలం గినుకఁ • దోరపుసాహస మొప్ప భల్లముల్
నర్మవిదారణంబులను • వైఖరి యొప్ప నిగిడ్చి వారలం
బేర్మి చెలంగ నుక్కడఁచి • విక్రమధుర్యలశక్తులన్ లస
ద్భర్మమయోగ్రబాణముల • వైచి యహంకృతి మాన్పి యిట్లనున్. 95
చ. వనితలు మీరు సిగ్గడలి • వచ్చుటె చాలు ననూనసాహసం
బున మము మార్కొనం గలరె • పోలునె మీ కిది భామలార! యిం
కనిమొన నిల్వ నెట్టు లగు • నందఱఁ బట్టి మదీయపత్తనం
బునఁ జెఱసాల నుంచెదను • బొల్పుగ నాభుజశక్తిఁ జూడుఁడీ. 96
తే. అనియె నంతట వార ల•య్యస్త్రసమితి
నొచ్చి యూరక నిల్చిన • నుగ్రమూర్తి
సంపదీశ్వరినేత్రముల్ • జ్వాలనుమాడ్కి
నొప్ప మదదంతిపై నెక్కి • యుర్వి వణఁక. 97
తే. వచ్చెఁ గోలాహలాఖ్యచే • వఱలు గజము
దనుజసేనల నుఱుమాడెఁ • దనకరమున
భవ్యసంలోలకంకణ•క్వాణమంజు
తరము నౌ సంపదీశ్వరి • కరము కడిమి. 98
తే. గుణము నాకర్ణముగ లాఁగి • కోటిసంఖ్య
బాణములను బ్రయోగింప • బవరమందు

మోక్షణాకర్షణమ్ములఁ • బోల్పరాక
యుండె శరధోరణియె కడు • నొప్పె నపుడు. 99

చ. దినకరకాంతియోగబహు•తీక్ష్ణమరీచుల నొప్పు బాణముల్
దనుజవరూథినీవనవి•తానము వేగ దహించె నంత న
వ్వనరుహనేత్రసాహసము • వారక చూచుచు దుర్మదుండు మా
రొక్కని యడరించె బాణములు • కుప్పలుకుప్పలుగాఁగ నామెపై. 100

క. ఇతరేతరబాణసమా,హతిచేత స్ఫులింగవితతు • లంత జనించెన్
దితిసుతసంపన్నాథల, కతిఘోరరణంబు చెల్లె • నాసమయమునన్. 101

క. తొలుదొల్త విడుచు బాణం,బులు సూర్యప్రభ నణంచి • భూరితమంబుం
గలిగించె మరల వైచిన, జ్వలనప్రతిమానబాణ•సముదయ మంతన్. 102

క. ఒండొంటి నొరసి జ్వాలల, మండఁగ ఖద్యోతగణము•మాడ్కిం దోఁచెన్
భండనమునఁ గోలాహల,చండమహాగజము శౌర్య•సారము చెలఁగన్. 103

ఆ. విక్రమించి దనుజ•వీరులఁ దనచర,ణాహతుల నడంచి • యతుల దంత
ముసలహతులచేత • నసురులఁ గొందఱ, జమునికడకు ననిపి • సాహసించి.

సీ. వాలదండాహతి•లీలఁ గొందఱ ఘోరఫీట్కారముల వజ్రి•విమతదనుజ
కాంతులఁ గొందఱ • గాత్రికమర్దనమునను గొందఱ నఖ•ముఖనిహతులఁ
గొందఱ రణమునఁ • గూల్చి యుద్దండమా భంగిని విహరింప • భండసైన్య
పతి దుర్మదుండు కో•పంబున రక్తైకదృష్టుల గజమును • ధిక్కరించి

తే. బాణ మొక్కటి సంధించి • పౌరుషమున, సంపదీశ్వరిమకుటస్థ•చారుమణిని
జిత్రభంగిని ఖండించి•చెలఁగి యార్చె, నంతఁ గోపారుణాక్షియై•యతివ తెగువ.

చ. శరముల నారిఁ గూర్చి బల•సారమునం దెగవాపి దేవతా
వరులను భూసురోత్తముల • భామలఁ బట్టి కలంచినట్టి పా
పరతుఁడు వీఁడు చచ్చు నని • వైవఁగ బాణనికృత్తవక్షుఁడై
ధరణిఁ ద్యజించి దేహము ని•తాంతముదంబునఁ బొందె సద్గతిన్. 106

చ. దనుజవరేణ్యుఁ డిట్లు రవి•ధామము బ్రద్దలు చేసి పొంచుఁ దాఁ
జనిన యనంతరంబ బల•శౌర్యము లొప్పఁగ వైరివారముల్
ఘనవిశిఖంబులన్ ముసల•ఖడ్గములన్ వడిఁ జంపె శక్తుల
య్యనిమొనఁ జావఁగా మిగిలి•నట్టి సురారులు పాఱి రెంతయున్. 107

వ. ఇవ్విధంబున హతశేషదానవులు పాఱి శూన్యకనగరంబును జొచ్చి కొలువుకూటంబున నున్న భండున కవ్వార్త్తం దెలిపిన మండిపడి యతం డుగ్రలోచ

నుండై చెంతనున్న కుటిలాక్షుం డను సైన్యాధిపతిం గాంచి హా! విధివైశసం బిట్లగునే. బలశాలియగు దుర్మదుం డొక్కదుష్టవనితచే ననిం బడియె. దేవమర్త్యోరగాదులయం దప్రతిహతబలుండగు దుర్మదుం డబలానిహతుం డయ్యె నింక నాతనిం గూర్చి శోచింపనేల? వేగంబ యాదుష్టభామినిం గొప్పువట్టి యీడ్చికొని తేవలయు. కావున సమరమర్మవిదుత్తముండగు కురుండునిం బంపుమని యాజ్ఞాపింపఁ గుటిలాక్షుండు మహాప్రసాదంబని చండదోర్దండుం డగు కురుండుని బిలువ నాతండు వచ్చి దానవేశ్వరునకు వందనం బాచరించి యేమియాజ్ఞ యనుటయుఁ గుటిలాక్షుం డిట్లను. నీవు మాయాచిత్రయుద్ధ విశారదుండవు. కూటయుద్ధంబున సమర్థుండవు. కావున సైన్యంబులం గూడి చని యాదుష్టవనితను నిర్దయుండవై మర్దింపు మనుటయు నిరువది యక్షౌహిణులం గైకొని భూగోళంబు వణఁకుచుండ దుర్మదాగ్రజుండగు నాకురుండుండు సమరోన్ముఖుండై చనియె నప్పుడు. 108

అశ్వారూఢ కురుండదానవుని జంపుట.

సీ. దిక్తటంబుల ధూళి • తేజరిల్లఁగ శోకకోపాగ్రహగ్రస్తుఁ•డై పతత్త్రి
సమవేగమునఁ బోవు•సాధు[1]వాహము నెక్కి శార్ఙ్గచాపముఁదాల్చి•శత్రుభయద
టంకారరవ ముత్క•టంబుగా నొనరించి సంపత్కరీసైన్య•సమితి నెల్ల
శరధారలను శౌర్య•సాహసములఁ బాపి సంపదీశ్వరిఁ గాంచి • జంకులేక
తే. పలికెఁ బాపాత్ములార! మ•ద్భ్రాతయుద్ధ
దుర్మదుని దుర్మదాహ్వయుఁ • ద్రుంచి గర్వ
యుక్తవైయున్నదాన వి • ట్లురువడించి
యిపుడు మద్బాణములు నిన్ను • నెలమిఁ ద్రుంచు. 109
క. అతిహృద్య మతిస్వాదువు, హితమును నగుతావకాంగ•హృద్యలతాని
ర్గతరక్తము [2]రణపూతన, లతిముదమునఁ ద్రాగఁ గలుగు • నట్లొనరింతున్.
క. నాతమ్ముని ననిఁ జంపిన, పాతక దుష్ఫలము నీకుఁ • బాపస్వాంతా
యీతఱి ననుభవమగు వి, ఖ్యాతభుజాబలముఁ జూడు • కదనమునందున్. 111
చ. అని యిటు సంపదీశ్వరిని • హస్తివరస్థితనుం గలంచి వే
దనుజుల కంబికాబలము • దార్కొని ద్రుంప ననుజ్ఞ నేయఁగాఁ
గని దనుజప్రమర్దనము • గాఢముదంబున నాచరింపఁగా

1 వాహము=గుఱ్ఱము. 2 రణపూతనలు=యుద్ధముకొఱకు వేచియున్న రాక్షసకాంతలు.

మనమున నెంచి హస్తిపతి • మార్గ్యాన వారలఁ జండశక్తిచేన్. 112

తే. క్రొత్తయుద్ధంబునందలి • తత్తఱమున, నశ్వసైన్యాధినాయిక • యరుగుదెంచి
స్నేహభావంబు చెలువార•స్మితమృదూక్తి, సంపదీశ్వరికనియెన•శ్వపతి యపుడు.

మ. చెలి! సంపత్కరి నాదుమాట వినుమీ • స్నేహంబునన్ వేగ యీ
ఖలు శిక్షించెద సంగరం బొసఁగుమీ • కాంక్షించితి న్నిన్ను ని
య్యెడ సందేహము మాను మంచుఁ బలుకన్ • హృద్యస్మితం బొప్ప వా
రలతో మార్గ్యాను సైన్యము న్నిలిపి యా•రాజీవపత్త్రాక్షియున్. 114

క. వెనుకకుఁ జనుటయు సైన్యముఁ, గని యశ్వారూఢ బాల•ఖరకరదీప్తిం
దనరెడు నిజసైన్యంబుల, దనుజుల మార్గ్యానఁగఁ బంచి • తానును వేడ్కన్.

ఆ. వాతచలితతుంగ•భంగంబు లట్లశ్వ, సముదయంబు శక్తి•సముదయమును
మోచుచును ఖరఖుర•పుటముల భూమిని, ద్రవ్వుచును మహోగ్ర•దనుజసేన.

వ. మార్గ్యాని [1]వల్గావిభాగకృత్యంబుల, [2]సంవర్తనవివర్తనంబుల, గతిభేదంబులఁ బంచధారలఁ బ్రోత్సాహనంబునఁ జతురవై యశ్వారూఢయజ్ఞు లగు శక్తులు చిందఱవందఱఁ జేయుటయుఁ గురుండ ప్రోత్సాహితములై రక్షసైన్యంబులు యుద్ధోన్ముఖములయ్యె నిట్లు పరస్పరంబు ఘోరాహవంబు సెల్లె. అప్పుడపరాజితాహ్వాయంబునఁ బరఁగు నశ్వంబు నెక్కి యశ్వారూఢ కురుండకుని మార్గ్యానియె నంత నమ్మహాదేవి ప్రచలద్వేణిసుందరయుఁ, జలచ్చంద్రకళోజ్వలయు, సంధ్యానురక్తశీతాంశుసుందరాననయు నగుచు మణికార్ముకంబును గేల నంది కురుండకుని శరాసారంబులఁ గప్పిన నమ్మార్గణంబులు దిగంతరంబుల నావరించియుండె నంత. 117

ఉ. భండనభీముఁ డాహవని•బద్ధమనీషుఁ డఖండచండదో
ర్దండధనుస్సమగ్రతర•దారుణబాణుఁ డశేషదేవతా
ఖండనలోలుఁ డుద్ధతుఁడు • కాలసమప్రభుఁ డాకురుండుఁ డు
ద్దండత నశ్వనాయికను • దత్తఱతోఁ బఱఁగఁ గప్పెఁ దూపులన్. 118

సీ. దనుజవీరుని సైన్య•తతుల నశ్వారూఢ ఘోటక మతిచండ•ఖురపుటముల
మర్దించె నయ్యశ్వ•మహితహేషాస్వాన ముత్పాదధారాధ•రోరునాద
భంగిఁ జెలంగ న•ప్పటునాదమున శత్రుసైన్య మెల్లెడల మూ•ర్ఛలమునింగి

1 వల్గావిభాగకృత్యంబులన్-వల్గ=కళ్లెమునకుఁ దగిలించెడు పగ్గము యొక్క, విభాగకృత్యంబులన్=వేఱుచేయు పనులయందు. 2 సంవర్తనవివర్తనంబులన్=శత్రువులనావరించుట యందును, వీలుపడనిచో మరలించుట యందును.

తెలివొంది పాఱంగఁ • దేఱి చూచుచు నశ్వనాయిక పాశంబు • నాకు లలర

ఆ. జ్వలనుమాడ్కి మండ•సైన్యంబుపై వైవ, భుజగరీతి నొప్పు • భూరిపాశ
కోటు లట్టె పుట్టి • మేటికురుండకు, బలమునెల్లఁ జుట్టి • పాఱనీక. 119

తే. వేగ బంధించె నది కని • విక్రమమున, బాణ మొకటఁ గురుండుండు•భామినీ ధ
నుర్గుణంబును ఖండింప•నొగులుమనము,నందు ధైర్యంబుబంధించి•యాగ్రహించి.

క. గతమార్విధనుర్వర్యము, నతివేగమె పాఱవైచి • యమితక్రోధో
ద్యతమతియై యశ్వాధిప, వితతాంకుశవరమునట్టె • వీచి యతనిపై. 121

తే, వైవ నాతండు నంకుశ•వదనవీత, జీవితాసృక్ప్రవాహుఁడై • క్షితిని వజ్ర
భిన్నభూజంబుపోల్కిగాఁ•బృథురవంబుఁ, జేయుచునుబడిస్వర్గంబుఁ•జేరుటయును.

క. ఘనపాశబద్ధసైన్యం,బును భూతములెల్ల వచ్చి • మోదంబున నొ
క్కనిముసమున భక్షించెను, మునివర ! యామీఁద వినుము • భూతగణంబుల్.

వ. దానవుల భక్షించుటయుఁ గురుండుండు పడుటయుఁ జూచి హతశేషులు పాఱి భండున కెఱింగింప నాతండు భుజంగంబురీతి నిట్టూర్పు నిగుడించెనని హయగ్రీవుండు పలికినఁ దరువాతివృత్తాంతం బగస్త్యముని యడుగుటయు మరల నిట్లనియె. 124

కరంకాది పంచసేనాధిపతులు చచ్చుట.

క. అనిలో నశ్వారూఢా, వినిహతుని గురుండదనుజ•వీరుని చరితం
బును విని కుటిలాక్షున కి, ట్లనియెను భండాసురేంద్రుఁ • డతిదుఃఖమునన్.

క. కలయందు నసంభావ్యము, నిల మును వినఁబడనిదియును•హృదయమునందుం
దలఁపంగ రానిదియునగు, ఖలదైవకృతంబునైన • కష్టము కలిగెన్. 126

తే. దుర్మదుండు కురుండుండు • నిర్మలాంగ, సౌష్ఠవంబును శౌర్యంబు • సాహసంబు
గలుగు సోదరు లని మొన•విలయమొంది,రఁట నితంబినిచేత మా• యాబలమున.

సీ. అక్షౌహిణీశత • మలరుచు వెంట రా రణదుర్మదులు శౌర్య•రాజితాంగ
కాంతులు సాహస•వంతులు నగు కరంకాదులఁ బంచసై•న్యాధిపతులఁ
బనుపుము వా రేగి • వనితను దురమున నవలీల నోడింతు • రనిన భండు
నాజ్ఞచేఁ గుటిలాక్షుఁ • డప్పు కరంకాదిపంచకంబును బిల్వఁ • బనుప వార

ఆ. లాదరమున భండు • నంఘ్రుల కెరఁగినఁ, గుటిలనయనుఁ డపుడు•కూర్మితోడ
నాజ్ఞచేయ వార • లప్పుడ కదలి ర,ణంబు చేయఁ జనిరి • డంబుమీఱ. 128

క. భేరీధ్వనుల నభంబును, వారిధిసప్తకము దిగ్ద్వి•పంబులు భీతిన్

ఘోరముగఁ గలఁగె నంతట, భూరిశతాక్షౌహిణులును ♦ ముందుగ నడువన్.

వ. చనుచుండి రయ్యవసరంబున. 130

సీ. భూరిఘీంకారఘో♦రారవనిర్భిన్నదిక్కుడ్యపంక్తులౌ ♦ ద్విపనికరము
హేషామహారవ♦శోషితోచ్చైశ్శ్రవస్సత్త్వమై రాజిల్లు ♦ సైంధవతతి
గర్జదద్రిభాంగసం♦ఘాతభిన్నావనీతలమై చెలంగు ర♦థవ్రజంబు
నుద్ధతముసలకుం♦తోరుగదాముఖ్యకనదస్త్రభీమమహా ♦ కాల్బలంబు

ఆ. మిగులు వేడ్కఁ నడువ ♦ మేదినీరజ మెల్లఁ, గడఁగి సూర్యుఁ గప్పెఁ ♦ గళవళించె
లోకజాలమెల్లఁ ♦ బ్రాకటగతి నిట్లు, పంచసైన్యపతుల ♦ బలము నడువ. 131

వ. అంత బహువిధాకారంబులును, మీనవ్యాళాదిచిత్రితంబులును నగు కేతనంబు లాధూళికాజాలంబున మహోదధియందు మత్స్యంబులువలెఁ గదలుచుండె నట్లు వచ్చుచున్న దానవసేనలం గాంచి యమరు లాకులితస్వాంతులై రప్పుడు కరంకాదులు సర్పిణి యను పేరఁ బరఁగు నొకమాయను గావింప నందు రణశాంబరి యగుసర్పిణి యుదయించి ధూమ్రవర్ణయు, ధూమ్రోష్ఠియు, ధూమ్రలంబపయోధరయు, మహోదధిగంభీరకుహరోదరయు నై యొప్పి బహుసర్పవిభూషణ యగుచుఁ గద్రువను బోలి మాయామయశరీరంబు లగు సర్పంబుల కుద్భవస్థానంబై సైన్యాధిపతుల చెంగటఁ జెలంగి శివాఘోరవిరావిణియై వల్గితంబు నొనరించెఁ గుంభసంభవా! కరంకాదు లమ్మాయచేతనే సురేంద్రాదుల నోడించిరని యెఱుంగు మివ్విధంబున సైన్యంబులు చనిచని శక్తిసైన్యంబుల మాఱొక్కని. 132

ఉ. ఒండొరు మీఱు పౌరుషము ♦ లొప్పఁగ దానవశక్తిసేన లు
ద్దండతఁ బోరి రప్పుడు ని♦తాంతరుషావిలభాషణంబులన్
జండతరాస్త్రజాలముల ♦ సంగర మెంతయు ఘోరభంగి యై
యుండె నభంబునందు దగ ♦ నున్న సురల్ భయ మందునట్లుగాన్. 133

ఆ. ధూళిచేత దృష్టి ♦ తోఁపకయుండె న,త్యుగ్రభాషణముల ♦ నొప్పు మెఱసి
పోరి రొక్కభంగి ♦ పొచ్చెమింతయు లేక, యుభయసైన్యజనము ♦ లుక్కు మిగిలి.

సీ. ఇతరేతరాంబక♦హతిసముత్థితహుతాశనము, శరాగ్నిసం♦ఛన్నదిక్క
[1]మసృగుగ్రతటినీస♦మాలోలనాగంబు, మాంసకర్దమబహు♦మగ్నరథము
సతతవికీర్ణకే♦శసమూహశైవాలశస్తరక్తాంబు ని♦ర్ఝరవరంబు

1 అసృగు...నాగంబు=రక్తప్రవాహమునఁ గదలుచున్న యేనుఁగులుగలది.

నతివీరజాతసిం♦హనినాదభీతిదం, బతిరజోధ్వాంతంబు ♦ హతశరీర
తే. మధిక[1]నిస్త్రింశభిన్న మ♦హాసురౌఘ, కంఠభవరక్తఘోరంబు ♦ కడు భయంక
రంబునై యొప్పె నప్పుడు♦రణము చూచు, దేవతావీరు లెంతయు♦దిగులు నొంద.

వ. తదనంతరంబ శక్తిసైన్యంబులు మార్కొని విజృంభింపఁ గరంకాది సేనాపతిప్రేరితయై సర్పిణి బహువిధసర్పంబుల నిజశరీరంబు నుండి పుట్టించిన. 136

సీ. రూతుకర్కోటక♦తక్షకవాసుకి ప్రతిముఖా బహుఫణీ♦శ్వరులు చిత్ర
బహువిధాంగులు తీవ్ర♦బహుళదంష్ట్రాభయంకరులు నానావిధ♦గరళదగ్ధ
భువనత్రయులు మఱి♦ భూరిదారదకాలకూటసౌరాష్ట్రిజ♦ఘోరవత్స
నాభాఖ్యవిషముల ♦ నానావిధంబుల బ్రహ్మపుత్రప్రదీ♦పనముఖముల
తే. చేతవక్త్రంబు లెంతయుఁ♦జెలఁగుచుండ, లోలరసనాద్వయంబులు♦గ్రాలుచుండ
గరళ మాశక్తిసేనపైఁ♦గడఁగి యుమిసి, కాల్చె రొక్కట నత్యంత♦గర్వమెసఁగ.

తే. సర్పిణీనేత్రయుగ్మంబు ♦ సరణిఁ బుట్టి, సర్పకోటులు పుచ్ఛాగ్ర♦సరణులందు
వక్త్రయుగ్మము ధరియించి♦ఫణము లొప్ప, సజలమేఘావళినిబోలి♦శక్తిబలము.

వ. మార్కొని విషంబుల నుమియఁ దొడఁగె నందు ముఖంబునుండి పుట్టిన సర్పంబులు శబలవర్ణంబులును, జతుర్వక్త్రంబులును; నాసికావివరంబునుండి యుద్భవించినవి పీతవర్ణంబులును, ద్రిఫణంబులును, దంష్ట్రావికటాననంబులును; గర్ణకుహరంబువలన నావిర్భవించినవి లంబమానమహాచర్మంబులును, గ్రోధభయంకరంబులును; నాభికుండోత్పన్నంబులు రక్తవర్ణంబులును, భయానకంబులును నై హాలాహలంబు నుమియుచుఁ బరబలంబులం గాల్చుచు ఫణమండలంబులం గొట్టుచు నల్లకల్లోలంబుఁ జేయుచు విజృంభించుటయు. 139

ఆ. శక్తితీవ్రశస్త్ర♦సముదయమునఁ జచ్చి, మాయచేత మరల ♦ మరలఁ బుట్టి
యాక్రమించె భూమి♦నంతయు సర్పంబు, లొకటి చావఁ బెక్కు ♦ లుద్భవించి.

క. జనయిత్రి యైన సర్పిణి, యనిఁ జావమి సర్పజాల ♦ మంతయు మరలన్
జనియించుచుండెఁ గుంభజ!, కనఁ జిత్రం బద్ది మున్ను ♦ కనుఁగొన మెచటన్.

తే. దారుణాహివిషానల♦దహ్యమాన, మగుచు నాశక్తిసైన్యాళి♦యపుడు దుఃఖ
సాగరంబున మున్గిన ♦ సరణిఁ గాంచి, వీరదానవు లంతట ♦ విక్రమించి. 142

వ. విజృంభించి యశ్వారూఢసైన్యంబు మీఁదఁ గవిసి రందుఁ గరంకుండు. 143

క. అతులబలంబున గర్దభ, శతములఁ బూన్చిన రథంబు ♦ శౌర్యంబున ను

---

1 నిస్త్రింశ... ఘోరంబు=కత్తులచే ఛేదింపఁబడిన గొప్పరాక్షసుల కంఠములవలనఁ బుట్టిన రక్తముచే భయంకరమైనది.

ద్ధతశక్తి నెక్కి యంబక,వితతుల నుత్పాతమేఘ•విధమునఁ గురిసెన్. 144

తే. కాకవాసితనామకా•నీకవిభుఁడు, గంధగజ మెక్కి తీక్ష్ణచ•క్రంబుచేత
శక్తిసైన్యంబు మర్దించె•శౌర్య మొప్ప,వజ్రదంతాఖ్యుఁడుష్ట్రింబు•పైఁ జెలంగి.

సీ. వజ్రిబాణంబులఁ • బఱపి సైన్యముఁ ద్రుంచె వజ్రముఖుండను • వాహినీశుఁ
డనుపమగతిఁ బోవు•నట్టి గార్దభ మెక్కి కుంతధారల శక్తి•కోటిఁ గూల్చె
వజ్రిలోమాఖ్యుండు • వరగృధ్రియుగ్యరథారూఢుఁడై మహా•ఘోరవిశిఖ
సముదయంబున శత్రు•సైన్యంబును మథించె నంతఁ దత్ప్రీతాహి•తాసురవర

ఆ. సేనలెల్ల లీల•చే శక్తిసేనల,మీఁదఁ గవిసి వారి • మృత్యుపురికి
ననుప సర్పిణియను•హస్తంబునన్ మాయఁ, బూని కోటిసర్ప•ములను గనియె.

వ. ఇట్లు సర్పిణివలనఁ గలిగిన భుజగంబు లశ్వారూఢసైన్యంబుల దైన్యంబు
నొందించుటయు. 147

క. సకలేశితాలుసంభవ, నకులీశ్వరి తార్క్ష్యవాహ•నంబు మెఱయ హా
టకకాంతిరుచిరయై యు,ద్ధకలాకౌశలము చెలఁగ • దర్పము పొంగన్. 148

తే. సంప్రవృద్ధాహిసేనపై • సకలవాఙ్మ
యాకృతియు వజ్రరూపదం•తావళియును
వెలయఁగా నిజసైన్యంబు • విడిచెఁ; దార్క్ష్య
వాహనంబును జెలరేఁగి • పౌరుషమున. 149

తే. పక్షవిక్షిప్తభూధర•పంక్తి యగుచు
సర్పిణీమాయచే వచ్చు • సర్పతతుల
కభిముఖంబుగఁ బోవంగ • నాగ్రహమున
నకులి ద్వాత్రింశదుచ్ఛదం•తములవలన. 150

వ. ద్వాత్రింశత్కోటినకులంబులఁ బుట్టించె నానకులంబులు కనకప్రభంబు లగుచు నటు నిటు దిరిగి నిజదంష్ట్రావిమర్శంబున సర్పమండలంబుఁ జంపఁ దద్విషంబు ప్రవహించె.స్వర్ణబభ్రువులగు బభ్రువులు క్రోధంబున రోమోద్గమంబు మెఱయఁ దోఁకల నాడించుచు నోరు తెఱచి సర్పంబుల ఛేదించె. అంత నొక్కొక్క మాయవలన గలిగిన సర్పంబు లొక్కొక్కనకులంబుచే నాశితంబు లయ్యె. శోణితనది భయంకరంబుగాఁ బ్రవహించె. నకులదశ్యమానంబులగు సర్పంబులు కుండలాకారంబుగాఁ జుట్టుకొనియె. పిదప నకులావళి దష్టనష్టప్రాణభుజంగ ఫణాభాసమానమణిగణంబు లద్భుతంబుగాఁ బ్రకాశించె. నకులాఘాతసంకీర్ణ ఫణాచక్రవినిర్గతంబు లగు మణులు మహాకోపజ్వలనజ్వాలలవలె వెలింగె నిట్లు

సర్పప్రళయం బగుటయు సర్పిణి కోపోద్దీపిత యై యుద్ధంబునకు వచ్చుటయు
నకులీశ్వరి యభిముఖయై మార్కొని కడంగి. 151

సీ. గారుడాస్త్రంబును • భూరిక్రుధను నారిఁ గూర్చి వైవంగ న•కులి యనుజ్ఞ
నుద్దామశిఖులతో • నొప్పి యాసర్పిణి తనువుఁ బ్రవేశించి • దర్పమొప్ప
సర్పమాయ నడంప • సర్పిణి మృతినొందె నది కాంచి పంచసై•న్యపతులుగ్రు
మూర్తులై తమబలఁ•బులఁ బంప నకులియు నిమిషమాత్రంబున•జమునికడకు

ఆ. వారి నంప మెఱయు•భూరిరోషంబున, నొక్కమాఱు కవిసి • యుగ్రబాణ
తతులఁ గప్ప నొక్క•తార్క్ష్యంబుపై నుండి, పంచసైన్యపతుల • బరవసమున.

క. ఘనబాణధారఁ గప్పిన, దనుజులు నకులములనెల్ల•దారుణముసలా
ది నిఖలసాధనములఁ దుృంచిన నకులియుఁ గ్రోధరసము•చెలఁగుచునుండన్.

మ. కులిశాకారము లైనదంతములతో • ఘోరంబుగాఁ దుృంచి దై
త్యుల నెల్లన్ నుఱుమాడి యార్చుటయు దై•త్యుల్ గొంద ఱత్యుగ్రక
ర్ణలలాటాహతులం గలంగి యముఁ జే•రం బోవఁ దత్సైన్యనా
థులు నూల్కొల్పిన దానవుల్ బలిమిచే• దోర్గర్వ మేపాఱఁగన్. 154

క. శరములు గురియఁగ నకులము, లరుదుగఁ దచ్ఛిన్నములను • నద్భుతఘోణా
ఖరవక్త్రకర్ణసీమల, బరవస మొప్పంగఁ గఱవఁ • బ్రాణభయమునన్. 155

మ. వికలస్వాంతులు భిన్నకంకటులు ను•ద్భీతిచ్యుతాస్త్రిల్ మహా
నకులోద్యద్దశనాహతుల్ సురరిపుల్ • నానాగతుల్ మీఱఁగా
సకలాశాంతరసీమలం గనఁగ ను•త్సాహంబునం బోవ న
ట్లు కడుం బాఱఁగఁ బోవనీక రణసం•లోలాంతరంగంబులన్. 156

తే. నకులములు దానవులవడ•నంబు లెక్కి,దంతములభిన్నములఁ జేసి•దర్పమొప్ప
సూక్ష్మతనువుల ఘ్రాణాళిఁ•జొచ్చి చించి, వికలనాసులఁగాఁ జేయ• వెనదనుజులు.

క. దీనత దోఁపఁగఁ బడుటయు, దానవపతి యాకరంక•దనుజుఁడు కోపం
బూనిన మదితోఁ దలఁపడఁ, గా నప్పుడె యితరసైన్య•కాంతులు శక్తిన్. 158

సీ. ప్రౌఢకోదండోత్థ•బాణౌఘములు మేఘ మెట్లుగ వర్షించు•నట్లు కురిసి
వజ్రదంతంబుల • వహ్ని బాణంబుల భేదింప నకులముల్ • భిన్నతనువు
లై నకులీశ్వరి• నాశ్రయించినఁ జూచి వేగంబ నకులియు • విక్రమించి
యతీక్ష్ణనకులాహ్వ•యం బగునస్త్రంబు సర్వతోముఖమును • జ్వలనసంవృ
తంబు శార్ఙ్గంబునఁ • దగఁ గూర్చఁ దద్బాణవరవినిష్ఠ్యూతోగ్ర • వజ్రదేహ

తే. ములును, భిదురాభరదనముల్ • భూరిజవము
లగుచు నకులంబు లెల్ల సం•ఖ్యాధికములు
గాఁగ జనియించి నకులేశి • గారవింప
శత్రుసేనల మర్దింపఁ • జనియె బలిమి. 159

వ. మఱియు నా నకులంబులు వజ్రసారంబులును, వజ్రవాలభయంకరంబులును, వజ్రరోమంబులును, వజ్రనఖంబులును, వజ్రరత్నప్రకాశమాననేత్రంబులును గలిగి మెఱసి రాక్షసుల మర్దింప దానవు లడంగుటయు శతాక్షౌహిణీబలంబులు యమసదనంబున కరుగుటం గాంచి కరంకాదిసేనాపతిపంచకంబు విక్రమించి నకులంబుల నొప్పింపఁ బేర్చి గరుడారూఢ యైన వారిమీఁదం బడి పట్టసంబునఁ గరంకుని కంఠంబును ఛేదించె. పదంపడి తార్క్ష్యుండు కాకవాసిత వజ్రదంత వజ్రముఖ వజ్రలోములకంఠంబుల నిజఖరనఖరంబులఁ ద్రెంచి పాఱవైచె. అట్టిలాఘవంబును గాంచి నకులీశ్వరిని శ్యామలాదేవి బహూకరించి నిజాంగదేవతాత్వంబు నొసంగె. కుంభసంభవా! లోకోత్తరగుణంబులు గలవారియం దెవరికైనను సంతసంబు గలుగకుండునే. వినుమంత హతశేషులు శూన్యనగరంబున కరిగి భండాసురున కవ్వార్త నెఱింగించినఁ జండరోషంబున నిట్టూర్పులు నిగుడఁ జెంతనున్న కుటిలాక్షున కిట్లనియె.

— వలాహకాదిసేనాపతు లేడుగురు పొలియుట. —

సీ. భద్రాత్మ! మనకు న•భద్రంబు సమకూడెఁ గందళద్భుజశౌర్య•కలితు లమల
సర్పిణీమాయాను•సాధితగీర్వాణు లగుకరంకాదు ల•త్యంతదుష్ట
మాయావిలాసయా • మగువచే నడఁగిరి కదనంబున వలాహ•కప్రభృతుల
సప్తసైన్యేశుల • శౌర్యసమగ్రుల నియమింపు మక్షౌహి•ణీశతంబుఁ
ఆ. గొనుచు సత్వరమునఁ • గూటయుద్ధంబున, స్త్రీసమూహమెల్లఁ•జిక్కుపడఁగఁ
జేసి విజయమొంది • శీఘ్రంబ రమ్మిట, కనుచు భండుఁ డతని•కనియె మరల.

వ. వారు కీకసాగర్భసంజాతు లుద్దండపరాక్రములు గావున వారి కవశ్యంబు విజయం బగునని యాజ్ఞాపించుటయుఁ గుటిలాక్షుండు వారలం బిలిపించిన వలాహక, సూచీముఖ, ఫాలముఖ, వికర్ణ, వికటానన, కరాళాక్ష, కరటకు లను నేడుగురు వచ్చి భండాసురునకు నమస్కరించి యనుమతులై కైకసు లగువారు పరస్పరసహాయులై శతత్రయాక్షౌహిణీవరూధినీ సంయుతులై వెడలి రప్పుడు. 162

సీ. కేతుజాలముల జీ•మూతసమూహంబు నొరయుచుఁ బాదన•ఖోగ్రనిస్వ
నవతిగా ధరణినెం•తయు శక్తిఁ జేయుచు రజములచే సము•ద్రములఁ బంక
సంకులములుగాఁగ • సవరించుచును రణభేరికానిస్సాణ• పృథురవముల
నంబరతలమెల్ల • నార్భటింపఁగఁ జేసి క్షోణినెల్లను నభో•గుణముగాఁగఁ
తే. బ్రతిపదంబునఁ జేయుచుఁ • బ్రథనమునకుఁ
జనియె నాసైన్యమంతయు • సప్తసైన్య
పతులు విశ్వంబు మ్రింగఁ జూ•పట్టి రోష
రక్తముఖములఁ బొల్పార • రయము మెఱయ. 163

చ. దినకరమండలప్రతిమ•తీక్ష్ణమహాకవచంబు లొప్పఁగా
ననికిఁ గృతాంతు లట్లు వివి•ధాయుధభూషణు లౌచు వేగ లో
కనివహముల్ జయించుటకుఁ • గర్బురనాథుఁడు పంపినట్లుగాఁ
జనిరి పరాంబసైన్యమును • జంపెదు కౌతుక ముల్లసిల్లఁగన్. 164

చ. కిలకిలలాడుచున్ సమర•కృత్యవిదుత్తము లుద్ధతాయుధో
జ్జ్వలిత ధనుఃకలాపు లరి•వారమహోగ్రులునైన దానవుల్
లలిత బలంబు లెచ్చట మె•లంగునొ యచ్చటి కేగి రంత న
బ్బలములఁ గాంచి దేవి పను•పం జని తాఁకెను శక్తిసైన్యముల్. 165

ఆ. పాశముసలచక్ర•పట్టసముద్గర, చాపములను దాల్చి • శక్తి మెఱసి
దైత్యరక్తములను • ద్రావంగ వడిఁ జని, పడిరి వారిపై న•వార్యరీతి. 166

వ. అప్పుడు. 167

ఉ. వేగమ రండు రండు బల•విక్రమసంపదఁ జూప వచ్చు వే
వేగమ వచ్చి మార్కొనుఁడు • వీరవధూమణులార! యింక మీ
కేగతిఁ బాఱినం దొలఁగు•నే మరణంబు కృతాంతునింటిలో
బాగున విందుచేయుదురు • పంపెద మచ్చటి కేము మిమ్ములన్. 168

తే. మాయలాడుల మిమ్ము నే•మమున నిపుడ, యమునిపట్టణమునకు వే•యంపఁదలఁచి
వచ్చినారము మార్కొన•వచ్చు మమ్ము, ననుచు భీషణముగఁ బల్కి • యార్భటించి.

ఉ. ఆహవకాంక్షమీఱ దను•జావళు లప్పుడె మార్కొనంగ దో
స్సాహస మస్త్రవీర్యమును • శౌర్యముఁ గోపముఁ దెంపుఁ బెంపు ను
త్సాహము నొక్కటం బెనఁగ • శక్తులు దైత్యుల మీఱి పోరి రా
హా! హతులైరి దానవు లం•టంచు సురావళి నింగిఁ బొంగఁగన్. 170

చ. వనిత యొకర్తు రోషమునఁ • బట్టసమూని చెలంగి పొంగుచున్

దనుజుని కంఠము న్నటికెఁ • దద్గళవిచ్యుతరక్తపూరముల్
గన వినఁ జిత్రిమాకరణి • గాఁగ నెసంగె మహోర్ధ్వమార్గ మై
విను మట మీఁదివార్తలను • వేడుక నింపెడు నాలకించినన్. 171

తే. రక్తమధ్యమమందు గృధ్రములు మండ
లాకృతిని గూడియుండఁగా • యమునియాత
పత్త్రికాంతి చెలంగిన•భంగిఁ దోఁచె
నంత నొక్కర్తు మిగిలిన • యాగ్రహమున. 172

సీ. దానవుం డొక్కఁడు•ద్దామశక్తిని నైవ నొకబాణమున దాని • నుక్కడంచి
యొకట దానవు యము•నికటంబునకుఁ బంచె వేఱొక్కవనిత యు•ద్వృత్తితనర
హస్త్యధిరూఢ యై • హస్త్యధిరూఢుఁడౌ దనుజునివక్షంబు • దర్పముప్ప
ఖండించె వేఱొక్క•కామిని ప్రతిభటాధిష్ఠితమదహస్తి•దివ్యకుంభ

తే. సీమ ఖడ్గంబునను ద్రెంచి • స్వీయకుచము
లకును మోదంబు నొనఁగూర్చి • ప్రకటచక్ర
మునను దనుజుని కోదండ•మును నడంచి
భూరియుగంబున కామోద•మును నొనర్చె. 173

చ. దనుజకృపాణయష్టి నొక•తన్వి శరావళిఁ ద్రుంచి యుత్సుకం
బునఁ దనలోమపంక్తికిని • భూరిముదంబును గూర్చె నొక్కపా
వని సురవైరిస్యందనము • వైఖరి ముద్గరధారఁ ద్రుంచి చే
సెను దనబల్పిఱుందులకు • జృంభితమోదము నేర్పు మీఱఁగన్. 174

ఆ. రయముమీఱ నసురు•రథకూబరం బొక్క, తరుణి తీవ్రఖడ్గ•ధారఁ జెండి
యూరువులకుఁ బ్రియము•నొయ్యనఁ గావించె,నంత నసురసైన్య•మార్భటించి.

ఆ. శక్తిబలము నడుమ•నరభసంబునఁ జొచ్చె, నంత నదియుఁ గడగి•యసురసేన
మధ్యతలముఁ జొచ్చె • మదినప్పు డూహింపఁ, బాలునీరుకలియు•భంగిదోఁచె.

సీ. శక్తిసైన్యం బట్టె • సామజశుండారదంబులఖడ్గపా•తమున నఱక
నవి యప్పు డొప్పె మ•హాక్రోడములభంగి పీరభయంకర•భూరిసమయ
మివ్విధంబున నొప్పె • నేరికైనస్మరింప సాధ్యంబు గాకుండ• సాహసమున
నపుడు వలాహకుం • డనుసైన్యపతి యగ్నిసంభవమై చండ•శౌర్యయుక్తి

ఆ. భాసమాన మగుచుఁ • బకవిక్షేపభ,యంకరంబు విజిత•యాతుధాన
నకలవాహనంబు • సంహారగుప్తాఖ్య, గృధ్రి మెక్కి యుద్ధ•కృత్య మెఱిఁగి.

ఉ. చెచ్చెఱ వచ్చి శస్త్రముల • జృంభణ మొప్పఁగఁ బోరుచుండఁ జం

చచ్చటులోరుపక్షముల • జయ్యనఁ జాఁపి మహారవంబుతో
మెచ్చుచు దానవుల్ చెలఁగ • మృత్యువుఁ బోలి వధించె శక్తులన్
హెచ్చుగఁ బాదఘాతముల • నెంతయు స్వేచ్ఛచరించుచు న్వడిన్. 178
ఆ. అగ్నికుండ మట్టు • లమరుతుండంబున, శక్తిబలము నెల్ల • సాహసమునఁ
దినుచు మెఱియ నతఁడు•తీక్ష్ణచాపముఁ దాల్చి, బాణవృష్టినపుడు•ప్రబలఁజేసి.
ఆ. పక్షయుక్తభూరి • పర్వతకూటస్థ, మేఘ మట్టులతఁడు • మెఱసి గృధ్ర
వాహనంబుతోడ • బహువిధంబుల నని, చేసి శక్తిబలము • చించెఁ గడిమి.
సీ. సూచీముఖుండును • సూచినిష్ఠురపక్షకాకవాహన మెక్కి • కఠినసమర
మప్పుడు చేసె న•య్యసురుని వాహంబు శైలశిఖశృంగాభ • చంచువులును
గాలదండాభజం•ఘాదండములు పుష్కలావర్తసామ్యముల్ • హారిపంక
సంకాశకాంతులు • సాంద్రంబు లతిదీర్ఘములు నైనపక్షముల్ • గలిగి మెఱసి
తే. చంచువులఁ గొట్టి మానినీ • సైన్యమెల్ల, నల్లకల్లోలమై పోవు•నట్లు చేసె
సమరమత్యద్భుతంబుగ • సంతసమున, దనుజులెల్లను బొగడంగ•ధైర్య మొప్ప.
ఉ. అంకిలిదీఱి రాక్షసు ల•హార్యభుజాబలమొప్పఁ బోర ని
శ్శంకబలంబునన్ మెఱసి • సాహసమొప్పఁగ భీమరూపమా
కంకము నెక్కి యగ్నిసమ•కాండములన్ ధరియించి స్వాభిధే
యాంకితశస్త్రమొప్పఁగ దు•రాత్ముఁడు ఫాలముఖుండు చెచ్చెరన్. 182
ఆ. యుద్ధకాంక్షవచ్చి • యుగ్రభంగిని బోరె, వికటనాముఁ డపుడు • విక్రమమునఁ
బృథుబలమ్ముతోడ•భేరుండమున నొప్పి, జయముగోరిచేసె•సమర మపుడు. 183
క. వికటాననుండు ముదమున, సకలాస్త్రము లొప్పఁ బట్టి•నంబు మెఱయ ను
త్సుకతం గుక్కుటవాహము, ప్రకటాటోపమున నెక్కి • పృథనముచేసెన్. 184
వ. కుక్కుటంబును గంఠరోమంబులు మెఱయ ఘోరభంగి నేత్రంబులు భాసి
ల్ల శక్తిసైన్యంబుపైఁ గవిసె నతనితోడఁ గరాళాక్షుండను నాఱవచమూపతి
యత్యంతగరిష్ఠదోశ్శాలియై ప్రేతవాహనంబు నెక్కి వజ్రనిష్ఠురఘోషంబు
చెలంగ యుద్ధంబుచేసె నాతండు మున్ను శ్మశానమంత్రంబునఁ దపంబుచేయ
నవాఙ్ముఖుండును, దీర్ఘబాహుండును, సారితపాదుండును నగు ప్రేతుండు వా
హనత్వమొంది కరాళాక్షుని వహియింప వరం బిచ్చె. పిదపఁ గరటకుం డను
సైన్యపాలకుండు బేతాళవాహనుండై శత్రువుల మర్దించె. వాహనరూపుం డగు
బేతాళుండు రోజనాయతమూర్తియై క్రూరనయనుండై మెఱసె. మున్ను
శ్మశానభూమియందు బేతాళమంత్రంబు జపించిన బేతాళుండు వాహనం బై

యుండునట్లు వరంబిచ్చె నక్కారణంబున నాతండు వాహనం బయ్యె నివ్విధం
బున సప్తసేనాపతులు శౌర్యంబునం బోరుచుండి రప్పుడు. 185

తే. సప్తసాగరములఁబోలి•శక్తిసైన్య, వారముఁ గలంచి పేర్చిన • పౌరుషమున
దానవోత్తము లెల్ల నుద్దామభంగి, ననితరాదృష్టశక్తిచే • ననిఁ జెలంగి.

ఆ. విక్రమించి రొక్కటి•వినుము చెప్పెద మౌని,వర్య! మున్ను వారు•భానుమూర్తి
గుఱించి తపము సేయఁ • గువలయవైరియు, వారిమెదుట నిలిచి•వలికె నిట్లు.

ఉ. కైకసులార! మీతపముఁ • గాంచి వరం బిడ వచ్చినాఁడఁ దీ
వ్రైకతపంబుసేసితి రిఁ•కేమియుఁ గోరిన నిచ్చువాఁడ నాఁ
బ్రాకటభక్తి వార లొగి • భాస్కరునిన్ వినుతించి మ్రొక్కి తో
షైకమనంబు లొప్ప రవి • కివ్విధిఁ దెల్పిరి స్వాభిలాషలన్. 188

సీ. ద్వాదశాత్మక! దేవ• భాస్కర! యుద్ధంబునందు దీప్తుల నొప్పి•యరిభయంక
రాకృతిఁ బొలుపారు•నట్లు మానేత్రకుక్షులయందు సాన్నిధ్య•మెలమినొనఁగు
మరిజనంబులు మామ•కాక్షిగమ్యులు నైన నిశ్చేష్టులై యని•నిలువవలయుఁ
ద్వత్సన్నిధిని శత్రు•వారముల్ స్తబ్ధశస్త్రాస్త్రులై యుండంగ•నరులఁ గూల్ప

ఆ. సులభతరము మాకుఁ • జెలఁగుదు మట్లైన, విజయవైభవమున • విక్రమించి
యనిన నట్ల యనుచు•నాదిత్యుఁ, డరిగె న,వ్వరముఁ దలఁచి రంత•భాస్కరుండు.

ఉ. అక్షిగతుండు నొటఁ గడు•నద్భుతదృష్టుల వారు చూడఁ బ్ర
త్యక్షశివాకృతిం బొలిచి • యప్పుడె శక్తులఁ జూడఁ గాంత ల
య్యక్షిగతప్రభాకరు మ•హామహిమన్ గతదోర్బలాఢ్యలై
వృక్షములట్ల నిల్చి రొగి • వీతమహాస్త్రశరౌఘసారలై. 190

ఆ. యత్న మెంతొ చేసి • యనికిఁ గడంగినఁ, గదలలేక నిలిచి • కాంతలెల్లఁ
జూచుచుండ రక్క•సులు శౌర్య మొప్పారఁ,గడఁగి చంపి రస్త్ర•కలితు లగుచు.

క. గతశౌర్య లైనశక్తులు, వితతాస్త్ర నికాయఘాత•విహ్వల లై చి
త్రితపటము లట్ల నిలిచిరి, గతి యేది సమస్త శస్త్ర•కలితలు నయ్యున్. 192

తే. వజ్రకంకటభేదులౌ•వాఁడిశరము, లొక్క మొగి దేహములఁ గాఁడ•నుద్గమించె
రక్తపూరంబు, లొప్పిరి • రమణు లపుడు, లలితపల్లవకంకేళి • లతలభంగి.

సీ. స్తంభితాయుధబాహు•సారలై యప్డు హాహాకారములఁజేసి • యఖిలలోక
జనయిత్రి లలితాంబ• సాధుపాలిని మమ్ము గాపాడుమీ యని • కడఁగి దైన్య
పూర్వకంబుగ వేడఁ•బొలఁతులయార్తిని బాపంగ మది నెంచి•భవ్యమూర్తి
లలితాంబ కరుణైక•జలనిధి వారాహి ప్రత్యంగరక్షిణి • ప్రబలశౌర్య

తే. చండదోర్దండమండిత•కాండయు నయి, నెమ్మిమెఱయు తిరస్కరి•ణిని జవమునఁ
బనుప నాదేవిరణమునఁ • బరులఁ గూల్చి, శ్రీపరేశ్వరి నలరింపఁ•జేయువేడ్క-

వ. తమోలిప్తాహ్వయంబును, సర్వతోముఖంబును నగు విమానం బెక్కి తమాల శ్యామలాకారయు, శ్యామకంచుకధారిణియు, శ్యామయుగ్యతురంగమయు నగు తిరస్కరిణి మోహనాభిఖ్య నొప్పు చాపంబుగొని సింహనాదం బొనరించి సర్పసన్నిభంబు లగు మార్గణంబులు గురిసిన గృష్ణరూపభుజంగప్రతీకాశంబులు నయోముసలసన్నిభంబులును నగు మోహనచాపనిర్గతబాణంబుల సహింపఁ జాలక రాక్షసు లెల్లఁ బరుగెత్తుటయు దండనాథప్రోత్సాహంబునఁ దిరస్కరిణి వలాహకాదిదానవులపై నంధాఖ్యచే నొప్పు నస్త్రంబును బ్రయోగించినఁ దదస్త్రశక్తి నాచ్ఛాదితనేత్రులై సప్తసేనాధిపులు కన్నులు విప్పరామి నూరకుండి రంత శస్త్రస్తంభనంబు తొలంగిన నెప్పటియట్ల శక్తిసైన్యంబు విజృంభించి యురువడించి సింహనాదపూరితదిక్తటం బై విక్రమించి తిరస్కరిణి ముందు నడువ రాక్షసమర్దనంబుఁ గావించుచుఁ దిరస్కరిణితో నీవు దురాత్ముల నేత్రనిరోధంబు చేసితివి కావున శత్రుతిరస్కరిణి వయ్యెద విట్లు దేవకార్యంబు సాధించితి వింక మాకేల భయవ్యసనంబు లీవలాహకాదులు నీచే నిహతులైన నవ్వార్త నాలించి లలితాంబ ప్రీతి నొందు వారాహియు శ్యామలయు సంతోషింతు రని శక్తులెల్లఁ బలికిన సంతసంబునఁ దిరస్కరిణి సంరంభంబున.

చ. దురమున నవ్వలాహకుని • దోర్బల ముల్లసిలంగఁ గేశముల్
గరమునఁ బట్టి పౌరుషము • గ్రాల మహాసి వధించి గృధ్రిముఖ్
ఖరశరధారఁ ద్రుంచె నది • కన్గొని దేవత లెల్ల సంతసిం
చి రమణి! దేవి! రాక్షసుల • జృంభణ మిట్లె యడంపుమీ యనన్. 196

క. సూచీముఖునకు నెదురై, వేచని పట్టసముచేతఁ • బృథుతరరత్న
ప్రాచుర్యమకుటశీర్షము, నౌచిత్యము చెలఁగఁ ద్రుంచె • నమరులు పొంగన్.

ఉ. తక్కిన పంచసైన్యపుల•దారుణశీర్షము లట్లె త్రుంచి పెం
పెక్కిన తత్సహాయుల న•హీనబలంబునఁ ద్రుంచె నంత నా
రక్కసు లెల్లఁ బుణ్యతతి • రాజిలునట్టి పదంబు నొందఁగా
నిక్కడ వారి ముండముల • నెల్ల ధరించి ముదంబు పొంగఁగాన్. 198

తే. ఆడె నంతర్ధిదేవత • యపుడు శక్తి, సైన్య మెల్లెడఁ జెలరేఁగి • శత్రుసైన్య
సమితినంతయుఁ దునుమంగ•సాంద్రరక్త, పూర మప్పుడు ప్రవహించె•నారభటిని.

. హతశేషులైన దానవు, లతిభయమునఁ బాఱి శూన్య•కాధిపు భండుక్

హతశత్రుని గని తెల్పిరి, గతవార్తల నెల్ల నతఁడు • కళవళమందన్. 200

వ. ఇచ్చట దండనాయిక మహామాయావిలాసిని యగు తిరస్కరిణిం బ్రశంసించి ప్రసాదమంథరం బగు దృష్టి నవలోకించె, దేవతాధీశ్వరు లెల్లఁ బొగడి రని హయగ్రీవుఁడు. 201

విషంగాదిదానవులు పాఱిపోవుట.

క. విను మవ్వలి వృత్తాంతం, బనఘా! భండాసురేంద్రుఁ • డవ్వార్తను గొ
ల్వున విని కృష్ణమహాఫణి, యనువున నిట్టూర్పు లొలయ • ననుజులతోడన్.

ఆ. మంతనంబు చేయ • మది నెంచి వారలఁ, బిలువఁ బంచి తానుఁ • గలఁగినమదిఁ
జింత సేయుచుండె • నెంతయుఁ జండదోర్దండుఁ డైనభండ • దానవుండు. 203

సీ. భండుని తమ్ముండు • బలశాలి యువరాజు నగు విశుక్రుఁడు యవీ • యసు విషంగుఁ
డనుమతి వెంటరా • నాస్థానకూటంబు నొంది యగ్రజుమృదు • సుందరాంఘ్రి
జలజంబులకు మ్రొక్కి • చారుపీఠంబుల నాసీను లై కుటి • లాక్షముఖ్య
సంయుతుండై యున్న • చండదోర్బలుభండుఁ గనుఁగొని పని యే మొ • పలుకుఁ డన్న

ఆ. క్వథితబుద్ధి యగుచు • భండాసురేంద్రుండు, పలుకు నన్నలార! • వంశమునకు
భ్రంశ మొదవె నకట; • బలవంతుఁ డై విధి, యిపు డుపేక్ష చేసె • నే మొకాని.

ఉ. దానవనాథుభృత్యుఁ డనఁ • దత్తఱ దోఁపఁగ దేవసంఘముల్
మానము వీటిఁ బుచ్చి మఱు • మాటయుఁ బల్కక పాఱుచుండురా
దానవభర్త కిప్పుడు ని • తాంతవిపర్యయ మొప్పె నక్కటా!
మానినిచేత యుద్ధమున • మాలవిధాత తలం పదెట్టిదో. 205

ఉ. ఏమనవచ్చు నింక విధి • యెంతయు శూరుని షండుఁ జేయు ను
ద్దామధనాఢ్యుఁ డౌ జను గ • తస్వునిగా నొనరించు జూచితే
నేమము లేక మాలవిధి • నేర్చుఁ జిరాయువు స్వల్పజీవిగాఁ
దా మహి నిర్ణయింప నెటు • తప్పదుపో విధిచేష్ట యెప్పుడున్. 206

చ. తలఁపఁగ నాదు బాహుబల • దర్పము లెక్కడ? సత్త్వహీన యై
యలరెడు దుష్టభామిని యు • హా! యది యెక్కడ? చోద్య మయ్యెడిన్
విలయము గాఁగఁ దోఁచె బల • వీర్యసమగ్రులు నైన దానవా
వళులకు నేమి చెప్పుదును • భండునికీర్తి యడంగు నే మొకో. 207

క. బలవంతుఁ డైన యవ్విధి, కులిశము మనమీఁద వైవఁ • గోరె నొకో దు
ష్టలతాంగిచేత నగునే, విలయము రాక్షసకులైక • వీరుల కిపుడున్. 208

క. కాకోదరమాయోగ్రుల, నీకవు లనిఁ బడిరి సైన్య • నిచయము గూలెన్

స్త్రీకఠినశౌర్యమహిమ ది, వాకరవరమహిమఁ దనరి ♦ యతిసాహసులై. 209

సీ. కబళీకృతామర♦గణులు నై పరఁగెడు కైకసు లనిఁ బడి ♦ కాలుపురము
నొందరే; భుజదర్ప♦యుక్తనై మాయినియై వధూమణి యొప్పె ♦ నబలచేత
మనమెల్లఁ దెగినచో ♦ మహి భండుశౌర్యంబు నిందింపఁ దగదె యీ♦నీచవార్తఁ
జెప్పంగ నాజిహ్వ ♦ సిగ్గు నొందెడి దనుజాన్వయంబు నడంపఁ ♦ నబలఁ బనిచె
తే. నకట! విధి యెంత బలశాలి ♦ యగునొ వినుఁడు
చారముఖమునఁ జంద్రాస్య♦చరిత మెల్లఁ
దెలిసికొంటిని దద్వార్తఁ ♦ దెలుపువాఁడ
సేనలకు నెల్లఁ బశ్చిమ♦సీమయందు. 210

చ. వనిత వసించియుండు నఁట ♦ వారణవాజిరథాదు లెల్ల ముం
దు నుభయపార్శ్వసీమల మ♦నోహర రీతిఁ జెలంగు చుండు నం
చును దెలియంగ వచ్చె బహు♦శూరతఁ బృష్ఠతలంబుఁ జేరి య
వ్వనరుహనేత్రసైన్యములఁ ♦ బట్టి వధించుట యుక్త మిత్తఱిన్. 211

వ. పార్ష్ణిగ్రాహం బిద్దాని నొనరింప విషంగుండు సమర్థుం డగు నతనితోడ సంగ్రామదుర్మదులును, బలోన్మత్తులు నగు పంచదశాక్షోహిణీసైన్యంబులు పోవలయు. శత్రునాయికకు వెనుక సైన్యంబులు లేవని తెలియ వచ్చె. స్వల్పసైన్యంబున్నను బహుసంరంభవిజృంభితులైన మనకు జయంబు సులభం బగుఁ గావున బహుసన్నాహంబున విషంగుండు గుప్తరూపుండై చని పార్ష్ణిగ్రాహుండైనవారు పట్టుపడుదు రని విషంగుం జూచి సహోదరా! నీ వదృశ్యరూపుండవై చనుము; పంచదశాక్షోహిణులు బలపరాక్రమసంపన్నులు సహాయులగుదురు. ఆలలితాంగనయే శక్తి మూలభూత యగుఁ దన్నాశనంబున మూలనాశనం బగు. మూలనాశంబువలన సరస్సునఁ గమలపత్రంబు లెట్లడంగు నట్లు శక్తు లడంగుదురు. మఱియు వినుము. 212

సీ. సేనాళి పశ్చిమ♦సీమను దశయోజనాయతోచ్ఛ్రియము మ♦హార్హమౌక్తి
కాతపత్త్రంబును ♦ హరి చామరచతుష్టయము నుత్తుంగ ధ్వ♦జనిచయవిలి
ఖితమహాజలదపం♦క్తియును నై చెలువొందుస్యందనం బొక్కటి ♦ సుందరముగ
నారథంబున మనో♦హరమూర్తి హరిణాక్షి నివసించు లక్షణ♦నికర మిద్ది
ఆ. వేగ పోయి దాని ♦ విజితమారపధూటిఁ, గొప్పు పట్టి యీడ్చి ♦ కుతుక మలర
మర్దితాంగిఁ జేసి ♦ మరలుము రక్షక, లజల లోట నిన్ను ♦ నధికబలుని. 213

చ. అనిఁ జెనకంగ లేక భయమందుదు రివ్విధిఁ గూటయుద్ధమం
దు నెలఁతఁ బట్టి చంపు మిది దుష్టులఁ జంపెడుమార్గ మింక నీ
కని సుసహాయులై చెలఁగునట్టి బలాధిపులన్ వచింతు వా
రనితరసాధ్యులై యలరునట్టి బలాధికు లెన్ని చూడఁగన్. 214

వ. దమనక, దీర్ఘజిహ్వ, హుంబేక, హులులుముల్ల, కల్కస, కల్కివాహన, పుల్కస, పుండ్రకేతు, చండబాహు, కుక్కుర, జంబుకాక్ష, జంభన, తీక్ష్ణశృంగ, త్రికంటక, చంద్రగుప్తులను పదియేనుగురక్షౌహిణ్యాధిపతులు బలపరాక్రమసంపన్నులు నిన్ననుసరించి తమతమ బలంబులం గూడి వత్తురు. నీవును శత్రువుల కెఱుఁగరానియట్టి యదృశ్యరూపంబునం బోయి పృష్ఠభాగంబున విజృంభింపుము. ప్రియసోదరా! యిక్కార్యంబునఁ బ్రౌఢిమను జూపుము. నీకు లగ్గగునని యుగ్గడించి విషంగుని యుద్ధంబునకుం బంపె నప్పుడు. 215

క. సకలేశీపార్ష్ణిగ్రాహకృతోద్యముఁడై విషంగుఁ డరుగుటఁ గని తా
వికలస్వాంతుం డగుచు దినకరుం డస్తాద్రి కేగి నక్కెన్ దరులన్. 216

చ. అరుదుగఁ బద్మమిత్రుఁ డపరాశను బొందినఁ బ్రాచి యట్టె కాం
తిరహిత యైనఁ బద్మినియుఁ దెల్విఁ దొఱంగి మొగంబు వ్రాల్చె నే
మరు దిది జీవితేశుఁడు పరానుగతుం డయి పోవఁ జూచి సుం
దరి మొగ మెత్తి తా నపుడు నాథుని జూడఁగఁ జాలునే భువిన్. 217

ఆ. ప్రథమ యుద్ధదినము బహుజగద్భీషణ, మగుచు రాక్షసులకు సంతకరము
నగుచుఁ గడువ నప్పు డసురులసాహాయ్య, కాంక్ష వచ్చె నంధకారమెలమి.

క. శితికంఠగళచ్ఛాయం, బతిసాంద్రము మహిషకకుదుదంచితధూమ్ర
ద్యుతిసమము [1]విపినభూదా, రతనుచ్ఛవి యగుచుఁ దమము రాజిలె నంతన్.

సీ. పొదరిండ్లలో ఘనీభూత మై తగునట్లు, భవ్యసింధువులందు బాఱునట్లు
భూవివరమ్ములఁ బూరింపఁ దగునట్లు, పర్వతగుహలలోఁ బ్రబలునట్లు
గాఢాంధకారంబు కడువడి నెల్లెడ నావరించెను మఱి యంగనాఘ
కర్ణమహోత్పలకాంతి దత్త్వావలంబనము గల్గిన భంగి, ప్రౌఢదిగ్ద్వి
పమదకజ్జలమందుఁ బరఁగ నేకీభూతమైన చొప్పున [2]శాద్వలాళియందు
తే. బద్ధమైత్రీక మగునట్లు భాస్వదసిస, మూహయష్టుల నాశ్లేషములను బ్రీతిఁ

1 విపినభూదారతనుచ్ఛవి=అడవిపందియొక్క దేహకాంతిగలది. 2 శాద్వలాళియందున్=లేఁతపచ్చికలుగల ప్రదేశములయందు.

జేయువిధమున నభివృద్ధిఁ • జెందె నప్పు, డంధకారంబు క్రమముగ • ననదృశగతి.

తే. మఱియు శ్యామఘనారామ • మండలముల, యందు గుప్తప్రవిష్టమౌ • నట్లుగాఁగ వృద్ధిఁ గాంచుచుఁ దగఁ బ్రస • రించె నప్పు, డెల్ల యెడలను జీఁకటు • లుల్లసిల్ల.

క. అరుదుగ రాత్రి వధూటీ, పరనీలసుకంచుకప్ర • భాసముతిమిర స్ఫురణాచ్ఛాదనవిరహిత, ధరణీతల మెచట నైనఁ • దగులదు చూడ్కిన్. 222

ఆ. రక్కసులకు బలము • రాత్రియం దభివృద్ధి
నొందు వారి మాయ • లొప్పునందుఁ
గాన సర్వసైన్య • కలితుఁడై నవిషంగుఁ
డమితబలుఁడు చనియె • ననికి వేడ్క. 223

సీ. ధాతోగ్రఖడ్గల • తాకాంతివర్ధిష్ణు తిమిరరోచులు దమ • నముఖదైత్య
సైన్యాధినాథులు • శ్యామకంకటముల శ్యామలోష్ణీషాళి • శ్యామవర్ణ
పరికరంబులఁ దాల్చి • బహుళాంధకారైక్యతను బొందినట్టి భం • గిని విషంగు
ననుసరించిరి విషం • గాహ్వయుండును గూటసమరంబునను మహే • శ్వరి జయింప

తే. మేఘడంబరనామమై • మేదురంబు
నైన కంకటమును వక్ష • మందుఁ దాల్చి
శ్యామకంచుకముఖముల • సమరవిజయ
కాంక్షచేఁ దాల్చి చనియెను • గదనములకు. 224

క. ఘనదుందుభిపణవానక, నినదము నొక్కింత లేక • [1]నివృతబలము ల
ట్లనురూపభంగి రాఁ బర, జనులకుఁ గనరానియట్టి • సరణిం జనియెన్. 225

వ. మఱియును గుప్తాకారుండును, [2]నిష్కోశీకృతఖడ్గాయుధుండును నై పశ్చిమాభిముఖంబుగాఁ బోవుచున్న లలితాసైన్యంబు నుత్తరమార్గంబుచే నావరించి పూర్వభాగంబునొంది నిట్టూర్పునైనను విడువక సావధానంబుగా సైన్యంబులు వెంటరాఁ బార్ష్ణిగ్రాహంబుకొఱకు విషంగాసురుండు నడచి శూన్యకపురప్రాగ్భాగంబునుండి మందపదక్రముండై లలితాసైన్యంబును దనసైన్యంబులకుఁ జూపుచుఁ గవచచ్ఛన్నవిగ్రహుండై యగ్రభాగంబున. 226

తే. మేరుమందరసదృశమై • భూరిశక్తి, పరివృతం బయి భాస్కర • ప్రభలు వోలె
స్వీయకాంతులు చెలువార • విమల మగుచు, నలరు శ్రీచక్రరాజశ • తాంగకంబు.

---

1 నివృతబలములు=నలుప్రక్కల చుట్టఁబడిన బలములు. 2 నిష్కోశీకృతఖడ్గాయుధుండు= ఒఱలేకుండఁ జేయఁబడిన ఖడ్గమును నాయుధముగలవాఁడు.

క. కనుఁగొని యాస్యందనమున, ఘనముక్తాచ్ఛత్రవరము • కమనీయం బై
తనరఁగఁ గాంచి యనంతర,మున దాని కథస్థ్సలమున • ముగ్ధ నొకతుకన్.

మ. కనియెన్ భానుసహస్రకాంతిసదృశాం•గస్ఫారభాభాసురన్
మునివర్యార్చితఁ బశ్చిమాభిముఖునుం • బూజ్యాంఘ్రిపంకేరుహన్
వనజాతాక్షి సమస్తశక్తివరసం•భావ్యోరుపార్శ్వద్వయిన్
ఘనతూణీరధనుర్ధరన్ రణలస•త్కోటూహలన్ శంకరిన్. 229

ఆ. ముందుఁ బోవు సైన్య•మును గాంచి హర్షించు, చున్న లలితచూడ•నొప్పు దుష్ట
బుద్ధియా విషంగుఁ • డుద్ధతిఁ బైకొని, పట్టుకొని దలంచి • బరవసమున. 230

వ. లలితారథంబు పృష్ఠవంశంబు నాక్రమింప సైనికుల నియోగించిన నందున్న యణిమాదిపరివారశక్తిసైన్యంబును బాణంబుల నొప్పించి యంధకారగతులై యదృశ్యమూర్తులై రక్కసులు పరాక్రమింప శ్రీచక్రస్యందన నవమపర్వస్థితాణిమాది దేవతలు కలంగి సంరంభంబున. 231

సీ. పట్టసద్రుఘణతీ•వ్రకులిశభిండివాలాదులఁ గొని యసు•రాళి వేగ
మర్దింపఁ జొచ్చిన • మానినీతతులకుఁ గనఁబడకుండ రా•క్కసులు ఘోర
బాణముల్ శస్త్రముల్•పట్టసాదులు పూని నొప్పింప మానినుల్ • నొచ్చి రంత
నాకస్మికాయోధ•నాయతోత్సాహవిపర్యస్తశస్త్రసం•పాత లగుచు

తే. క్షోభ మొందియు ధ్వాంతౌఘ•గూఢరూప, శస్త్రకంకటము గురాక్ష•సప్రకాండ
మసదృశంబుగ వైచెడు • నట్టి బాణ, తతులచే నొచ్చి మొఱలిడి•రతివ లపుడు.

క. సుమహితపర్వములను నీ, క్రమమున యోగినులు భీతిఁ • గాంచి మొఱలిడన్
మమతచెలువార విని వేఁగమ దానవునక్రమంబు • గనుఁగొని కినుకన్. 233

చ. శరములు చాపమున్ వెలుఁగఁ • జయ్యన యుద్ధము సేయఁ బూన నా
ఖరదనుజుం డవార్యభుజ•గర్వము మీఱఁగఁ బోరుచుండె నీ
కరణిమహోగ్రయుద్ధ మిటఁ • గ్రాలుచు నుండఁగఁ జండవిక్రమ
స్ఫురణము పొంగ భండుఁ డట • శూరుని నక్కుటిలాక్షు దుర్మదున్. 234

వ. లలితాసైన్యంబును మార్కొని నిలువరింపం బంచి దశాక్షౌహిణులతోఁగూడి పోవ ననుజ్ఞ నిచ్చుటయు నాతండు సైన్యంబులతోఁ జని శ్రీచక్రక్షోభంబుఁ గాంచి సహాయార్థమై చన నుద్యోగించియున్న సైన్యంబుల మార్కొని నిలువరించి మహారణంబు గావించె నిట్లిరుదెఱంగుల మహోగ్రయుద్ధంబు చెల్లుచుండె. రాత్రియందు దానవులకు బల శౌర్యంబు లభివృద్ధి నొందుటచేఁ బరాక్రమంబున నొప్పించుచుండిరి. అట విషంగుండు సాహసంబున విజృంభించి.

చ. శరములు నస్త్రశస్త్రములు • శక్తులు తోమరభిండివాలముల్
వరుసగ నంతరంబు కను•పట్టఁగనీయక వారిధార ల
ట్లరుదుగ వారిపై నిగుడు•నట్లుగఁ జేసిన నాశరంబులన్
[1]ధరము వనావళీనిబిడి•తం బగు పోల్కి జెలంగె నయ్యెడన్. 236

తే. మఱియు నారక్కసుం డభి•మాన మొప్పఁ
బర్వముల నాక్రమించి య•వార్యశరము
చాపమునఁ గూర్చి శ్రీమహా•చక్రవర్తి
తాలవృంతంబుఁ దెగ నేసె • లీల పోలె. 237

సీ. [2]అత్యాహితుం డైన•యవ్విషంగునిచేతఁ దాలవృంతము తెగి•ధరణిఁ బడుట
నారసి యతిభీతి • నచ్చటి కామేశ్వరీముఖాద్భుతనిత్య•లామహోగ్ర
కృత్యంబు నారసి • కృత్రిమదానవు దుర్వారగర్వంబు • తోలఁగునట్లు
భ్రూకుటియుక్తమా • భూతనాథునిపత్ని వదనాంబుజముఁ గాంచి • పౌరుషంబు
తే. లట్టి పైకొనఁ గాలాన•లాభిదీప్త, లైన నిత్యలు తిథివిగ్ర•హాలు నితాంత
కోపసంయుక్త లై వేగ • శ్రీపరాంబ, నిట్లు వేఁడిరి యుద్రేక•వృత్తి తనర. 238

వ. శ్రీదేవీ! యుష్మత్ప్రేషితచమూవారంబు దండినీమంత్రిణీపరిపాలితం బగుటఁ గాంచి మాయాచ్ఛద్మపరాయణు లగు దుష్టదానవులు భయపెట్టుటకుఁ గూటయుద్ధంబునఁ బార్ష్ణిగ్రహణపరాయణు లై రథవర్యంబును బాధింపఁ జొచ్చిరి. కావునఁ దిమిరసంఛన్నమూర్తు లగు దానవులదర్పంబు క్షణమాత్రంబున నుపశమింపఁజేసెద మీాక్షింపుము. వహ్నివాసినియు జ్వాలామాలినియు నను నీయిరువురయుద్ధంబు రాక్షసులు సహింతురుగాక, నిమిషమాత్రంబునఁ బార్ష్ణిగ్రాహప్రవర్తనులగు దుష్టులదోర్గర్వంబు నడంచి వత్తురు. కావున ననుజ్ఞ దయచేయుఁ డని కృతాంజలిపుట లై ప్రార్థింప సుస్మితపూర్వకంబుగా నట్లే చనుం డని యనుజ్ఞ యొసంగినఁ జని రందు మహాకామేశ్వరీనిత్య కుండలీకృతకార్ముక యై బాలారుణసంకాశం బగు ముఖంబు క్రోధంబున ద్విగుణితారుణకాంతి యై కనుపట్టుచుండ రాక్షసునితో ని ట్లనియె. 239

శా. ఓరీ పాపమతీ! నిశార్ధమున నే•మోమాయచే సంగరం
బేరీతిన్ వడిఁ జేయఁ బూనితివె దు•ర్వృత్తాత్మ! నీమాయ మ
ద్భూరిప్రోద్ధతబాణజాలములచేఁ • బోకార్చెద న్నిల్వరా.
క్రూరాత్మా! యిఁక నిన్నుఁ గాల్చు సతత•క్రూరాస్త్రివహ్నుల్ గడున్.

1 ధరము=పర్వతము. 2 అత్యాహితుండు=మహాభయంకరుఁడు.

చ. అని యదలించి యక్షయశ • రాళిలసద్ఘనతూణ మొప్ప న
వ్వనరుహనేత్ర కోపమున • భాసిలు నొక్కశరంబు యష్టితోఁ
బెనఁగ నమర్చి స్యందనము • వేగమ డిగ్గి స్వకీయనిత్య లె
ల్లను గొలువంగ నేగెను వి•లాసము మీఱ రణంబు చేయఁగన్. 241

వ. ఆ కామేశ్వరీనిత్యతోడ భగమాలినియు, జ్వాలామాలినియు, వహ్నివాసినియు, సజ్యకార్ముకహస్తలై విజృంభించి రయ్యవసరంబున దానవులు ప్రకాశశరీరులై మహాకోపయుక్తులై మార్కొనినఁ గామేశ్వర్యాదిపంచదశనిత్యలును సాయుధపాణులై విజృంభించి సింహనాదంబులు దిక్తటంబులు వగులఁ జేయ మార్కొని రప్పు డిరుతెఱంగులవారికిని సందడి కయ్యం బయ్యె నయ్యవసరంబున. 242

సీ. మందరక్షోభిత•మహితపాథోరాశి వేల్లదుద్యద్భంగ•పృథునినాద
భర్మకంకణజాల•భాసమానంబులై బాహువు లొప్ప న•ప్పద్మముఖులు
సాయుధపాణులై • యాకృష్యమాణకోదండలై యుద్ధ ము•ద్ధతముగాఁగ
హామద్వయావధి•గా మహాక్రోధంబు మెఱయఁగ వారిని • మీఱి నిత్య
తే. లుగ్రశరముల దనుజుల • నుక్కణంచి, సైన్యములఁ జంపి రప్పుడు•సరభసమున
దమనుఁ గామేశి వధియించె•దనుజవరుని, దీర్ఘజిహ్వుని భగమాల•దెగ్గఁ జేసె.

సీ. హులుంచేకదానవు • హులుమముల్లకాఖ్య నిత్యక్లిన్నభేరుండ•దండధరుని
వీటికిఁ బంపిరి • వీరుఁ గల్కను వహ్నివాసిని వధియించె • వాఁడిమెఱయ
వజ్రేశ్వరియుఁ గల్కి•వాహనుఁ బుల్కసు శివదూతియును జంపి • చెలఁగి రిట్లు
పుండ్రకేతుని మహా•భుజబలుఁ ద్వరితాంబ ప్రమందఁజేసెను గుల•సుందరియును
జండబాహుని భుజో•ద్దండుఁ గుక్కురదైత్యు వధియించె నవ్వల•బాహుశక్తి
తే. విజయ జంభను ప్రమందించె • విమతు జంబు, కాతు దానవవీరుని • నని వధించి
మించె నీలపతాకయు • మిగిలి తీక్ష్ణ, శృంగుఁ జంపెను శ్రీసర్వ•మంగళయును.

వ. జ్వాలామాలినియుఁ ద్రికంటకు నూర్ధ్వలోకంబున కనిపె. దుశ్శీలుం డగు చంద్రగుప్తుని చిత్రాఖ్యనిత్య వధించె. ఇవ్విధంబున సేనానాథులందఱు ప్రమందుటయు విషంగుండు బహురోషంబున యామావశిష్ట యగు నిశయందు ఘటికాద్వయంబు నిత్యలతో యుద్ధంబుచేసి తత్సాహసంబు భరింపరామి నెఱింగి యంతలోఁ గామేశ్వరీ కరాకృష్టనిశితచాపంబువలన నావిర్భవించిన బాణంబులచే భిన్నమర్మస్థలుం డై విహ్వలాశయుం డై హతశేషులంగూడి పలాయితుం డయ్యె. కుంభసంభవా! ఆయుద్ధంబునఁ జావని దైత్యవీరుండు విషంగుం

డొక్కరుండె. ఇతండు కాలదండసదృశం బగు దండనాయికశరంబునం జావం
గలవాం డగుటం జావం డయ్యె నయ్యవసరంబున. 245

చ. బలభుజశౌర్యము ల్గలిగి • భామల గోడె విషంగదానవుం
డిల విధిపంపు దాంటుటకు • నెవ్వండు శక్తుం డటంచు దోష తాం
గలంగిన చిత్తమొప్పంగ ని•కామముదంబును బాసి యెంతయుం
దెల తెలవోయె నన్నగతి • నిర్మల మయ్యె నభంబు చూడంగన్. 246

క. దోషయందుం జెలంగి•దోషాచరులు భామ,లను వధింపంబూని•యును బరేశీ
కోపవహ్నిశిఖలం • గూలి రన్నదమున, దిగ్వధూటి యట్లె • తేజరిల్లె. 247

వ. అప్పుడు రణంబు సేయంజాలక పాఱుచున్న దానవుల ననుసరించి పోయి వధిం
చుట రణధర్మంబు కాదని కామేశ్వర్యాది నిత్యలెల్ల మరలి దైత్యశస్త్రాస్త్ర
వ్రణస్యందిశోణితప్లుతాంగు లై లలితాసాన్నిధ్యంబున కరిగిరి. వారలంగాంచి
లలిత సంతోషస్వాంత యయ్యె ననిహయగ్రీవుండు చెప్పి కుంభసంభవుం గాంచి.

భండపుత్త్రులు పొలియుట.

తే. కడంగి యక్షోహిణీశత•కంబుం గూడి, యనికిం జని కుటిలాక్షుండు•హరిణనేత్ర
లెల్ల నవ్వంగ దండేశి•పృథులబాణ, పాతమునకోడి జవమునం • బాఱె నకట!

సీ. అక్షౌహిణులు పది • యాదండనాథచేం బొలిసెం బ్రాజ్ఞిశి నను•భూరితాప
కరమైన యావార్త•కర్ణంబులం బడ సంక్షోభ మొందె నా•చండభండుం
డంత నారాత్రియం • [1]దతికపటప్రవిదారణంబును జేసి • దానవౌఘ
మెంతయు నొప్పించి • రీశ్వరిసేనల ననుమాట వినన దం•డినియు మంత్రి

తే. ణియును నిర్వేద మొంది యా•నిఖిలలోక, జనని కెంతయుం గష్టంబు•దనుజగణము
వలనంగలిగెనుదుష్టబు•ద్ధులముగాక,దూరముగ సైన్యమునుగొని•తొలంగితిమిట.

తే. చక్రరాజరథముం•జయ్యనం గాచుచు, నున్నవారిం గొనుచు • నిన్న మనము
వచ్చుటను దురాత్ముం • డెచ్చటం గాంచెనో, పరిభవింపం బనిచె • బలమునెల్ల.

క. అచ్చటివార్త లెవ్వియో యెఱుంగవలయు శ్రీదేవి యుద్ధంబు గావించె నని
తోంచుచున్నది. పరివారశక్తులు యుద్ధసన్నద్ధ లై యుండిరి. ఇంతయేల? వే
గంబ చని రాత్రివృత్తాంతం బెఱుంగవలయు. మహాదేవి యాగ్రహపరవశ
కాకుండ మన మరుగుద మని శంకాకులస్వాంత లై దండనాథాదులు శ్యామ
లాంబను బురస్కరించుకొని లలితాపరిసరమునకుం జని యచ్చట సూర్యోద

1 అతికపట...ణంబును = మిక్కిలిమాయాయుద్ధము.

యం బగుటయు శక్తిసమూహంబు ప్రాక్తనంబుగాఁ గూడుకొని యెప్పటియట్ల పర్వక్రమంబున నివసించి రాసమయంబున దండినిమంత్రిణులు యానంబులు డిగ్గి తమతమ పరివారంబు నందుండ నియోగించి చక్రరాజరథం బెక్కి క్రమంబుగా నవపర్వముల నతిక్రమించి మహాదేవిం గాంచి సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి యి ట్లనిరి. 252

మాలినీవృత్తము. జనని సకలలోక•స్వామినీ శ్రీపరాంబా
దనుజులు నడిరేయిన్ • దర్పశౌర్యంబు లొప్పన్
ఘనతరశుభరీతిం • గాంచిలు శ్రీచక్రవర్యం
బును దలపడి ఘోరం • బూనికన్ నేతెంచి రాహా. 253

సీ. కలిగెఁ బ్రమోదంబు • కలవిలపాటొందె దివ్యచిత్తం బని • తెలిసె నిప్పు
డరుదెంచితిమి దాన•వావళి కూటయుద్ధంబునఁ గెల్వంగఁ • దలఁచె నేమొ
భండుండు మాయావి•చండశాసనుఁ డోట జయకాంక్షచే నిట్టి • సంగరంబుఁ
జేయంగఁ బంచెను • సేనల నెల్ల దైవాధీనమున నంబ • యసురవరుల
తే. బాణజాలంబు శ్రీరథ•వరముపైని, బడక యుండఁగ వారలు • పాఱి రకట!
భవదుదారపదాంబుసం•భవము నమ్మి, యున్న వారము సంతోష • ముప్పతిల్ల.

చ. దితిజులు మాయవన్ని యతి•తీవ్రపరాక్రమ మెల్లఁ జూపి శ
క్తితతుల యుద్ధభూమిఁ జెడఁ • గృత్యము నల్పుదు రట్టు లోట వే
జతనము మీఱ దివ్యరథ•చక్రము నిర్భయరీతిఁ బొల్చు న
వ్వితమునఁ గాచు టొప్పు నరి•వీరుల శౌర్యము వ్యర్థతం గనన్. 255

వ. కావున మహేంద్రపర్వతదక్షిణభాగంబున యోజనశతపరిమితవిస్తారం బగు శిబిరంబుఁ గట్టించి వహ్నిప్రాకారవలయితంబుగా నొనరించి తన్మధ్యభాగంబున మనసైన్యంబు నెల్ల నిలుపవలయు. వహ్నిప్రాకారదక్షిణభాగంబున ద్వారంబు నిర్మించి తత్సంరక్షణార్థము దనేకపరివారదేవతల నుద్యతాయుధపాణుల నిలుపవలయు. శూన్యకనగరంబు దక్షిణభాగంబున నుండుఁ గావున న ట్లొనరించి ద్వారసంరక్షకదేవత లాలస్యనిద్రావిరహిత లై యుండున ట్లాజ్ఞాపింపవలయు అట్లైన సంధ్యార్ధరాత్రాద్యనియతకాలంబులయందును గూడ శత్రుభయంబు లేకయుండు. అ ట్లొనరింపకున్న మాయావిశారదు లతిక్రూరులు, దురాశయులును నగు దనుజులు[1] పశ్యతోహరులభంగి నస్మద్బలంబుల నాక్రమింతు రనిన విని శుచిదంతకాంతులు ముక్తావర్షంబుఁ గురియ లలిత యి ట్లనియె. 256

---

1 పశ్యతోహరులు=చూచుచుండఁగా దొంగిలించువారు.

ఉ. సారమనీషలార! మదిఁ • జారుతరం బగు మంత్ర మిట్లు మీ
రారసి చెప్పు టొప్పు మది • నారయ యుక్త మటంచుఁ దోఁచె నేఁ
డోరయ మొప్పఁ జేయుఁ డట • నుద్ధతబాధ లడంగు నింక నీ
దారియె నీతిమార్గము ని • తాంతసుబుద్ధివిచారితంబె యౌ. 257

చ. తనపురి ముందుగాఁ బహుళ • తంత్రము వన్నుచు నెల్ల దివ్యసా
ధనములఁ గాచికొంచు మఱి • దస్యుపురంబును బల్మిఁ బట్టఁ గా
ననఘులు కాంతు సేయుదు ర • హార్యపరాక్రమ మొప్ప నెవ్విధిన్
దనుజులు చత్తు రవ్విధము • దప్పక యోచనచేయుఁగాఁ దగున్. 258

క. అని వార లూరడిలఁగా, ఘనభణితిం బలికి తంత్ర • కార్యములెల్లం
దనమది నారసి సైన్యము, దనుజులు చొరరాని యట్టి • తంత్రముచేయన్. 259

క. లీల మెలంగెడు జ్వాలా, మాలిని లలిఁ బిలిచి పలికె • మానిని! యగ్ని
జ్వాలాకృతి వౌటను నే, వేళను మనబలము నసుర • వీరులబాధల్. 260

తే. పొందకుండఁగఁ గావుమీ • పూవుఁబోఁడి, యోజనశతాయతంబును • యోజనముల
ముప్పదింటను బొడవునై • యొప్పునట్లు, నగ్నిసాలంబుగట్టి సై • న్యములజుట్టి.

క. నిలువుము యోజనవిస్తృతి, గలిగిన ద్వారంబు విడిచి • క్రవ్యాదవరుల్
గలఁగి పరుగెత్తునట్లుగ, జ్వలదుద్వృత్తనువుఁ దాల్చి • భాసిల్లు మిఁకన్. 262

క. పలికి యిటు లమ్మహేంద్రా, చలమున నుత్తరపుదిక్కు • సైన్యము నెల్లన్
లలిత పయనంబుచేసిన, బలమెల్లను విడిసె జిష్ణు • పర్వతసీమన్. 263

సీ. అంతట లలితాంబి • కాజ్ఞఁ జతుర్దశీతిథిరూపయౌ నిత్య • దేవి పాద
పద్మంబులకు మ్రొక్కి • పర్వతోత్తరపుభాగంబునఁ గుండలీ • కారమట్లు
జ్వాలామయం బగు • సాలరూపంబున నావరించుచు మఱి • యంతరిక్ష
వలయ జంఘాలస • జ్జ్వాలా సమూహాకులాకృతి యై పోల్చె • నంత నందు

తే. శ్యామలాదండనాయికా • సైన్యములును, మహితపరివారదేవతా • మండలంబుఁ
దద్బలంబులు నుజ్జ్వల • ద్దహనసాల, మట్టె చొచ్చెను సంతోష • మతిశయింప

క. వారాహియు శ్రీదేవీ, చారుతరస్యందనంబు • సాలము నడుమన్
దారుణభంగిగ నిలిపి యు, దారస్వస్యందనంబుఁ • దద్ద్వారమునన్. 265

తే. దక్షిణంబున శ్యామార • థంబు వెనుక
సంపదీశ్వరి భాసుర • స్యందనంబు
ముందు మెఱయు హయానన • స్యందనంబు
నిలుచునట్లుగ నియమించె • నేర్పు మెఱయ. 266

క. సాహసమున నిరువది య,క్షౌహిణులను ద్వారమందు • సాంద్రాయుధ లై
బాహుబలంబున మెఱయ వ,రాహానన నిలిపి మఱియుఁ • బ్రౌఢిమతోఁ దర్.

ఉ. స్తంభిని నాఁ జెలంగు విల•సద్భుజదర్పమహోగ్రమూర్తి యై
జృంభణ మొప్పఁ బొల్పు సర•సీరుహనేత్రను ద్వారసీమలోఁ
జంభవిరోధివైరిగణ•సాహస మెల్ల నడంప నిల్పె నా
స్తంభినియుఁ సమగ్రభుజ•శౌర్యము పొంగఁగ నిల్చె వాకిటన్. 268

తే. దండినికి విఘ్నదేవియే•తరుణి యగునో, యట్టి స్తంభిని కుంతైక•హస్తయగుచుఁ
బొలిచె నవ్విధి నిలిచిరి • పొలఁతు లెల్లఁ,గర్బరోదగ్రపురమును • గాల్పఁబూని.

వ. ఆసమయంబున. 270

చ. తరుణుల నర్ధరాత్రమున • ధర్మవిరుద్ధముగాఁగఁ గూటసం
గరమునఁ గెల్వనెంచిన ని•కామదురాత్ముల మాని దేవభీ
కరులను దుష్టరాక్షసులఁ • గాల్చెద నే నని సూర్యుఁ డక్షు లు
ద్ధురగతి నెఱ్ఱచేసె ననఁ • దూర్పునఁ దోఁచెను రక్తవిద్యుతుల్. 271

చ. దనుజులు రాత్రియం దధిక•దర్పితు లై ప్రధనంబుఁ జేసి ప
ద్మినుల జయింపఁ బూని యతి•తీక్ష్ణతదుద్ధతి కోడి పాఱె రొ
య్యెన ననువార్తఁ బక్షితతి•హారిరవంబుల విన్నరీతిఁ బ
ద్మిని కుతుకంబు మీఱ నటు•తేఱి కనుంగొనె విప్పి వక్త్రిముల్. 272

సీ. వేదప్రతానసీ•విపులాలవాలంబు, కర్మసంతతిమూల•కారణంబు
ధ్వాంతసందోహవి•ధ్వంసనోదగ్రంబు, మదనమోహావేశ•మారణంబు
కుముదినీవనపంక్తి•గూఢకుఠారంబు, శీతలవాతవి•చ్ఛేదకంబు
పంకేజవికసన•ప్రౌఢసాహాయ్యంబు, చక్రదంపతిమిథ•సౌఖ్యదంబు

తే. భూసురస్నానజపహోమ•భూరిసుకృత
కార్యకరణైకమూలంబు • కాంక్షితార్థ
దంబు, విమలంబు, సుకృతప్ర•దంబు పూర్వ
మహితగిరి నెక్కె మార్తండ•మండలంబు. 273

వ. ఇవ్విధంబున సూర్యోదయం బగుటయు దనుజసైనికుల నడంచు కుతూహలం
బు మనంబులఁ జెలంగ శక్తిసైన్యంబులు విజృంభించి. 274

చ. కిలకిలశబ్ద మొప్ప రణ•కృత్యముఁ బూని వరాహవక్త్రిసే
నలు రభసంబునన్ దరని•నాదము దిక్కులఁ బిక్కటిల్ల ను
జ్వలదహనార్చులం బొలుచు • సాలము దక్షిణదిక్కునుండి వె

ల్వడియెను భండుఁ డిచ్చటి వి♦లాసము కర్ణములందుఁ జొచ్చినన్. 275

తామరసవృ. అనలు ముఖంబున ♦ నాజ్యము సోఁకన్
ఘనశిఖలన్ వెసఁ ♦ గ్రాలెడురీతిన్
దనవదనంబున ♦ ధారుణకోపం
బను శిఖి తోఁపఁగ ♦ నాతఁడు వల్కెన్. 276

ఉ. కంటిరె మంత్రులార! భుజ♦గర్వసమగ్రులు శత్రులోకహృ
త్కంటకు లయ్యు దానవులు ♦ క్రౌర్యము తోఁపఁగఁ బోయి రాత్రి వా
ల్గంటులచేత నొచ్చి తముఁ ♦ గామిను లార్భటి వెంటనంట రా
వింటి నిదేమి చిత్రమొకో ♦ వేధతలం పెటులొక్కొ యక్కటా!. 277

తే. అని విషంగవిశుక్రుల ♦ నాత్మజులను, గాంచి వృత్తాంతమెల్లను ♦ గారవమునఁ
దెలిపి యిట్లని పల్కెను ♦ దీర్ణవృత్తి, భండనము సేసి విజయంబుఁ ♦ బడయురీతి.

సీ. పూని చతుర్బాహు♦ముఖులు మత్ప్రియపుత్త్రు లంబుధిగంభీరు ♦ లతిబలాఢ్యు
లొక్కట గుమిగూడి♦యుక్కుమీఱెడు సేనవెంట రాఁబోయి వా♦ల్గంటులడర
మార్కొని వారల ♦ మ్రిందించిరాఁ జను ననుచుఁ బుత్త్రులఁ బంపె♦నాతురమునఁ
కుంభసంభవ! వారు ♦ కూటసంగరవిదు లభినవోజ్జ్వలశక్తు ♦ లతిసురూపు

తే. లట్లు తమతండ్రి పనిచిన♦నతని పాద,పద్మములభక్తి ధ్యానించి♦బవరమునకుఁ
జనిరి వారలు ముప్పండ్రు♦చండసాయ,కాతిభీషణకోదండ♦హస్తు లగుచు. 279

వ. వా రెవ్వరెవ్వ రంటివేని చతుర్బాహు, కోలాక్ష, చతుశ్శిరో, వజ్రఘోష, షోర్ధ్వకేశ, మహామాయ, మహాహను, మఘశత్రు, మహాస్కంది, సింహఘోష, సురాళ, కాంధక, సింధునేత్ర, కృపక, కృపలోచన, గుహాక్ష, గండల, చండవర్మ, యమాంతక, లండన, పండసేన, పురుజి, త్పూర్వమారక, స్వర్గశత్రు, స్వర్గబల, దుర్గాఖ్య, స్వర్గకంట, కాతిమాయ, బృహన్మ, యోషమాయులను నామంబుల నొప్పుదురు. తండ్రియగు భండాసురునితో సమంబగు దోర్వీర్యసంపన్నులు. తండ్రిచే ననుజ్ఞ వడయునప్పుడు పుత్త్రులం బ్రసన్నదృష్టి నవలోకించి సగౌరవంబుగా భండుం డిట్లనియె. 280

ఉ. దానవవర్యులార! రణ♦దర్పసమగ్రుఁడ నైన నాకు స
త్సూనులు మీసహాయమున ♦ శోభిలి కాదె సురాలయంబు స్వా
ధీనముగాఁగఁ గొంటి మును ♦ తీక్ష్ణభవద్భుజశక్తిచేత నిం
ద్రానలముఖ్యు లోడిరి ర♦ణాంగణమందునఁ బల్కు లేటికిన్. 281

తే. మీ రెఱుంగనిశస్త్రముల్ ♦ మీకుఁ దెలియ, రానిమంత్రంబులును లేవు♦గాననిప్డు

కలిగినట్టి కులభ్రంశ•కమును బోవఁ, జేసి జయమందుఁ డీ యని•స్మితముతోఁప.

చ. మమతవచించె నిట్టు లభి•మానము పొంగఁగ వారితోడ నా
ప్రమద, మనోహరాంగరుచి•భాసుర, కూటరణప్రచార, దు
ష్టమథనదక్ష, దుర్లలిత•శౌర్యసమగ్ర, సమస్తశక్తివా
రమహిత యై వెలుంగు రణ•రంగమునం దసహాయశూర యై. 283

సీ. స్వసమానరూపవై•భవ లైనకాంతలతోడ యుద్ధంబున • దుర్మదాది
దనుజులహింసించె • దానవు లలరంగ జ్వలితాయుధార్చుల• భామ నట్టె
మార్కొనిసురలెల్ల • మ్రాన్పడదహియించి మరలుఁడు మిమ్మొక్క•మానినీవ
ధంబుకై పంపుట • తగదైన నీయొక్కకీర్తి విపర్యయో•క్తిని గ్రహింపుఁ

ఆ. దన్నలార! విధియు • ననుకూలుఁ డగు మఱి, శౌర్యకీర్తు లలర • సంగరంబు
చేయు సరణి లేదె • చెప్పంగవలసె మీ, కిట్టి హీనవాక్య • మిప్పు డకట! 284

తే. ఐన నేమాయె విజయంబు•నంది మీర, లరుగుదెంచుటయే నాకు•యశ మటంచు
దనుజుఁ డక్షౌహిణీద్విశ•తంబుతోడ, వారలను బంపె విజయైక•వాంఛఁ బూని.

క. ఆసేనకుఁ దిలకాయితు, లై సముదగ్రాయుధముల • నలరుచు భ్రుకుటి
త్రాసితదేవత లై చని, రీసున భండాత్మజన్ము • లెల్లరు ననికిన్. 286

క. ఆతఱి భూకంపము ను,త్పాతంబులు నవనిఁ దనరె; • పౌరతరుణు ల
య్యాతుతనూజులపైఁ గడుఁ, బ్రీతిగ లాజలను జల్లి • ప్రియతమభణితిన్. 287

క. నుతియించిరి నటగాయక, వితతియుఁ గీర్తించె నంత • వెలఁదులు శుభమా
గతి మంగళనీరాజన, మతిశయముగ నిచ్చి పంప • నానందమునన్. 288

తే. ధరణి భేదింపఁబడిన చం•దమున నభము, శోష మొందినవిధమున • సారిదిజలధి
ఘూర్ణమానంబు నౌరీతిఁ•గుమతులైన, భండతనయులు చనునప్డు•పరఁగె జగతి.

వ. ఇవ్విధంబున ద్విశత్యక్షౌహిణులంగూడి క్రోధోద్యద్భ్రుకుటీకూరనిటలభాగు లై భండసూనులగు చతుర్బాహుప్రముఖులు సంగరకాంక్షఁ బోవుచుండి.

చ. అని మొన శక్తిసైన్యతతి•నంతయు మ్రింగుదు మొక్కసారి య
వ్వనితల శస్త్రజాలముల • బాహుబలంబున నుగ్గొనర్తు మొ
య్యన శుచిసాలమార్పుదము • హారితసూరుచి నొప్పుచున్న భా
మిని లలితన్ దురాశయను • మిక్కిలి నొవ్వఁగఁ జేసి యొంతయున్. 291

తే. భండుఁ డుప్పొంగఁ జెఱసాల•బంది గొందు, మనుచు నన్యోన్యభాషల•నగ్నిసాల
సన్నిధిని జేరి సింహని•స్వనము మోద, మొప్పఁజేసిరి శౌర్యంబు • లుప్పతిల్ల.

వ. ఆసింహనాదంబున బ్రహ్మాండంబు లెల్ల భేదిల్లె వారిదంబు లార్భటించె నను

భూతపూర్వం బగు నాశబ్దంబున శక్తి వ్రజంబుల శ్రవణంబులు మనంబులును క్షోభించె నయ్యవసరంబున వివిధోగ్రాయుధసంపాతసమ్మూర్ఛద్వైమానిక చ్ఛటంబగు నక్కలకలం బాకర్ణించి చతుర్బాహుముఖులగు భండపుత్త్రులరుదెంచుట నెఱింగి వారితో సన్నద్ధ యై యుద్ధంబు సేయు కుతూహలంబున లలితాసకటవాసినియు, సమస్తశక్తిచక్రసంపూజ్యయు, విక్రమశాలినియు, లలితాసంకాశాకారయు నగు బాలాదేవి కోపఘూర్ణితమానస యయ్యె. కుంభసంభవా! ఏదేవి సర్వదా నవవర్షయు, సర్వవిద్యానిధియు, బాలారుణ తనుప్రభయు, మహారాజ్ఞీపాదపీఠసంతతసంవాసయు నగు నాబాల భండపుత్త్రులతో సంగరంబు చేయ నెంచి శ్రీదేవితో నిట్లనియె. 293

శా. తల్లీ! భండతనూజు లాహవసము • ద్యత్కౌతుకం బొప్పఁగా
నుల్లోలాస్త్రరుచుల్ వెలుంగ సమరో • ద్యోగంబునన్ వచ్చుటల్
తెల్లం బయ్యెను వారితోడ సనిలోఁ • దెంపొప్పఁ బోరంగ నా
కుల్లాసంబు చెలంగుచున్నయది న • న్నుత్సాహతం బంపుమీ. 294

తే. యుద్ధకండూతిచే నొప్పు • చున్నదాను, బాహువులకిప్డు దుర్దీప్త • భండనమునఁ
దీఁటవాపంగవలయుఁ • బుత్రీత్వమునను, బంపు మోతల్లి నాయందుఁ • బరఁగుప్రేమ.

క. బాలిక నోటను గ్రీడా, లోలత్వము నొందు టెల్ల • లోకజనని! నీ
వాలోచింపుము దురమును, కేళికి ననుఁ బంపు మచటఁ • గ్రీడింతుఁ దమిన్.

క. అన విని పరమేశ్వరి య,వ్వనజాక్షిని గాంచి పల్కె • వత్స మనోజ్ఞాం
గిని నవవర్షకవు ని, న్ననుపుదు నెటు లాహవమున • కిది ఘోరంబౌ. 297

తే. నీవు నాయుధశిక్షను • నిన్న మొన్న, నేకదా పొందితివి నేను • నిన్నువిడిచి
యుండఁజాలను క్షణమైన • నొక్కవృత్తి, వగుటనిను నొంటిగా నంప • నగునెనాకు.

ఉ. శ్యామల, దండనాథ భుజ • శౌర్యవిలాసిని సంపదంబ యు
ద్దామభుజాబలస్ఫురణ • దార్కొని పోరఁగ నున్నవా రయో
కోమలగాత్ర నీవు రణ • కోవిదు లుద్ధతు లుగ్రశౌర్య లో
హోహో మహితాస్త్రు లా దనుజు • లొక్కట మార్కొన నోర్వఁజాలు దే.

క. అని పలుమఱు నిర్బంధించిన బాలయు సంగరంబుఁ • జేసెడు కాంక్షన్
వినయమున వేఁడ లలితయు, ననుమతి యిడి కౌఁగిలించె • నతి దృఢరీతిన్.

సీ. తన ఘనకవచసం • తతిలోన నొక్కటి దివ్యమౌ కవచంబుఁ • దీక్ష్ణశరము
లను మహాచాపంబు • ఘనతమాశీర్వాదకలితంబుగా నిచ్చి • కౌఁగిలించి
పనుపంగ నాబాల • పరమేశి సచ్చాపదండోత్థకర్ణీర • థంబు హంస

వాహనశతయుక్త • భాసమానము నెక్కి సంగరకాంక్షచేఁ జనఁగ దేవ

తే. కిన్నరస్త్రీలుపాడిరి • సన్నుతరథ, పర్వతతిదేవతావళుల్ • ప్రమద మొలయ
సన్నుతించిరి జయశబ్ద•సరణి మెఱయ, వేత్రహస్తలు మాన్పిరి • విపులరవము.

సుగంధివృ. అంతఁ జాపదండ మూని • హస్త మొప్ప బాల య
త్యంతతీక్ష్ణసాయకాళి • నట్టె లస్తకంబునం
బంత మొప్పఁ గూర్చి శక్తి • వారమెల్లఁ గూడ రా
నుంతయేని భీతి లేక • చొచ్చె నారణస్థలిన్. 302

ఉ. అంతయుఁ గాంచి బాల యిటు • లాహవకాంక్ష బెనంగఁ బోయెడిన్
జింత యొకింత లేక రణ•సీమకుఁ బంపెఁ బరేశి యేమొకో
యెంతయుఁ జోద్యమయ్యె నని • యెంచుచు శ్యామలదండనాథయున్
శాంతమనోజ్ఞవాక్యముల • శంకరిపుత్త్రిని బల్కి రివ్విధిన్. 303

తే. తగునె యిటు భర్తృదారిక! • దారుణాహ,వంబుచేయంగఁబోవనె•బ్బంగిననిపె
శ్రీమహారాజ్ఞియనిసేయ•సేనలేదె,మానుమీపూన్కినిఁకనైన•మాయనుమతి.

క. అనుచు నమస్కృతు లొప్పఁగఁ, దను నిలిపెడు శక్తి యుగము•దర్ప్రోక్తులతో
మన మలరఁజేసి చనియెను, దనుజాధములెల్లఁ జూచి • తత్తఱమందన్, 305

క. అనిరుద్ధగమనయై యిటు, చనుచుండిన బాలతోడ • శ్యామలయును దం
డినియును బూన్కి సహాయం, బొనరింపఁగఁ జనిరి పార్శ్వ•యుగ్మమునందున్.

వ. ఇట్లు మంత్రిణియు సేనాధినాథయు నిరుగెలంకుల రా సైన్యంబు సన్నద్ధం బై పృష్ఠభాగంబున నంటిరాఁ గదలి హుతవహునిద్వారంబున వెడలి దనుజసేనలదరిపడిచూడ రణస్థలంబున కరిగి యందున్నభండపుత్త్రిలం గాంచి సింహనాదంబుచేసిన రాక్షసులును గిలకిలార్భటులఁ గవిసి రప్పుడిరుదెఱంగులసైనికులకు సందడి కయ్యంబు సెల్లె. ఆసమయంబున బాల నిజసారథిం గాంచి భండపుత్త్రిలపై రథంబు నడుపుమనుటయు నవ్వనితయుఁ జిత్రగతులు మెఱయ స్యందనంబు నడిపె నంత నచ్చేరువనున్న భండపుత్త్రిలను మార్కొని బాల రోషంబునఁ గుటిలభ్రూకుటివికటభాలభాగ యై బాణవర్షంబు గురిసె నయ్యద్భుతసంగ్రామంబును దేవత లెల్ల విస్మయంబునఁ జూచుచుండి రీవృత్తాంతం బంతయుఁ బ్రతిక్షణంబును లలితకుఁ బరిచారికలు తెలుపుచుండి రంతట శ్యామలావరాహవక్త్రిలాశ్చర్యంబునఁ జూచుచు సహాయంబు చేయ ననవసరంబ యని యూరకుండిరి. ఆసమయంబున బాల యొక్కతయయ్యును భండపు

త్త్రిల కనేకరూపంబుల నొందినట్లు కనఁబడుచు విజృంభించి బాణంబులం గప్పెం. చూచు ఖేచరు లానందసాగరనిమగ్నులై రంత. 307

సీ. శ్యామలాదండినులాశ్చర్య మందంగ ద్వైతీయదినమున • బాల చెలఁగి
యొక్క_తె యనిసేయ•నూహించి యస్త్రాళి మోచనంబున భండ•పుత్త్రులెల్లఁ
గంపింప నని సేసి • క్రోలురోషంబున నరుణోత్పలాకృతి • నాస్య మలర
నారాయణాస్త్రంబు • నారిని సంధించి యట్టహాసముతోన • నఖిలశత్త్రు

తే. సేనపై వైవ నయ్యస్త్రి•జృంభణమునఁ
దెగియె నక్షౌహిణీశత • ద్వితయ మట్టి
ఘోరయుద్ధంబుఁ గాంచుచుఁ • గోపఘూర్ణి
తాస్యయై భండపుత్త్రికు • లడరుటయును. 308

క. ఇరుదెఱఁగుల సైనికులకు, గురుతరయుద్ధంబు సెల్లెఁ • గోపంబున భీ
కరగతి ముప్పదిబాణము, లరుదుగ సంధించి తల్లి • నమలమనీషన్. 309

క. ధ్యానించి దేవతలకును, మానవులకును మేలు గలుగ • మత్తులు దైత్యుల్
సేనలతోఁ గూలుదు రీ, మానితబాణమున ననుచు•మదిఁ దలఁచి వెసన్. 310

ఆ. బాణమోచనంబు • ప్రౌఢతఁజేసిన, భండపుత్త్రిశీర్ష•పంక్తిఁ ద్రెంచి
రక్తధారలొలుక • రయమున నబ్బాణ, పంక్తిపోయె దివిజ•పంక్తి పొగడ.

వ. ఇబ్భంగి భండునిపుత్త్రి లొక్క_పెట్టున ముప్పదుండ్రును గూలిన దేవతలు పుష్పవర్షంబులు గురిపించిరి. శ్యామలాదండనాథలు మహాముదంబున బాల నాలింగనంబు జేసిరి. సైన్యమెల్ల నత్యుత్సాహంబున జగత్త్రయంబు కంపింప నార్భటించె. అనంతరంబ బాలాపురస్సరలై శక్తులెల్ల లలితాపరిసరంబున కరిగి వృత్తాంతం బెఱింగింప సంతోషంబునఁ గుమారిఁ గౌఁగిలించి యంకసమాసీనం గావించి కరకమలంబున దేహమెల్ల దడవి మూర్ధాగ్రాణం బొనరించె. హతశేషు లరిగి భండున కవ్వార్తను దెలిపిన నాతండు. 312

## భండాసురుండు విలపించుట.

క. సుతులెల్ల సంగరంబున, హతు లౌట నెఱింగి భండుఁ • డతిశోకాగ్ని
ప్లుతుఁడై కులనాశంబున, కతి సంతప్తుండు నగుచు • నలమట పడుచున్. 313

వ. ఎలుంగు రాల్పడ ని ట్లనియె. 314

సీ. హా పుత్త్రవరులార! • హా మహోదార దోర్దర్పభాసితులార • తండ్రులార
హా మదేకాయత్త•హారిమనఃపద్ములార హా మన్నేత్ర•చారుతరసు

ధాపూరులార సం•తతవంశవర్ధనులార దేవావళి • భూరిగర్వ
నిర్వాపణక్షమ•నియతదోర్దర్పకులార దైత్యాంగనా • లలితదృష్టి

తే. మోహనస్మరులార మీ•మోహనాంగ
ములను జూపరే యొకమాఱు • కలఁగె మనము
న్యాయమే యిది దీనుఁడౌ • నన్నుఁ గన్న
తండ్రి విడనాడి స్వర్గ మొం•దంగ మీకు. 315

తే. మీరు లేకున్న నారాజ్య•మిత్రబంధు, జనులు శోభిల్ల రిదె • నాదు సద్మజాల
మెల్లనుత్తదియైయున్న•దిదియెసభయు, శూన్యమైయున్న దేమొకో•చూడఁజాల.

చ. నను విడనాడి మీర లిటు • నాకము నొందఁగఁ బాడియే కటా!
ఘనభుజశక్తులైన మిము • గాంత యొకర్తు వధించెనే చిరం
తనముగ వచ్చు మత్కులము • నాశన మాయె యకాండ మిట్టులే
మనఁ గల నింక దైవము మ•హాబలవంత మటంచుఁ దోఁచెడిన్. 317

చ. సురపతిఁ దొట్టిదేవతలు • శూరత నొప్పెడు మిమ్ముఁ జూచి సం
గరమును మాని పాఱుదురు • గా మును దేవతలట్టివార లీ
దురమున మిమ్ము మాఱుకొని • తోయజనేత్ర యొకర్తు చంపఁగాఁ
గరము ముదంబు మీఱఁగను • గాంచిరి గా! యిఁక నేమి సేయుదున్. 318

క. కులసంపదలు సుఖంబులు, చెడియెఁ గదా యెప్పుడింక•స్మితవక్త్రములం
జెలఁగుచుఁ గనుఁగొందునొ హా, కలుగునె యెప్పుడైన నట్టి•కలిమియు నాకున్.

తే. పూర్వజన్మంబునందు నేఁ•బూని చేసి, నట్టి సుకృతంబునం గంటి • నయ్యలార
మిమ్ముఁ బుత్త్రులమీరు స్వ•ర్గమ్ముఁ జేర, నిచటఁ జచ్చినవాఁడనే• నేను నిజము.

తే. హతుఁడ నైతి విపన్నుఁడ•నైతి మంద, భాగ్యకలితుండ నైతి నో • భవ్యరూపు
లార యని శోకగద్గదుఁ•డై రయమున, నశ్రువులు రాల నేడ్చుచు•నవనిఁ బడియె.

తే. ముక్తకుంతలుఁ డై యిట్లు•మూర్ఛపోయి, భద్రసింహాసనమునుండి•పడినభండు
గని విశుక్రవిషంగులు • దనుజసైన్య, పాలకుఁడు కుటిలాక్షుండు • బరవసమున.

వ. లేవనెత్తి శీతలోపచారంబులఁ గావించుచుండఁ దెలివినొందినభండునితో
విశుక్రుం డి ట్లనియె. 323

చ. దనుజవరేణ్య! ప్రాకృతుఁడు • ధైర్యము మాని కృశించినట్లు నీ
వును దనయుల్ మహాహవముఁ • బొల్పుగఁ జేసి దివంబు శూరతం
గని సుఖయింప నేడ్చెదవు • కానవొకో యిది శాశ్వతంబు నై
ఘనమయి శూరు లెల్లఁ జనఁ • గాఁ దగు త్రోవని శాస్త్రసంతతిన్. 324



ఆ. దుఃఖ మొందనేల • తొలఁగునే మృత్యువు, సమయ మొదవి నపుడు • చంపకుండ
నొక్క కారణమున • మిక్కిలిశోకంబు గలిగె, వినుము దాని • కారణంబు.

చ. సురపతివహ్నిముఖ్యు లగు • శూరుల నెల్ల మహాహవంబునం
గరశరలాఘవంబు చెలఁ • గఁగ వడి మార్కొని పాఱఁదోలు ను
ద్ధురభుజశౌర్యసారులను • దోయజనేత్ర యొకర్తు దర్పయై
ఖరి వధియించె నన్ననుడి • కర్ణములం బగులంగఁ జేసెడిన్. 326

చ. అని వచియింప నప్పలుకు • లద్దనుజేంద్రుని పుత్త్రిశోక మె
ల్లను వడిఁ బాఱఁదోలి నును • లత్తుకచాయలఁ గన్ను లొప్పఁ జే
సిన దనుజాధిపుండు క్రుధ • చే లయకాలహుతాశనాభుఁడై
యనితరదృష్టపూర్వ మగు • నద్భుతకోపరసంబు పొంగఁగాన్. 327

తే. ఉగ్రయమసన్నిభంబయి • యొప్పుచున్న
ఖడ్గమును ద్రిప్పి తనకన్నుఁ • గవను నిప్పు
లొలుక భండాసురుం డప్పు • డొప్పె విలయ
సమయరుద్రునిబోలి తే • జః ప్రసక్తి. 328

వ. ఇట్లు క్రోధాగ్నిదందహ్యమానహృదయుం డై భండుఁ డిప్పుడ చని యాదు
ష్టాంగనను దిలప్రమాణశకలంబుగాఁ జేసి బంధుజనులం గలిసి సుఖించెద నని
రోషజ్వలద్భుజంగంబువిధంబున నిట్టూర్పు నిగిడించి ఖడ్గంబును ద్రిప్పుచుఁ
బయనం బగుటయు నాతని వారించి దానవేంద్రా! వనితావధార్థ మీ వరుగ
వలయునే మేమ యప్పని నొనర్చి వచ్చెద మని దానవపుంగవు లెల్ల
మఱియును. 329

చ. దితిజవరేణ్య! మీ యనుమ • తిం గని మే మిపు డేగి లోకసం
హాతులను గాల్చువారమన • మానిని యెంత? సముద్రపంక్తి ను
ద్ధతిజలహీన మై యెసఁగ • దర్పము పొంగ నొనర్తు మింకఁ బ
ర్వతముల ద్రింగఁ జాలుదుము • వాసవముఖ్యులమాట యేమిఁకన్. 330

సీ. తలక్రిందుగా లోక • తతుల నొనర్తుము స్వర్గంబు భేదించి • వత్తు మిప్పు
డాజ్ఞ యొసంగు మం • చని యిట్లహంకారగర్భితవాక్కులఁ • గర్వగవరు
లాడిన వారల • కనియె భండుం డిట్లు [1]ప్రతిఘారుణాక్షుఁ డై • ప్రౌఢభణితి
నందఱుఁ బోనేల • సుందరిఁ గెల్వ విశుక్రుఁ డొక్కఁడు మేటి • శూరుఁ డగుట

తే. వేగ చని విఘ్నయంత్రంబు • విమతహరము

1 ప్రతిఘారుణాక్షుఁడు=కోపముచే నెఱ్ఱనయిన నేత్రములుకలవాఁడు.

శత్రుకటకంబున న్నిల్పి • సమరవిముఖ
లనుగ నొనరించి రావలె•యును బరాక్ర
మమున నన నాతఁ డెంతయు • మండిపడుచు. 331

—ః విశుక్రుఁడు విఘ్నయంత్రమును బ్రయోగించుట.

కుసుమవిచిత్రవృ. వనితలనెల్లఁ • బవరములోనం
గనుఁగొని దేవౌ•ఘము వెఱఁగందన్
ఘనతరశక్తిం • గలవిలమందం
గను నొనరింతుం • గనుఁ డిఁక నంచున్. 332

సీ. మాయాతిరోహిత•మహితదేహుం డయి దానవుం డరుగంగ • ద్వాదశాత్ముఁ
డరుదుగఁ బర్యస్త•కిరణౌఘపాటలీకృతదిఙ్ముఖుం డయి • యతిజవమున
నస్తాద్రి కరిగిన • ననురాగవతి సంధ్యపాతాళకుంజవి•ఖ్యాతకేళి
చేయ నుత్సుకవోలెఁ • జెలఁగి తీవ్రమయూఖు ననుసరించెను వేగ•మున సహస్ర
ఆ. కిరణుఁ డొంద నతని•వరదేహసంగసమ్ముత్థితంబు లౌ స•ముద్రవారి
కణము లనఁగఁ దార•కలు నభంబున నొప్పె,నుక్కు మిగిలి చూడ• లెక్క లేక.
తే. ఆదురాశయునకును సా•హాయ్య మొనరఁ
జేయ నుద్యుక్త మైనట్లు • చెలఁగె గాఢ
తమము కజ్జలమేచకం • బమితమగుచు
దర్ప మొప్పఁగ మాయార•థంబు నెక్కి. 334
తే. గాఢశార్వరసంవృత • గాత్రుఁ డగుచు, ఖలుఁడు నైనవిశుక్రుండు • లలితసైన్య
కటకమునుగాంచియుజ్వల•ద్గాఢవహ్ని, సాలవిస్తృతి నూఱుయో•జనములగుట.
క. కని దాని దాఁటువెరవును, గనఁజాలక దక్షిణమునఁ • గ్రాలెడుద్వారం
బును గాంచి యందుఁ జొరఁగా, ననువుపడ నటంచు నెంచి•యచ్చట గడఁకన్.
శా. కాంచెన్ రాక్షసుఁ డుగ్రలోచనలఁ జ•క్రస్వచ్ఛభేరుండకా
ప్రాంచద్దివ్యధనుశ్శరవ్రజలస•ద్ధస్తాబ్జలన్, శక్తులం
జంచత్కంకటతూణదీప్తతనులం • జండోరునిశ్వాసఘో
దంచద్భీకరవక్త్రలన్ సమరసి•ద్ధస్ఫారసంరంభలన్. 337

వ. ఇరువదియక్షౌహిణులం గూడి యున్న స్తంభినీప్రముఖలం గాంచి విస్మయావిష్ట చిత్తుండై విశుక్రుండు ప్రాకారంబుఁ బ్రవేశింప ననువు పడమి నెఱింగి బహిస్థ లంబునం దేయుండి గవ్యూతిమాత్రాయామంబు, నంతపొడవును గలిగిన శిలా పట్టంబున దివ్యమగు నొక్కయంత్రంబును లిఖించి యష్టదిక్కులయందును సం

హాఁగాతుకరమాళియగు శూలాష్టకంబును లిఖించి యలసయుఁ, గృపణయు, దీన యు,నిద్రయుఁ,దంద్రయుఁ, బ్రమీలికయుఁ, గ్లీబయు,నిరహంకారయునను దేవ తలఁబొందుపఱిచి శూలాగ్రంబుల నీదేవతలొప్ప నభిమంత్రించి పూజించి ఛాగాదుల బలినిచ్చి దానిని శత్రుకటకంబునఁ బడునట్లు వీచి వైచిన నాయం త్రం బగ్నిప్రాకారంబు నవలీల నతిక్రమించి లోపలఁబడుటయు నాయంత్రవికా రంబున శక్తులెల్ల విముక్తశస్త్రులై దీనమానసలై యుప్పుడు. 338

ఉ. శౌర్యమొప్ప రాక్షసవ్రజంబును జంపి, విజయ మొందనేల • విపులశస్త్ర ధారణం బిదేల • దర్ప మియ్యది యేల, జయముఁ గొనఁగనేల • చాలుఁ జాలు.

సీ. ప్రాణులహింసించి • పాప మొందుట కన్న,నూరకయుండుట • యుత్తమంబు
దేవసంరక్షకై • దితిజులఁ జంపినఁ గలుగులాభం బెద్ది • కలకలంబు
వ్యర్థంబుగాఁ జేసి • యనిసేయ నిఁకనేల స్వామిని యెవ్వతె • స్వామి యెవఁడు
దండినితోనేమి • చండికతోనేమి మనకింక పని వెస • మంత్రిణి యన

ఆ. నెవతె మనము దాని • కిట్లు సేవను జేయ,నేల మనకుఁ బ్రభ్వి • యాలతాంగి
యేకదా! సుమాంగి • యేమి లాభమునిచ్చు,వనితలార!రణము • వలదువలదు.

చ. పరుల జయించినం గలుగు • భవ్యఫలంబు లిఁకేల యుద్ధము
ధురగతిఁ జేసి దేహములు • ఘోరపుశక్తిని బాసియుండఁగా
నిరతము సేయ నేల యతి•నింద్యము గాదె రణప్రసక్తి చా
లు రణము చాలు నీజయవి•లోలత నొందఁగ నేమి లాభమా. 341

ఉ. సంగరరంగమందు వెసఁ • జచ్చిన జీవితమెల్ల వ్యర్థమా
నంగనలార! యుద్ధ మిఁక • నాపుట మంచిది సౌఖ్యరాశికిన్
భంగము నిచ్చు సాహసము; • భవ్యసుఖంబు నొసంగు నిద్రయుం
చంగనలెల్లఁ జిత్తముల • నార్తిని బొంది కలంగుచుండ్ వడిన్. 342

వ. ధైర్యంబు లేక వా రాలస్యంబునకు సమానమగునదిలే దది చిత్తవిశ్రాంతి నొసంగు. మనల రాజ్ఞి యేమిశిక్షింపఁగల దిట్లు మనము కూటంబుగానుండిన లలిత దుర్బల మై మనల శిక్షింపఁ జాలదని యూహించి చిత్తవిభ్రమంబున నాయుధంబులను బాఱవైచి నిద్రాకృష్టచిత్త లై మాంద్యభూయిష్ఠ లై శక్తు లెల్ల బహువికారంబుల నొందిరి. ఇట్లావిశుక్రదానవుండు జయవిఘ్నమహా యంత్రంబు నొనరించి ద్వితీయయుద్ధదినార్ధరాత్రంబున విజయంబు సిద్ధించు ననుతలంపున మరలి పురంబునకు వచ్చి ముప్పదియక్షౌహిణులంగూడి వేగంబ యగ్ని ప్రాకారంబు నొంది జయభేరిని మ్రోయింప శక్తులెల్ల నిరుద్యోగపరా

యగా లై యుండ నవ్విధం బెఱింగి విఘ్నయంత్రవికారంబుల నాలోచించి
మంత్రిణియు దండనాథయు నొక్కచోఁ గూడి. 343

సీ. ఇదియేమి సైన్యంబు • లెల్ల నిద్రాలస్యతంద్రాభయంబులఁ • దత్తఱిల్లె
నెవని వికారంబు • లిబ్బంగిఁ గావించె మనవాక్యములనెల్ల • మానినీగ
ణం బాదరింపదు • నాయిక లలితాంబఁ బూజింప దిదియేమి • ఘూన దస్త్ర
శస్త్రంబులను నిర • స్తప్రమోదంబున నుండఁగా హేతు వే • ముండునో యని
తే. లలిత కడ కేగి సేనల • లక్షణంబుఁ, దెలుపఁగా నెంచి శ్యామల • దీనవృత్తి
నిట్టు లనియెను బరమేశి! • యిప్పు డేమి, కారణం బొకొ తెలియఁగఁ • గాదు మాకు.
క. పరమారణకృత్యమునకుఁ, జొర రిపుఁడు శక్తు లేమి • చోద్య మొకో సం
గరమన్న నూరకుండుదు, రరయరు భవదాజ్ఞనైన • నాలస్యంబున్. 345
ఆ. నిద్రఁ బూని రేమొ • నేర్పును విడిచిరి, దుష్టవాక్యములను • దూలనాడు
చున్నవారు మమ్ము • నో దేవి! దండిని, మంత్రిణి యన నెవరు • మాకు ననుచు.
క. ఇక్కడ నివ్విధి నుండఁగ, రక్కసులను గూడి దైత్య • రా జరుదెంచెం
బిక్కటిలఁగఁ దిక్కులు పెం, పెక్కన భుజగర్వ మొప్ప • నిప్పుడె కడఁకన్.
ఆ. భేరినిస్వనముల • భేదిల్లె దిక్కులు, శక్తులెల్లఁ బలుకఁ • జాల రకట!
యేమి చేయఁదగునొ • యెఱిఁగింపు మనివిన్న, వింప శ్యామలాంబ • విధముఁ గాంచి.
చ. మనమున రాక్షసాధిపుని • మాయ నొకించుక సేపు చూచి య
ద్దనుజుని దర్పముం జెఱుపఁ • దద్దయు నిశ్చయ మొప్పఁ జేసి య
వ్వనరుహనేత్ర యీశ్వరుని • భవ్యముఖంబున దివ్యదృష్టి ని
ల్పెను స్మితవక్త్రి మొప్ప నన • భిప్రకటీకృతదంతపంక్తి నై. 349
సీ. ఆ దేవి సుస్మిత • మందున వెసఁ గుంజరాకృతిముఖ మొప్ప • నమలగండ
తలగళద్దానాంబు • లలితుఁ డై మఱి జపాపాటల్యతస్కర • భవ్య దేహ
కాంతివ్రజుండు నై • గదయు బీజాపూర మిక్షుచాపము శూల • మెసఁగు నబ్జ
పాశ ముత్పలమును, • భవ్యసుదర్శనంబును, వ్రీహిమంజరి • భూరిరత్న
రమణీయకుంభంబు, • రాజితస్వరదాంకురములఁ దాల్చు దశక • రములు మెఱయఁ
తే. దుండిలుఁడు చంద్రచూడుండు • సుందరుండు
సిద్ధలక్ష్మీసమాశ్లిష్టుఁ • డిద్ధయశుఁడు
నైన గణనాథుఁ డనుపేర • నలరు దేవుఁ
డవతరించెను దేవాళి • యలరుచుండ. 350

గణేశ్వరుఁడు విఘ్నయంత్రమును భేదించుట.

స్వాగతవృ. అంత నాగణపుఁ • డంబిక కెంతో
సంతసంబునను • సాఁగిలి మ్రొక్కన్
వింత సుస్మితము • వేడుక నింపన్
గాంత పుత్త్రకుని • గాంచి వచించెన్. 351

క. అలవిఘ్నమహాయంత్రం, బలయించెడి సేననెల్ల • నాత్మజ! చని దా
నిలయము గావింపుము నా, నలరుచు గణనాథుఁ డచటి • కరిగెం బెలుచన్.

తే. వహ్నిసాలంబు నడుమ నా•బ్భద్రదంతి, వదనుఁ డీక్షించె నిభృతమై • వఱలునట్టి
దాని జయవిఘ్న మనుపేరఁ•దనరుదాని, యంత్రవర్యంబు గాఢసు•మంత్రితంబు.

తే. ఘోరనిర్ఘాతదుస్సహా•భూరిదంత, పాతనంబుల నాయంత్ర•వరము నతఁడు
చూర్ణితంబుగ నొనరించెఁ • జూచునట్టి, త్రిదశులెల్లను ముదమునఁ • దేజరిల్ల.

క. ఆయంత్ర మాశ్రయంబుగఁ, బాయక నివసించియున్న • బహుదుష్టమహా
పాయకరదేవతలతోఁ, నాయంత్రము భస్మశేష • మా నటుచేసెన్. 355

సీ. యంత్రంబు చెడిపోవ • నప్పుడు కిలకిలస్వాన మొప్పఁగ శక్తి • సముదయంబు
తంద్రామయోగ్రని•ద్రాముఖవర్జిత లై యుద్ధసన్నద్ధ • లై మహాస్త్ర
పాణు లై యలరంగ • భద్రదంతీంద్రాస్యుఁ డతిబృంహితస్వన•మపుడు చెలఁగ
బుట్టించె గజవక్త్ర•ముల నొప్పు వారల బహుసంఖ్యలను వేగ • వారు కటక

తే. విగళదున్మదసంలోల•భృంగనికర, మెలమిఁ గీర్తింప దాడిమ • లలితకేస
రాళివిక్షేపకరకరా•త్యంతకాంతు, లలర సప్తాబ్ధులను ద్రావుఁ•నట్టి లీల. 356

వ. చెలంగి విజృంభించిరి. ఆమోద, ప్రమోద, సుముఖ, దుర్ముఖ, విఘ్న, విఘ్నకర్తలను నాఱుగురు సప్తకోటిహేరంబాధీశ్వరులయి రయ్యాఱుగురును ముందు నడువ గణనాథుండు వహ్నిప్రాకారంబు నతిక్రమించి క్రోధహుంకారతుములుండై దానవులసమీపంబున కరిగి ముప్పదియక్షౌహిణులును గొలువ మెఱయుచున్నశక్రశాసనుం డగువిశుక్రునిం గాంచి యిక్షుకోదండవక్త్రనిర్గతంబు లగుదివ్యబాణంబులం గప్పి ప్రచండఫీట్కారబధిరీకృతవిష్టపుండై సింహనాదంబుచేసిన నవ్విజృంభణంబున నొక్కపెట్ట గణనాథుని సైన్యంబు దానవులపైఁ బడి బాణంబుల శిరంబులు ఛేదించుచు, శస్త్రంబుల నురంబులం ద్రెంచుచు, నస్త్రంబులఁ బ్రాణంబులఁ బాపుచు, గదల మొత్తుచు, గుంతంబుల నింతలింతలుగా ఖండించుచుఁ, బరిఘంబుల నొప్పించుచుఁ, బాశంబుల, బడలువడం జేయుచు, ముసలంబుల మోదుచు, ముద్గరంబుల మూ

ర్ఛలనొందించుచు, భిండివాలమ్ములఁ బిండిసేయుచు, దోమరంబుల దాన
వాంగంబుల భూమిపైఁ దొరలించుచు, సింహనాదంబుల దిక్తటంబులభేదించు
చు, నట్టహాసంబుల దనుజులగుండె లవియించుచు నేటులాడి రాసమయంబున.

మ. ద్విరదాస్యుండు విశుక్రు గిట్టి విజయో • ద్వృత్తిన్ మహోహుంక్రియా
కరణాస్వానితదిక్కదంబుఁ డగుచున్ • గాఢోల్లసద్భ్రూకుటీ
కరణాత్యంతభయంకరాస్యుఁ డయి యా • క్రవ్యాదునంగంబులన్
గురుబాణంబుల వ్రయ్యఁ జేయఁగ విశు • క్రుం డంత దష్టోష్ఠుఁ డై. 358

సీ. బాణంబులను గప్పె • బలువిడి లన్యోన్యశస్త్రాస్త్రఘట్టన • స్వానములను
దిక్కులు భేదిల్ల • నుక్కున మెఱయుచుఁ, బోరాడి రప్పుడు • భూరి వాజి
వర్యఖురక్రోడ • బహుళఘాతంబుల దంతీంద్రఘీట్కార • దారుణరవ
ములను ఘోరంబుగాఁ • గలకలం బయ్యె నశ్వౌఘహేషలువార • ణౌఘబృంహి

తే. తములు రథచక్రరవములుఁ • దారుణాంబ
కములస్వనములు, చాపని • క్వణనములును
గవిసి దిక్కుల భేదించెఁ • గడఁగి యంత
దనుజవారంబుపైఁ బడి • దంతిముఖులు. 359

చ. అరదములం గలంచి ద్విర • దావళిఁ బాఱఁగఁ దోలి సేనలన్
శరములఁ జించి యశ్వములఁ • జయ్యనఁ బిండిగఁ జేసి యంతటం
బరుగిడునట్టి దానవులఁ • బట్టి కరంబులఁ జుట్టి దంతని
ష్ఠురతరసంహతిన్ ముసల • శూలహతిన్ వడిఁ జంపి రెంతయున్. 360

వ. మఱియును హేరంబునిసైన్యంబులు దానవులపైఁబడి యురువడించి. 361

సీ. కర్ణతాళోద్ధతిఁ • గంపింపఁగాఁ జేసి ధ్వజముల నాసికా • వాతహతులఁ
బడిపోవఁగాఁ జేసి • పాదాహతులవారి మర్దించి ముద్దయా • మాడ్కిఁ జేసి
ధూళిశేషంబుగాఁ • దూర్ణంబుగాఁ జేయఁ గోపించి యట విశు • క్రుండు వేగ
గజదానవుని వారిఁ • గదనంబునను జంప నక్షౌహిణీసప్త • కాయతముగఁ

తే. బంప నవ్వీరు మార్కొని • బాహుశౌర్య
సాహసంబులు మెఱయంగ • సంగరమున
గణపతియు బలహీనుని • గా నొనర్చె
నంతయును గాంచి దనుజేశుఁ • డలఘుగతిని. 362

వ. గణేశ్వరుం డధికబలుం డని తెలిసికొని పాఱె నంత గజాసురుని జంపి తత్సై
న్యంబు నిరవశేషంబుగా సమయించి గణపతి సింహనాదంబు చేసె. ఇట్లు విశు

క్రుండు పాఱుటయు గణనాథుండు విజయంబు నొందుటయుఁ గనుఁగొని లలిత ముదితహృదయ యయ్యె. దైత్యబలవర్ధనకారిణి యగు నారాత్రి చనుటయు గణపతి సర్వదైవతపూజయందును బూర్వపూజ్యత్వంబు లలితాప్రసాదంబు వలన నొందెనని మఱియు హయగ్రీవుం డగస్త్యున కిట్లనియె. 363

విశుక్రవిషంగదానవులు మృతు లగుట.

క. బలశాలియౌ విశుక్రుఁడు, కలహంబున నోడిపాఱె • గాంతలు నవ్వన్
బలమెడల ననెడివార్తకుఁ, గలఁగుచు భండుఁడు విచారకలితుం డయ్యెన్.

ఆ. వెచ్చనూర్చి దైత్యవీరులఁ బిలిపించి, మంతనంబుచేసి • మరల ననుజ
యుగ్మమును గడంగి • యుద్ధంబు సేయంగఁ, బనిపె విజయకాంక్ష•పరిధవిల్ల.

చ. దనుజవరుండు తమ్ము బల•దర్పసముగ్రు లటంచుఁ బంప వా
రనుపమశౌర్యసాహసము • లద్భుతరీతులఁ బొల్పుమీఱ న
వ్వనరుహపత్త్రినేత్రల జవంబునఁ బట్టి వధించుకౌతుకం
బున సముదగ్రకోపమును • బూని విశుక్రవిషంగు లేఁగఁగన్. 366

క. అనుజాన్వితుఁ డగు యువరా,జును లోకత్రయము వడఁక • శూరత నక్షౌ
హిణులు చతుశ్శతసంఖ్యలు, ఘనభక్తిని గొలువఁ జనియెఁ • గదనము సేయన్.

ఆ. వెస నులూకజిత్ప్రభృతిభాగినేయులు, పదుగు రతని గూడి • బవరమునకుఁ
జనిరి ధూమిని యను•చండభండుని సహో, దరికి వారు సుతులు•దర్పఘనులు.

క. వారికి భండాసురుఁడే, దారుణరణకృత్య మెల్లఁ • దగనేర్పె మహా
క్రూరులు రణవిజయులు భుజ, సారులు శస్త్రాస్త్రబాణ•సంధానచణుల్. 369

ఆ. గర్వయుతులు వారు • కావున మాతులు, నాజ్ఞఁ బూని చేయ • నాహవమున
కేగి రఖిలసైన్య • మెలమి వారలవెంటఁ, బోయె దేవవరులు• పొగులుచుండ.

సీ. ఘోరకోదండని•ర్ఘోషంబులను దిశాసమితిభేదిల్లంగఁ • జాపమౌర్వి
మీటుచు సేనల • మిగిలి మాతులునకుఁ బ్రీతినింపుచుఁ బోయి • రాతతగతి
నారూఢవారణుం • డై విశుక్రుఁడు యుద్ధభూమికేఁ జనుదెంచి • భూరిసింహ
రవము లొప్పెడు చమూ•రాజితో మార్కొని యట్టహాసము సేయ•నారవమున

ఆ. క్షుభితహృదయు లయ్యు • శూరత శక్తులు సంభ్రమోద్యమముల•జ్వలనసాల
మపుడె దాఁటి వేగ • యస్త్రరోచులఁ దటి, న్మయముగా నొనర్చి•నభము నెల్ల.

గ. గురుతరభీతికృద్బహుళ • కోపరసారుణవక్త్రకాంతిసం
బరమును రక్తవారిదని•బద్ధముగా నొనరించుచున్ శరో

త్కరగురుచాపతూణములఁ • దాల్చి మహాహవకాంక్ష నేగి సం
గరకుతుకాంతరంగు లగు • కర్బురవర్యులఁ దాఁకి రుద్ధతిన్. 372

ఉ. శౌరత నేగుదెంచిరి వి•శుక్రవిషంగు లటంచుఁ జెప్పఁగా
భూరితరాగ్రహంబు మదిఁ • బొల్పెసలారఁగ శ్యామలాంబ భూ
దారముఖీలలామయును • దర్పమునన్ వరగేయచక్రమున్
సౌరునఁ బొల్చునట్టి కిరి•చక్రమునున్ వడి నెక్కి శౌరతన్. 373

వ. శ్వేతాతపత్త్రంబులు మెఱయ సతీలలామలు చామరంబులు వీవ నచ్చరలు నాట్యంబు సల్ప లలితాజ్ఞనొంది సమరోద్యుక్తలై మంత్రిణీదండనాయికలు పయనం బయి శ్రీచక్రరథసంరక్షణార్థమై శతాక్షౌహిణీసైన్యంబును నిలిపి మిగిలిన సేనలం గూడి చనుచుండ నందు వారాహి సమరోన్ముఖియై యంత రంగంబున విజయకాంక్ష చెలువారుచుండఁ బోయె నప్పుడు. 374

సీ. ఒకచేత హలనామ•కోగ్రసాధనము వే ఱొకచేత ముసలంబు • నొప్పుచుండఁ
దిప్పుచుఁ దరుణేందు•దివ్యకళాచూడయును బోత్రిముఖకంజ•మును మెఱయఁగ
లోకత్రయంబు వి•లోలంబుగాఁ జేయు సేనయుఁ దోడరా • మాననీయ
దృష్టిని జూచుచు • నెసఁగు సురాపానవాసితాధరపల్ల•వయుఁ బరాక్ర

ఆ. మోద్ధురయును నగుచు • నుద్యమ మొప్పంగ, దనుజవీరసైన్య•తతులఁ గూల్ప
నరుగు దండనాథ • ననుసరించుచు గేయ, చక్రరథము నెక్కి • శ్యామలాంబ.

చంద్రవర్త్మవృ. ఇంద్ర ముఖ్యు లగు • నెల్ల దివిజులున్
సాంద్రభక్తిఁ బద•సారసముల ని
స్తంద్రచిత్తములఁ • దద్దయుఁ గొలువం
జంద్రశీర్షరణ•సమ్మద మొలయన్. 376

క. మార్వీనాదముచే నీ, యుర్వరయును మాఱు మ్రోయ • నుద్యమ మొప్పన్
సర్వబలంబును దనర న, ఖర్వరణోత్సవము మీఱఁగా నడిచె వడిన్. 377

సీ. శీర్షణ్యకృతకచ•జృంభితతుహినాంశుపల్లవమును మహా•భాసమాన
తార్తీయనేత్రసుం•దరలసత్సిందూరతిలకకాంతులు మణి•దీప్యమాన
కంకణభాసుర•కరపద్మరోచులు చెలువారు చుండ వి•జృంభితాత్మ
తూణీరముఖకృష్ట•బాణంబుఁ ద్రిప్పుచు "వర్ధస్వ, జయశత్రు•వార" మనుచు

ఆ. మాను లనువదింప • మానినుల్ గీర్తింప, నాట్య మప్సరోంగ•నలు చెలంగి
సలుప దివిజు లెల్ల • నెలమిఁ గీర్తింపఁగా, రాక్షసుల హరింప • రమణి కదలె.

తే. చక్రరథ నేమిఘట్టన • సరణిఁ బృథివి
బ్రద్ద లై ఘూర్ణిలంగ నా • రాక్షసాఘ
హృదయములు నష్ట మై యుండ • ముదితశ్యామ
లాంబ తనుఁ జూచువారెల్ల • నభినుతింప. 379

వ. అక్షౌహిణీసహస్రాష్టకంబు సమరోద్ధతం బై కల్పవిశ్లేషనిర్ణర్యాదాంబుధిచందంబున వెంటరాఁ జనుచుండె నాసైన్యంబునఁ గొందఱు ధర్మనిర్మలకాంతిదేహులును, గొందఱు దాడిమసంకాశాంగసౌష్ఠవలును, మఱికొందఱు జీమూతాయతరోచిశ్శాలినులును, గొందఱు సిందూరత్విడ్భాసమానతనులును, మఱియుఁ బాటలపాటలలును, జంద్రికాగారలును, శ్యామలకోమలలును, హారకప్రఖ్యలును, గారుత్మతోపమతనుచ్ఛాయలును, విశుద్ధపంచవర్ణసమ్మిశ్రితదేహకాంతులు నై చెలంగుచు శతకోటివిధంబుల దేహచ్ఛాయలు ప్రకాశింప వివిధాయుధంబులఁ దాల్చి యనేకశక్తులు చనిరి. దండినిసైన్యంబు లనేకవిధంబులఁ జనియె. మఱియు సైన్యసన్నాహంబును, భూషణవేషాదికంబును, సర్వపూజ్యతయు, మహారాజ్ఞీభక్తియు నెట్లెట్లు శ్యామాసైన్యంబునందుఁ జూడనగు నట్టి చందంబెల్ల దండనాథసైన్యంబునందును జూడఁ బడియె. శ్యామాంబయం దొక్కవిశేషంబు కలదు. శ్రీమహారాజ్ఞీవితీర్ణం బగు నాజ్ఞాముద్రాంగుళీయకంబు కరంబున భాసిల్లు. తక్కినవిషయంబుల దండనాథమంత్రిణికిసమానమైయుండె. ఇట్లు సైన్యంబులు కదలిచనియె నప్పుడు. 380

తే. అమ్మహాభారభంగుర • మైనభూమి, డోలికాలీల నలరారె • లీల మెఱయ
నుభయసేనలు మార్కొని • యుగ్రరీతిఁ, గదన మొగిఁజేసి రత్యంత • కాంతిమిగుల.

చ. కదనము సేయుచుండ జయ • కాంతుఁ బెనంగెడు సైనికోల్లస
త్పదతతిఘట్టనప్రభవ • దారుణధూళిసముద్రసీరముల్
మదజల మట్లు పంకిలము • మాడ్కి నొనర్చెను; జిత్రరీతి న
య్యదనునఁ బోరి రీర్ష్యలమ • హారభసంబున నొక్కపెట్టునన్. 382

క. తురగస్థులఁ దురగస్థలు, ద్విరదస్థలు హస్తిగతులఁ • దీవ్రోద్యమ మొ
ప్ప రథస్థలు రథికులతో, నురవడి కాల్బలము నట్టు • లుద్రేకమునన్. 383

ఉ. మార్కొని దైత్యసైనికులు • మానినిసైనికు లొక్కరీతిఁగా
గోర్కులు చెల్వుమీఱ రణ • గుంభన మొప్పఁగఁ బోరుచుండఁగాఁ
దార్కొని యవ్విషంగుని గ • దాహతి నొంచెను దండనాథ య
ట్లర్కసమోగ్రలోచనయు • నై తగు శ్యామ విశుక్రదానవున్. 384

చ. సరభసమొప్ప రత్నచయ•సాంద్రశరాసనమూర్వి మీటుచున్
శరతతినొంచె; నశ్వపతి • శౌర్యము పొంగ నులూకజిత్తు సం
గరకుతుకంబు మీఱఁగ న•ఖండకలంబకపంక్తి నొంచె న
ల్లురవడి సంపదీశ్వరియు • నుగ్రభుజాబలయుక్తయై కడున్. 385

సీ. పురుషేణుమాఱ్కొని • పోరె మహామాయ కుంతిషేణకుని మా•ఱ్కొని యెనంత
నున్మత్తభైరవి•యుగ్రయై మలదుని బాణజాలంబులఁ • బరిభవించె
నట్లు లఘుశ్యామ•యూర్చ్చికశూరుని దాఁకి తూపుల నొంచి • దర్ప మడఁచె
స్వప్నేశి మంగళు•బాణవిద్ధాంగునిగాఁ జేసి యార్చె న•క్కాలమందు

తే. నికటగతుఁడగు ద్రుఘణునిఁ • బ్రకటచాప
గళితబాణాళి నొంచె వా•గ్వాదినియును
జండకాళియుఁ గోల్లాటు•భండనోగ్రుఁ
గదిసి తూపులగుమిఁ గ్రుచ్చి • క్రౌర్య మణఁచె. 386

క. ఆనందడి కయ్యంబున, నీసున సైనికులు గదిసి • యొసఁగెడు కుఱిధచే
జేసిరి యుద్ధము మదిలో, భాసుర జలకేళి సేయు • వడువున నంతన్. 387

తే. సమర మీరీతి నొకకొంత•జరుగుచుండ, వర్ధమానంబులై శక్తి•బలములెల్ల
హీయమానంబులౌదను•జేశుబలము,గాసినొందంగఁ జేయుటఁ•గాంచియపుడు.

ఉ. రోషమునన్ విశుక్రుఁడును • రుద్రుని చందముగాఁగ నొప్పుచున్
భీషణమూర్తియై గుణము • వేగమ మీటుచు విఘ్ననామముల్
దోషములం గలంచు క్రియఁ • దోరపుశక్తిని భర్మతూణస
ద్భూషితమాంసలాంసముల•తో వడి మాఱ్కొని నొంచె సేనలన్. 389

తే. శక్తిసేనలనిటునొంచి•శౌర్య మొప్ప,వైచెనుదృషాస్త్రమును మంత్ర•వైభవమున
నద్ది దావానలజ్వాల • లట్లు కదిసి, బాధ లొందంగఁ జేసె న • బ్బలము నెల్ల.

వ. తృతీయయుద్ధదివసంబునఁ బ్రొద్దు జామెక్కుటయు విశుక్రముక్తతార్షాస్త్రంబు ప్రబలమై బాధింప వ్యాకులస్వాంతలై ప్రమదలెల్ల నలజడిఁ బడి రయ్యస్త్రంబింద్రియగ్రామంబును క్షోభింపఁజేయుచుఁ, దాలుమూలంబులను శోషింపఁజేయుచుఁ, గర్ణకుహరంబుల మండించుచు, నంగంబులయందు దౌర్బల్యంబు నాపాదించుచు శక్తిదేహంబులు భూమిపైఁ బడునట్లు చేయుచు నివ్విధంబునఁ బలుభంగుల విజృంభించి యయ్యస్త్రంబు బాధింప నందఱ దేహంబులందును దృషాజ్వరంబు ప్రజ్వలించె నంత. 391

సీ. తార్షాస్త్రసంబాధి•తం బగుసైన్యంబు గాంచి మంత్రిణి మది • నెంచి దండ

నాయికతోఁగూడి • నానావిధంబులఁ జింతించి యిట్లను • జింతసేయ
ఫలమేమి చెలియ! యి • ప్పాడుశస్త్రము శిథిలీకృతంబుగ నేన • లీలఁజేసె
హా! విధి యెంతటి • యపకారి యయ్యెనో శుష్కతాలువులతో • సొమ్మసిల్లి

ఈ. సైన్య మిపుడు యుద్ధ•సరణి మానెను శస్త్ర, జాల మవనిఁ బడియెఁ • జానలెల్లఁ
బలుకఁ జాలరిపుడు•పరమేశి యివ్వార్త, నెఱిఁగి యేవిధమున • నెంచునొక్కొ.

ఉ. దీనికిఁ దగినయుపాయము, మానిని యూహింపు మిపుడె • మగువలలోనన్
గానఁబడ దొక్కతెయుఁ గనఁ,గా నీయస్త్రమున బాధ•గాంచక యనిలోన్.

చ. ఇది సమయంబుగాఁ దలఁచి • యెంతయుఁ బౌరుషమూని రాక్షసుల్
ముదితల నెల్లఁ గూల్చుటకు • మూఁగిన వారదె చూడు మింక నీ
మదిఁ దలపోసి యేదయిన • మా ర్గ మొనరించినఁగాని నిల్వరీ
యదనున దానవోత్తము లహంకృతిరూపులు దుర్నివారకుల్. 394

వ. దీనికి నాకుం దోఁచిన ప్రతీకారంబును జెప్పెద నాలకింపుము. త్వదీయరథ పర్వంబున నున్న [1]శీధుమహార్ణవరూపుం డగుపురుషు నాజ్ఞాపింపు మాతండ నల్పపానీయపానాదికంబుల నీశక్తులకుఁ దృప్తిగావించు. ఆతండె మదిరాసింధు వనంబడుగాదే. వేగంబ యాతని సమరోత్సాహకారకుని దార్ఢ్యాస్త్రబాధాసం హారకు నాజ్ఞాపింపు మనుటయు దండనాయిక సంతసించి సదుపాయం బని నిశ్చయించి సురాసింధువు రావించె నప్పుడు. 395

సురాసింధువు పుట్టుట.

క. సమదాలసరక్తాక్షుం, డమలసువర్ణాబ్జమాలి•కాయతభూషుం
డు మహితవేషుఁడు చనుదెం,చి మమతసాష్టాంగ మొసఁగి • చేమోడ్పు తగన్.

ఉ. అనుమతి వేఁడిన నాతని, గనుఁగొని సైన్యములఁ జూపి • కాతరలగు వీ
రిని గాచి రమ్ము రమ్మన, మనమున సంతసము మీఱ • మదిరాంబుధియున్.397

సీ. తనదేహమును బహు•ధాత్వ మొందఁగఁ జేసి తరుణార్కపాటల•త్వంబుగనుచు
నొకటఁ దాపింఛంబు • నొప్పు నాశ్యామయు, వేఱొకచో శ్వేత•విద్యుతియును
మదకరిహాస్తోప•మంబగు నాకృతియును దగ మెఱయంగ • నుద్యమమున
మదిరాబ్ధికోట్లుగ • మదిరాతిధారను వర్షించె నెంతయు • వాయుసహితుఁ
తే. డగుచు మఱిపుష్కలావర్త•కాంబుదములఁ, గల్పసంక్షయకాలసం•కలితదేహ

1 శీధుమహార్ణవరూపుండు-శీధు=పక్వమైన చెఱకురసముతోఁజేసిన కల్లు అను, మహార్ణవ రూపుండు=సముద్రస్వరూపుఁడు.

ములగుఘనములఁబోలుచు♦భూరిశక్తి, సైన్యములమీఁదవడిఁబడి♦సౌరుచెలఁగ.
తే. దేనివాసనపాతినఁ♦దెలివినొందు, మృతుఁడుదుర్బలుఁ డతిబల♦యుతుఁడు నగునొ
యాసురాంబుధిధారల ♦ నప్పరేశి, సైన్యములఁ దన్పె దివిజులు ♦ సంతసింప.
మ. వనితామండలమెల్ల నాసురగ్రహిం♦పంబూని లోలాశయం
బున నెంతే వడిలేచి త్రాగెను మహా♦భూతంబులో నాఁగ న
ద్దనుజుల్ మద్యముఁ ద్రాగకుండ శరసం♦తానంబునన్ సాలముల్
ఘనశక్తిన్ నచివేశికట్టె దివిజౌ♦ఘంబుల్ మదిం బొంగఁగన్. 400
తే. మద్యధారలశక్తు లే♦మాడ్కిఁ గోరి, రట్లు బహువిధగతులతో ♦ నబ్ధిగురియఁ
జేసె నామద్యమును గ్రోలి ♦ స్త్రీకదంబ, మెల్లనాహవముఖమయ్యె♦నుల్లమలర.
వ. తృతీయయుద్ధదివసంబునఁ బ్రహరద్వయ పర్యంత మిట్లు మద్యధారలఁ గ్రోలి రయ్యవసరంబున సురగౌడియుఁ, బైష్టియు, మాధ్వియు, వల్లియుఁ, గాదంబరియు, [1]హైంతాళియు, లాంగలేయియుఁ, దాళజాతయుఁ, గల్పవృక్షోద్భవయు, వివిధపర్వతసంజాతయు, సుస్వాదుసౌరభాఢ్యయు, శుభగంధయు, మదప్రదయు, వకుళప్రసవామోదయు, బుద్బుదోజ్వలయుఁ, గటుకకషాయమధురతిక్తముఖవివిధరససమాశ్లిష్టయు, ఛేదినియుఁ, బిచ్ఛిలయు, నీషదమ్లయుఁ, గట్వమ్లయు, మధురామ్లయు, శస్త్రక్షతిరోగహంత్రియు, నస్థిసంధానదాయినియు, రణశ్రమహారియు, శీతలయు, సంతాపహారిణియుఁ, [2]గవోష్ణయు, ననుష్ణయు, జయప్రదయు నను ననేకభేదంబులఁ బరఁగు. ఇట్లు మదిరార్ణవంబు పర్షింప నవిచ్ఛిన్నంబుగా యామమాత్రం బుత్తానవదనంబులఁ గ్రోలి రప్పుడు సురాసింధువు మరల దివ్యరూపంబు నొంది దండనాథకు నమస్కరించి స్నిగ్ధగంభీరఘోషంబున నిట్లనియె. 402
మేఘవిలసితవృ. శ్రీరాజ్ఞీప్రియ ♦ జితఘనదనుజా
స్మేరాంచన్ముఖ ♦ సితసరసిజ, మీ
రారీతిం గడు ♦ ననుమతి యిడఁగా
భూరిప్రోద్బల♦ము నొసఁగితి నటన్. 403
ఆ. ముక్తతర్షలగుచు♦ముదమునవనితలు, కుతుక మొలయుచుండఁ ♦ గొంద ఱదిగొ
యాడుచున్నవారు♦కూడి కొందఱు పాటఁ, బాడుచున్నవారు♦ పాటవమున.404
ఉ. కొందఱు పాడుచుండ మఱి ♦ కొందఱు తాళము లట్టెకొట్టఁగాఁ
గొందఱు నాట్యముల్ సలుపఁ ♦ గొందఱు నవ్వఁగఁ గొంద ఱార్చుచున్

1 హైంతాళి = గిఱకతాడిచెట్టునుండి తీయఁబడినది. 2 కవోష్ణ = ఇంచుక వేఁడియైనది.

సందియ మింత లేక యొక • సారసనేత్రియు గౌఁగిలించి యా
నందము మీఱ నుండు రదె • నాదగు నేర్పునఁ జేసి యుద్ధతిన్. 405

వ. శ్రోణీవిగళన్మేఖలాంబర లై మెఱుఁగుచున్న వారు కొందఱు యుద్ధంబునకు సన్న
ద్ధలై యున్నవారని వేఱువేఱఁ జూపి విన్నవించినఁ జూచి వారాహి ప్రమో
దాంతరంగ యై యి ట్లనియె. 406

ఉ. సంతసమందితిం బ్రబల • సాహ్యముఁ జేసితివో సురాంబుధీ!
చింత తొలంగ దేవహిత • సిద్ధియుఁ జేసితె నీదుశక్తి నే
నెంతయు మెచ్చితిన్ వనిత • లెల్ల బలాఢ్యత నొప్పఁ గంటి నీ
వింతటనుండి పూజ్యతమ•వృత్తిని బొందుము నాయనుజ్ఞచేన్. 407

సీ. వాజపేయాదిస•వంబుల సోమపానంబుభాతిని నీవు • నాయనుజ్ఞ
నుపయోజ్యుఁడవుగాఁగ•నొప్పుముసన్మంత్రిపూతుండవగునిన్నిఁ•బుధులుమఖము
నందుఁ ద్రాగుదు రింక•నందియమేల నీ సవముఁ ద్రాగిన • జనులు యజ్ఞ
సిద్ధిని వహియింతు • రిద్ధవిచారు లై యాచారపావను•లయి సతంబు

ఆ. బలములను వహింతు•రెలమి స్వర్గముఁ గాంతు, రనఘ! భార్గవుండు•నమ్మహేశి
యమ్మహేశ్వరుండు • నబ్బలరాముఁడు, నిన్నుఁ ద్రాగుచుండ్రు • నియతముగను.

క. విను మీఁక దత్తాత్రేయుఁడు, జనులెల్లను ద్రాగుచుండ్రు • నవమందును బూ
జను గొన్న నీవు సిద్ధుల, నొనగూర్తువు వేయునేల • యురుగుణనిలయా. 409

చ. అని వరమిచ్చి యాతని మ•హాముద మొందెడునట్లు చేసి శ్యా
మను గని యిట్లు పల్కె నిఁక • మంత్రిణి! సేనల సంగరోద్యమం
బున మెలఁగంగఁ జేయు మదె • పూన్కి సురారిబలంబు గ్రాలెడిన్
గనుఁగొను మంచుఁ దానును ని•కామవిజృంభణ మొప్పఁ దాఁకినన్. 410

తే. యుద్ధముద్ధతి నొప్పారె • నుభయసైని,కులకు నప్పుడు ప్రత్యగ్ర•లలితమద్య
మత్తలై మద్యపానైక•మదకృతాట్ట,హాసనిర్భిన్నదిఙ్నాగ • లగుచుఁ జెలులు.

క. దనుజులనొంచిరి వెనుకకుఁ,జన కసురులు శక్తిసైన్య•సముదయములతో
నని సేసిరి భీకరముగఁ, గనుఁగొని సురలెల్ల నింగిఁ • గళవళ మందన్. 412

వ. అయ్యవసరంబున దనుజులతో దోర్వీర్యంబు మెఱయ శక్తిసేనలు పోరుచుండ.

తే. సమరలక్ష్మిని బొందిన • శక్తితతికిఁ, బ్రబలమదరాగమున నక్షి•పంక్తి దైత్య
రక్తసిక్తంబు లైనశస్త్రములపంక్తి, యలరె నీరెండు నొకరీతి • నప్పుడుచూడ.

క. సురగంధర్వమహోరగ, గరుడాదులు చోద్యమందఁ • గడుఁదుములం బై
పర్వఁగెను శక్తిసురారుల,కు రణం బన్యోన్యశస్త్ర•గాఢక్షతులన్. 415

సీ. అకాలమున మృత్యు • వైనభయంబునఁ గాందిశీకత్వంబు • గాంచుఁ గుంభ
సంభవ! వినుము ప్ర•స్ఖలదంఘ్రివిన్యాసలును, మదరక్తాక్షు•లును గభీర
వీరభాషిణులును • జారుకదంబగోళాకారహృష్టస•ర్వాంగయష్టి
భాసమానలును నై • పరఁగెడు శక్తులు యువరాజసైన్యంబు • నుక్కడంచి
తే. రంత నక్షోహిణీశతం • బడరఁ గూల్చె
దండనాయిక మంత్రిణి • దర్ప మొప్ప
నంత సైన్యము మఱి దాని•యందు సగము
నవనిఁ గూల్చెను భుజశౌర్య • మపుడు పొంగ. 416

వ. అశ్వారూఢాదులు మదారుణవిలోచన లై నూటయేఁబది యక్షౌహిణులం గూర్చి రక్తమందిరంబును గావించి రప్ప డశ్వారూఢ తీక్ష్ణం బగు నంకుశంబున నులూకజిత్తును యమలోకాతిథిం గావించె సంపత్కరిలోనగువారెల్ల మదిరాపానమత్తచిత్త లై కోపంబునఁ బురుషేణప్రభృతు లగుదానవులరూపుమాపి రాసమయంబున. 417

తే. దారుణం బగు కలహంబు • దాను జూడ
నోడి కరుణామయుం డౌట • నుగ్రకరము
లెల్ల ముకుళింపఁ జేయుచు • నినుఁడు పశ్చి
మాద్రితటమును వడిఁ జేరె • నంతలోన. 418

ఉ. ఒండొరు మీఱు పౌరుషము • లొప్ప విశుక్రుఁడు శ్యామలాంబయుం
జండధనుశ్చ్యుతోగ్రశర•సంతతిఁ బోరిరి భీకరంబుగాఁ
జెండె విశుక్రుబాణములఁ • జిత్రగతిన్ సచివేశి మించి కో
దండము రెండుగాఁ దునిమె • దారుణమార్గణసంతతిన్ వడిన్. 419

వ. మఱియును. 420

ఉ. సారథిఁ జంపి కేతనము • శాతశరంబులఁ గూలనేసి కో
పారుణనేత్ర యై దివిజు • లార్వఁగ బ్రహ్మశిరస్సమాహ్వయం
బై రహి మించు నస్త్రమున • నాతని శీర్షముఁ ద్రుంప భూమిపై
ఘోరవిశుక్రదానవుఁడు • కూలె సురారులు వంత నొందఁగన్. 421

ఉ. సంతస మొప్ప దండిని వి•షంగుని మార్కొని ఘోరసాయకా
క్రాంతుని జేయుచున్ ముసల•ఖడ్గములన్ వడి నొవ్వఁజేయఁగా
నుంతయు భీతి లేకయె వి•శుక్రుని తమ్ముఁడు కాలదండ మ
ట్లెంతయు నొప్పునట్టి గద•నెత్తి యహంకృతిఁ గిట్టె దండినిన్. 422

చ. ఇరువురు బాహుయుద్ధమున • నేచి భుజోగ్రబలంబు మీఱఁగాఁ
దిరుగుచు నట్టహాసములఁ • దీక్ష్ణతరోక్తుల ఘోరభంగి సం
గర మొనరించి రుద్ధతిని • గాయము నొవ్వ గదోగ్రసంహతిఁ
బరవస మొప్ప మర్మములు • బ్రద్దలుగా దివిజుల్ భయంపడన్. 423

వ. గదాఘాతంబుల నన్యోన్యదేహంబులు వ్రయ్యలై రక్తపూరంబు గలుగున
ట్లర్ధరాత్రపర్యంతంబును యుద్ధం బొనరించి రప్పుడు వారాహి విషంగుని మీ
ఱి పౌరుషంబున. 424

తే. దనుజవరుకంఠసీమను • దర్ప మొప్ప
హలముఁ దగిలించి యీడ్చి ముఁ•సలవరంబు
చేత నొప్పింప నాతండు • నీ యిఁకేటి
పౌరుషం బని విడిచెను • బ్రాణవితతి. 425

తే. చూర్ణమైనట్టి రథముతో • సురవిపక్షు
నంగ మప్పుడు భూస్థలి • నాశ్రయించె
నంత మంత్రిణీదండిని • యాని శావ
శేష మచ్చట గడిపిరి • చింతమాని. 426

వ. ఆరాత్రియు భండాసురుని యాయుష్యంబుతోఁగూడ నంతంబునొంద వేగుట
యు సకలబలంబులఁ దమతమ శిబిరంబుల కనిపి మంత్రిణీదండనాథ లావృత్తాం
తంబంతయు లలితకుఁ దెలిపి రనిచెప్పిన విని యగస్త్యుండు హయగ్రీవునితో ని
ట్లనియె. 427

—లలితాభండాసురుల యుద్ధము.—

తే. అశ్వవక్త్ర! మహాప్రాజ్ఞ! • యమలధిషణ
వర్ణితం బయ్యె మంత్రిణీ•బలము సూక
రానన విషంగుఁ జంపిన•యట్టి గాథ
తెలుపఁ బడియె సమస్తంబుఁ • దెలిసికొంటి. 428

క. లలితారణవృత్తాంతము, తెలిసికొనం గోరినాఁడఁ • దెలుపుము భండుం
డలఘుబలోపేతులు సహజులు పడుట యెఱింగి యెట్టి • ఘోరతఁ జూపెన్.

సీ. ఎబ్భంగిఁ బోరాడె • నెట్లు సన్నాహంబుచేసెను సాహాయ్య•సిద్ధి నెట్లు
పొందె సోదరులును • బుత్త్రిలు చావంగ నాతని కెవరు సహాయు లైరి
వృత్తాంత మద్దాని • వినఁగోరినాఁడ నాకెఱుఁగంగఁ జెప్పుము • హితమనీష!
యనవిని హయవక్త్రుఁ • డనియెఁ గుంభజ! విను మద్ది పాపౌఘంబు•నడఁచుసర్వ

తే. కాంక్షితంబుల నొసఁగును• గాఢభక్తి, నయనయుగ్మంబునందుఁ బు•ణ్యతమకాల
మందు నైనను లలితామ•హాచరిత్రి, మెలమిఁ గీర్తింప లభియించు• హితములెల్ల.

చ. అనుజులు సంగరాంగణము•నందు మృతిం గను టేర్పడంగఁ దా
విని కడుశోకపూర మభి•వృద్ధిని బొంద వికీర్ణకేశుఁ డై
కనుఁగవ నశ్రుపూరములు • గ్రమ్మఁగ నేడ్చి మహాస్వనంబుతో
దనుజవరేణ్యుఁ డాత్మబల • దర్పము లెల్ల నడంగ బల్విడిన్. 431

వ. మఱియు నాతండు భ్రాతృవ్యసనకర్శితుం డై మూర్ఛిల్లి యేడ్చుచుఁ గుటిలా
క్షాశ్వాసితుం డై కలంకదేఱి క్రోధం బుప్పొంగ భ్రమద్భ్రుకుటీభీషణంబును,
క్రూరంబును నగు ఫాలం బొప్ప నంగారపాటలంబు లగు నేత్రంబులు మెఱయ
గృష్ణసర్పంబు వలె నిశ్వాసంబులను విడుచుచు మాటిమాటికిఁ గరపాళికఁ బ్రస
రింపఁజేయుచు హుంకారంబులను జేయుచు, నుత్పాతధారాధరంబుమాడ్కి
గర్జించుచుఁ జెంతనున్న కుటిలాక్షునితో ని ట్లనియె. 432

సీ. ఏదుష్టమతి మాయ • నిద్ధచారిత్రులౌ సోదరుల్ పుత్త్రులు • శుభతమాంగు
లనిఁ బడి రానారి • ఘనకంఠశోణితధారలచే భ్రాతృ • తనయశోక
వహ్నిఁ జల్లార్చెద • వాహినీనాయక! సేనల సిద్ధంబు • చేయు మింక
నని పల్కి కఠినాట్ట • హాసంబు చెలఁగంగ వజ్రపాతసమాన • వర్ష్మ మొకటి

తే. బాహుమధ్యంబునం దొడ్గి • ప్రబలతూణ
యుగము ధరియించి మౌర్వికా•త్యుగ్రనాద
మెల్ల దిక్కుల నిండంగ • జృంభణమునఁ
గాలహుతవహుభంగిని • గ్రౌర్య మడర. 433

ఆ. పురమునుండి వెడలెఁ • బురబహిర్ద్వారస్థ, సకలశస్త్రవర్మ•సాంద్రు లైన
తాళజంఘముఖులు • దర్పంబు పొంగ రా, నడిచెఁ గదనమున క•పుడు కడంగి.

వ. కుటిలాక్షపురస్సరులగు పంచత్రింశచ్చమూనాయకులు యుద్ధసన్నద్ధు లై వెంట
రాఁ గదలె నందు సర్వసేనాపతీంద్రుం డగు కుటిలాక్షుం డఖండశౌర్యంబున
మండిపడుచుఁ గోపంబు రూపంబుగొన్న విధంబున సమరోన్ముఖుం డగుచు నట్లు
చత్వారింశచ్చమూపతులు దీప్తాయుధులును, దీప్తకేశులు నై రెండు వేలనూట
యెనుఁబది యై దక్షౌహిణులతోఁ గూడి వచ్చుచుండ భండాసురుండు యుద్ధం
బునకు వెడల శూన్యకనగరంబు స్త్రీమాత్రావశేషం బయ్యె. సహస్రయుగ్య
సింహాఢ్యం బగు నాభీలాహ్వయరథం బెక్కి కాలాగ్నితుల్యంబును, జంద్రహాస

సమాకృతియు నగుయాతనాహ్వయఖడ్గంబును బట్టి భండుండు రణస్థలంబున
కరుగు నప్పుడు. 435

క. చతురంగంబుల పాదా,హతిఁ బుట్టిన ధూళి నింగి • కరిగెను సైన్యో
ద్ధతభారము సైరింపక, యతిజవమునఁ బోవుచున్న • యవనివిధమునన్. 436

తే. కొండఱిగిరి భూతల • మందు స్థలము
లేమి దివమునఁ గొండఱు • లీలఁబోలె
సైనికులస్కంధముల నెక్కి • సరభసమున
దిశలు భూమియు నింగియుఁ • దెలియకుండ. 437

క. ఇతరేతరసంశ్లేషా, ద్ధతిదుఃఖము నొంది చనిరి • ధైర్యంబులచే
వితతరథచక్రగజసం, హృతదేహులు భటులు పదిరి • మేదినియందున్. 438

చ. సురరిపుసేన లివ్విధిని • జూపఱు లెల్ల భయంబు నొంద సం
గరజయకాంక్ష లొప్పఁ జని • గాఢరవంబున నార్వ భండుఁ డు
ద్ధురరభసంబు మీఱఁగ వి•ధూతజగత్త్రియసింహనాదముం
గరమనురక్తిఁ జేయఁగ వి•కావిక లయ్యె జగంబు లన్నియున్. 439

తే. అశనిసంపాత సైన్యాట్ట•హాసములను, భండభీకరసింహార•వంబుచేత
సాగరంబులు శోషించె • జంద్రసూర్యు, లట్టె పాఱిరి తారక • లవనిఁ బడియె.

తే. అవనికంపించె దిగ్దంతు•లతిభయంబు, నొందె దివిజులు మూర్ఛిల్లి • రొగిసమస్త
శక్తిసేనలు భీతిల్లి • శౌర్యమెడల, విహ్వలతనొంది యప్పుడే • వెఱఁగుపడిరి.

క. జ్వలనాకృతిఁ దగుసాలము, వలయము చల్లార్చి మరల • భాసిలె దనుజా
వలి భండధనుర్నిస్వన,ముల లోకము శాబ్దమట్లు • మ్రోసెఁ గడంకన్. 442

మంజుభాషిణీవృ. దనుజేశు హస్తిరిపు • దారుణారవం
బున సంగరంబునకుఁ • బూని వచ్చుటల్
మన మందు నెంచి యభి•మాన మొప్ప నీ
శుని పత్ని వేగఁజనె • శూరతం గడున్. 443

చ. ఇతరులచేత భండదను•జేశుఁడు చావమి నెంచి సంగరం
బతులపరాక్రమంబు చెలు•వారుచు నుండఁగఁ దాను సేయఁగా
జతనము మీఱ నెంచి శర•సంతతిమంటలు గ్రక్కుచుండ ను
ద్ధతిఁ బయనంబు సేసె భుజ•దర్పమునన్ సురలెల్ల మేలనన్. 444

సీ. మహితచతుర్వేద•మహనీయచక్రంబు పురుషార్థఘోటకం•బును మనోజ్ఞ
నవపర్వయుక్తమా•నందధ్వజోపేతము నవపర్వస్థశ•క్తినికరాఢ్య

మభితస్థితోగ్రాంగ•నాళిసంపాలితంబును, మఱియు దశయో•జనసమున్న
తంబును రుచిరంబు • దనుజ భీకరముఁ జతుర్యోజనోత్సేధ•ధూతజలద
ఆ. మండలంబు నైన•మానిత శ్రీచక్రి, రథము నెక్కి లలిత•రాజశీర్ష
కదలె నంబతోడఁ • గదలిరి శ్యామాంబ, దండనాథసైన్య•తతులు గొలువ.

వ. శ్రీదేవి రథంబు వెనుక గేయకిరిచక్రరథంబులు జనియె. వారితోడ నృసిం హోష్ట్రనరవ్యాళమృగహయగజభేరుండశరభవ్యాఘ్రవాతమృగాదులును, బత్తులును వాహనంబులుగా ననేకశక్తులు చనిరి. యోజనమాత్రవిస్తారం బగు వహ్నిద్వారంబును జ్వాలామాలిక విస్తరింపఁ జేయ నాద్వారంబు శ్రీదేవి రథంబు ముంగలిగా సైన్యంబులు చనియె నప్పుడు దేవదుందుభులు మ్రోసె. పుష్పవృష్టులు గురిసె. మహాముక్తాతపత్త్రంబు వియత్తలంబున శోభిల్లె. శుభ శకునంబు లనేకంబులు గానంబడియె. 446

క. మంగళతమశకునంబుల, కంగన లెల్లను ముదంబు • నంది జవమునన్
సంగరము సేయఁ దొడఁగి ర,భంగురశౌర్యముల దనుజ•బలములు కలఁగన్.

చ. దనుజవరేణ్యుసైన్యమున • దారుణభంగిని శోణితాంబువృ
ష్టిని జలదావళుల్ గురిసె • జేరువ నక్కలు గూసె దివ్యకే
తనములయందు గృధ్రసము•దాయము వాయసముల్ చెలంగె న
స్థినికరము ల్వడిం బడియె• సేనలమధ్యమునందుఁ బెల్లుగన్. 448

ఉ. అంతట దానవోత్తముఁ డ•హంకృతితోఁ బురికొల్ప సేన ల
త్యంతకఠోరకుంతముస•లాదిమహాయుధరాజి వైచి కా
లాంతకు లట్లు శక్తినివ•హంబును దాఁకిన వారలెల్ల నొ
క్కింతయు భీతిలేకయె ని•కృత్తశరీరులఁ జేసి రుగ్రతన్. 449

ఉ. పంతమునం బరస్పరముఁ • బౌరుషముల్ చెలువారుచుండ దు
రాంతమహాట్టహాసముల • దారుణబాణముల న్నభస్థలం
బంతయుఁ గప్పఁగా నడరె • నయ్యెడ ధ్వాంతము గాఢరీతి ది
క్సంతతి తోఁపకుండగ వి•శాల తమాంగము పొల్పుమీఱఁగన్. 450

ఆ. జన్యహన్యమాన•సామజౌఘాంగని, ర్గళితరక్తబిందు•రాజివిహ్వాత
దేవవైరినికర•దివ్యాతపత్త్రౌఘ, మావరించె నప్పు • డవని నెల్ల. 451

ఆ. అంతరిక్ష మిద్ది • యవనీతలం బిద్ది, దిగ్విభాగ మియ్యె•దియని చూడ
ననువుపడకయుండె • నప్పు డొక్కరజంబె, కానఁబడియె వారి • కన్నులకును.

సీ. నృత్యదుగ్రకబంధ•నివహధూతాంతికపాదపంబును, దేవ•వైరి కేశ

శైవాలకలికౌఘసాంద్రంబు, శ్వేతాతపత్రసద్వలయౌఘభాసమాన
సితపంకజంబును, జృంభితచక్రహృత్కరిపదకూర్మసంకలిత, మతుల
శక్తి వ్రజధ్వస్తసకలదానవగజగండశిలోచ్చయకంబు, శస్త్ర
పతితచామరఫేనపటలంబు, తీక్ష్ణాసివల్లరీయుక్తటావలితలంబు

తే. దితిజవీరేతకణౌఘశుక్తితతిసంపు, టాభిరామము, దైత్యవాహానసమూహ
మీనన్రకాకులంబయి మీఱి రక్త, పూర మప్పుడు ప్రవహించె ఘోరగతిని.

వ. ఇవ్విధంబున మృత్యుత్రాసకరంబుగ యుద్ధంబు చతుర్థదినంబునఁ బ్రహరద్వయ
పర్యంతంబు సెల్లె నయ్యవసరంబున లలితాంబయు భండాసురుండును మారొకని.

మ. శరసంధానము బాణమోచనముఁ జంచద్భర్మతూణాంబకో
త్కరసంకర్షణముల్ గనుంగొన నశక్యంబై తగం జాపని
స్వరనాదంబులు దిక్కుల న్నెగడి సంక్షోభింపఁగాఁ జేయ నొం
డొరులన్ మీఱెడు పౌరుషంబుల మహోద్యోగంబునం బోరుచున్. 455

సీ. సంగరం బొనరింపఁ బొంగుచు లలితాంబ సంధానమోక్షణసరణి తెలియ
రాకయుండఁగ నప్డు భీకరాంబకముల దానవు వైవ సంధానమందు
నొక్కరీతిగ లస్త్రోద్గమనంబునఁ బదివిధంబులను నభంబునందు
శతవిధంబులుగాఁగ సైన్యసంప్రాప్తియందు సహస్రవిధముల దుష్టజనుల

తే. కుటిలదేహౌఘసంప్రాప్తిఁ గోటివిధము,లగుచు బాణంబు లడరి సైన్యంబునెల్లఁ
జెండ గ్రోధారుణాక్షుఁడై భండుఁ డపుడు, బాణజాలంబు వర్షించి పౌరుషమున.

తే. అంధతామిస్రకాఖ్యచే నలరు శస్త్రి,మును బ్రయోగింప శ్రీదేవి ముఖమునందుఁ
జెలునగవు దోఁప ఖండించెఁ జిత్రభంగిఁ, దరణి బాణంబుచే దానిఁదత్క్షణంబ.

క. దనుజుఁడు పాషండాస్త్రం,బును వైవఁగ లలిత తనదు బుద్ధి స్మరించెన్
ఘనగాయత్ర్యంబకమును, దనుజాస్త్రము భగ్నమయ్యె దాని జవమునన్.

తే. భండుఁ డంధాస్త్రమును వైవ బాణ మద్ది, శక్తిదృష్టుల బంధింప సారసాయ
తాక్షి చక్షుష్మతి యనంగ నలరుశస్త్రి,ధార ఖండించె దానిని దనుజు లదర.

సీ. శక్తి నాశాహ్వయాస్త్రంబుఁ బ్రయోగింప విశ్వావసు వనంగ వెలయు శస్త్రి
వర్యంబుచేఁ ద్రుంచె భండుఁ డంతకనామశస్త్రంబు విడిచిన శౌర్య మొప్ప
నంబయు మృత్యుంజయాస్త్రంబున నడంచెఁ బౌరుషోద్ధతిచేత భండుఁ డంత
శర్వశస్త్రాస్త్రౌఘసంస్మృతి నాశాఖ్యశస్త్రంబు విడిచిన సాహసమున

తే. ధారణాస్త్రంబున నడంచెఁ దద్భయంబు
వే భయాస్త్రంబు వైవంగ వెలఁది యభయ

దానవతుంబు నై తగు • మాని తైంద్ర
శస్త్రమును వైచి యయ్యస్త్ర•శక్తి నడఁచె. 460

వ. మఱియును భండాసురుండు మహారోగాస్త్రంబు శక్తిసేనలమీఁద ప్రయోగింప రాజయక్ష్మాదు లగురోగంబు లుప్పతిల్లఁ దన్నివారణసిద్ధికై లలితాంబనామత్రయమహామంత్రమహాస్త్రంబును బ్రయోగించిన నచ్యుతానంతగోవిందు లావిర్భవించి హుంకారమాత్రంబున నారోగంబుల నడంచి పరమేశ్వరికి నమస్కరించి తద్భక్తవ్యాధి మర్దనంబునకు నియోగింపఁబడి తదనుజ్ఞాతులై తమపదంబుల కరిగిరి. అంత దానవేంద్రుఁ డాయుర్నాశాస్త్రంబును బ్రయోగింపఁ గాలసంకర్షణి యనుశస్త్రంబున దాని నడంచె. వెండియు భండుండు మహాసురాస్త్రంబును విడిచిన మధుకైటభ, మహిషాసుర, ధూమ్రలోచన, చండముండాదులును, జిక్షురచామరరక్తబీజశుంభనిశుంభకాలకేయధూమ్రాదు లనేకులాయస్త్రంబునం దుద్భవించి కఠోరశస్త్రమండలంబుల శక్తిసైన్యంబును మర్దించి క్రీడింప హాహాకారంబుల సైన్యంబులెల్ల దైన్యంబు నొంది రక్షింపురక్షింపుమని లలితను శరణంబు వేఁడుటయు. 461

దుర్గావిర్భావము.

ఆ. వారి నూఱడించి • భూరికోపంబున, నట్టహాస మప్పు • డంబచేయ
దానఁ గలిగె నొక్క•తరుణి దుర్గాహ్వయ, దేవసంఘదివ్య• తేజ మలర. 462

చ. హరమధుసూదనాంబుపతి•హవ్యవహుల్ దమి శూలచక్రముల్
దరమును శక్తి నిచ్చిరి, ని•తాంతవరంబున నొప్పు చాపముల్
గురుతర మక్షయాంబకము • గూఢము నై తగు తూణముల్ మహా
దరమున వాయువిచ్చె రిపు•దర్పహరుం డగు వజ్రి వజ్రముల్. 463

తే. ఘంట నైరావతం బిచ్చెఁ • గాలదత్త, మయ్యె దండంబు పాశంబు • నబ్దిపాశ
ధరుఁడొసంగెనుగుండిక•ధాతయొసఁగె,జపకమొసఁగెనుధనదుండు•సంతసమున.

ఆ. ఖడ్గఖేటకములఁ • గరమనురక్తితో, మృత్యు వొసఁగె దివ్య•మృదులకాంతి
నలరు హార మిచ్చె • నంబుధివిశ్వక,ర్మయును భూషణాళి•మమత నొసఁగె.

సీ. సింహవాహన మెక్కి•చెలఁగుచు సైన్యంబు వెంటరాఁగను బహు•విధవిభూష
ణావళి ధరియించి • యత్యుగ్రచాపంబుఁ బూని కౌసరముఖ•దానవాళిఁ
జండికాహ్వయసప్త•శతియందు నెబ్భంగి దారుణయుద్ధకృ•త్యంబుచేసె
నట్టు లీదుర్గయు • నెట్టన నమయించి లలితకు మ్రొక్కినఁ • జెలఁగి నంబ

తే. మరలభండాసురుండు న•మ్మానిని గని,మూకశస్త్రంబు విడిచిన•మోముసందు
నుస్మితము దోఁప మందార•సురభిళాంగి, వైచె వాగ్వాదినీనామ•వరశరంబు.

భండాసురుండు పొలియుట

వ. ఆయస్త్రంబు మూకాస్త్రప్రభావంబు నడంచె నంత వేదతస్కరులగు నసురాధములను భండుండు పుట్టించుటయు. 467

తే. దక్షిణాంగుష్ఠనఖమునం • దన్విమత్స్య, మూర్తిం బుట్టించె నాతండు • భూరిశక్తి
వేదతస్కరులను జంపె • విక్రమించి, యర్ణవాస్త్రంబు వైచె భం • డాసురుండు.

మత్తకోకిల. వారిరాశిజలంబుచేం గడు • వారిజాక్షుల ముంపంగా
సారసాయతనేత్ర శ్రీశివ • సాధ్విపుట్టంగం జేసె రో
షారుణం బగు భాల మొప్పంగ • నప్పుడే యపసవ్యహ
స్తారవిందసుతర్జనీనఖ • మందుం గూర్మతనుం హరిన్. 469

తే. యోజనాయత విస్తృతి • నొప్పు దేహ, మరల నారాయణుం డుగ్రుం • డై స్వకర్ప
రమున శక్తుల వహియించి • రయము మెఱయ, జలమునంతయుం ద్రావె నా • శ్చర్యభంగి.

క. అంత హిరణ్యాక్షాస్త్రం, బెంతయు దోశ్శక్తి మెఱయ • నింతిపయిం గా
లాంతకుం డై వైచినం ద, త్సంతతి జనియించి రుగ్ర • సాధనధరులై. 471

క. ఉదయించి హిరణ్యాక్షులు, సుదతుల నందఱను గదల • నుక్కఁగఁ జేయన్
మద మెడలి దైన్యమున వా, రిదె వచ్చిరి దనుజులనుచు • నెంతయు నార్వన్.

లలితాదక్షిణహస్తో, జ్జ్వలమధ్యాంగుళినఖంబు • వలన జవమునం
గలిగె వరాహాకృతితో, నలరుచు నారాయణుండు • హర్షము మీఱన్. 473

ఆతండు వజ్రసమానం, బై తగు బోత్రమున దాన • వావళిం జూపన్
భీతిల్లక భండాసురుం, డాతతకోపమున భ్రుకుటి • నత్యుగ్రగతిన్. 474

ముడివెట్టినంత నా • ముడియందున హిరణ్యకశిపులు కోట్లుగాం • గలిగి సూర్య
సంకాశదేహులై • శక్తి సైన్యంబును బ్రహ్లాదుం బీడించె • భామినులకు
నలరునే ప్రహ్లాద • మతిపరమానందలక్షణ మద్ది బా • లకు నిరీతి
శ్రీదేవిసన్నిధిం • జేరంగా దక్షహస్తానామికాగ్రంబు • నట్టె కదలం

జేయ నందుం బుట్టె • సింహవక్త్రముతోడ
సటలు మెఱయుచుండ • నిటలనయన
యుక్తుం డై మురారి • యుగ్రనఖాయుధ
కలితుం డగుచు ఘోర • కాయుం డగుచు. 475

సహస్రబాహువు లొప్ప హిరణ్యకశిపుల సంహరించె నంత దానవుండు రోషంబున సర్వదైవతనాశనంబు మహాఘోరంబును నగు బలీంద్రాస్త్రంబును బ్రయో

గింపఁ దన్నివారణార్థ మంబికాదక్షిణహస్తకనిష్ఠికాంగుళిజనితులై వామన మూర్తులు పాశహస్తులై మహాభయంకరకాయంబు లొప్ప మహో త్సాహంబునఁ దదస్త్రంబు నుద్దండశక్తి నడంచిరి. అప్పుడు భండుండు హై హయాస్త్రంబు వైవఁ గార్తవీర్యార్జునకోటు లుదయించి సైన్యంబును దై న్యంబు నొందింప శ్రీత్రిపురాంబావామహస్తాంగుష్ఠనఖరంబునఁ గ్రోధసింహ నాదంబుతోఁ బరశురాముండు పుట్టి కఠోరకుఠారంబున వారలం జంపె. అం తట దనుజేంద్రుండు క్రోధహుంకారం బొనరింప నద్దానివలనఁ జంద్రహాసకృ పాణకలితుండును, సహస్రాక్షౌహిణీసేనాపరివారుండును, వింశతిభుజుండును నగు రావణాసురుండు కుంభకర్ణ మేఘనాదులం గూడి యుద్ధంబుచేయ శ్రీదేవి వామహస్తతర్జనికానఖరంబుఁ జలింపఁజేయుటయు నందుండి లక్ష్మణసహి తుండై కోదండరాముఁ డావిర్భవించి జటామకుటధారియు, వల్కలాంబరుండు ను, నీలోత్పలదళశ్యాముండును నై రావణకుంభకర్ణుల హరించె. లక్ష్మణుండు మేఘనాదుని సమయించె నప్పుడు భండుండు. 476

తే. ద్వివిదశస్త్రంబు వైచిన • దీక్ష్ణపింగ, ళాక్షు లా కపులాంజనే•యానుకారి
దేహములతోడఁబుట్టియుఁ•ద్వ్రిత్తిమెఱయ, శక్తిసైన్యంబునుఱుమాడ • సాహస [మున.

తే. వామకరమధ్యమాంగుళీ•వరనఖంబు
వలన శ్రీదేవి పుట్టించె • హలధరాఖ్యు
నీలవస్త్రోత్తరీయుని • నిర్మలాంగు
రాము నాతండు కపిసైన్య•రాజి నడఁచె. 478

వ. అంత రాక్షసుండు రాజాసురాస్త్రంబును బ్రయోగించిన నృపదానవులగు శి శుపాల, దంతవక్త్ర, కాశీపతి, పౌండ్రకవాసుదేవ, రుక్మ, శంబర, ప్రలంబ, బాణాసుర, కంస, ముష్టిక, చాణూర, పూతనా, శకటాసురాదు లుదయించి శస్త్రపాణులై విజృంభింప శ్రీదేవి వామహస్తారవిందానామికనఖంబున వాసు దేవుని బుట్టింప నాతండు చతుర్వ్యూహుండు గావున వాసుదేవ, సంకర్షణ, ప్ర ద్యుమ్నానిరుద్ధనామంబుల నొప్పి చతురాకృతులం దాల్చి వారి సమయించె నంతయుం జూచి రక్షోగణేశ్వరుండు. 479

తే. ధర్మవిప్లావకంబు దు•ర్దాంతమతిభ, యంకరంబును నై ఘోర•మైన యట్టి
కల్కిశస్త్రంబు వైచె న•క్కఱినసాయ, కమున నాంధ్రులుపుంద్రులు•కలిగిరపుడు.

క. శ్రుతినిందకులు కిరాతులు, క్షితిసురహింసకులు యవన•కృత్రిమశబరుల్
గతధర్ములు వర్ణాచా, రతతిని జెఱుపంగఁ బుట్టి • రాజిల్లుటయుఁ. 481

క. పరమేశ్వరి వామలస, త్కరమున నొప్పెడు కనిష్ఠి•కనఖంబున నా
మురహరుఁడు కల్కి తనువునఁ, దురగారూఢుండు నగుచుఁ•దోఁచి ముదమునన్.

తే. అట్టహాసంబు సేసిన • నశనిపాత, తుల్యతద్ధ్వని భీతిల్లి • దోర్బలంబు
భంగమగుటయుఁ బాఱిరి•పాపిజనులు, భండుఁ డెంతయు వెఱగంది•యుండ నపుడు.

వ. ఇప్పగిది దశావతారనాథులు లోకోపకారం బొనరించి పరమేశ్వరికి నమస్కరించి బద్ధాంజలిపుటులై యనుజ్ఞ వేఁడుటయుఁ బ్రతికల్పంబున మత్స్యాదిరూపంబుల నొంది ధర్మరక్షణంబు సేయుం డని లలిత నియోగింప వైకుంఠంబున కరిగిరి. ఇట్లు సకలాస్త్రంబులు వృథయగుటకుఁ జింతించి దానవనాయకుండు మహామోహాస్త్రంబు బ్రయోగించె. దానం జేసి సైన్యంబెల్ల మూర్ఛిల్లుటయు శాంభవాస్త్రంబున నయ్యస్త్రంబును నడంచి లలిత భండాసురుమేన నారాచంబులు నిగుడించి నిలువరించె నప్పుడు. 484

ఉ. భండన భీముఁ డుద్ధతుఁడు • పాపమనీషుఁడు క్రూరకర్ముఁ డీ
భండమహాసురుండు సుర•వారము నెల్లఁ గలంచెఁ గాన ను
ద్దండభుజాబలస్ఫురణఁ • దన్వి సమస్తభయాపహర్త్రి యీ
భండనమందుఁ జంపు వెన • వచ్చి కనుండని చెప్పఁబోయె నాఁ
జండగభస్తియుస్తమయ • శైలము చెంతకుఁ బోయె నయ్యెడన్. 485

క. కనుఁగవ నిప్పులు రాలఁగ, ఘననారాయణమహాస్త్ర•కంబున సైన్యం
బును జంపె లలిత దివిజులు, మునులును గీర్తింపుచుండ • భుజబల మొప్పన్.

తే. పాశుపత మనుశస్త్రంబు•వైచి యంబ, చంపె నలువంద్రవీరుల•సైన్యపతుల
నప్పు డసహాయుఁడై నిహ•తాఖిలస్వ, బంధుపుత్త్రబలుండునై•భండుఁ డుండ.

చ. కనుఁగొని సర్వమానులను • గాఱియపెట్టినవాఁడు దేవతా
వనితలఁ జెట్టవట్టి మద•వైఖరి బాధల పెట్టినాఁడు దే
వనికరముం గలంచి తమి • స్వర్గముఁ జేకొని మించినాఁడు వీ
నిని రణమందుఁ జంపి వర • నిర్మలకీర్తిని గాంచు టొప్పగున్. 488

సీ. బలశాలి లోకవి•ప్లవకారి సజ్జనవైరి కావున వీని • బాహుశక్తి
మెఱయంగ వధియించి • మేదిని నిష్కంటకంబుగాఁ జేసి దుః•ఖజలమగ్న
దేవతామనముల • దీపింపఁజేసెద నని మహాకామేశ్వ•రాస్త్రవరము
నారియందునఁ గూర్చి • భూరిరోషంబున భండుఁ డీయస్త్రప్ర•భావమునను

తే. సమయుఁ గావుత మని పల్కి • చండశరము, విడువ ఖరకరుదీప్తిచే • వెలసిపోయి
భండుప్రాణంబులనుగొనె • భవ్యశరము, దేవతలు మింటనుండి కీ•ర్తింపుచుండ.

క. వక్షంబుగాఁడి వీఁపున, నక్షయగతి శస్త్రిమరుగ ♦ నప్పుడు దితిజహా
ర్యక్షుఁడు ధరపైఁ బడియెను, బక్షంబులు తెగినఁ బడెడు ♦ పక్షి విధమునన్. 490

తే. అంత లలితాంబక్రోధారు♦ణాక్షిశిఖల, బాలవనితాదియుక్తమై♦పరఁగు శూన్య
కాహ్వయపురంబు భస్మమై♦యవనిమాత్ర, శేషమయ్యె నక్షణమాత్రఁ♦జిత్రభంగి.

వ. ఇట్లు భండుండు సమయుటయు శూన్యకపురంబు భస్మంబగుటయుఁ గాంచి త్రిలోకంబులు హర్షించె. విజయశ్రీయుత యగు శ్రీదేవిం గాంచి శక్తిసైన్యం బెల్ల భేరికాహాళాదుల మ్రోయించె. దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. నింగి దేవదుందుభులు మ్రోఁగె. వాసంతపవమానుండు వీచె. దిక్కులు ప్రసన్నంబులయ్యె. నభంబు నిర్మలం బయ్యె. దేవగంధర్వాంగనలు మంగళారార్తికంబు నొనరించిరి. రంభాదు లాడిపాడిరి. గరుడోరగసిద్ధకిన్నరాదు లమ్మహాశ్చర్యకార్యంబును స్మరించి సంతోషాంబుధి మునింగిరి. తుంబురునారదసరస్వతులు జయమంగళపద్యంబులఁ బాడిరి. వసిష్ఠాదులు ఋగ్యజుస్సామరూపమంత్రంబుల స్తుతించి యథర్వరూపమంత్రంబుల హుతవహునందు వ్రేల్చిరంత సకలసురమునివరస్తూయమానయై వ్రీడానమ్రీకృతాననయై లలితాంబ ప్రయాణోన్ముఖి యగుటయు ముందు సంపత్కరియు, దానిపిఱుంద దివ్యపాశాయుధంబును దాల్చి యశ్వారూఢయుఁ దమ తమ సైన్యంబులం గూడి శ్రీదేవీపార్శ్వద్వయంబు ననుసరించి నడిచిరి. మంత్రిణీదండనాథలు రథపుంగవారూఢలై చనిరి. ఇట్లు లలితాంబ దేవకార్యం బొనరించి విజయశ్రీసమాయుక్తయై కామేశ్వరుం గూడి వెలింగి సంగరకర్మఖిన్నంబును, భండాసురప్రబలసాయకాగ్నితప్తంబును నగు సైన్యంబును సూర్యుం డస్తమింప శిబిరంబులకుం దోడ్కొని చనియె. నివ్విధంబున జగత్కంటకుం డగు భండాసురుని వధించిన లలితాప్రభావంబు నెవండు భక్తియుక్తుండై పఠించు నతనికి యుద్ధభయంబు తొలంగు. అష్టసిద్ధులును ముక్తియుఁ గరతలామలకంబువలె నగు. ఇట్టి పవిత్రలలితాచరిత్రంబు సమస్తపాపహరంబు. వాంఛితార్థప్రదంబని కుంభసంభవున కెఱింగింప హయగ్రీవుం గాంచి తరువాతివృత్తాంతంబు నెఱుంగం గోరి యగస్త్యుం డిట్లనియె.

క. తురగానన! ప్రాజ్ఞోత్తమ, పరమేశ్వరిచరిత మెల్ల ♦ వర్ణింపఁ బడెం
జరితామృతపానంబునఁ, గరము ప్రమోదంబు గల్గెఁ ♦ గా మదిలోనన్. 493

క. సచివేశీ కిరివక్త్రిల, ప్రచురచరిత్రంబు వింటి ♦ స్వాంతగతము కా
విచికిత్సలెల్లఁ దీఱెను, సుచరిత యటమీఁది కథను ♦ సొంపుగఁ జెపుమా.

క. అని యడిగినఁ గుంభజునకు, మనమున సంతోష మలర ♦ మహనీయవచ

స్వ్వనమున హయవదనుం డిట్లనియె మహోమహానివర్య!♦యానిశి గడువన్. 495

క. ఖరకిరణుం డుదయాద్రిశి, ఖరగతుఁ డై యొప్పుచుండఁ ♦ గాంతాజనముల్
పరమారణకృత్యనిరం, తరకష్టము నొంది బడలి ♦ తత్తఱపడఁగన్. 496

క. వారల నంబిక కరుణా, భూరికటాక్షేక్షణములఁ ♦ బోలఁగఁ జూడన్
నారీమణు లక్కరుణా, ధారల గతభేద లై ము♦దంబునఁ బొదలన్. 497

క. దనుజేశ్వరుఁ డగుభండుని, హననంబునఁ దృప్తి నొంది ♦ యంబను గొలువం
జనుదెంచిరి ధాతృజనా, ర్దనశక్రిపురోగమామ♦రవ్రజము లొగిన్. 498

చ. సురపతి ముఖ్యదిక్పతులు ♦ సూర్యశశాంకులు సిద్ధసాధ్యకి
న్నరగరుడోరగాద్యఖిల♦నాకులు రుద్రులు యక్షు లశ్వినుల్
మురరిపుధాతృశంకరులు ♦ మోదమునం జనుదెంచి రంబికా
చరణసరోజముల్ గొలువఁ ♦ జయ్యన భక్తిరసప్రపూర్ణు లై. 499

క. దనుజులు ప్రహ్లాదాదులు, వినయము భయభక్తు లొప్ప ♦ విశ్వేశ్వరిప
ద్వనజముల కెఱఁగి యిట్లని, వినుతించిరి కేలు మోడ్చి ♦ వేదోక్తముగన్. 500

బ్రహ్మాదులు లలితాంబను స్తుతించుట.

తే. సకలజగదభినాయికా ♦ శౌర్యధుర్య, భండదనుజఘ్ని కామేశి♦వామకేశి
త్రిపురహరపత్ని త్రిపురేశి ♦ దివ్యచరిత, భక్తిసాష్టాంగపూర్వక ♦ వందనంబు.

సీ. చింతామణివి సర్వ♦చింతితార్థద వచింత్యవు చిదాకృతివి చి♦త్రాంబరాఢ్య
వంబిక చిత్రలో♦కావనదక్షువు నాయిక విదిగో వం♦దనము నీకు
మోక్షప్రదాత్రివి ♦ ముగ్ధశీతప్రభఖండచూడవు స్మిత♦కలిత వంబ
ముద్రేశ్వరీకృత♦భూరిరాజ్యావనతంత్రవు జనని వం♦దనము నీకు
తే. క్రూరరాక్షసభేదివి ♦ కోమలాంగి, క్రోడవక్త్రాసుపాలిత♦గూఢసైన్య
సముదయాసర్వలోకేశి ♦ సారసాక్షి, భక్తపాలిని శ్రీదేవి ♦ వందనములు. 502

సీ. అంగదేవీషట్క♦శృంగారపరివారసేవిని సాంగత్ర♦యీవిమృగ్య
చారిత్ర, షట్చక్ర♦సంస్థిత, షడ్భావకాయా, షడూర్మివి♦ఘాతకర్త్రి
కామేశ్వరీముఖ్య♦కాంతావిలాసిని కంజాక్షి, కామిని ♦ కామదాత్రి
కామేశసుందరి ♦ కామకళారూప, మానిని, దివ్యౌఘ♦మానవౌఘ
సిద్ధౌఘరూపిణి ♦ సృష్టికారిణి, దినేశసహస్రకాంతిపి♦స్ఫారదేహ
తే. దివ్యసుందరి, లోకేశి ♦ దేవదేవ, భామినీ, సర్వసాక్షిణి♦ భక్తవాంఛి
తార్థదాయిని, సుందరీ♦యంబుజాక్షు, ధాతృపూజిత, నీకు వం♦దనము లంబ.

తే. సర్వదాణిమాద్యష్టక • సతతసేవ్య, మానరూపిణి, శంకర • మంచవాసి
నీ, సవిత్రురూపిణీ, సదా • నిర్మలాంగి, వందనంబులు నీ కివె • సుందరాంగి.
సీ. బ్రాహ్మ్యాదిమాతృవా • రనిషేవ్యపాదాబ్జ, బ్రహ్మప్రియా సర్వ • బంధహంత్రి
బ్రహ్మామృతోజ్జ్వల • ద్భవ్యనదీరాజహంసి, శ్రీబ్రహ్మేశి • యంబ సర్వ
సంక్షోభిణీముఖ్య • సర్వముద్రాసేవితా, సంకసంహర్త్రి • భాసురాంగి
సంసారతారిణి • సారసాయతనేత్ర, నిత్యాకళానాథ • నిత్యరూప
తే. నిర్మలానందదాయిని • నీలచికుర, వారరుచిర, యనంగ పు • ష్పాముఖైక
సేవితా, మంగళేతర • భావహంత్రి, మందగామిని నీ కివె • వందనములు. 505
సీ. సంక్షోభిణీముఖ్య • సచ్చతుర్దశమహార్చిర్మాలికావృత • సిద్ధదీప
మగు నాత్మధరియించి • యమలాశయవు నైన నీకు వందనములు • నిర్మలాంగి
సర్వసిద్ధ్యాదిక • శక్తిబృందార్చిత, సర్వజ్ఞరూపిణి • సర్వశక్తి
సర్వసిద్ధిప్రద • సర్వశక్త్యధినాథ, సర్వామరేంద్రవాం • ఛాప్రదాత్రి
తే. దేవి, వశినీముఖామల • దివ్యవామ, లెల్లఁ గొలువంగ నెగడెడు • తల్లి వారి
ధరవినీలకచా, వర • దా, త్రిలోక, పాలినీ, కామసుందరీ • వందనములు. 506
చ. శరవరచక్రపాశముఖ • సాధనముల్ ధరియించి క్రూరక
ర్బురవిభుభండముఖ్యులను • బూని వధించి కృపాంబురాశివై
సురలను భూసురోత్తముల • శోభిలఁ జేసి సమగ్రకాంతిసుం
దరివయి యొప్పుచున్న లలి • తా యిదె నీకు నమస్క్రియాతతుల్. 507
తే. అంబ కామేశి, వజ్రేశి • యనఁగ నొప్పి, కళ్యవై, కాలరూప వై • కాలమెల్ల
మార్పనేర్పరి వై, దైత్య • మండలంబు, సమయఁజేసిన నీకిదె • సాధ్వి మ్రొక్కు.
తే. బిందు సంస్థితి నొంది యా • బిందురూప, వగుచు బ్రహ్మాత్మికవు సదా • నిగమవినుత
వై చిదానందరూపవై • హారరాజి, నలరు నీకివె వందన • ములు మహేశి. 509
తే. కామసుందరు నుత్సంగ • కమున నున్న, కాలరూపవు కాళివి • కామితార్థ
దానదక్షవు కందళి • తాను కల్ప, వంబ వందనశతము రో • లంబచికుర. 510
క. [1]సారంగశాబనయనా, [2]సారంగమనోజ్ఞగమన • [3]సారంగాంగీ
[4]సారంగవాగ్విలాసిని, [5]సారంగసమూహవేణి • [6]సారంగాస్యా. 511

---

1 సారంగశాబనయనా = ఇఱ్ఱిపిల్ల నయనములవంటి కన్నులుగలదానా ! 2 సారంగమనోజ్ఞగమన = ఏనుఁగువంటి మనోహరమగు నడకగలదానా ! 3 సారంగాంగీ = రక్తాధికపీతవర్ణమైన దేహము కలదానా ! 4 సారంగవాగ్విలాసిని = కోయిలయొక్క వాగ్విలాసమువంటి వాగ్విలాసముకలదానా ! 5 సారంగసమూహవేణి = తుమ్మెదగుంపువంటి కొప్పుగలదానా ! 6 సారంగాస్యా = కమలమువంటి మోముకలదానా!

క. సకలేశి! త్వత్ప్రిభావ, ప్రకటీకృతశక్తికలన • భండాదిదురా
త్మకుల హరించి మహాముని, నికరము రక్షించె బాల•నియతి దలిర్పన్. 512
చ. దనుజులు దేహసారమును • ద్రావ నశక్తత గన్నవారలన్
ఘనకరుణాంతరంగమునఁ • గావఁ దలంచి నవీనదేహముల్
గనదురుకాంతియుక్తములఁ • గ్రమ్మఱ నిచ్చి పరాక్రిమాదికం
బును దయచేసి ప్రాణములఁ • బోసితి కాదె దయాతరంగిణీ. 513
తే. శంభునాథు ద్వితీయ తేజఃప్రసార
తనుఁడు శంకరుఁ డిప్పుడు • స్థాణుమాని
యాశ్రిమంబున గతభోగుఁ • డై సతీవి
యోగమునఁ దీవ్రితపమూని • యున్నవాఁడు. 514
సీ. అద్రివంశంబున • నవతరించె నుమాఖ్యతరుణి; యాకన్య శం•కరునిగూర్ప
నమకట్టి మేమెల్ల • స్మరుని బ్రేరేపించి పంపిన ఘోర త•పస్సమాధి
విఘ్నకోపంబున • విషమాక్షిహుతవహజ్వాలలఁ గాల్చె నా•భస్మజనితుఁ
డయ్యె నీభండాఖ్యుఁ • డసురుఁ డాతని జంపి మమ్ముఁ గాచితి వంబ•మానిమిత్త
తే. మచటఁ జచ్చిన మన్మథు•నమలకరుణ, మరలఁ బ్రిదికింపు మీభర్తృ•మరణఖిన్న
యైన రతికాంతవైధవ్య • మనుభవింపఁ,జాలకున్నది రక్షింపఁ • జనుముదమున.
క. పరమేశి! త్వదుత్పాదితు, స్మరుఁ గూడి సనాథ యగుచు • సంతసమున న
మ్మరునికళత్రిము సౌఖ్య,స్ఫురణను గను; వినుము శివుఁడు • భూరితపంబున్.
క. ఒనరించుచు స్థాణ్వాశ్రిమ,మున నుండుట దుఃఖకరము • మోహితుఁ డగు నీ
మనసిజునివలన నీశుఁడు, వనితను గ్రిహియించు మరల • భవ్యమనీషన్. 517
క. చిరకాలము గిరిపుత్త్రిక, పరిచర్య యొనర్చుచుంటఁ • బాటింపక యీ
శ్వరుఁ డున్నవాఁడు నియమ,స్ఫురణను గావున మనోజుఁ • బుట్టింపఁ దగున్.
ఆ. తత్సమాగమమునఁ • దనయుండు గీర్వాణ,సైన్యవిభుతనొంద• సాంద్రబలుఁడు
పుట్టు భండమిత్త్రు • భూరిబలోత్సాహుఁ, దారకాఖ్యుఁ డనెడి•దనుజుఁ జంపు.
చ. దనుజవరేణ్యుఁ డై నెగడు•తారకుఁ డీశ్వరపుత్త్రివర్యుచే
ననిఁ బడెనేని ప్రాణములు • హాయిగనుండును మాకు నంతటన్
జనని! పరేశ్వరీ; మదనుఁ • జయ్యన సృష్టి యొనర్చి దుఃఖవే
దనఁ గృశ యై తపించు రతి • దారుణబాధ నణంపుమీ దయన్. 520
చ. రతిపతిహీన యై దివిజ•రాజికి సాయముచేయఁ బూని యే
పతి పరలోకమొందె నని • వ్యాకులచిత్తయు శోకపూరపూ

రితనయనాంబుజాతయు సు•వృత్తసుఖక్రియయున్ సదా సుపూ
జితభవదీయపాదసర•సీరుహయున్ గతసౌఖ్యరాశియున్. 521

తే. త్యక్తభూషయు నై సర్వ•దా నిజేశు, మదిఁ దలంచుచునున్నది • మమతరతిని
నాథవతిఁ జేయు మని వేఁడి•నాకివరులు, రతిని లలితకుఁ జూపంగ•రమణిఁ జూచి.

తే. కుంభసంభవ! యటమీఁదఁ • గూర్మిలలిత, దీనవక్త్రను శోకఖే•దినిని ఘూర్ణ
కుంతలను ధూళిధూసర•సంతతార్తి, గతతనూవల్లి రతిఁ గాంచి•కరుణమెఱయ.

మన్మథుఁడు జీవించుట.

సీ. కామేశ్వరియు మహా•కామేశ్వరుని గటాక్షేక్షణంబునఁ జూడ • నిద్ధరూపుఁ
డభినవశృంగారుఁ • డతివిలాసుఁడు స్మయమానముఖాబ్జుఁడు • మదసమగ్రుఁ
డిక్షుబాణుండు, పుం•డ్రేక్షుకార్ముకుఁడును,సకలభూషుఁడు ద్విభు•జకలితాంగుఁ
డావిర్భవించెఁ బూ•ర్వాధికరుచి యయి ప్రాగ్జన్మపత్నిని • రతిని మోద

తే. సాగరంబునఁ దేల్చుచు • స్మరుఁడు రతియు
జీవితుని భర్తఁ గాంచుచుఁ • జిత్తమందు
లలిత మహిమను బొగడుచుఁ • జెలఁగుచుండె
నంత మదనుండు కేల్మోడ్చి • యంబ కనియె. 524

క. ఏతనువు శంకరేక్షణ, పాతమునన్ భస్మమయ్యె • భవపత్ని మహా
ప్రీతమతి వైన నీదృ, క్పాతంబున మరలఁ గలిగె • భవ్యం బగుచున్. 525

ఆ. కాన నీకు నేను • సూనుండ దాసుండ, నెద్ది యాజ్ఞయైన • నెసఁగు భక్తి
నట్లు చేయువాఁడ • నాజ్ఞ యేమన విని, లలిత మదనుతోడ • బలికె నిట్లు.

మత్తకోకిల. శ్రీకరుండవు గమ్ము స్వేచ్ఛఁ జ•రించుచుండుము పుత్త్రికా
లోకమోహన మాను నీదు వి•లోలదృష్టిశరౌఘముల్
ప్రాకటంబుగ నీదు శౌర్యము • భంగ మించుక లేకయే
జోక గల్గి యొసంగు నెప్పుడు • సూరిసంస్తుతి నొందుమీ. 527

ఆ. నీదు బాణపతన•నిర్గతధైర్యుఁడై, శంభుఁ డద్రిసుతను • సజ్జనాను
మతిని బత్నిఁ గాఁగ•మమతఁ గ్రహించు; సహస్రకోటిమదను•లసమతనులు. 528

క. నీతనువున నుద్భవులై, ఖ్యాతిగ సర్వాంతరంగ•కంబుల రతిసం
ప్రీతములుగా నొనర్తురు, చేతోభవ! మత్ప్రసాద•సిద్ధుఁడ వగుటన్. 529

చ. హరుఁ డతికోపియైన భవ•దాయతదేహము గాల్ప లేక యా
ధరసుతయందుఁ బ్రేమ గను•దర్పక! త్వద్గురుబాణపాత స

త్వరుఁ డయి భార్యగాఁ గొని ని♦తాంతముదంబున నర్ధదేహముం
బరఁగ నొసంగు దప్ప దిది ♦ భాసురశక్తియు నీకుఁ గల్గెడిన్. 530

ఆ. మత్ప్రసాదదివ్య♦మహిమ నిప్పటినుండి, బ్రాణితతికి నెఱుఁగఁ♦బడని యట్టి
తనువునొంది యెట్టి ♦ ధైర్యశాలుల కైన, మోహకుండ వగుము ♦ సాహసమున.

క. నిను నెవ్వఁడు నిందించునొ, ఘనుఁడైన నపుంసకత్వ♦కలితుం డగునే
జను లతిపాపులు మద్భ,క్తనికరమున కెప్డు కీడు ♦ తలఁతురొ మదిలోన్. 532

క. వారి నగమ్యులు నగు న,వ్వారిరుహాస్యలను బొందు♦వారిగ నెంతో
భూరితరశక్తిఁ జేయుము, మార! యవశ్యంబు వారి ♦ బ్రమందింపు మిఁకన్. 533

సీ. ఎవ్వారి మనముల ♦ నెనఁగు మత్పూజైకరతి వారినెల్ల స♦ర్వసుఖకలితు
లనుగా నొనర్పుమం♦చనునయ మొప్పంగ లలితాంబ చెప్ప నం♦జలి యొనర్చి
శిరసావహించి యా♦స్మరుఁడతిజవమునఁ జనియెనీశుని మోహ♦మున మునుంగఁ
జేయు వేడుకతోడ ♦ జృంభించి యంతటఁ దద్రోమకూపవి♦తతులవలనఁ
బలుగుండ్రు మదనులు♦భవ్యాత్మకులు మనోహరమూర్తులుదయించి♦పరఁగిజగము

తే. మోహ మొందంగఁజేసిన ♦ ముదము నొంది
స్మరుఁడు స్థాణ్వాశ్రమమునందు ♦ శంభు మరల
నుగ్రశక్తి జయింపంగ ♦ నూహచేసి
చనియెఁ బరివారములఁ గూడి ♦ సరభసమున. 534

వ. మిత్రుండగు వసంతుండును, సేనాని యగుచంద్రుండును, బీఠమర్దుండును వెంటరా మందానిలసుందరస్యందనంబు నెక్కి పుంస్కోకిలగళస్వానకాహళీసంయుతుండై శృంగారవీర్యసంపన్నుండును, రత్యాలింగితవిగ్రహుండును నగుచు జైత్రం బగుశరాసనంబును జలింపఁజేయుచుఁ దపోనిష్ఠ నున్నచంద్రమౌళిని బుష్పశరంబు లడరించి నొంచిన శంకరుండు. 535

చ. సుమశరుబాణముల్ తనువు ♦ సోఁకినఁ జంచలితాంతరంగుఁడై
మమత నొనర్చు నత్తపము ♦ మాని విరాగతఁ బాఱఁ ద్రోలి నె
య్యమున గ్రహించియున్న నియ♦మావళినెల్లఁ ద్యజించి పార్వతీ
సుమహితరూప వైఖరిని ♦ సొంపగు మోమును లోఁ దలంచుచున్. 536

సీ. నిట్టూర్పునిగుడించి ♦ నిర్గతధైర్యుఁ డై పాండురతమగండ♦మండలంబు
దనరంగ ధైర్యంబు♦చనఁగఁ బార్వతిదృష్టపూర్వను మఱి మఱి♦పూన్కి దలఁచి
తలఁచి మన్మథబాణ♦దహనసంతప్తుఁ డై కుందుశూలికి నప్పు ♦ డిందురేఖ
గంగయుఁ దాపంబుఁ♦ గ్రమ్మఱింపఁగఁ జాలదయ్యె నందీశ్వరుం♦ డాదియైన

తే. ప్రమథగణములు పుల్లపుష్పములు దెచ్చి, రూర్ధ్రశయ్యావిధానంబు నాచరింప
నందుఁ శయనించిపొరలుచు నంది హస్తతలము చేయూఁతఁగా శివుఁ డలజడిఁబడి.

తే. పుష్పతల్పాంతరంబునఁ బొరలె నప్పు
డిందు ఖండచ్యుతామృత హిమజలంబు
లమలసుకుమారపుష్పపర్యంకమతని
మదను జ్వరతాపమహిమను మాన్ప వయ్యె. 538

వ. అంత శంకరుండు శిలీభూతహిమపయఃపట్టంబులఁ గప్పి నఖంబుల శైలసుతా
రూపంబును జిత్రపటంబున లిఖించి తదాలోకనంబున ననంగార్తిని వృద్ధి నొం
దించె. మఱియుఁ జిత్రపటంబున హ్రీనమ్రవదనయై కటాక్షవీక్షణంబుల నొ
ప్పు పార్వతిని లిఖించి యప్పటంబు నంగంబునం దునిచి యంతకంత కెక్కు
డగు మదనతాపంబుచేతఁ గృశీభూతుం డై సర్వకాలంబులయందును గిరిసుతం
గాంచుచు నంతర్జనితోన్మాదంబునఁ దన్మయీభూతహృదయుం డై తత్పరా
యణుం డై తత్కథాసుధానీతసమస్తసమయుం డై, తచ్ఛీలవర్ణనవ్యగ్రుండు
ను, దద్రూపాలోకనోత్సుకుండును, దచ్చారుభోగసంకల్పమాలాకరణమాలి
కుండును నగుచుఁ దన్మయత్వంబు నొంది సంతాపంబు భరింపఁజాలకయున్న
శంకరుని గందర్పుండు విశిఖంబుల నొంచి పార్వతినిగూడ నట్లే గభీరభూరిసం
తాపకరాశుగనికరంబుల నలయించె నప్పు డప్పార్వతియు. 539

క. విరహజ్వాలామలినో, ద్ధురనిశ్వాసానిలములఁ దోఁగుచు శుష్కా
ధరదళ యై తెలుపెక్కిన, నిరుపమగండస్థలముల నెగడుచుఁ గినుకన్. 540

ఆ. తలిరు పాన్పునందు లలితమా నాహార, మందు నిద్రయందు డెందమలర
కుండుటయును జెలులు చండికి శైత్యోప, చారముల నొనర్ప స్మరుఁడు కినుక.

ఆ. మరల మరలఁ దీవ్రమార్గణంబులఁ గ్రుచ్చి, వెగడుపడఁగఁ జేయ విహ్వలాత్మ
యగుచు రోగశాంతి యా నుపాయములేక, మన్మథాగ్ని యందు మ్రగ్గి మ్రగ్గి.

క. విరహానలతాపంబున, గురుఁడగు తుహినాద్రిమనసుఁ గుందఁగఁ జేయం
బరుషం బగు సుతవిరహము, హరువిషయమునందె యనుచు నద్రితలఁచుచున్.

తే. తల్లి! తపమున శంకరు నుల్లమలరఁ, జేసి యీశుని భర్తగాఁ జేసికొనుము
వంత నొందంగనేలని పలుక నతని, యందె గౌరీశిఖరమున యందె నియతి.

మ. పతిలాభం బెడఁ గోరి దుష్కరము నై వర్ణింప నొ నట్టిఘో
రతపంబున్ మహితంబుగా నియతి నా రాజాస్యయున్ వహ్నులన్
జతనం బొప్పఁగ నిల్పి గ్రీష్మమునఁ జం చద్భక్తిఁ దన్మధ్యసం

స్థితి మీఱంగ దివాకరుం గనుచుఁ జే•సెం బూన్కి హేమంతమం
దతిశీతోదకసంస్థితిం దనరి య•త్యంతంబు నిష్ఠారతిన్. 545

చ. అచలమనీషతోఁ దప మ•హార్నిశముల్ వడి సల్పె నిట్టు ల
వ్విచికిలగంధితన్ గుఱిచి • వింతతపం బొనరించు టెంచి య
య్యచలపుసమ్మతిన్ గిరిశుఁ • డా తరుణీమణిఁ బెండ్లియాడె విం
తచెలువు తోఁపఁగా సురవి•తానము లెంతయు సంతసింపఁగన్. 546

ఉ. శీతగిరీంద్రదత్త యగు • చేడియఁ గూడి శివుండు సంతత
ప్రీతమనంబుతో శ్వశుర • వేశ్మమునం జిరకాలమున్ స్మర
ప్రీతిగఁ గేళిసల్పి మఱి • స్వీయనివాసము నొంది భక్తసం
ఘాతముఁ గూడి సౌఖ్యముగఁ • గాలముఁ బుచ్చె మనోహరంబుగన్. 547

వ. మఱియు నీశ్వరుండు సందీపితకాముం డై కైలాస మందర వింధ్య హేమశైల మలయ పారియాత్రకాది పర్వతవరంబులయందును, నానావిధమనోహర తరుగుల్మవిచిత్రితంబు లగు స్థలంబులయందును విహరించుచు నిర్భరస్వీయశుక్లంబు విడువఁ బార్వతి భరింపఁజాలక భూమియందుఁ ద్యజించిన నాభూమియు వహ్నియందును, హుతవహుఁడు కృత్తికలయందును, వారు గంగానదీజలంబునందును, గంగ శరవణమందును గ్రమంబున విడిచిరి. ఆశరవణంబున నుత్పన్నుండై మహావీరుండును, షడాననుండును నగుకుమారుండు చెలంగె. పదంపడి గంగ శివు నంతికంబు నొందింప నాతనిం బ్రీతుం డై శంకరుండు వృద్ధినొందించుచుండె నంత. 548

చ. దినదినవర్ధమానుఁ డయి • తీవ్రపరాక్రమయుక్తుఁ డైన యా
తనయుని గాంచి శంకరుఁడు • తద్దయుఁ బ్రీతిని సర్వవిద్యలన్
ఘనశరవిద్య నేర్పిన ని•కామపరాక్రమ మొప్పఁ దండ్రిచే
ననుమతుఁ డై కుమారుఁడు సు•రాధిపసైన్యపతిత్వ మొందుచున్. 549

క. తారకుని సర్వదనుజో, ద్ధారకుని సమస్తదేవ•తామాని మహా
మారకుని జంపె ననిలో, భూరిపరాక్రమము దేవ•ముఖ్యులు పొగడన్. 550

చ. దనుజవరేణ్యుఁ గీటణఁచి • దానవబాధలఁ జిక్కకుండఁగా
మునులను గాచి దేవతల • భూరిముదంబును బొందఁజేసి త
న్ననుపమరీతిఁ గొల్చెడు మ•హాత్ముని బుత్త్రిని గాంచి సంతసం
బున నిఖిలాస్త్రశస్త్రముల • భూతవిభుం డసమానుఁ జేసినన్. 551

బలరిపుండు మెచ్చి • భామిని దేవసేనాఖ్య నొసఁగ స్కందుఁ • డతివఁ బెండ్లి

యాఁడె దేవసేన ♦ యాషణ్ముఖునిగూడి, సంతసమునఁ బొదలి ♦ సౌఖ్యమొందె.

వ. ఇవ్విధంబున సమ్మోహితాశేషవిశ్వచక్రుం డగుమనోభవుండు దేవకార్యంబు సంపూర్ణంబు గావించి యేపురవరంబున శ్రీలలితాంబ నివసించెనో యట్టి శ్రీపురంబునకుఁ బరమేశ్వరిని సేవింప నరిగె నని హయగ్రీవుండు తెలుపుటయుఁ గుంభసంభవుండు. 553

## శ్రీ నగరనిర్మాణము.

క. పరమాత్మ! హయాస్య! శ్రీ,పుర మనునది యెచటనుండుఁ ♦బూర్వ మెవనిచే
నరుదుగ నిర్మింపంబడెఁ, బరమేశ్వరి మహిమనెల్ల ♦ వర్ణింపు మిఁకన్. 554

తే. అంబ నివసించు నేపుర ♦ మదియె పురము, సర్వసందేహపంకశో♦షణదినేశ
తుల్యుఁడవు నీవయోగీశ!♦తొల్లి యేప,రిమితిఁ జేయంగఁబడెనో యా♦రీతిఁ జెపుము.

చ. అన విని యాహయాననుఁడు ♦ హర్షము పొల్పెసలారఁ గుంభజుం
గని యిటు వల్కె మానివర! ♦ కామిత దాత్రి మహేశి సర్వలో
కనుతచరిత్ర లక్షణ ని♦కాయయుతాయతచక్రరూపమహా
ఘనరథ మెక్కి నిర్జరని♦కాయనుతుల్ చెలువారుచుండఁగన్. 556

క. సురవరుల రక్షణార్థము, పరమేశ్వరి లోకభయదు ♦ భండుని జంపం
గరమలరి యింద్రముఖ్యులు, నిరతిశయానంద మొంది ♦ నిశ్చింతులునై.

క. కామేశ్వరునకు లలితకు, శ్రీమహితముగాఁగ నిత్య♦సేవార్థముగా
భూమి నొకపురము గట్టిన, క్షేమము తమ కనుచు నెంచి ♦ చిత్తము లలరన్.

మ. పరదేవీచరణాబ్జసేవనము సం♦ద్భక్తిం దమిం జేయఁగా
సరసీరుట్ప్రిభవాబ్జనేత్రశివులున్ ♦ శక్రుండు దేవాళియుం
గరపద్మాంజలు లొప్పఁ బోయి లలితా♦కాంతాజ్ఞ శిల్పజ్ఞునిన్
సురసంఘాదృతు విశ్వకర్మమయునిన్ ♦ శుంభన్మహాప్రజ్ఞునిన్. 559

ఆ. పిలువఁ బంచి వారిఁ ♦ బ్రీతిపూర్వకముగ, సత్కరించి బ్రహ్మ ♦ సరసిజాక్ష
శంకరులు గభీర♦చారుభాషణముల, వారి కిట్లు లనిరి ♦ గారవమున. 560

తే. శిల్పివరులార! శాస్త్రిసం♦సిద్ధచిత్ర, కార్యఘటనాప్రవీణసం♦కల్పమాత్ర
శిల్పకల్పనచణులార ♦ శ్రీపరాంబ, కెలమి నగరంబు నిర్మింప♦వలయు నిపుడు.

వ. షోడశక్షేత్రిమధ్యంబులఁ దత్క్షేత్రసమసంఖ్యచే శ్రీనగరంబుల నానారత్నాలంకృతంబులను గా నిర్మింపవలయు. శ్రీదేవి షోడశవిధంబుల నొప్పుచుండు. కావున నీ శ్రీనగరంబులు షోడశసంఖ్యలం బరఁగున ట్లొనరించుట మాకును దేవతలకును, సర్వలోకంబులకును బ్రియం బగు. సత్వరంబుగా రచింపుఁ డను

టయు మయవిశ్వకర్మలు సంతసించి నమస్కరించి కారణపూరుషు లగు బ్రహ్మాదుల కిట్లనిరి. 562

క. ఏయేక్షేత్రవరంబుల, నేయేవిధములుగఁ బురము • లెసఁగఁగఁ దగునో యేయేమానములను దగ, నే యేగతి నుండవలయు • నెఱిఁగింపుఁ డనఘ. 563

క. వారలఁ గనుఁగొని ప్రియముగఁ, గారణపూరుషులు క్షేత్ర•గణవిభజన మొ ప్పారఁగ నిట్లని పల్కిరి, శ్రీరమణీ ప్రియముగాఁగఁ • జిత్రమృదూక్తిన్. 564

వ. మేరుపృష్ఠ, నిషధ, హేమకూట, హిమాలయ, గంధమాదన, నీలమేష, శృంగాఖ్య,మహేంద్రగిరి,మహాగిరు లనునివి తొమ్మిదియు భౌమ లనంబడు.లవణేక్షుసారసురాఘృతదధిక్షీరజలసాగరంబు లోదకక్షేత్రంబు లనంబడు. పూర్వోక్తనవక్షేత్రంబులతోఁగూడ నివి పదియాఱు క్షేత్రంబు లయ్యె.ఈక్షేత్రంబులందు బరదేవికి దివ్యగేహంబుల నిర్మింపవలయు. ఈక్షేత్రంబులయందు నిర్మించిన పురంబులకు లలితానిత్యానామంబు లుండవలయు. ఆదేవి నిత్యాస్వరూపంబుచేఁ గాలవ్యాప్తికరియుఁ బరాంబయు నై సర్వజగంబుల వ్యాపించియుండు. నిత్యానామంబులతోఁగూడిన పురనామంబు లెవ్వి యనినఁ గామేశ్వరపురంబు, భగమాలాపురంబు, నిత్యక్లిన్నాపురంబు మొదలగు నిత్యానామంబు లొప్పు. మీ రనల్పశిల్పకల్పన నై పుణ్యంబునఁ బుణ్యాదినంబున నిర్మింపుఁ డని పలికిన మయవిశ్వకర్మలు వల్లే యని కారణపూరుషోపదిష్టమార్గంబున నిర్మించి రా శ్రీపురవిస్తారంబును బురాధిష్ఠానదేవతలను నెఱింగించెద నాకర్ణింపు మని హయగ్రీవుం డగస్త్యున కిట్లనియె. 565

ఆ. వేయియోజనముల • వెలయు నున్నతముఁ జ,తుర్దశజగములను • దాఁటియున్న విగ్రహంబుఁ గలిగి • యుగ్రభంగిని మేరు, వఖిలమూల మగుచు•నలరుచుండు.

సీ. ఆపర్వతమునందు • నలరు శృంగంబులు నాల్గు నైరృతి పవ•నదివిజేశ దిశలను మఱిమధ్య•దిశను; యోజనమాత్ర మమరుఁ ద్రిశృంగోన్న•తము తలంప శతయోజనముల వి•స్తారంబు నాత్రిశృంగములఁ ద్రిమూర్తిలో•కములు తనరు వానియం దగు గేహ•వైఖరి నెఱిఁగింతు సమయాంతరమునందు•సాధువర్య!

తే. మధ్యతలసంస్థశృంగంబు • మానితంబు నై చతుశ్శతయోజనా•యతము నంత విస్తృతంబును గలిగి సు•ధీనుత మగుచుఁ బొల్చు నాశృంగమందు శ్రీ•పురము వెలయు. 567

తే. వెలయు నన్నూఱుయోజన♦ముల పొడవున
నాపురంబు ఘటోద్భవ! ♦ శ్రీపురంబు
తద్విభాగము వివరింపఁ ♦ దరమె యైనఁ
దెలిసి నంతయె నీకిటఁ ♦ దెలుపువాఁడ. 568

వ. ప్రథమప్రాకారంబు కాలాయసవినిర్మితంబును, షట్ఛతాధికసాహస్రయోజనాయతంబును, జతుర్దిగ్ద్వారసంయుతంబును, జతుర్యోజనోచ్ఛ్రితంబును నై యుండు. ఆప్రాకారమూలపరీణాహంబు యోజనమాత్రంబు. సాలాగ్రవిశాలము గవ్యూత్యర్ధమితంబు. సాలద్వారోన్నత్యంబు యోజనమాత్రంబు. ప్రతిద్వారంబునందు గవ్యూత్యర్ధవిస్తరంబులగు కవాటంబులు రెండు నేకయోజనోన్నతంబు లై కాలాయసవినిర్మితంబు లై యుండు. ఆకవాటద్వయంబునం దర్ధక్రోశసమాయతం బగు నర్గళద్వంద్వంబు మెఱయుచుండు. 569

క. ఈవిధిని జతుర్ద్వార, శ్రీవిభవకవాటయుగము ♦ చెలఁగుచునుండున్
భావింపఁగ నద్భుతమిది, యీవిధిఫణిపతులకైన ♦ నలవియె పొగడన్. 570

సీ. కుంభసంభవ! విను ♦ గోపురసంస్థాన మద్ది పూర్వోక్తమా♦నట్టి సాల
మున యోజనాయత ♦ మూలతలంబునఁ బార్శ్వద్వయంబున ♦ భవ్యరీతి
యోజనద్వంద్వంబు ♦ నున్నతంబును నంత విస్తారమును గల్గి ♦ వెలయునట్లు
ద్వారగర్భితమయి ♦ తనరి పార్శ్వద్వయయోజనద్వయముల ♦ నొప్పు సాల
మధ్యతలంబును ♦ మహితరీతిని గూర్చి పంచయోజనముల ♦ బరఁగు విస్త్ర
తే. తియుఁ దనరునట్లు నిర్మింప ♦ దివ్యమగుచుఁ
బంచయోజనమాత్రమై ♦ పరఁగు నాయ
తంబుతోఁ గూడి గోపురం ♦ బంబుజాక్షు
విధి ముఖాదికసేవ్య మై ♦ వెలసె మఱియు. 571

వ. ఆగోపురమూలతలవిస్తారంబు వింశతియోజనపరిమితంబు. గోపురంబు క్రమంబున నూర్ధ్వభాగంబున హ్రాసం బగుచుండు. గోపురసర్వసంఖ్యాప్రమాణంబు పంచవింశతియోజనపరిమితంబు. ప్రతియోజనమందును సకవాటంబును, మనోహరంబును నగు ద్వారం బొప్పుమీఱు. యథాక్రమోర్ధ్వహ్రాససంయుతంబులగు భూమిక లంతపరిమాణంబుకలవై యలరుచుండు. మఱియు గోపురాగ్రతలవిస్తారంబు యోజనమాత్రం బాయామం బంతియ. అందు మకుటత్రయంబు ప్రకాశించుచుండు. తద్విస్తారంబు క్రోశమాత్రంబు. తదుచ్ఛ్రియంబు క్రోశద్వయసమ్మితంబు. మూలతలంబునకన్నఁ దదగ్రభాగంబు హ్రాసంబయియుండు.

తదనంతరతలం బర్ధయోజనపరిమితంబు. మకుటంబులు దక్షిణద్వారగోపురంబునఁ బశ్చిమాదిప్రాచ్యంతంబులుగ నిలుపఁ బడియె. పశ్చిమద్వారగోపురంబున దక్షిణోత్తరంబులుగను, నుత్తరద్వారగోపురంబున దక్షిణగోపురంబు రీతిని భాసిల్లు. పశ్చిమద్వారగోపురంబుభంగిఁ బ్రాగ్ద్వారగోపురంబున మకుటంబులు భాసమానంబు లై వెలయు. మఱియు. 572

క. కాలాయసమయ మగు నా, సాలమునంతరము [1]వాయు • సమయోజనమై
క్రాలుమునినాథ! యందొక, సాలము కాంస్యమునఁబూర్వ • సరణిఁ మెఱయున్.

తే. తత్ప్రమాణంబు ప్రాగుక్త • తను జెలంగుఁ, గాంస్యసాలముద్వారాది • కములఁబూర్వ
సాలతుల్యంబు ప్రోక్తల • క్షణసమన్వి, తములునై యొప్పు శ్రీగోపు • రముల వెలయు.

వ. [2]కాలాయసకాంస్యసాల మధ్యభాగంబు నానావృక్షమహోద్యానంబని చెప్పఁబడు. సమస్తోద్విజ్జాలం బందు నివసించు. అం దనవరతపల్లవకుసుమఫలభరితంబు లై యేలా, లవంగ, తక్కోల, కర్పూర శాఖి, [3]పీలు, [4]కాకతుండ, [5]కాంచనార, [6]లికుచ, పనస, ఖర్జూర, [7]పాటలా, [8]ఫలినీ, [9]జటిలా, [10]జఘనేఫలా, [11]గణికా, [12]కురంటక, [13]బంధుజీవ, దాడి [14]మాశ్వకర్ణ, [15]హస్తికర్ణ, చాంపేయ, [16]కనకద్రుమ, [17]యూథికా, [18]తాళపర్ణి, [19]లాంగలీ [20]సదాఫల, తాల, తమాల, [21]హింతాల, ఖర్జూర, [22]శర, [23]బర్బరా, [24]క్షీరి, [25]శ్లేష్మాతక, విభీతక, హరీత [26]క్యవాక్పుష్పీ, [27]ఘోంటాలీ, [28]స్వర్ణపుష్పికా, [29]భల్లాతక, ఖదిర, [30]శాకోట, చందన, కాలాగరుద్రుమ, [31]కాలస్కంధ, చించోదుంబరాశ్వత్థశమీవృక్షరుచకకుటజాద్యనేకభూరుహంబులు సర్వర్తుకుసుమశోభితంబు లై శ్రీసుందరీ శృంగారహేతువు లై భాసిల్లుచుండు. కాంస్యసాలాంతరాళంబున నేడుయోజనముల దూరంబునఁ జతురశ్రమగు తామ్రప్రాకారంబు సప్తయోజనోన్నతం బై యుండు.

---

1 వాయుసమయోజనమై=ఏడుయోజనములు గలదియై. 2 కాలాయసము=ఇనుము. 3 పీలు=గొలుగుచెట్టు. 4 కాకతుండ=కాలాగరు. 5 కాంచనార=దేవకాంచనపుచెట్టు. 6 లికుచ=గజనిమ్మచెట్టు. 7 పాటలా = కలిగొట్టుచెట్టు. 8 ఫలినీ=ప్రేంకణము. 9 జటిలా=జటామాంసి. 10 జఘనేఫలా=బ్రహ్మమేడిచెట్టు. 11 గణికా = అడవిమొల్లచెట్టు. 12 కురంటక = పచ్చగోరంటచెట్టు. 13 బంధుజీవ = మంకెనచెట్టు. 14 అశ్వకర్ణ = ఇనుమద్దిచెట్టు. 15 హస్తికర్ణ = చిట్టాముదముచెట్టు. 16 కనకద్రుమ = కాంచనపుచెట్టు. 17 యూథికా = పెద్దగోరంట. 18 తాళపర్ణి = పిన్నసదాపచెట్టు. 19 లాంగలీ=నీరుప్రబ్బలిచెట్టు. 20 సదాఫల=మేడిచెట్టు. 21 హింతాల=గిఱకతాడు. 22 శర=రెల్లు. 23 బర్బరా=వాయింటచెట్టు. 24 క్షీరి=పాలచెట్టు. 25 శ్లేష్మాతక=విరిగిచెట్టు. 26 అవాక్పుష్పీ=బ్రహ్మదండి. 27 ఘోంటాలీ=పోఁకచెట్టు. 28 స్వర్ణపుష్పికా=జీలుగుచెట్టు. 29 భల్లాతక=నల్లజీడిచెట్టు. 30 శాకోట=పెద్దసేఁకు. 31 కాలస్కంధ=పొగడచెట్టు.

కాంస్యతామ్రప్రాకారాంతరభూమి కల్పకవాటి యని చెప్పంబడు. అందుఁ గర్పూరం బొసంగుచు రత్నబీజసమన్వితంబు లై కాంచనత్వక్సురుచిరంబు లై సఫలంబు లగుభూరుహంబులు వెలయుచుండు. మఱియు నాభూరుహంబుల యందు దివ్యప్రవాళంబులు చీనాంబరంబులు, మధురసంబమృతంబును, బుష్పంబులు భూషణంబులుగాఁగలిగి కల్పవృక్షంబులు భాసిల్లు. ఇది ద్వితీయకక్ష్య యని చెప్పంబడు. తామ్రసాలాంతరాళంబున సీససాలం బొప్పుచుండు. తామ్రసీసప్రాకారాంతరభాగంబు సప్తయోజనపరిమితం బందుఁ గల్పవాటీసమాకృతి యగు సంతానవాటిక యొప్పుచుండు. సీససాలాంతరాళంబున సప్తయోజన దూరంబున [1]నారకూటమయప్రాకారంబు పూర్వసాలసమాకృతి యై యలరుచుండు. సీసారకూటప్రాకారమధ్యక్షోణి హరిచందనవాటిక యని కీర్తింపఁ బడు. అయ్యది కల్పవాటీసమాకారయు, ఫలపుష్పసమాకులయు నై భాసిల్లు. ఈప్రాకారంబులయం దెల్ల ద్వారకల్పనంబు పూర్వోక్తప్రకారంబె యై యుండు. గోపురమకుటాదికల్పనంబును గూడఁ బూర్వప్రతిపాదితంబ యగునని వెండియు హయగ్రీవుం డిట్లనియె. 575

తే. ఆరకూటాంతరాళంబు • నందు సప్త
యోజనాయతదూరస్థి • తోర్వియందు
నలరు సాలంబు పంచలో • హమయ మగుచుఁ
బూర్వసాలంబు సమతను • బోలియుండు. 576

సీ. పంచలోహోల్లస • త్ప్రాకారమున కారకూటసాలంబున • కును నడుమను
మహిత మై తగుభూమి • మందారకద్రుమవాటిక యన నొప్పుఁ • బంచలోహ
సాలాంతరంబున • సప్తయోజనదూరమున రౌప్యసాలంబు • పూర్వరీతి
నలరుఁ దన్మధ్యంబు • నందున్నభూమియుఁ బారిజాతద్రుమ • వాటికాహ్వ
తే. యమున నొప్పారు ఫలకుసు • మములఁ బొదలు, దివ్యగంధంబుచేతను • దేజరిల్లు
రౌప్యసాలాంతరమున వి • రాజమాన, హేమసాలంబు దిక్కుల • నెసఁగుచుండు.

వ. హేమసాలంబును సప్తయోజనములదూరంబునం దమర్పఁబడియె. ద్వారకల్పనంబు పూర్వోక్తప్రకారంబ. తన్మధ్యభాగక్షోణికదంబ తరువాటిక యనంబడు నందు యోజనద్వయోన్నతంబు లగుదివ్యనీపవృక్షంబు లనవరతమదిరాస్యందమేదురప్రసవోజ్జ్వలంబు లై భాసిల్లుచుండు. కాదంబరి యను యోగిని భోగదాయిని యై మదిరోత్పన్న యై శ్యామలాంబ కత్యంతప్రియ యై యుండు.

---

1 ఆరకూటమయప్రాకారము = ఇత్తడితోఁ జేయఁబడిన ప్రాకారము.

మఱియు నా నీపద్రుమంబులు సచ్ఛాయంబులును, బల్లవాకులంబులును, నామోదలోలద్భృంగాళిఝుంకారపూరితోదరంబులు నయి యొప్పారుచుండు నందే మంత్రిణి యగు శ్యామలాదేవికి మందిరంబు మనోహరంబుగ నిర్మింపఁబడియె. కదంబవనవాటికయుం దాగ్నేయనిరృతివాయ్వీశాన్యంబుల నాల్గు మందిరంబులు నిర్మింపఁబడియె. ఒక్కొక్కగృహవిస్తారంబు పంచయోజనపరిమితంబు. ఆయామంబును నంతియ. సప్తావరణత్వంబుచే నలరు నాగృహంబులకు నీపవృక్షంబులు నలుప్రక్కలనుండు. ఇదియె శ్యామలానివాసస్థలంబు. మహాపద్మాటవీస్థలంబున సేవార్థమై నగరంబు నిర్మింపఁబడియె. శ్రీదేవీనిత్యసేవనంబు మంత్రిణి కావశ్యకం బగుట సమీపంబున నివాసం బమర్పఁబడియె. త్వష్టయు, మయుండును శ్రీపురంబున మంత్రిణీమందిరంబు సాటిలేని పరిపాటి నమర్చిరి. దానిం బొగడ శేషునకైనఁ దరంబు గాదు. కాదంబరీసుధాపానతామ్రనయనలును, మానితాంగులును నగు మాతంగకన్యకలు కలవీణారవంబులతో గానంబు చేయుచు నందుఁ గ్రీడింతు రని చెప్పుటయు నగస్త్యుం డిట్లనియె.

—॥ మాతంగకన్యాజననము. ॥—

క. మాతంగమౌని యెవ్వం, డాతని కీకన్య లెట్టు • లైరి తనూజల్
ప్రీతిగ వారలు మునిసుత, లై తనరియు శ్యామఁ గొలువ • నగుహేతు వొగిన్.

ఆ. విస్తరింపు మనిన • విని హయగ్రీవుండు, పలికె నిట్టు లనుచు • లలితసరణి
మౌనివర్య! వినుము • మాతంగుఁ డనుమౌని, కలఁ డొకండు యోగ•కలితబుద్ధి.

మానిని. లోకము లెల్లను దాను సృజింపఁగ•లోలత నొందుచు మౌని మదిం
బ్రాకట శీలము గల్గి యపారత•పంబును జేయుచు ఖ్యాతి తగం
బాకవిభేది జయంతుని గాంచిన • భంగిగ నాతఁడు కాంచె సుతున్
జోక నతండు దినక్రమ మొప్పఁగ • శోభిలి వృద్ధిని గాంచెఁ దగన్. 581

చ. అతఁడును దండ్రినామమున • నద్భుతతేజమునం జెలంగి సం
తతహృదయానురాగమున • ధ్యానముచేయుచు మంత్రనాయికన్
వితతనియామ మొప్పఁ గడు • వింతగఁ గొల్చుచుఁ జారుభంగి ను
ద్యతమతి వేఁడ శ్యామలయు • నాతని యోగము ప్రీతి నింపఁగన్. 582

క. సాన్నిధ్య మొసఁగి యాతని, మన్ననచెలువారఁ గాంచి • మహనీయతపం
బెన్ని వరమీయ వచ్చితి, సన్నుతచరితా! వచింపు • సాధ్వాశయమున్. 583

కవిరాజవిరాజితము. అన విని యమ్ముని • హర్షము మీఱఁగ
శ్యామపదాంబురు•హద్వయికిన్

ఘనతరభక్తిని • గ్రా మొగిడించుచుఁ
గామితదాత్రివి • గావె జగ
జ్జననివి నీపద • సారసయుగ్మము
సంస్మృతిఁ జేసినఁ • జాలును భ
క్తనికరమిష్టము • గ్రన్ననఁ బొంది ని
కామముదంబును • గాంచు నిలన్. 584

తే. మఱియు నణిమాదిసిద్ధులు • మహితరీతిఁ, గలుగు నాకును నీపద•కమలదర్శ
నంబుచేతనె కాంక్షాక•దంబ మిపుడె, కలిగెఁ గోరంగ నెద్దియుఁ • గానరాదు.

క. ఐనను నీసాన్నిధ్యము, మానిని! వ్యర్థంబు గాదు • మహి నెవ్వరికిం
గాన నొకవరముఁ గోరెద, దానిని జేకూర్చు మిపుడె • తత్పరమతి వై. 586

చ. మును పాకసారి శీతగిరి•ముఖ్యునితోఁ గడు మైత్రి మీఱఁగా
ననుపమరీతిఁ గ్రీడల న•హర్నిశముల్ చరియించుచుండఁగా
ఘనగిరి పల్కెనే గురుఁడ • గౌరికి నంచు స్వకీయ కీర్తనం
బున ననుఁ గాంచి యెంతయును • బూన్కి చెలంగఁగ సంపదున్నతిన్. 587

వ. తల్లీ! మిత్రు లిరువురు సర్వగుణంబుల సము లై యుండవలయు నందొక్క నియంం దాధిక్యంబు గనఁబడిన రెండవవాఁ డద్దానిఁ గాంక్షింపకుండునే. కావున నేనును గౌరీగురుత్వశ్లాఘార్థ మై తపం బొనరించుచున్నవాఁడ. నీవు నాకుఁ బుత్రివి కమ్ము. నానామధేయంబున వెలయుము. సంశయంబు వలదని ప్రార్థింప నట్ల యగునని దేవి యంతర్హిత యయ్యె. మునియును సంతసిల్లె. నాటిరాత్రి మాతంగమునిపత్నికి స్వప్నంబున శ్యామల సాక్షాత్కరించి యొక్క తాపింఛమంజరిని గర్ణావతంసంబునుండి తీసియిచ్చినఁ దత్స్వప్నప్రభావంబున మునిపత్ని యగుసిద్ధిమతి యంతర్వత్ని యై లఘుశ్యామను గనియె. అక్కారణంబున మాతంగి యనం బరఁగి చతుష్షష్టిమహావిద్యను గ్రహించి తత్ప్రభావంబున స్వసమాన లగువారలఁ బెక్కుశ్యామలాంబికలఁ బుట్టించె. మాతంగ కన్యకలు కోటికోటు లై రంత లఘుశ్యామలవారలంగూడి యంగశక్తిత్వంబు నొంది మంత్రిణ్యంబను సేవించుచుండె. ఇది మాతంగకన్యకోత్పత్తిక్రమంబు. లోహనిర్మితంబు లగుసప్తసాలంబుల ప్రకారంబు లెఱిఁగించితి. ఇఁకఁ దెలుపఁ దగిన దెద్ది యనుటయు హయగ్రీవునకుఁ గుంభసంభవుం డి ట్లనియె. 588

—— లోహాదిసప్తప్రాకార రక్షకులు. ——

తే. సైంధవానన! లోహాది•సప్తసాల,ములను రక్షింపఁ బూనిక • నిలిచియున్న

వారి నామంబు లెఱింగింప • వలయు సంశ, యంబు దీఱంగ నన విని • హాయగళుండు.

క. నానావృక్షాఖ్యమహో, ద్యానంబునఁ గుంభజా! మ•హాకాళుఁడు మే
ఘానీలవిగ్రహుఁడు ఘో, రాననభీకరుఁడు నగుచు • నలరి వసించున్. 590

వ. మఱియు నమ్మహాపురుషుండు. 591

తే. శ్యామకంచుకధారి మ•దారుణాక్షుఁ, డగుచు [1]బ్రహ్మాండచషకంబు•నందు విశ్వ
రసమయాసవమును బ్రీతిఁ • ద్రావుచుండు, సకలలోకభయంకర•స్వాన మడర.

సీ. అతినీలతనువనం • గార్ద్రియు నా మహాకాళిఁ గటాక్షాళిఁ • గనుచు రత్న
సింహాసనమున నా•సీనుఁ డై లలితాంఘ్రిపంకజధ్యానతత్పరుఁడు నగుచు
దేవిభక్తుల కెల్ల • దీర్ఘాయువొసఁగుచు గాలమృత్యుప్రముఖసకలోగ్ర
కింకరులనుగూడి • కేరుచుఁ గాళీమహీంకాళు లంబికా•జ్ఞానుసరణు

తే. లగుచు మొదటిది యైన య•ద్యానమందు
నుందు; వారల కానన • మొప్పఁ గాల
చక్ర మెల్లను వారల • శక్తి నెఱుఁగ
నలవి గా దెవ్వరికి మాని • తిలక! నిజము. 593

వ. చతురావరణోపేతం బగుచక్రంబు మెఱయు నది మధ్యబిందుమనోహరంబును, త్రికోణపంచకోణంబును, షోడశపత్త్రిపంకజాత, మష్టారపంకజంబును గలిగియుండు నందు మహాకాళుండు మధ్యస్థితుం డై మెఱయు. త్రికోణచక్రంబున మహాకల్పయు, మహాసంధ్యయు, మహానిశయు నను ముప్వురు మహాకాళశక్తు లైరి. పంచకోణచక్రంబునఁ గృతయు, త్రేతయు, ద్వాపరయుఁ, గలియు, మన్వంతరయు నను వారు నివసించిరి. మఱియుఁ బంచకోణాగ్రంబులఁ బ్రత్యూషయుఁ, బితృప్రసువును, బ్రాహ్ణయుఁ, బరాహ్ణయు, మధ్యాహ్నయు నను శక్తులు భాసిల్లుచుందురు. షోడశపత్త్రికమలంబున దినయు, నిశయుఁ, దమిస్రయు, జ్యోత్స్నయుఁ, బక్షిణియుఁ, బ్రదోషయు, నిశీథయుఁ, బ్రహరయుఁ, బూర్ణిమయు, రాకయు, ననుమితియు, నమావసియు, సినీవాలియుఁ, గుహువు, భద్రియు, నుపరాగయు నను షోడశశక్తులు ప్రకాశింతురు. మఱియు షోడశపత్త్రాగ్రంబులఁ గలాకాష్ఠానిమేషలును, క్షణలవాత్రుటిముహూర్తలును, గుతపాహోరాత్రశుక్లపక్షలును, గృష్ణపక్షాయనలును, విషువయు, సంవత్సరాపరివత్సరేదావత్సరలు నను నీషోడశశక్తులు భీకరాకార లై వెలుంగుదురు. ఇద్వత్సరేదువత్సరావత్సరలును, దిథివారలును, నక్షత్రియు, యోగాకరణలు నను

[1] బ్రహ్మాండచషకము = బ్రహ్మాండమనుపానపాత్రము.

నీ యెనిమిదిశక్తులు నాగపత్త్రాంబుజంబున భాసిల్లుదు రని చెప్పి మఱియు
ని ట్లనియె. 594

సీ. కలికల్యలును మఱి ♦ కలినయుఁ గాళియుఁ గాలచక్రద్వార♦పాలకత్వ
ముఁ నొప్పి రిట్లు శ♦క్తినివహములు మహాకాళుని సేవించి ♦ క్రాలుచుండు
మదహాసితాస్యలై ♦ మద్యసంపూర్ణచషకమును బిశితంబు ♦ సంతసమున
ధరియించి శ్యామల ♦ తనువు లొప్పఁగ లలితాపూజనధ్యాన ♦ తత్పరత్వ
తే. మున మహాకాళు సేవించు♦చును జెలంగి, కాలచక్రంబునం దెప్డు♦ క్రాలుచుండ్రు
కల్పవాటిక రక్షించు ♦ కార్యమందు, నున్న వారల నెఱిఁగింతు ♦ నోమునీంద్ర.

చ. ఎలమి వసంతుఁ డందు వసి♦యించుఁ బరేశ్వరి యాజ్ఞఁ బూని యు
జ్జ్వలతను వొప్పఁ బుష్పమయ♦బాణుఁడు పుష్పసురామదారుణుం
డలఘు సుమాఘభూషణుఁడు ♦ హారి సుమోల్లసితాతపత్త్రని
ర్మలతరకాంతిశోభితుఁడు ♦ మాన్యుఁడునై చెలువొందు నెప్పుడున్. 596

వ. మధుశ్రీమాధవశ్రీలను నిరువురు భార్యలు ప్రసూనమదిరామత్తలును, బ్రసూనశరలాలసలును నై వసంతుని గూడి యుండు రాతండు లలితాకింకరుండై కల్పవాటిని గాపాడుచుండు. 597

క. సంతానవాటికను న,త్యంతము గ్రీష్మర్తు వుగ్ర♦తరలోచనుఁడై
సంతతమును గాపాడుచు, నెంతయు లలితాజ్ఞఁ దలవ♦హించి చెలంగున్. 598

సీ. అతని కిద్దఱు భార్య♦లైరి శుక్రశ్రీయుఁ మఱి శుచిశ్రీయును ♦ మానిచంద్ర!
హరిచందనాఖ్యచే ♦ నలరువాటికయందు వర్షర్తు వెంతయు ♦ భాసమాన
తనుఁడు విద్యుత్పింగ♦ళనయనుం డశనితుల్యాట్టహాసుండు వా♦హనము జలద
మై చెలంగుచునుండ ♦ నంబుదకవచంబు మణికార్ముకము దాల్చి♦మహితభక్తి
తే. నంబికాధ్యానపూజల ♦ నాదరమునఁ
జేయుచును ద్వారరక్షను ♦ జేయుచుండుఁ
ద్రిజగదాహ్లాదకరుఁడునై ♦ తేజరిల్లు
నతని పరివారశక్తుల ♦ ననువదింతు. 599

వ. నభశ్శ్రీయు, నభస్యశ్రీయును, సరసయు, సస్యమాలినియు, నంబయుఁ, దులయు, నితత్నియు, నభ్రయంతియు, మేఘయంతికయు, వర్షయంతియుఁ, జాపుణికయు, వారిధారయు నను పండ్రెండుశక్తులు మదారుణవిలోచనలై సేవింతురు. వారలం గూడి పరమేశ్వరి నాతండు సేవించుచు నిజకాలజనితపుష్పమండలంబుల లలి

తాభక్తదేశంబుల నలంకరించుచుఁ దద్రిపుభూముల ననావృష్టులఁ బీడించు చుండు. 600

క. మందారవాటికాంతర,సుందును శరదృతువుపాల•కాఖ్యుఁ జెలంగున్
సుందరతరమూర్తి మహా,నందప్రదుఁ డగుచు భక్త•నాయకుఁ డగుచున్.601

వ. ఇషశ్రీయు నూర్జశ్రీయు నను భార్యలనుగూడి శరదృతువు లలితను జారుకుసు మంబులఁ బూజించుచుండు. 602

తే. పారిజాతాఖ్యవాటికఁ • బాలనంబు
సేయు హేమంతుఁ డతి హిమ•శీతలాంగుఁ
డంబికా ప్రియకింకరుఁ • డతఁడె సుమ్ము
సుప్రసన్నముఖాంభోజ•సుందరుండు. 603

చ. కుసుమములన్ నిజోత్తములఁ • గూరిమి మీఱఁగ దేవదేవిపా
దసరసిజద్వయంబును ని•తాంతము నర్చన సేయుచుండు నం
తసమున దేవదేవియు మ•నంబున నాతని గారవించు నెం
దు నమత లేక యాఋతువు•తోరపు వేడుకనందు వర్తిలున్. 604

వ. సహశ్రీయును, సహస్యశ్రీయును నను నిరువురుభార్య లాతనిం గూడియుందురు. కదంబవనవాటికయందు శిశిరర్తువు పాలకుం డై యుండు. శిశిరీకృతభూతలం బై యాస్థలంబు వెలుఁగొందు. తపశ్రీయును, తపస్యశ్రీయు నను భార్య లాత నికిం గలరు. ఆకదంబ వనవాటికయందు శీతలాకృతి యగు శ్యామాదేవత చెల్లంగుచుండు నన విని యగస్త్యుండు. 605

సీ. నాకేశవందిత • నామ! నానావృక్షముఖసప్తకంబున • మొదటివాటి
యందుఁ బాలకుఁడు మ•హాకాళుఁ డని వింటిఁ జతురావరణ యుక్త•చక్రమనియు
వినితిని ఋతుషట్క•వితతవాటికలందుఁ బరఁగు పాలకులు చె•ప్పఁబడి రైనఁ
జక్రశక్తుల నాము•చక్రం బెఱింగింపఁ బడదయ్యె వానిని • వరుస దయను

ఆ. జెప్ప వయ్య నాకుఁ • జిత్తంబు రంజిల్లు, నట్లు వినఁగవలయు • ననిన మౌని
చంద్రుఁ గాంచి పల్కె • సైంధవవదనుండు, లోకజనని నెంచి • ప్రాకటముగ.

వ. పూర్వోక్తకాలచక్రంబు వాసంతచక్ర మనంబడు. పంచత్రికోణనాగపత్రి షోడశారదశారద్వితయపంకజచతురశ్రంబును, సప్తావరణంబును నగు నాచక్ర మధ్యబిందుచక్రంబున వసంతుం డొప్పు. ఆతని యంకద్వయంబున మధుశ్రీ మాధవశ్రీలు చెలంగుదురు. వసంతుఁ డయ్యిరువుర వక్షోరుహంబుల నాత్మ కరద్వయంబునఁ బీడించుచుఁ దక్కినహస్తంబుల ససౌరభం బగుపువ్వుమది

రాపూర్ణ చషకంబును, బిళితంబును ధరియించి యుండు. సర్వర్తుధ్యానంబు నిట్టి దియె యగు. వర్షర్తుధ్యానంబునందు మాత్రము శక్తిద్వయం బూరుస్థితంబుగను దక్కినశక్తులు సమీపమున నున్నట్లును ధ్యానింపవలయు. ఇంక వాసంత చక్రంబున నుండు దేవీనామంబులఁ జెప్పెద నాలకింపుము. మధుశుక్లశబ్దపూర్వక లగు ప్రతిపద్ద్వితీయాదిపూర్ణిమాంతతిథినామ దేవతలును, మధుకృష్ణశబ్దపూర్వక లగు ప్రతిపద్ద్వితీయాద్యమాంతతిథినామధేయ దేవతలును నీ ముప్పదిమంది శక్తులును జక్రదేవతలు. ఇఁక మాధవాఖ్యోపరిస్థితలను బూర్వోక్తరీతి నెఱుంగవలయు. వీరెల్ల షష్టిసంఖ్యాక లగు దేవతలు సప్తావరణంబులయం దుండురు. కావున వేఱు వేఱుగా వీరిని బూజింపవలయు. వాసంతచక్రంబువలెఁ దక్కిన ఋతువులకును జక్రంబు లెఱుంగవలయు. శుక్రశుచ్యాదిభేదంబున దేవతాభేదంబుల నెఱుంగునది. ప్రతిచక్రంబునందును షష్టిసంఖ్యాక దేవతలు ప్రకాశించుచుందురు. గ్రంథవిస్తరభీతిచే నిట సవిస్తరంబుగాఁ జెప్పఁబడ దయ్యె. లలితాపూజాధ్యానపరాయణ లగు నీదేవతలెల్లఁ గల్పాదివాటికాచక్రంబుల మదాలసలై చరించుచుఁ బుష్పంబుల మహేశ్వరిని బూజింతురు. షట్చక్రదేవతలు షష్ట్యుత్తరశతత్రయసంఖ్యాక లై రిట్లు సప్తప్రకారంబులయందును బాలకులును జక్రదేవతలును జెలంగుచుందురు. తక్కినసాలంబులకు నుపాదానస్వరూపంబుగ విస్తారంబును శక్తి చక్రంబు నెఱింగింతు వినుమని హయగ్రీవుం డిట్లనియె. 607

రత్నప్రాకారలక్షణము.

తే. లక్షణంబులు లోహసాలముల కమర, దనుజశిల్పికృతంబులు • తగినరీతి
వర్ణితము లయ్యె నిఁకమీఁద • బహుళరత్న, సాలలక్షణ మహిమలు • సరగవినుము.

ఆ. కనకపుష్యరాగ • కమనీయసాలాంత, రంబు సప్తయోజ • నంబు సుమ్ము
అందు సిద్ధలలన • లలరుచుఁ గ్రీడింతు, రమితమద్యమత్త • లగుచు నెపుడు.

క. రసముల నభినవముల బహు, రసాయనంబులను మఱియు • భ్రాజత్ఖడ్గ
ప్రసృతము లగు పాత్రంబుల, [1]ససమాంఘ్ర్యంజనముచేత • నా సుదతు లొగిన్.

క. దేవీ భక్తులఁ దనుపుచుఁ, బావనమదిరారసాను • భవమున నందం
దావిర్భవదమలమనో, భావంబుల నలరుచుంద్రు • పరమప్రీతిన్. 611

సీ. ప్రాగుక్తవిధిఁ బుష్య • రాగాదిసాలంబులకును ద్వారాదుల • లక్షణములు
తెలియంగఁ దగు మఱి • దివ్యగోపురకవాటార్గళంబులు సాల • హారిరత్న

1 అసమాంఘ్ర్యంజనము=సాటిలేనిపాదములకుఁ బూయు లత్తుక.

మయము లై యొప్పారు • మఱియును బుష్యరాగమయసాలములకుఁ • గనకసాల
మునకు నంతరగత • భూమియుఁ బుష్యరాగమయమైయొప్పారుఁ • గాంతమగుచు.

ఆ. వక్ష్యమాణసాల • కక్ష్యలయం దెల్లఁ, దత్ప్రభాఢ్యపక్షి • తతులు గొలఁకు
లంబు పూర్ణనదులు • నతిమనోహరభూరు, హములు సాలవర్ణ • కములఁ దనరు.

ఆ. సిద్ధజాతులందు • శ్రీదేవి వివిధక్ర,మంబులను భజించి • మమత విడిచి
యెవ్వరంగములను • హితమతి విడుతురు, వారు సిద్ధులగుచుఁ • బరఁగుచుంద్రు.

మ. లలితామంత్రములన్ జపించి మదిలో • లాక్షారుణాంఘ్ర్యబ్జయా
కుళదేవీవరనామకీర్తనములన్ • గూఢాత్మయా నంబికా
విలసత్స్తోత్రములన్ సదా నుడువుచున్ • విశ్వేశ్వరీధ్యానని
ష్ఠలచే నొప్పెడు వారు సిద్ధులగుచున్ • సంతృప్తి నుం ద్రెప్పుడున్. 614

చ. స్థిరమగు పుష్యరాగమయ • దివ్యమరీచివిశాలమైన య
వ్వరణము నవ్వలం జెలఁగి • పావకయోజనదూరమందు సుం
దరమయి పద్మరాగసము • దాయవినిర్మితసాల మొప్పెడుం
గరమరుదై చెలంగునది • కన్గొన గోపురరత్నకాంతులన్. 615

తే. అదియుఁ జతురశ్రమై తగు • నచటి భూమి
పద్మరాగమయంబయి • పరఁగుచుండు
నందుఁ జారణలోకస్థు • లయినవారు
సిద్ధిఁ గని దేవిఁ బూజించి • చెలఁగుచుంద్రు. 616

ఉ. చారణకాంత లాస్థలిని • జారుతనూలత లొప్పఁగా సురా
పూరితకుక్షులై మదవి • భూతిఁ జెలంగి పరేశ్వరిన్ మనో
హారిణి దివ్యగానమున • హర్షనిమగ్నగఁ జేయుచున్ సురో
దారమహీజమూలతల • ధామములన్ నివసించి ప్రీతితోన్. 617

తే. ప్రాణనాయకులను గూడి • పగలు రాత్రు
లతిమధురమద్యమును ద్రావి • యతుల గతులఁ
బ్రమదమునఁ దేలుచుందురు • పద్మరాగ
సాలమున కవ్వలను దీప్తిఁ • గ్రాలుచుండు. 618

వ. గోమేధికప్రాకారంబు పూర్వప్రాకారసమాకృతియై సప్తయోజనదూరంబున
నుండు. అద్దాని మధ్యభాగంబునఁ గోటియోగినులును, భైరవులును గాలసం
కర్షణి యను పేరం బరఁగు పరమేశ్వరిని సేవించుచుందురు. గోమేధికప్రాకా
రాంతరంబున మారుతయోజనదూరంబున నత్యున్నతం బగు హీరరత్నమయ

ప్రాకారంబు వెలుంగు. తన్మధ్యభాగంబు హీరరత్నమయం బై యుండు నందు.

సీ. గంధర్వు లప్సరో • గణములతోఁ గూడి పరమేశ్వరీగుణ • ప్రకరగీత
సంతతి వల్లకీ • స్వనములఁ జాటుచుఁ గామశుభైకసం • క్రాంతు లగుచుఁ
గామసన్నిభదివ్య • కాయు లై సుకుమారసుస్వభావాఢ్యు లై • సులభు లగుచు
రంభ మేనకయు నూ • ర్వసియు నలంబుస మంజుఘోషసుకేశి • మహితమూర్తి

తే. యైన విశ్వాచియుఁ దిలో త్త • మాఖ్యలలన
మొదలుగాఁగల నచ్చరల్ • పొదలుచుండఁ
గల్పవృక్షజసురఁ గ్రోలి • కామజనని
పాదపద్మంబులను గొల్చి • పరఁగుచుండ్రు. 620

వ. మఱియుఁ జతుర్దశస్థానోత్పన్న లగు నచ్చరలెల్ల నందుఁ బర దేవిని బూజించు చుందు రన విని యగస్త్యుండు చతుర్దశస్థానంబు లెవ్వి యెఱింగింపవే యను టయు హయగ్రీవుం డిట్లను. బ్రహ్మహృదయంబును, గాముండును, మృత్యు వు, నుర్వియు, మారుతంబును, దవనకిరణంబులును, జంద్రకిరణంబులును, వేదంబులును, బావకుండును, విద్యుత్తు, నమృతంబును, దక్షకన్యాద్వయంబు ను, జలంబు నను నీచతుర్దశస్థానంబు లప్సరసలకు జన్మకారణంబు లని పెద్దలు చెప్పుదురు. కిన్నరులును గింపురుషులును దమతమ కాంతలం గూడి హీరకస్థ లంబు నాశ్రయించి లలితామంత్రజపంబుల విధూతాశేషకల్మషు లై నా ట్యంబు సేయుచుఁ బాడుచుందురు. హీరకక్షోణియందు వజ్రనది యొకటి చెలంగు. తత్తటద్రుమంబులు వజ్రాకారంబు లై ప్రకాశించుచుండు. వజ్రరత్న సికతాతలంబును, వజ్రద్రవమయోదకంబును గన్నుల కింపొనర్చుచుండు. ఆ మహానది పవిత్ర యై సదా ప్రవహించుచుండు. లలితాభక్తు లాయుదకంబును ద్రావి వజ్రరూపకళేబరు లై దీర్ఘాయుర్నీరోగు లై యుందురు. మఱియును. 621

క. మును భండాసురు వజ్రం,బున నింద్రుఁడు గొట్టె నదియు • భూరి బలాఢ్యుం
దనుజుని హింస యొనర్పం, గను సామర్థ్యంబు లేక • గళితం బయ్యెన్. 622

క. కనుఁగొని వాసవుఁ డీవ,జ్రనదీతటమందుఁ దపము • సల్పెను భక్తిం
దనరెడునాతపమునకును, మనమున ముద మంది లోక • మాన్యయుఁ గరుణన్.

క. నిరుపమకాంతివిశేష, స్ఫురణంబున వజ్రతటినిఁ • బుట్టి జవమునన్
గురుశక్తిలసితవజ్రము, బురుహూతున కొసఁగె నతఁడుఁ • బొదలె ముదమునన్.

తే. రమణ వజ్రాఖ్యసాలాంత • రమున సప్త, యోజనంబుల వైదూర్య • కోజ్జ్వలమగు
సాల మొక్కటి చెలువారు • లీలచేత, శిల్పియుగనిర్మితంబున • నల్పమగుచు.

తే. అచటిస్థలమును వైడూర్య • నిచయకాంతి
భాసురాకృతి వై పొల్చు • [1]బలినికేత
నమున వసియించు వారెల్ల • సుమహితాత్ము
లగుచు శ్రీదేవిఁ బూజించి • యనఘు లగుచు. 626

సీ. సిద్ధమూర్తులచేతఁ • జెలఁగుచు వసియింతు రాస్థలంబున సౌఖ్య • మలర శేష
శంఖకతక్షకుల్ • శంఖచూడుండును, వాసుకియును మహా • పద్మముఖులు
సర్పవర్యులును ద • ద్వ్యాంధవాదులు బలి ప్రముఖధార్మిక మహా • రాక్షసులును
వైడూర్యమయభూమి • వర్ధిల్లి లలితాంబ నర్చించి ధ్యానించి • యతులభక్తి

తే. వినుతి సేయుచు నాగమ • విధుల నెఱిఁగి
భక్తులై యుందు రాస్థలిఁ • బరఁగు శిశిర
జలములో [2]హ్రాదినుల్ సర • స్సముదయంబు
[3]సారసాలంకృతంబు హం • సగణహారి. 627

సీ. వైడూర్యమణిలస • ద్భవనంబు లొప్పారు నందుఁ గ్రీడింతు ర • య్యసురవరులు
సర్పరాజంబులు • చానలతోఁ గూడి యాసాలమునకు మ • హాస్థమునకు
సప్తయోజనముల • సరణిని జెల్వారు నింద్రనీలంబుల • నెసఁగునట్టి
ప్రాకార మది చక్ర • వాకంబు నానొప్పఁ దన్మధ్యమమునందుఁ • దనరుధరణి

తే. నీలరత్నమయుంబయి • నెగడు నందు, [4]మధురపాథస్సులై నదుల్ • మధురసైక
హారిపంకేరుహంబు లొ • నట్టి కొలఁకు, లఖిలసౌఖ్యార్థవస్తువు • లలరుచుండు.

చ. మనుజులు దేవదేవి ఘన • మంత్రము భక్తి జపించి సిద్ధులై
తనువులఁ బాసి నీలమణి • ధామవిశాలమహాస్థలంబునం
దనవరతోత్సుకప్రదము • లైన సువస్తువులన్ భుజించుచున్
వనితలఁ గూడి యుందు రతి • భాసురమద్యముఁ గ్రోల మత్తులై. 629

చ. సరసుల [5]సింధుకూలములఁ • జారులతాగృహమండపంబులన్
నిరతము లోకమాత మది • నిల్పి జపించుచు మంత్రరాజ మీ
వరుసను సౌఖ్యనీరనిధి • భాసిలి ప్రాగ్జనికర్మముల్ క్షయిం

1 బలినికేతనము = పాతాళము. 2 హ్రాదినుల్ = నదులు. 3 సారసాలంకృతంబు=కమలములచే నలంకరింపఁ బడినది. 4 మధురపాథస్సులై=మంచినీరుగలవియై. ఇచట పాథశ్శబ్దము పయోగణమునఁ జేరినది కావున "సాంతాదపయః ప్రభృతే స్లోపః" అనుసూత్రము ప్రకారము సులోపములేదు. రూ. పాథసు. 5 సింధుకూలములన్ = నదీతీరములయందు. సింధుశబ్ద మిట నదీ సామాన్యవాచక మని తెలియఁదగు. శ్లో. "సింధుస్తు వారిథౌ, దేశే నదే గజమదే నా నద్యాం తు స్త్రియా మయమ్" అని నానార్థరత్నమాల.

పరహితపాపు లై మరలఁ • బైకొను వాసనచేత మర్త్యు లై. 630

తే. మర్త్యలోకంబునం బుట్టి • మహితఁ జక్ర, వర్యమును బూజచేయుచు • భవ్యచిత్తు
లగుచు మరలను శ్రీపుర • మందు నొప్పు, నీలమణి భూమిపై లీలఁ • గ్రాలుచుంద్రు.

క. మనమున నిర్మలభక్తిని, దనరుచు జ్ఞానమునఁ బొదలి • తనువులు క్షీణిం
చినఁ జని మనుజులు లలితా, ఘనదేహైక్యమును బొంది • క్రాలుదురు మునీ.

వ. ఇంద్రనీలప్రాకారంబునకు సప్తయోజనంబుల దూరంబున ముక్తారత్నమయ
ప్రాకారంబు పూర్వరీతి గోపురద్వారమండితం బై యుండు. తన్మధ్యభాగంబు
ముక్తారత్నఖచితం బై శిశిరాతిమనోహరం బై వెలుంగు తామ్రపర్ణియు,
మహాపర్ణియు మొదలగు మహానదులు ముక్తామయతటవిరాజితంబు లై వెల
యు. అమ్మహానదీతీరంబులందు. 633

క. సురలోకవాసు లంబా, వరమంత్రజపంబు జేసి • ప్రాక్సుకృతంబుల్
పరిణతి నొందిన జన్మాం, తరమున ముక్తానదీవ • తంసతటములన్. 634

వ. వసియింతురు. ముక్తాసాలనీలప్రాకారద్వారమధ్యభాగంబులందుఁ బ్రాగ్భా
గంబున నింద్రలోకంబును, దత్కోణంబున వహ్నిలోకంబును, యామ్యభా
గంబున యమపురంబు నలరు. ఆ యమపురంబునందు. 635

తే. చిత్రగుప్తాదు లెల్లను • జేరి కొలువ, శ్రీపరాంబికమంత్రసం • సిద్ధుఁ డగుచు
దండధరుఁ డంబికాద్రోహి • తతుల నెల్లఁ, బీడసేయుచు నివసించుఁ • బృథులశక్తి.

సీ. గురుశప్తులును, దురా • చరణులు లలితాంబికా ద్వేషకారులు • గర్వమతులు
దర్పితుల్, మూర్ఖులు • స్తబ్ధులు కూటభుక్తులు, మంత్రచోరులు • కుమతపరులు
కుత్సితవిద్యాప్తి • గూఢధర్మాశ్రితుల్ ప్రాణిహింసకులును • బాపశీలు
రంగనాద్వేషులు • హతధర్ములును మఱి యితరపాపులు నగు • నెల్లజనులఁ

తే. గాలసూత్రంబు రౌరవాం • గారతాప, నాసిపత్రవనంబులు • నాదిగాఁగఁ
గల్గు నరకంబులందు వే • గ పడవైచి, బాధసేయుచు నుండును • బౌరుషమున.

వ. నిర్ఋతి యను రాక్షసుండు ఖడ్గధారకుం డై పశ్చిమభాగంబున రాక్షసలోకం
బు నాశ్రయించి యుండు. ఉత్తరభాగంబున వారుణలోకంబు నాశ్రయించి
వరుణుండు [1]వారుణీపానమత్తుం డై శుభ్రాంగుం డై [2]ఝషవాహనుం డై
ప్రకాశించుచుండు. మఱియు నవ్వరుణుండు. 638

1. వారుణీపానమత్తుండై = సురాపానముచే మత్తత కలవాఁడై. 2 ఝషవాహనుండై = చేఁప వాహనము గాఁగలవాఁడై.

పంచ్చ్ధవృ. మనోన్మనీక్ శంకరి • మంజుభాషిణిక్
సనందనాద్యర్చితచారుపాదుకక్
మనంబునక్ ధ్యానసమాధినిష్ఠతో
ననంతభక్త్యుత్కటహర్ష మొప్పఁగక్. 639

ఆ. తలఁచుచు న్మహాశితంత్రసాధకుఁ డయి, దేవి రిపుల నెల్లఁ • దీక్ష్ణపాశ
బంధనములఁ గట్టి • భవ్యేతరం బగు,మార్గమందుఁ ద్రోసి • మఱియు నతఁడు.

క. పరమేశ్వరిచరణాంబుజ, నిరతుల బంధములనెల్ల • నెక్కొను వేడ్కం
బరిపరివిధములఁ ద్రెంచుచు, వరుణుఁడు చెలువారుచుండు• వైభవ మెసఁగక్.

సీ. అతనికి నుత్తరం • బగుకోణమున వాయువతికాంతిఁ జెలువారు • నందు వాయు
దేహులై యత్యంతదివ్యభోగాత్ములై సిద్ధదివ్యర్షులు • చెలఁగుచుంద్రు
మఱియును యోగైకమహితులు యోగినుల్ మొదలుగాఁగలయట్టిసదమలాత్ము
లనుగూడి పవమానుఁడును ధ్వజహస్తుఁడై మృగవరంబును నెక్కి • మిగులుశక్తి

తే. శంకరీపాదపంకజార్చనరతుండు, సప్తధాభిన్నమూర్తియు • సాధుచిత్తుఁ
డగుచు వర్తిల్లు నతిసికినునుఁగుశక్తు, లిడ సుషుమ్న యుఁబింగళ యెసఁగుచుంద్రు.

వ. వారలు సర్వదామధుమదాలసులై యానందపూరితదేహు లగుశక్తులం గూడి యుండు రాశక్తిత్రయంబును గూడి మారుతేశ్వరుండు చక్రేశ్వరిని బూజించుచుండు. ఏశక్తిచేఁ గల్పాంతమందు లోకంబులనెల్లఁ బరాగమయంబులఁగా నొనరించి నశింపఁ జేయు నట్టిశక్తి కలుగుటకై లలితేశ్వరీమంత్రజపంబు చేయుచుండు. అట్టి మారుతలోకంబునకుఁ బూర్వభాగంబున యక్షలోకంబున యక్షేశుండు ప్రాగుక్తద్వారద్వంద్వమధ్యగతుండై నవనిధులం గూడి బుద్ధివృద్ధ్యాదిశక్తియుక్తుండై యక్షులం గలిసి చక్రేశ్వరిని బూజించుచుండు. మాణిభద్రపూర్ణభద్రమణిమన్మణికంధరులాది యగుయక్షు లాలోకంబున నివసింతురు. ఆలోకంబునకుఁ బూర్వభాగంబున రుద్రలోకం బలరు నందు. 643

తే. సర్వదా బద్ధతూణుఁడై • సంతతాతి,మన్యుసంయుతుఁడై జటామకుటరుచిర
కాంతిఁ జెలువారు రుద్రుండు•సంతతంబుఁ, బ్రీతి నివసించు భూషణవ్రాతమలర.

చ. మఱియు నధిజ్యకార్ముకుఁడు • మాన్యుఁడుఁ బింగళలోచనుండునై
నెఱిఁ జెలు వొంది సోప్వపముల • నిర్మలశీలుర శత్రుకోటులక్
నెఱవు దగంగఁ జంపుటకు • నేర్పును శూరతఁ గల్గు వారలం
జుఱుకుతనంబునక్ మిగుల • శోభిలు వారలఁ గూడి వేడుకక్. 645

వ. షోడశావరణస్థానంబుల నున్నరుద్రులును భక్తియుక్తులై కొలువ లలితామం

త్రింబును జపించుచు శ్రీదేవీధ్యానసంపన్నుం డై యనేకకోటి రుద్రాణీగణమండితపార్శ్వస్థలుం డై యుండు. ఆరుద్రపత్నులును నవయౌవనగర్వితలును, లలితాధ్యాననిరతలును, సురామదముద్రాలసలును నై చెలంగుచుందురు. వారలఁ గూడి త్రిశూలపాణియగుచు హిరణ్యబాహుప్రముఖరుద్రనిషేవితుం డై లలితాదర్శనభ్రష్టు లగుదురాత్ములను, గురుద్వేషులును నగుపాపులను శూలాగ్రంబున భేదించి తృతీయనేత్రోత్పన్నపావకజ్వాలల దహించుచు వారి పశుభృత్యాదులను హింసించుచుండు. ఆరుద్రదేవుని పరివారదేవత లసంఖ్యాకులై యధిభూమ్యంతరిక్షంబుల నుందు రట్టి వారినెల్లఁ బేర్కొన నెవ్వరికైన నసాధ్యం బై యుండు. ఏరుద్రుల కన్నంబు వాయువులు, వర్షంబు బాణంబు లారుద్రులు ప్రదీప్తులును, బింగళేక్షణులును నగుచు వర్తింతురు. అర్ణవంబున నంతరిక్షంబున నున్నరుద్రులు మహౌజసులును, జటావంతులును, ధనుర్ధరులును, నీలగ్రీవులును, విలోహితులు నయి ప్రకాశింతురు. ఏరుద్రులు భూతంబుల కెల్ల నధిపతు లగుదు రట్టిరుద్రులు విశిఖులును, గపర్దినులు నయి యుందురు. ఎవ్వరు మార్గరక్షకులును, దీర్ఘనివాసులు నగుదురో యట్టి సహస్రసంఖ్యాకు లగు రుద్రులు సృకావంతులును, నిషంగిణులును నై లలితాజ్ఞాప్రవర్తకు లై దిక్కులయం దెల్ల నివసించుచు క్షణమాత్రంబున విశ్వత్రయంబును గాల్చుటకు సమర్థు లై శ్రీదేవీధ్యాననిరతు లై తన్మంత్రంబులను జపించుచుఁ బరదేవీభక్తులను బాలించుచు షోడశావరచక్రంబున ముక్తాప్రాకారమండలంబునం దున్నమహారుద్రు నాశ్రయించి వర్తింతురు. కుంభసంభవా! రత్నసాలంబున నివసించిన వారల నెఱింగించితి నన విని యగస్త్యుండు హయగ్రీవున కి ట్లనియె. 646

### రుద్రాలయరుద్రవిశేషనామముల వివరము.

తే. షోడశావరణం బయి • సొంపు నింపు, చక్రమెట్టిది దానికి • స్వామి యెవ్వఁ
డందు నివసించుశ్రీరుద్రు • లెంద ఱెట్టి, నామములఁబిల్వఁబడుదురు • నాకుఁ జెపుము.

క. ఏయేయావరణంబుల, నేయేదళములను నెంద • ఱెందఱు ప్రీతిం
బాయక నివసింతు రొకో, యాయాహ్వాము లనువదింపు • మతిశయకరుణన్.

వ. ఏనామంబులు యౌగికంబు లెవ్వి రూఢంబు లెఱింగింపు మనుటయు హయగ్రీవుం డి ట్లనియె. 649

సీ. అందు రుద్రాలయ • మలరు ముక్తాసముదాయనిర్మిత మయి • తనరు పంచ
యోజనవిస్తృతి • నొగిఁ బంచయోజనాయామంబుచే నొప్పు • నందుఁ బదియు

నాఁటు నావరణంబు • లలరుఁ దన్మధ్యమభాగంబునను వెల్గుఁ • బరమపీఠ
మద్దానియందు మా•హారుద్రుఁ డుజ్వలన్మన్యుఁడుఁ ద్ర్యక్షుండు•మహితతనుఁడు
తే. సజ్యకార్ముకహస్తుండు • సర్వఫలదుఁ, డగుచు నివసించు నెప్పుడు • హార్ష మలరఁ
ద త్రికోణతలంబునఁ • దనరుచుండ్రు, మూఁగురు రుద్రులు సజ్యకా•ర్ముకము లొప్ప.
తే. ప్రథముఁడు హిరణ్యబాహుండు • పరఁగు నల్లె
నవనవానంద మొప్ప సే•నాని యనెడు
వాఁడు ద్వితీయుఁ డగును దిక్•పతి తృతీయుఁ
డుద్యతాయుధహస్తుఁ డై • యొప్పుచుండు. 651
వ. షట్కోణంబులను వృక్షులు, హరికేశులు, బశుపతి, సస్పింజరుండు, త్విషీమంతుఁడు, పథిపతియు ననువారు చెలంగుచుందురు. అష్టకోణంబులయందు బభ్రుశుండు, వివ్యాధి, యన్నపతి, హరికేశుం, డుపవీతి, పుష్టపతి, భవుండు, హేతి యనురుద్రులు భాసిల్లుదురు. మఱియు. 652
సీ. దశపత్త్రములయందుఁ • దనరు జగత్పతి రుద్రాతతావినుల్ • రూఢబలము
లొప్పు క్షేత్రపసూతు•లొగి నహంతయు వనపతి రోహితుండు స్థపతియు వృక్ష
పతియును సజ్యచా•పంబుల నొప్పారుచుందురు వీరెల్ల • నుగ్రమూర్తు
లరిజనభీషణు • లై క్రాలుచుందురు ; ద్వాదశపత్రస్థ•దైవతములఁ
తే. బంచమావరణస్థులఁ• బ్రబలమూర్తు,లను మహావీరవర్యుల•ననువదింతుఁ [యుఁ
గ్రమముగామంత్రివాణిజ•కక్షపతిభు,వంతులునువారివస్కృతా•హ్వాయుఁడుమఱి
వ. ఓషధిపతియు, నుచ్చైర్ఘోషాక్రందయంతులును, బత్తిపతియుఁ, గృత్స్నవీతుండును, ధావంతుండును, సత్వపతియు నను నాహ్వయంబుల నొప్పుదురు. మఱియు షష్ఠావరణంబున సహమానవ్యాధులు, నావ్యాధినీపతియుఁ, గకుభుండును, నిషంగియు, స్తేనపతయు, [1]నిషంగియు, నిషుధిమంతుఁడును, దస్కరపతియు, వంచత్పరివంచులును, స్తాయుపతియు,నిచేరువుండు ననురుద్రులు నివసింతురు. షోడశారంబునందుఁ బరిచరారణ్యపతిసృకావులును, జిఘాంసన్ముష్ణత్పత్యసిమంతులును,నక్తంచరప్రకృంతపత్యుష్ణీషిగిరిచరకులుంచపతీషుమంతులును, ధన్వావియు, నాతన్వానుండును, ప్రతిదధానుండు, నాయచ్ఛంతులు నను మహావీరులు ప్రకాశింతురు. అష్టమావరణంబున విస్పృజంతులును, నాస్యంతులును, విధ్యంతులును, నాసీనులును, శయానులును, స్వపంతులును, జాగ్రితుండును, దిష్ఠంతులును, ధావంతులును, సభులును, సభాధిపులును, నశ్వంబులును, నశ్వ

1 నిషంగి=భక్తులయం దెల్లప్పు డాసక్తికలవాఁడు.

పతులు, నావ్యాధినులును, వివిధ్యంతులు, నుగణులును, దృంహత్యులును, గృత్స్నలు నను నష్టాదశవిధ దేవతలు నివసింతురు. నవమావరణంబునఁ గృత్స్నపతియు, వ్రాతులును, వ్రాతపతియు, గణంబులును, గణపతులును, విరూపులును, విశ్వరూపకులును, మహాంతులును, క్షుల్లకులును, రథులు, నరథులును రథరూపులును, రథపతులును, సేనలును, సేనానినులును, క్షత్తలును, సంగ్రహీతలును, దక్షులును, రథకారకులును, గులాలులు నను రుద్రులు నివసింతురు. దశమావరణంబునఁ గర్మారులును, బుంజిష్ఠులును, నిషాదులు, నిషుకృద్గణంబులును, ధన్వకారులును, మృగయువులును, శ్వనులును, శ్వానరూపులును, పతులును, భవుండును, రుద్రుండును, శర్వుండును, బశుపతియు, నీలగ్రీవుండును, శితికంఠుండును, గపర్దియు, వ్యుప్తకేశుండును, సహస్రాక్షుండును, శతధన్వుండును, గిరిశుండును, శిపివిష్టుండును, మీఢుష్టముండు నను రుద్రులు నివసింతురు. ఏకాదశచక్రంబున నిషుమద్ధ్రిస్వవామనులును, బృహద్వర్షీయులును, వృద్ధసంవృధ్వనులును, నగ్ర ప్రథములు, నాశ్వజిరశీఘ్రిశిభ్యకులు, నూర్మ్యవస్వన్యసోత్రస్య ద్వీప్య జ్యేష్ఠకనిష్ఠపూర్వజాపరజమధ్యమాపగల్భజఘన్య లను చతుర్వింశతిసంఖ్యాకరుద్రులు నివసింతురు. ద్వాదశావరణంబున బుధ్న్యసోభ్యప్రతిసర్యకయామ్యకక్షేమ్యోర్వర్యఖల్యశ్లోక్యావసాన్యవన్యకక్ష్యశ్రవప్రతిశ్రవాశుషేణాశురథశూరావభిందద్వర్మివరూథిబిల్మికవచి శ్రుతసేనశ్రుతదుందుభ్యాహనన్యధృష్ణువు లను షడ్వింశతిరుద్రులు నివసింతురు. త్రయోదశావరణంబునఁ బ్రమృశదూతప్రహితనిషంగులు, నిషుధిమత్తీక్ష్ణేషువులును, శతాయుధిస్వాయుధసుధన్వులును, స్రుత్యపథ్యకాట్యనీప్యసూద్యసరస్యనాద్యవైశంతకూప్యావట్యవర్ష్యావర్ష్యమేఘ్యవిద్యుత్యేధ్రియాతప్యవాత్యరేష్మియవాస్తవ్యవాస్తుపసోము లను రుద్రులు చెలంగుచుందురు. చతుర్దశావరణంబున రుద్రతామ్రారుణశంగపశుపత్యుగ్రభీమాగ్రేవధదూరేవధహంతృలును, హనీయసుండును, వృక్షహరికేశతారశంభుమయోభువులును, శంకరమయస్కరశివశివతరతీర్థ్యకూల్యపార్యావార్యప్రతరణోత్తరణాతార్యలాద్యశష్ప్యఫేన్యలను దీప్తకోపులగు త్రింశన్మహారుద్రులు విహరించుచుందురు. పంచదశావరణంబున సికత్యప్రవాహ్యేరిణ్యప్రపథ్యకింశిలక్షయణకపర్దిపులస్తికగోష్ఠ్యగృహ్యతల్ప్యగేహ్యకాట్యగహ్వరేష్ఠకహ్రదయ్యనివేష్ప్యపాంసవ్యరజస్యకశుష్క్యహరిత్యలోప్యోలప్యులును, ఊర్వ్యసూర్మ్యపర్ణ్యపర్ణశద్యాప గురమాణకాభిఘ్నంతులును, ఆక్షిదత్ప్రక్షిదంతులును, గిరికదేవహృదయు లను ద్వాత్రింశద్రుద్ర దేవతలు

విలసిల్లుచుందురు. షోడశావరణంబునఁ బూర్వాదిద్వారంబులయందు విక్షీణక
విచిన్వత్కానిర్హ్వాతామీవత్కలను రుద్రులు దీప్తాస్త్రులై మహారుద్రునుపా
సించుచుందురు. మహారుద్రుండు లలితాజ్ఞాప్రవర్తకుం డై ముక్తాసాలేశాన్య
కోణంబున నివసించియుండు. శతరుద్రీయసంఖ్యాతరుద్రు లహర్నిశంబులు
విఘ్నహరు లై యుందురు, ఇట్లు శక్రాదిదిక్పాలకులు ముక్తాసాలంబు నాశ్రి
యించి లలితాసేవకు లై యుందురు. ముక్తాసాలాంతరంబున సప్తయోజన
దూరంబున మరకతనామకం బగు ప్రాకారంబు చతుర్యోజనోచ్ఛ్రితం బై
చెలంగు. గోపురద్వారాదికంబులు పూర్వరీతి నని యెఱుంగవలయు. అందు
వారాహికి నాగ్నేయాదికోణంబులయందు నాల్గుగృహంబులు శ్యామాగృ
హతుల్యంబు లై నిర్మింపఁబడియె. మఱియును, 654

కం. కిరిచక్రపర్వసంతతి, శరణంబుగ నలరుశక్తి • శక్తులె యాయా
వరగృహముల నలరారుదు, రరసి తదుజ్జృంభణంబు • నలవియె పొగడన్. 655

సీ. ఆదివ్యభూస్థలం • బంతయు మరకతరత్నఖచితము నై • రాజిలుఁ గడు
హేమతాళవనంబు • లెసఁగు నం దఖిలసద్వస్తువుల్ చెలువారు • వైభవాస్ప
దంబు నై యొప్పు నా • స్థలమందు నివసించు శక్తులు కిరిచక్ర • సమవిభవలు
లీలార్థపీతసు • రాలోలనేత్రలు మదఘూర్ణముసలాఖ్య • మహిత ఘోర

తే. సాధనోదగ్రహస్తలు • చంచలాభ
గాత్రలును నై చరింతు రా • క్ష్మాతలమున
యోజనాయతకాండంబు • లొప్ప లెక్క
పెట్టఁగా రాక తాళముల్ • పిక్కటిల్లు. 656

వ. అని మఱియు నవస్వర్ణవిచిత్రితంబు లై [1]విశంకటదళయుతంబులై [2]హేమ
త్వక్కులై సుస్నిగ్ధంబులై [3]ఫలభంగురంబు లై యామూలాగ్రలంబమాన
ఘటపటలంబు లై దండనాయికాప్రీత్యర్థకల్పితంబు లై యలరుచుండు. 657

ఆ. తాళసురను గ్రోలి • తద్దయు ముదమున, హేతుకాదిభైర • వేశ్వరులును
జృంభిని మొదలయిన • సీమంతినులు సప్త, నిగ్రహాఖ్యశక్తు • లుగ్రభంగి. 658

సీ. విహరింతు రతిమద • విహ్వాల లై నాల్గు దిక్కుల వార్తాళి • దేవి కొఱకు
నిర్మించి యున్నట్టి • నెలవులకును బూర్వముఖదిక్కులందు వి • భూతిమెఱయ

---

1. విశంకటదళయుతంబు లై = విరివిగలదళములతోఁ గూడినవి యై. 2 హేమత్వక్కు లై= బంగారుమయమగు పైపొరగలవియై. 3 ఫలభంగురంబు లై =ఫలములచే వంగినవియై.

వార్తాళిసంకాశ • భాసురకాంతుల నున్మత్తభైరవి • యొప్పుచుండు
స్వప్నేశియును దిర • స్కరిణియుఁ గిరిపదా దేవియు వార్తాళి • సేవచేయు
తే. చుండు రామరకతకక్ష్య • యందు దండ,నాథ విహరించు దుష్టజ • నంబులకును
నంత మొనఁగుచు భక్తుల • నరసిప్రోచు,చును యథేచ్ఛముగా భూతి • శోభిలంగ.

వ. వార్తాళికి మహాపద్మాటవీస్థలంబున సేవావాసం బొందుకలదు. మరకతాకార ప్రాకారంబునకు సప్తయోజనాంతరంబు నందు. 660

తే. విద్రుమాకారసాలంబు • వెలయు నుదయ,సూర్యపాటల మై యద్ది • శుభతమంబు
లైన విద్రుమములను జే • యంగఁ బడియె,నందువిద్రుమసంకాశుఁ • డైన యజుఁడు,
చ. సరసిజవిష్టరుం డగుచు • సర్వజగన్నుతుఁ డై పరాంబికా
చరణసరోజముం గొలువ • సంతస మొప్ప వసించుచుఁ మునీ
శ్వర యుతుఁ డై మరీచముఖ • సర్వజగత్సృజనప్రమోదని
ర్భరు లగుసృష్టికర్త లిరు • వంకలఁ గొల్వఁగ నుండుఁ బ్రీతితోన్. 662

వ. చతుర్దశవిద్యలు ననేకోపవిద్యలును, జతుష్షష్టికళలును శరీరములను దాల్చి విద్రుమప్రాకారంబున బ్రహ్మలోకంబు నాశ్రయించి చెలంగుచుందురు. విద్రుమసాలంబునకు సప్తయోజనంబులయందు మాణిక్యమండపం బనుకక్ష్య యలరారునదియును. 663

సీ. బహురత్నకృతములై • పరఁగు నాప్రాకారమును బూర్వరీతిఁ గో • పురముఖంబు
లలరఁగా వెలుఁగొందు • నం దొప్పు విష్ణులోకంబు నిర్మలతమ • కాంతిచేత
నందు సనాతనుం • డగు విష్ణు వెప్పుడు దశచతుర్ద్వాదశ • తనువు లొప్పఁ
దనరు భండుని యుద్ధ • మునఁ బరదేవినఖములఁ బుట్టినయట్టి • కంజనయన
ఆ. దశక మలరుచుండుఁ • దనరు నాకక్ష్యయం, దమల మణిమయంబు • లైనయట్టి
మీఁది కప్పదాని • కేదియుసాటిగా, దరయఁగక్ష్యలందు • నధికమిదియె. 664

క. ఆ కక్ష్యాంతరతలమున, శ్రీకేశవుఁ డలరు భక్త • చింతామణి యై
శ్రీకలితశంఖచక్రగ, దాకమనీయాచ్ఛహస్త • తలము లమరఁగన్. 665

వ. పూర్వాదిదిక్కులను గాపాడుచుఁ బంద్రెండు మూర్తులం దాల్చి యుండు. తద్విధం బెఱింగించెద సావధానుండ వై యాలింపుము. 666

క. కనకప్రభల వెలుఁగుచు, వనజాక్షుఁడు చక్రి యొప్పఁ • బరఁగుచుఁ బ్రాగ్ది
క్కునఁ గేశవాహ్వయంబున, ననయము నివసించియుండు • హర్షము తనరన్.

వ. దక్షిణభాగంబున ధనుర్ధరుం డై గోవిందుండుండు. పశ్చిమభాగంబున ముద్గరహస్తుం డై విద్యుత్సన్నిభచ్ఛాయుం డగు నారాయణుం డలరు. ఉత్తరపార్శ్వం

బున హాలధరుం డగు విష్ణుమూర్తి పద్మకింజల్కసమకాంతిచే నొప్పు. ఆగ్నే యంబున నరవిందపరిభల ముసలధారి యై మధుసూదనుండు చెన్నుమీఱు. నైరృతియందు ఖడ్గపాణియగుచు జ్వలనకాంతిచేఁ బ్రకాశించు త్రివిక్రముండు వెలుఁగొందు. వాయవ్యతలంబున వజ్రాయుధుం డగుచు నాదిత్యవర్ణుం డై వామనుండు మెఱయు. ఈశాన్యంబునఁ బుండరీకకాంతిచేఁ బట్టసాయుధం బొప్ప శ్రీధరుండు ప్రకాశించు. అధోభాగంబున శంఖహస్తుం డై జీమూ తాంగుం డై నారాయణుండు తనరు ఊర్ధ్వభాగంబున నిందీవరదళశ్యాముం డగు మాధవుండు నివసించు. పద్మనాభుండు శార్ఙ్గపాణియై సహస్రదినకరప్రభా భాసమానుం డై మాణిక్యమండపస్థానంబు ననులోమంబునఁ జుట్టి రక్షించు. ఇంద్రగోపకతుల్యకాంతి యై పాశహస్తుం డై సర్వాయుధంబులను దాల్చి దా మోదరుండు మాణిక్యమండపస్థానంబును బ్రతిలోమక్రమంబునఁ గాపాడు చుండు. ఇట్లు ద్వాదశవిధంబుల నమ్మండపంబును భగవంతుండు కాపాడుచుం డు. అద్దానికి సప్తయోజనమితదూరంబున సహస్రస్తంభనామకం బగు మండ పంబు చెన్నుమీఱు. అద్ది నానారత్నఖచితంబు, నానామణిమయప్రాకారంబు నత్యున్నతంబును నగు. ఒక్కొక్కవరుసకు వేయిస్తంభంబు లలరు. ఇట్టి పంక్తులు నాల్గుదిక్కులయం దనేకములుండు. ఉపర్యాచ్ఛాదనంబు రత్నదారు మయం బై యుండు. అందు శివలోకంబు వెలుఁగొందుచుండు. శైవాగ మంబు లిరువదియెనిమిదియు నందు దేహంబులం దాల్చి నివసించియుండు. నంది భృంగి మహాకాళప్రముఖులగు ముప్పదియాఱు దేవత లందుందురు. గజా ననులు వేలకొలఁది మెఱయుచుందురు. మఱియును. 668

గా. అందీశానుఁడు చంద్రశేఖరుఁడు లోకారాధ్యుఁ డై యెంతయుఁ
మందం బై బెడఁ గాస్మితంబు ముఖసీమం బర్వ యొప్పారఁగా
నెందుఁ సామ్యము వోల్పఁగాఁ దగని యుద్వృత్తిఁ మదోదగ్రులం
గుందం జేయుచు నుండు భక్తులకుఁ గోర్కుల్ ప్రీతితో నిచ్చుచున్. 669

• అంతర్బహిర్ధ్వాంత • మడఁగింపఁ జాలెడు నట్టి ప్రకాశ మై • యలరుమేధ
నలరింపఁజేయుచు • లలితామహాజ్ఞను దాఁటక సర్వజ్ఞ•తయు వెలుంగ
శైవదృష్టిని సర్వ•జనులను గాంచుచు మంత్రసిద్ధికి నయి • మహితరూప
మొప్పార నివసించు•చుండును గుంభజా! రుద్రాలయంబులు • రుద్రదైవ
• భేదములను నీకు • విస్తరించి వచించి,నాఁడ దీని వినిన • నాశమొందు
సకలపాతకములు • సకలమనోభీష్ట,ములును సిద్ధిఁ గాంచు • లలితకరుణ. 670

### మహాపద్మాటవీవర్ణనము.

క. అలరెడు వాపీత్రయముఖ, ములఁ గక్ష్యాభేదమునను ♦ బూన్కి వచింతుం
గలుషౌఘ మడఁగుఁ గర్ణం,బుల సోఁకిన నెట్టి వార్త♦ ముదమున దానిన్. 671

క. ఏవృత్తాంతము వినినన్, భావుకఫలములు లభించుఁ ♦ బ్రౌఢిమ చెలఁగుం
బావనమగు నవ్వార్త సు,ధీవిభవా! తెలుపువాఁడ ♦ దృప్తిగ వినుమా. 672

వ. సహస్రస్తంభసాలంబునకు మారుతయోజనాంతరంబున మనోనామకం బగు మహాసాలంబు సర్వరత్నవిచిత్రితం బై పూర్వరీతిగా గోపురద్వారకవాటార్గళ సంయుతం బై యుండు. తన్మధ్యకక్ష్యాభాగంబు సర్వం బమృతవాపిక యనం బరఁగు. 673

చ. మునివర! యే మహాసలిల♦ముం దమిఁ ద్రావిన యోగిసిద్ధు లా
య్యనఁ గులిశాంగులుం బ్రబలు♦లై కడుఁ బ్రాజ్ఞులు నౌదు రట్టి పా
వనసురసాయనం బమృత♦వాపికఁ దోయత నొంది యుండుఁ గా
వునఁ బరిపూతతత్సలిల♦భూరిసుగంధము భక్తి మీఱఁగన్. 674

క. ఆఘ్రాణించిన మాత్రన, శీఘ్రంబుగ సిద్ధికాంత ♦ చెలువుండె యగున్
జిఘ్రివు గాక స్పృశించిన, శీఘ్రిమ గతపాపుఁ డగుచుఁ♦ జెందును ముదమున్.

సీ. ప్రాకారయుగముల ♦ పార్శ్వంబులను సుధావాపీతటంబులు ♦ వఱలు రెండుఁ
గ్రోశార్ధవిస్తృతి ♦ గోమేధికచ్ఛాయ లగుచుఁ దక్కినభూమి♦ యంతయును సు
ధావాపి యై యొప్పుఁ ♦ దజ్జలస్థితి చతుర్యోజనాయత మయి ♦ యొప్పుచుండు
సోపానవలయముల్ ♦ శుభరత్నచిత్రితస్వర్ణవర్ణంబు లై ♦ సాంద్రరత్న
తే. భంబు లై యుండుహంసలు ♦ భవ్యసార, సములు వీచీవశంబునఁ ♦ జారుతీర
ములనుబొందుచునలరారు♦ నెలమిబత్తు, లాజలముద్రావియమరత్వ♦ మందుసుమ్ము.

క. [1]కారండవవికిరంబులు, బోరునఁ గూజితపులత్వ్య♦ మున లలితాదే
వీరాజన్మంత్రజపం, బారూఢిగఁ జేయుచుండు ♦ నాతీరమునన్. 677

క. సచివేశీసైన్యేశీ, ప్రచురాజ్ఞను నౌక నెక్కి ♦ వాపీస్థలికిన్
విచలితభక్తిని బోఁ దగు, నచటికి వేఱొక్కరీతి ♦ నరుగ వశంబే. 678

క. తరుణేశ్వరి యై తారా, వరవర్ణిని జెలఁగు నందు ♦ బహుశక్తు లాగిం
బరిచారికలై పొల్తురు, సురపతి మణితుల్యదేహ♦ శోభిత లగుచున్. 679

క. సరసీజలమున రత్న, స్ఫురదురునౌకాసహస్ర♦ ముల వారు నిరం

---

1 కారండవవికిరంబులు=హంసవిశేషములు.

తరమును గ్రీడింతురు స, త్వరముగఁ బరపూర్వరమ్య • తటగమనములన్. 680
క. అలరుచు వీణావేణ్వా, దుల మ్రోయఁగఁ జేయుచున్ వి • ధూతకబంధో
జ్జ్వలమాలిక లొప్పఁగ వా, రలు నూతనయౌవనముల • రాజిలుచుఁ గడున్.
క. కొందఱ[1]రిత్రకరాబ్జలుఁ, గొందఱు శృంగాంబుకరలుఁ • గొందఱు తరుణుల్
సుందరవీణాహస్తలుఁ, గొందఱు మదిరైకపాత్ర • గుంభితహస్తల్. 682
క. కొందఱు మృదంగమర్దళ, సుందరకర లగుచుఁ జెలఁగు • చుం బాడుచు నా
నందమున మదిరఁ గ్రోలుచు, నందందును వారికేళి • నానందింపన్. 683
క. తారాంబయు నాశక్తుల, గారవమున గూడి యెపుడు • గానానందం
బారూఢిగఁ బొందుచు న, వ్వారాహీశ్యామలాజ్ఞ • వాప్యమృతమునన్. 684
క. అవకాశ మొసఁగు దాఁటఁగ, నవహారునకు నైనఁ గాని • చాన చమూవా
రవిభుత్వశీల యై వెల, యు వరాహి యనుజ్ఞ లేక • యొసఁగ దనుజ్ఞన్. 635
క. సురఁ ద్రావుచుఁ దమిఁ బాడుచుఁ, [2]దరణిక్రీడాభిరతుల • దద్దయుఁ గనుచుం
బరమేశ్వరి కీర్త్యుజ్జ్వల, చరితములను బాడుచును వి • శాలప్రజ్ఞన్. 686
క. ప్రతినౌకను నవమణిని, ర్మితగృహముల నలరుచున్న • మీనేక్షణలన్
జతనంబు మీఱఁ బ్రోచుచు, నతిముదమునఁ దార యొప్పు • నాస్థలమందున్.
క. కొన్ని సువర్ణాఢ్యంబులుఁ, గొన్ని మహారత్ననికర • గుంభితములునుం
గొన్ని మృగాననములు నై, సన్నుతిఁగను దివ్యతరణి • సముదయములొగిన్. 638
క. ద్విరదేంద్రమకరమృగపతి, వరముఖముల నొప్పు తరణి • వారము లచటం
బరఁగు విచిత్రాకృతులం, దరణీశ్వరి యచట దివ్య • [3]తరియం దలరున్. 689
క. తనుఁబోలి చెలఁగి లలితా, [4]మనుజపనిష్ఠాత్వ మొప్పు • మానిని జెలియన్
వనరుహనేత్రను గూడుచు, ననులోమవిలోమగతుల • నందుఁ దిరుగుచున్.
క. ఘనశక్తిని దారాంబిక, యనుదిన మీకక్ష్య నెంతొ • యాదరమునఁ బా
లన సేయుచు నివసించును, గనుఁగొని లలితాంబ మదిని • గౌతుక మొందన్.

వ. ఆ మనస్సాలంబునకు సప్తయోజనాంతరంబున బుద్ధి సాలం బొప్పునది చతుర్యోజనోచ్ఛ్రితం బగు. తన్మధ్యకక్ష్యాభాగంబంతయు నానందవాపిక యనఁ బ్రఖ్యాతినొందు నా యానందవాపికయందు. 692

క. వకుళామోదకమేదుర, మకలంకము దివ్యతమము • నౌ మద్యము త
ప్తకనకసచ్ఛాయము నై, ప్రకటగతిన్ దజ్జలత్వ • భంగి వెలుంగున్. 693

---

1 అరిత్రకరాబ్జలు = ఓడ గడపెడు త్రెడ్లు హస్తాబ్జములందు గలవారు. 2 తరణిక్రీడాభిరతులన్=ఓడయందు విహరించుటయం దగు నాసక్తిచేత. 3 తరి = ఓడ. 4 మనుజపము=మంత్రజపము.

సీ. అవ్వాపికాగాధ • సమ్మృతవాపిక యట్ల యలరు సోపానము • ఖ్యంబు లెల్లఁ
బ్రాగ్వాపికారీతిఁ • బరఁగుఁ బతత్త్రిలు నవ్విధంబున నందు • నలరుచుండు
నందలి సలిలమ • ద్యంబును దమి దీఱఁ ద్రావుచుఁ ద్రావుచుఁ • దటమునందు
విహరించుచుందురు • విపులమదోన్మత్త లగుచు శక్తులు మదా • త్యంతపాట
ఆ. లాత్ములగుచు నందె • యలరు వారుణియుఁ బ్ర, త్యక్షురీతి నౌక • యందుఁ జెలఁగి.
యార్యవర్యు లెల్ల • నంద్రు సుధామాలి, నార్య నమృతనాథ యామె సుమ్ము. 694
తే. అట్టి వారుణి నౌకస్థ • యగుచు శక్తి, సైన్యములఁ గూడి యించుక • సరసదృష్టిఁ
జూచినంతనె లోకాళి • శుభ్రమద్య, మత్తతను గాంచ నాలేమ • మమత నుండు.
వ. మఱియును. 696
చ. తరుణరవిప్రకాశయు మ • దప్రకటారుణగండభాగయున్
సురతరుపుష్పమాల్యరుచి • శోభితకైశ్యయు నై సురాత్త[1]క
ర్బురచషకంబు నుత్పలము • పొంకముగాఁ బయి నొప్పుదాని ని
ర్భరమణిపాత్రముం [2]బిశిత • బంధురమున్ ధరియించి వేడుకన్. 697
మ. అనుకూలుం డయి నాయకుండు తనరన్ • హర్షంబునన్ వారుణీ
వనజాతాక్షి చెలంగుచున్ సతతమున్ • వారాహికా శ్యామలా
జ్ఞను నౌకా తరణాజ్ఞ నిచ్చుచును దో • స్సారంబునం బొల్చు న
న్వనితారత్నముఁ దేఱిచూడ నగునే • బ్రహ్మాదిదేవాళికిన్. 698
వ. బుద్ధిసాలాంతరంబున సప్తయోజన దూరంబున నహంకారప్రాకారంబు పూర్వ ప్రతిపాదితగోపురద్వారకవాటాన్వితం బై యొప్పు. ఆసాలద్వయమధ్యకక్ష్యా భూతలంబు సౌషుమ్నామృతరూపిణి యగు విమర్శవాపిక యనఁ బరఁగు. మహాయోగి మనంబు మారుతపూరితం బగుచుండ నేపరమామృతంబు సుషుమ్నాదండవివరంబున నావిర్భవించు నద్దియే విమర్శవాపికాసలిలంబు. ఆవిమర్శవాపిక పూర్వప్రోక్తతటసోపానపక్షినౌకాదులచే నొప్పు నందు నౌకేశ్వరి కురుకుల్లాహ్వయంబునఁ బ్రకాశించుచుండు. 699
సీ. తాపింఛనీలమౌ • తనువున వెలుఁగొంది శ్యామకంచుకమును • సరగఁ దాల్చి
స్వసమానరూపవై • భవయుక్త లౌ నట్టి కాంతలతోఁ గూడి • కడుఁ బ్రియంక
రుండు నౌ ప్రియుఁడు కై • దండ వర్తింప [3]రత్నారిత్రమును బూని • యతిబలాఢ్య
యై నౌకలను నెక్కి • యనుదినంబును గ్రీడసల్పువాపీదివ్య • జలగభీర

1 కర్బురచషకంబు=బంగారుపానపాత్రము. 2 పిశితబంధురము=మాంసముచే నిండియుండునది.
3 రత్నారిత్రమును=రత్నమయమైన యోడగడపెడు తెడ్డు.

తే. మలరుఁ బూర్వోక్త మారీతి♦నవలసప్త, యోజనంబుల సూర్యబింబో♦జ్జ్వలంబు
నై చతుర్యోజనోచ్ఛ్రితం♦బైన సాల, మర్కతేజంబుఁ బోనాడి♦యలరుచుండు.

క. కురువిందఖచితమై యు,ర్వరభాసిలు నందు వెలయు ♦ బహుపుణ్యాదమై
సురకిన్నరోరగాదుల, కిరవై యాకత్మ్యమహిమ ♦ నెసఁగుచు నెపుడున్. 701

సీ. బాలాతపోద్గార♦భవ్యాహ్వయంబున నొప్పెడు నద్దాని♦ నొగి స్పృశింప
సూర్యతుల్యప్రభా♦శోభితు లై దివ్యతేజస్స్వరూపు లై ♦ దివ్యు లట్ల
వెలయుచుందురు భక్తి♦కలితు లై తగువార లందు శ్రీలలితాంబ♦నాశ్రయించి
తప మొనరించి య♦త్తపనుండు దీప్తులఁ బడసె గ్రహంబులు ♦ [1]భంబు లుగ్ర

ఆ. తపము సల్పి లోక♦తతుల వెలింగింపఁ, జాలునట్టి కాంతిఁ♦ గ్రాలునట్లు
వరము లొందె నట్టి ♦ బాలాతపోద్గార, మెన్నఁగాఁ దరంబె ♦ యేరికైన. 702

వ. మార్తాండభైరవుండు ద్వాదశవిధాకారంబులతోఁ జెలంగుచు శక్తితేజఃకోటుల తోడఁ గూడి మహాప్రకాశరూపుం డై మదారుణవిలోచనుం డై కంకేళితరుఖండంబులయందుఁ గ్రీడింప నుత్సుకుం డై యుండు. మహాప్రకాశశక్తియుఁ జక్షుష్మతియు, ఛాయాదేవియు నను మువ్వురనుగూడి శ్రీదేవీవిద్యను జపించుచు లలితాభక్తుల సర్వేంద్రియంబులఁ బ్రకాశింపఁ జేయుచు బహిరంతస్తమోజాలంబు సమూలంబును నశింపఁజేయుచు బాలాతపోద్గారంబునఁ బ్రకాశించుచుండు. సూర్యబింబమహాప్రాకారాంతరంబున సప్తయోజనదూరంబునఁ జంద్రబింబమయప్రాకారంబు చతుర్యోజనోచ్ఛ్రితంబు నై పూర్వసాలతుల్య గోపురద్వారకవాటంబులు గలిగి వెలుంగు. తన్మధ్యభూతలంబు చంద్రికోద్గారంబని చెప్పంబడు నందు. 703

మ. అతిదుస్సాధ్యతపం బొనర్చి మును ప♦య్యత్ర్యక్షిజుం డౌ విధుం
డతులం బై తగుకాంతి నొందె మఱి దే♦వాళుల్ మనోభీష్టసం
తతులం బొందిరి దేవదేవిఁ ద్విజగ♦ద్ధాత్రిన్ మదిన్ నిల్పి ని
శ్చితచిత్తంబునఁ గొల్వ సిద్ధి గలుగున్ ♦ శ్రీసోమనాథుం డటన్. 704

మ. విమలాకారమునం ద్రిలోకతిమిరో♦ద్వృత్తిం గడుం జెండుచున్
మమతన్ నిర్మలచంద్రికామృతముఁ బ♦ల్మాఱుం దమిం ద్రావుచున్
శమముం బూని సమస్తభక్తతతితాపాం♦చ్ఛాదానదక్షుండు నై
సుమహాతేజమునం జెలంగు నెపుడున్ ♦ శుభ్రాంశురూపంబునన్. 705

1 భంబులు=నక్షత్రములు.

తే. సప్తవింశతినక్షత్ర♦శక్తు లలరఁ
బూర్ణకాంతుల నాకృతి ♦ పొల్పుమీఱఁ
జంద్రికోద్గారమున నొప్పఁ ♦ జంద్రుఁ డలరు
సోమనాథాహ్వయంబున ♦ క్షేమదుఁడయి. 706

తే. శక్తు లెల్లను దారాహ్వ♦యుక్తి మెఱసి
సాలమం దెప్డు నిండి ని♦శ్చయమనముల
నాడుచును బాడుచును బ్రీతి♦ నమరియుండ్రు
చంద్రసాలంబునకు మీఁద ♦ సాంద్రమగుచు. 707

ఉ. మారుతయోజనంబులను ♦ మానితమై తగుసాల మొండు శృం
గారమహాఖ్యఁ బ్రాగ్వరణ♦కప్రతిమానమహోచ్ఛ్రియంబు చె
న్నారఁగఁ గౌస్తుభోల్లసిత♦మై యలరారెడు మధ్యభూమిశృం
గారము కుప్పచేసి నటు♦ కానఁబడున్ మునివర్య యెంతయున్. 708

వ. అద్దిమహాశృంగారపరిఘయనంబడు నందు శృంగారశక్తివ్రజంబు నానాభూషణభాసురంబై నౌకాసహస్రంబున సంచరించుచు మదోద్ధతంబై నౌకాసంస్థుం డగుకుసుమాయుధు నుపాసించుచుండు. కుసుమాయుధుండును విశ్వసమ్మోహకారకంబు లగువిశిఖంబుల నఖిలలోకంబుల మోహింపఁజేయుచు లలితాజ్ఞావశంవదుం డై యుండు. తత్ప్రభావసమ్మూఢు లై మహాపద్మాటవీస్థలంబును సురాసురులు పొందఁ జాలరు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శుద్ధచిత్తస్వభావు లై తదాజ్ఞచే నాస్థలంబున విహరింతురు. మఱియు. 709

సీ. పరిశుద్ధవేషులు ♦ భక్తినిర్భరులును శాంతచిత్తులు నైన ♦ జనులు వేగ
పద్మాటవీస్థలిఁ ♦ బరికింపఁ జాలుదు రతిమోహపరవశు ♦ లతిచలాత్మ
లతివికల్పస్వాంతు ♦ లైనట్టి మూఢులు వ్యామోహదాయిని ♦ యై ప్రభూత
రాగవనంబు లై ♦ రంజిల్లు శృంగారపరిఘఁ దరింప నే ♦ వరుస నైన

తే. తగరు మదనుం డజయ్యసౌం♦దర్యుఁ డగుచుఁ
జారుశృంగారపరిఘాధి♦కారి యగుచు
నలరు నాతని యనుమతి ♦ నందుఁ జొరఁగ
వలయు లేకున్న నందుఁ బో ♦ వచ్చునెట్లు. 710

ఆ. దాని యంతరాళ♦ధరణిషడ్యోజన, మాత్రదూరమందు ♦ మహితరీతి
నలరుఁ జక్రరాజ ♦ నిలయ చింతామణి, గృహము సకలలోక♦కీర్త్య మగుచు.

వ. తన్మధ్యభూమియంతయు రత్నభూషితంబు మహాపద్మాటవీనామంబునఁ బరఁగు.

అది సౌభాగ్యదాయిని యై యొప్పు. గోపురసంస్థితి ప్రాగుక్తప్రకారంబ యగు.
ప్రాకారంబులు బంచవింశతిసంఖ్యాకంబులు. ఒక్కొక్కప్రాకారంబునకు
జతుర్దిగ్గోపురంబు లలరుఁ గావున శతగోపురంబులు భాసిల్లు. సర్వప్రాకారంబు
లకును మూలభాగంబు యోజనసమ్మితంబు. పద్మాటవీస్థలంబును దన్మాహాత్మ్యం
బును వచించెద నాలకింపుము. సమస్తరత్నఖచితం బగు నాస్థలంబున స్థలపద్మం
బు లసంఖ్యాకంబు లై వర్తిల్లు. వానినాళంబులు యోజనాయామంబు లై
మార్దవంబు లై కంటకావృతంబు లై భాసిల్లు. పత్త్రంబులు తాళదశకమా
త్రాయామంబులు. కేసరంబులు పంచతాళసమాయతంబులు. కర్ణికంబులు శత
హస్తాయతంబులు. మఱియు నత్యంతకోమలంబులు, సదావికసితంబులు, నవ
సౌరభహృద్యంబులు, విశంకటదళంబులును నగు పద్మంబు లనేకకోటిసంఖ్య
లందుఁ బ్రకాశించుచుండు. 712

సీ. విను మహాపద్మాట • వీస్థలిఁ బ్రాగ్భాగమందుఁ గ్రోశోన్నత • మగుచు వర్తు
లాకారసంస్థిత • మై వహ్నిరూప మై యర్ధయోజనమాత్ర • మైన యట్టి
విస్తారమున నొప్పి • విమలకలాదశకంబున భాసిల్లి • క్రమ మగుచు
నర్ఘ్యపాత్రాధార • మలరు ఘటోద్భవ! దానిచుట్టును శ • క్తితతులు దీప్త
ఆ. విగ్రహముల నొప్పి • వెలయు ధూమ్రార్చిఃప్ర, ముఖము లర్కకళలఁ • బూనితరుణ
సరసిజాలయాంగ • సౌందర్యమున నొప్పి, బహుళభూషణములఁ • బరఁగు నచట.
తే. అలరు నాధారరూపుఁ డై • హవ్యవాహు, నాశ్రయంబున మన్మథు • సంగసౌష్ఠ
వమున నలరారు శక్తివ్ర • జము నిరంతరంబున సమానదోఃప్రతా • పంబుతోడ.
వ. ధూమ్రార్చిరూష్మలును, జ్వలినియు, జ్వాలినియు, విస్ఫులింగికయు, సుశ్రీ
సురూపలును, గపిలయు, హవ్యవాహయు, గవ్యవాహయు నను నీ దశకళ
లాధారాశ్రయంబుచే భాసిల్లుచుండు. ఆధారస్థితుం డగుసూర్యుండు పాత్ర
రూపుం డై త్రిలోకతిమిరధ్వంసి యై యుండు. సూర్యాత్మకం బగు నప్పాత్రము
సార్ధయోజనోచ్ఛ్రయంబును యోజనమాత్రవిస్తారంబును మహాజ్యోతిఃప్రకా
శితంబును నై యొప్పు. తత్పాత్రంబున సూర్యద్వాదశకళలు తపినియుఁ,
దాపినియు, ధూమ్రియు, మరీచియు, జ్వాలినియు, రుచియు, సుషుమ్నయు,
భోగదయు, విశ్వయు, బోధినియు, ధారిణియు, క్షమయు నను ద్వాదశనా
మంబుల వర్తించు. మఱియుఁ దత్పాత్రంబున మహానందకారణం బగు పర
మామృతంబు సర్వౌషధరసాఢ్యంబును, హృద్యసౌరభ్యసంయుతంబును, నీలో
త్పలకహ్లారసౌరభవాసితంబును, శీతలంబును, నిర్మలంబును, జలద్వీచీశతోదా

రంబును, లలితాభ్యర్చనోచితంబును, శబ్దాయమానంబును, సిద్ధికారణంబును నై యొప్పు. అద్ది నిశాకరకళామయం బగునమృతంబుగాఁ జెప్పంబడు నందు.

తే. చారుమణినిర్మితం బగు•స్వల్పనౌక, నెక్కి శశికళలం దతి•హృద్యనూత్న
యౌవనంబుల శోభిల్లి • యనవరతము, క్రీడచేయుచునుందురు•తృప్తిగనుచు.

సీ. అమృతమానదపూష• యలరు పుష్టియుఁ దుష్టిరతిధృతిశశినియుఁ•రామచంద్రి
కయుఁగాంతిజ్యోత్స్న శ్రీ•కాంతయుఁబ్రీతియు నంగదపూర్ణపూ•ర్ణామృతాఖ్య
యను నాహ్వాయంబుల•నమృతరోచిఃకళ లభినవయౌవన•లగుచు సుస్మి
తానన లై యొప్పి•యుందుఁ గ్రీడింతురు సృష్టియు బుద్ధియు•స్మృతియు మేధ

తే. కాంతిలక్ష్ములుద్యుతియును•గాంతస్థిరయు,స్థితియుసిద్ధియు ననవొప్పు•సృష్టికర్త్రు
కళలు క్రీడించుచుందు ర•గస్త్య మౌని,చంద్రి వారలవర్ణింప•సాధ్యమగునె.

వ. మఱియు జరయుఁ, బాలినియు, నీతియు, నీశ్వరియు, రతియుఁ, గామికయు, వరదయు, నాహ్లాదినియు, నీతియు, దీర్ఘయు నని హారికళలును; తీక్ష్ణయు, రౌద్రియు, భయానిద్రలును, దంద్రియు, క్షుత్క్రోధినీక్రియలు, నుత్కారియు, మృత్యువు నను రౌద్రకళలును; పీతయు, శ్వేతయు, నరుణయు, నసితయు నను నీ యీశ్వరకళలు నాల్గును; నివృత్తియు, బ్రతిష్ఠయు, విద్యయు, శాంతియు, నింధికయు, దీపికయు, రేచికయు, మోచికయు, బరయు, సూక్ష్మయు, సూక్ష్మామృతయు, జ్ఞానయు, జ్ఞానామృతయు, నాప్యాయినియు, వ్యాపినియు, వ్యోమరూపికయు నను నీపదాఱును సదాశివకళలును నాసరోవరంబునఁ గ్రీడించుచుందురు. మఱియు నందు విద్యలెల్ల శక్తిరూపంబు తుద్ర నౌక నధిష్ఠించి విహరించుచుందురు వీరెల్ల నర్ఘ్యసంశోధనార్థమై పరమేష్ఠిచేఁ గల్పింపఁబడిరి. అయ్యమృతమును ద్రావి శక్తులెల్ల మత్తచిత్తలై యుందురు. మహాచక్రస్థిత లగుశక్తు లయ్యమృతంబును రత్నకుంభసహస్రంబులను సువర్ణ ఘటకోటులను బూరించిపూరించి త్రావిత్రావి చింతామణిగృహనివాస లగు నణిమాదిశక్తులకెల్ల నిచ్చుచు విహరింతురు. మహాపద్మాటవీకక్ష్యాపూర్వభాగంబునం దర్ఘ్యకల్పనంబు వివరింపఁబడియె. తరువాతి చింతామణిగృహాంతరమును వర్ణించెద నాకర్ణింపు మని హయగ్రీవుం డిట్లనియె. 718

చింతామణిగృహాంతరవర్ణనము.

క. మునివర ! చింతామణిగృహ, మున కగ్నిదిశాంతరమున • మునుకొని వెలుఁగుఁ
ఘనశుచికుండం బది యో, జనవిస్తృతి ఖాతకముల • సమమై యొప్పున్. 719

ఉ. అందు వెలుంగుఁ జిజ్జ్వాలనుఁ • డర్చితుఁ డై పరమేశ్వరీమహా
నందద పాదపద్మ భజ•నప్రకుతూహలభక్తవాంఛలం
బొందుగ నిచ్చుచుం సురవి•భుప్రముఖామరసేవ్యమానుఁ డై
సుందరి యాజ్ఞచే నెలమి • శుభ్రిమరీచులం దేజరిల్లుచుం. 720
ఆ. అతఁ డనింధనుండు • నమృతతర్పిత దేహుఁ, డతులదీప్తి రుచిరుఁ•డసదృశుండు
మఱి యశోకవృక్ష • మహితపల్లవకాంతిఁ దనరి వెలుఁగుచుండు•ఘనుఁడతండు.
తే. అందు హోత్రమహాదేవి•హారుఁడు హోత, వారలిరువు రెరక్షించు• వారుజగము
లార్తినొందకయుండఁగ•నంబయంద, నుత్తరపరాఖ్యచేనొప్పు•నూత్న యగుచు.
క. లలితాంబాచోదితుఁ డై, జ్వలనాక్షుఁడు కామశివుఁడు • వర్తించు జగం
బుల నెల్లను గాపాడుచు, ఖలులను జెండుచుఁ ద్రిశూల•కలితకరుం డై. 723
సీ. విమలచింతామణి • వేశ్మమునకు రాక్షసాధిపుభాగంబు • నందుఁ జక్ర
రాజరథంబుండు • రమణీయమై నవపర్వయుక్తంబు నై • సర్వరత్న
మయ నిజాకృతితోడ • మహిత మై నాల్గుయోజనముల విస్తార•మున జెలంగ
దశ యోజనోన్నత•త్వమునఁ జెల్వారుచు శ్రుతిమయచక్ర మై•యతుల మగుచు
తే. సర్వపురుషార్థదాయము నై • చారుకేత, నాళిఁ జామరపంక్తుల•నలరుచు దను
జపతిఘోరరణోత్సాహ•సాహసముల, నలరుముక్తాతపత్రింబు• వెలయుచుండు.
వ. మఱియు నమ్మహారథంబు పరభయంకరంబును, శ్రీదేవీ ప్రీతిదంబును నై యొప్పు చింతామణిగృహవాయుభాగంబున శ్యామలాంబ గేయచక్రస్యందనంబు, నీశాన్యభాగంబున దండనాయికాకిరిచక్రమహారథంబును మెఱయుచుండు. ఈ రథత్రయంబు సర్వక్షేత్ర శ్రీపురపంక్తులయందు నంతస్థ దేవతలం బోలి సమాన ప్రతిభ నొప్పుచుండు. ఆగ్నేయభాగంబున ననలమయకుండంబును, బశ్చిమభాగంబున గాయత్రియు, దానివెనుక నభయంకరుండును, వారివెనుక ఘృణిసూర్యుండు నోంకారమందిరంబును, దురీయగాయత్రియు, జక్షుస్మతియు నివసింతురు. వారి వెనుక గంధర్వరాజును, మద్రుద్రాహ్వాయుండును, దారాంబికయు నివసింతురు. మఱియు నాగృహంబునకు రక్షోభాగంబు నాశ్రయించి నామత్రయ మహామంత్రవాచ్యుం డగు శ్రీహరియు నతనికి నుత్తరభాగంబున మహాగణపతియు, నతనికి నుత్తరంబున బంచాక్షరీమహామంత్రవాచ్యుం డగు శివుండును, మృత్యుంజయేశ్వరుండును జెలంగుచుందురు. వారికి నుత్తరంబున ధారణాఖ్య యగు సరస్వతియు, నకారాది క్షకారాంతవర్ణమూర్తియు భాసిల్లుచుండుదురు. వారికి నుత్తరభాగంబున మాతృకాంబయు, నామె వెనుక సంపదీశ్వ

రియుఁ, గాలసంకర్షిణియు, శ్రీమహాశంభునాథుండును, విశదజ్యోత్స్నానిర్మల విగ్రహ యగు శ్రీపరాంబయు నొప్పుచుందురు. బాలాన్నపూర్ణాహయారూ ఢా శ్రీపాదుకలు నుపర్యుపరిక్రమంబునఁ బ్రకాశించుచుందురు. పశ్చిమభాగం బున లఘుశ్యామయు, వాగ్వాదినియు, నకులాంబయుఁ, బరాశ్యామా చతు ష్కంబును వాయవ్యాంతము నివసింతురు. వాయుభాగంబు మొదలు మహాప ద్మాటవియం దున్మత్తభైరవియు, స్వప్నవారాహియుఁ, దిరస్కరణియుఁ, బంచ మ్యంబయుఁ, గ్రమంబున నివసింతురు. శ్రీపూర్త్యంబయు, శ్రీపాదుకాంబయు నను నీయిరువురు శంకరునిచే షడామ్నాయసాగరంబున నిరూపింపఁబడిరి. వీరెల్ల మహాపద్మాటవీస్థలంబున మహావిభవంబుల నెసంగుచు నివసింతురు. మ ఱియు నాచింతామణిగృహంబు పూర్వద్వారంబునందు. 725

ఆ. దక్షిణంబునందుఁ • దనరు శ్యామాగేహ, మల్లె వామభాగ•మందు దండ
నాయికాగృహంబు • నవరత్ననిర్మిత, మై చెలంగుచుండు • నద్భుతముగ. 726

క. పరమేష్ఠికాంచనాంబర, హరులకు గేహంబు లలరు • నర్ఘ్యస్థలికిన్
సురనాథు దిక్కునందునఁ• దరమగునే తెలుప నాకు • దద్విభవంబుల్. 727

ఉ. భక్తి చెలంగఁగా నమర•వారము శ్రీలలితాంబు నెంతో యా
సక్తి నహర్నిశంబులును • స్వాంతమునందుఁ దలంచుచుందు రా
శక్తిసమూహనాయికయు • సాధుజనావనదక్షదీక్ష యై
యుక్తవరంబు లిచ్చుచు మ•హోద్యమ మొప్ప వసించు నప్పురిన్. 728

వ. పూర్వోక్తం బగు నర్ఘ్యస్థానంబును,నర్ఘ్యకల్పనంబును యామ్యద్వారప్రభృతి ద్వారంబులయందు సమానంబ యగు. ఇంకఁ జింతామణిగృహంబును వర్ణిం చెద నని హయగ్రీవుండు. 729

క. శ్రీనగరమధ్యతలమున, మానితమహిమమున సాటి • మహి లేక లస
న్నానామణిగణఘృణులన్, స్థానము చింతామణి యనఁ • దనరుచునుండున్.

తే. యోజనద్వయ విస్తృతి • నొప్పి క్రోశ
విస్తృతము నైనభిత్తుల • వెలసి మఱియుఁ
జారుచింతామణీమయ•ఛాదినులను
దనరి యాగేహ మలరారు • ఘనతరముగ. 731

వ. గృహభిత్తి చతుర్యోజనోచ్ఛ్రియంబున నొప్పు. దానిపై స్థూపిప్రమాణంబు వింశతియోజనమాత్రంబు. ఇచ్ఛాక్రియాజ్ఞానరూపంబు లగు మూఁడుమకుటం బులు గలవు. అవ్వి దేదీప్యమానంబు లగు చింతామణిమయంబు లై యుండు.

చింతామణిగృహంబున సమస్తంబును జింతామణిమయంబె యగు. క్రోశార్ధా యామంబుగల ద్వారచతుష్కంబు నలరు. ఆ యామార్ధంబు ద్వారవిస్తారంబు. మఱియుఁ జింతామణిగృహాంతరంబున నన్నిద్వారంబులయందును [1]లలితాంబా దేహలౌహిత్యసింధువులు తరుణాదిత్యసహస్రతుల్యప్రభలును, శశాంకశీతలంబులు నయి ప్రవాహరూపంబునఁ బ్రవహించుచుండు. పూర్వామ్నాయమయంబు పూర్వద్వారంబు దక్షిణపశ్చిమోత్తరామ్నాయమయంబులు దక్షిణపశ్చిమోత్తరద్వారంబులు గృహరాజాంతరాళంబున భిత్తిఖచితదండకంబులు రత్నప్రదీపంబులై కోటిసూర్యసమప్రభలై ప్రకాశించుచుండు. 732

క. సురుచిరచింతామణి గృహ, పరమధ్యస్థానమందు • వఱలు నతిమనో
హరబిందుచక్రముమహ, త్తరమై శతసూర్యకాంతి • ధామం బగుచున్. 733

సీ. విమలగేహోత్తుంగ • భిత్తిబిందువులకు నంతరభూమి కుఁ•డ్యప్రమాణ
మైన క్రోశము గాక • యలరుఁ గ్రోశత్రయ మదిహస్త సంఖ్యల•నరయ నయ్యె
నిరువదినాల్గువేఁలు రమణీయంబగు బిందుమయోత్తుంగ•పీఠమువఱ
కును జతుర్దశ విభే•దనము లివ్విధి నౌటఁ దన్మానమెల్ల హ•స్తప్రమాణ

తే. సరణిఁ దెల్పెదఁ గుంభజా!•సారసాట, పీస్థలమునుండి చింతామ•ణిస్థగితగృ
హంబువఱకును వింశతి•హస్తపరిమి, తోన్నతంబొప్పు నణిమాదు•లుండు రందు.

వ. అణిమాంతరవిస్తారము చతుర్నల్వసమన్వితంబు నన్యూను హస్తంబుల ప్రమాణంబు నల్వ మనంబడు. అం దణిమాదులు పూర్వాదిదిక్కులయందు గృహంబుల నేర్పఱచుకొనియుండురు. అణిమా, మహిమా, గరిమా, లఘి, మేశిత్వ, వశిత్వ, ప్రాకామ్య, భుక్తీచ్ఛా, ప్రాప్తిసర్వకామలను నామంబుల నలరుచునుత్తమశక్తు లనం బరఁగి రస, మోక్ష, బల, ఖడ్గ, పాదు, కాంజన, వా, గ్లోహ, దేహసిద్ధులు మొదలగు ననేకసిద్ధుల నొసంగుచుఁ బర దేవతను సేవించుచుండుదు. మఱియు నందు సిద్ధాహ్వయశక్తులు కోటిసంఖ్యల నవలావణ్య సంపూర్ణలును, స్మయమాన ముఖాంబుజులును, జ్వలచ్చింతామణికరలును, నిరంతర షోడశవార్షికలును, నత్యుదారప్రకృతులును, మదవిహ్వలలును నై విహరించుచుండురు. ఆయణిమాద్యంతరంబునకుమీఁద నిరువదిబాహువుల యెత్తును, జతుర్నల్వ విస్తృతియును, జతుర్దిగ్విరాజితసోపానవితతిమనోహరంబును నగు బ్రాహ్మ్యాద్యంతరధిష్ణ్యం బొండు చెన్నుమీఱు. అందు బ్రాహ్మియు, మాహేశ్వరియుఁ, గౌమారియు, వైష్ణవియు, వారాహియు, మాహేంద్రియుఁ,

1 లలితాంబా......సింధువులు=లలితదేహముయొక్క యెఱ్ఱని కాంతుల నెడు ప్రవాహములు.

జాముండయు, మహాలక్ష్మియు, ననువారలు సకలాయుధంబులం బూని తూర్పు మొదలు ప్రాదక్షిణ్యక్రమంబున నివసింతురు. ఆస్థానంబునకుఁ బైని బ్రాక్ప్రమాణోన్నత విస్తృతం బగు ముద్రాంతరంబను స్థానంబు మెఱయు. అందు సంక్షోభ, ద్రావ, ణాకర్ష, వశ్యో, న్మాద, మహాంకుశ, ఖేచరీ, బీజ, యోన్యాఖ్యలును, ద్రిఖండియు నను దేవతలు క్రమంబున నివసింతురు. వీరు సుందరాకారలును, నవయౌవనాంగులును, గమనీయకాంతి సంపూరిత దిగంతర లై లలితాంబను సేవించుచుందురు. ఈయంతరత్రయము త్రైలోక్యమోహన చక్రం బనం బరఁగు. ఈచక్రంబున నున్న శక్తులు ప్రకటాభిధానంబుల నొప్పుదురు. వీరి కధిష్ఠాత్రి త్రిపురాచక్రనాయిక యనం బరఁగు. ఆచక్రంబును సంక్షోభణాత్మిక యగు ముద్రాంబ పరిపాలించు. 735

తే. అట్టి చక్రంబుమీఁద ము • న్ననువదించి
నట్టి స్థానంబునకుఁ దుల్య • మగుచు నొప్పు
నద్ది నిత్యాకలాంతరం • బనఁగఁ బరఁగుఁ
గుంభసంభవ! తెలిపెదఁ • గుతుక మలర. 736

తే. అందు షోడశచంద్రక • ళాత్మిక లగు, నిత్యలను శక్తు లెప్పుడు • నిలయములు వి
లాసగతి నొప్ప నివసించి • లలితసేవ, చేయుచుందురు సంతోష • చిత్తు లగుచు.

వ. కామాకర్షిణియు, బుద్ధ్యాకర్షిణియు, నహంకారాకర్షిణియు, శబ్దాకర్షిణియు, స్పర్శాకర్షిణియు, రూపాకర్షిణియు, రసాకర్షిణియు, గంధాకర్షిణియుఁ, జిత్తాకర్షిణియు, ధైర్యాకర్షిణియు, స్మృత్యాకర్షిణియు, నామాకర్షిణియు, బీజాకర్షిణియు, నాత్మాకర్షిణియు, నమృతాకర్షిణియు, శరీరాకర్షిణియు నను నిత్యాకలాశబ్దాంత లగు నీశక్తులు గుప్తయోగిను లన నొప్పుదురు. త్రిపురేశి యనునంబిక సర్వాశాపరిపూరక చక్రాధిష్ఠాన దేవత యగు. విద్రావిణీముద్రాంబిక శక్తులను బాలించు. అట్టి స్థానంబుపైని సుందరం బై ప్రాక్స్థానప్రమాణం బగు సర్వసంక్షోభణాభిఖ్యస్థానం బలరు. అందు మదారుణవిలోచన లై [1]యనంగశబ్దపూర్వక లగునష్టశక్తులు చెన్నారుచుందురు. నవతారుణ్యాలగు కుసుమా, మేఖలా, మదనా, మదనాతురా, రేఖా, వేగిన్యంకుశా, మాలిను లనువారు లలితాసేవనోత్సుక లై యుందురు. సుందరీనామంబున నలరు గుప్తతరయోగిన్యంబ వీరి కధిష్ఠాత్రి యగు. ఆచక్రంబు నాకర్షణీముద్రాంబ పాలించు.

1 అనంగశబ్దపూర్వికలు=అనంగశబ్దము మొదటకలవారు. అనఁగా ననంగకుసుమ, అనంగమేఖల అని యిట్లు పఠింపవలయు.

అనంగశక్త్యంతరోపరిభాగంబునఁ బ్రాగుక్తప్రమాణసిద్ధం బగుసంక్షోభిణ్యాది శక్త్యంతరంబు గలదు. అది సర్వసౌభాగ్యదాయకం బగు. అందుఁ జతుర్దశ సంఖ్యాక లగు శక్తు లుందురు. సర్వసంక్షోభిణియు, సర్వవిద్రావిణియు, సర్వాకర్షిణికయు, సర్వాహ్లాదినికయు, సర్వసంమోహినియు, సర్వస్తంభనశక్తియు, సర్వజంభనయు, సర్వవశంకరియు, సర్వరంజనకరియు, సర్వోన్మాదనశక్తియు, సర్వార్థసాధనియు, సర్వసంపత్తిపూరణియు, సర్వమంత్రమయియు, సర్వద్వంద్వక్షయంకరియు నను నీసంప్రదాయాఖ్యశక్తులకుఁ బురవాసిని యను పరదేవి యధిష్ఠాత్రి యగు. చక్రింబును సర్వవశ్యాఖ్యముద్రాంబ పాలించు చుండు. మఱియును. 738

వ. వినుము మునీంద్ర! యాపయిని • వింశతి హస్తసమున్నతంబు నై ఘనమయి నాల్గు నల్వములఁ • గల్పన లొప్పెడు విస్తృతంబుతోఁ దనరి నధిష్ఠ్య మొందు తగు•దాని విలాసము నెన్న శక్యమే వనరుహసూతికైన నట • వాసముచేసెడు శక్తిసంఘమున్. 739

సీ. సర్వసిద్ధిప్రద, • సర్వసంపత్ప్రద, సర్వప్రియంకరి•శక్తి, సర్వ మంగళకారిణి • మఱి సర్వకామప్రదయుఁ దీవ్రదర్ప యై • తనరు సర్వ దుఃఖవిమోచని•దోర్బలాధికతచేఁ జనుసర్వమృత్యుప్ర•శమని సర్వ విఘ్ననివారిణి • విక్రమధుర్యయా సర్వాంగసుందరి • సర్వపూర్వ

తే. మైన సౌభాగ్యదాయిని • యనఁగ నొప్పు నీకులోత్తీర్ణయోగిను • లెసఁగు చుంద్రు చక్రిణియు శ్రీమహాఖ్యచే • జగతి వెలయుఁ జక్రమయ్యాది సర్వార్థ•సాధక మగు. 740

వ. దానిని సర్వోన్మాదనముద్రాంబ పాలించుచుండు. దానికిఁ బైని బూర్వప్రమాణంబునఁ బరఁగు. సర్వజ్ఞాంతరంబు సర్వరక్షాకరచక్రనామంబున వెలయు. అందు, సర్వజ్ఞయు, సర్వశక్తియు, సర్వైశ్వర్యప్రదాయినియు, సర్వజ్ఞానమయియు, సర్వవ్యాధివినాశినియు, సర్వధారస్వరూపయు, సర్వపాపహరయు, సర్వానందమయియు, సర్వరక్షాస్వరూపిణియు, సర్వేప్సితప్రదయు నను నిగర్భయోగిను లనంబడు దేవత లలరుచుందురు. చక్రిణ్యంబిక మాలిని యను పేర నొప్పు. సర్వమహాంకుశాముద్రాంబ యాస్థానంబును బాలించుచుండు. కుంభసంభవా! చింతామణిగృహంబునఁ గొన్నిచక్రంబులు వర్ణింపఁబడియె. తక్కుఁ గలవానిని గ్రమముగ వినుమని హయగ్రీవుండు లలితాభక్తిపరవశుఁడై యిట్లనియె.

—॥ గృహరాజాంతరకథనము. ॥—

తే. మహితసర్వజ్ఞ మొదలగు • మానినుల ని
వాసమున కూర్ధ్వమం దిరు•వదికరముల
నున్నతంబు చతుర్నల్వ•సన్నుతాయ
తంబు నై చెన్నుమీఱు ధి•ష్ణ్యం బొకండు. 742

క. పరఁగురహి వశిన్యాద్యం, తర మని యది జగతియందు • దర్పోజ్జ్వలతన్
బరమేశ్వరి సేవించుచు, నిరతము నివసింతు రందు • నెలఁతలు భక్తిన్. 743

సీ. ప్రాగాదిదిక్క్రమ•పద్ధతివారుందు రందు స్వరములతో • నలరుచుండు
వశినీశ్వరి యనెడి • వాగ్దేవియును గవర్గసహిత యయి కాంతి • గ్రాలుచున్న
యట్టి కామేశ్వరి • యనఁబడు వాఙ్మయి మఱిచవర్గముఁ గూడి • మహితరూప
మలరంగ మోదిని • యనెడు వాగీశియు నల్లె టవర్గంబు • నలర విమల

తే. యనఁగఁ బరఁగు సరస్వతి • యవల తాది, పంచవర్ణంబులను గూడి • వాగధీశ
యరుణి యనఁనొప్పు దేవియు•నల్లె పాది,వర్ణములఁగూడి జయినియన్•వాగధీశ.

వ. యాదివర్ణచతుష్కంబుతో సర్వేశ్వరీనామకవాఙ్మయియు, శాదికాక్షరషట్కం
బుతోడఁ గౌళిని యనుశారదయు నీయెనమండ్రు దేవతలు మెఱయుచుందురు
మఱియును. 745

మ. వరముక్తామయహారభూషణములన్ • భాసిల్లి రక్తాంగ లై
స్ఫురదామోదదగద్యపద్యలహరీ•పూర్ణాస్య లై కావ్యసుం
దరనాట్యాగమసంస్తుతిప్రకరనా•నా వేద వేదాంతచా
తురులన్ మీఱి సరస్వతీనికరమం•దున్ వేడ్కతో నుండెడున్. 746

వ. మఱియును. 747

క. శ్రుతిహారిమధురశబ్దా, యతసదలంకారసముఁద•యంబుల నెపుడున్
శ్రితచింతామణి మది సం,తతమును సంతోషమందఁ • దనరుదు రెలమిన్.

వ. వీరు రహస్యనామంబులచేత విఖ్యాత లగుదురు. సిద్ధాంబ వీరి కధీశ్వరి యగు.
ఖేచరీముద్రాంబ యీచక్రసంరక్షణి యగు. వశిన్యాద్యంతరాళంబునకు మీఁ
దఁ బ్రాగుక్తప్రమాణయుతం బగునస్త్రచక్రం బలరు నందు. 749

సీ. బాణాధిదేవతల్ • పరఁగుదు రందైదు కామేశిబాణముల్ • కామశంభు
బాణంబు లై దగుఁ • బరమేశపరమేశ్వరులకు నంకుశయుగ్మ • మలరుచుండుఁ
బుండ్రేక్షుకల్పితం•బులు నూత్నములు నగు చాపముల్ దీప్తపా•శద్వయంబు
నివ్వి నాల్గగు నిట్టు • లెనిమి దయ్యెనుశస్త్రములు జ్వలద్దీప్తులు•ముఖ్యతమము

తే. లగు మదోద్ధతభండమ•హాసురేంద్రు, సంగరంబున దానవ • సర్వశోణి
తములఁ ద్రావి మహాతృప్తిఁ • దనరుచుండు, వీని పరివారశరములు•వినుతికెక్కు.

వ. వాని సంఖ్యకోటిగుణితం బగు నందు వజ్రశక్తిశతఘ్నులును, ముసుండియు, ముసలంబును, గణయంబును, బట్టసముద్గరభిండివాలంబు లను నీమొదలగు ననేకాయుధంబులును బ్రాగుక్తాస్త్రాయుధమహాశక్తులును సేవించుచుందురు. ఆస్థానంబునకు మీఁదఁ బూర్వోక్తప్రమాణయుతం బగు ధిష్ణ్యంబు సమయేశీస్థానంబనఁ బ్రఖ్యాతినొందియుండు నందు. 751

తే. ముదిత లలరుదు రత్యంత•మోదమలర, ముగురు కామేశిలోనగు•భూరియశలు
నాల్గనది యైన పూఁబోఁడి • వెల్గునందు, సర్వలోకాంబ లలితాంబ•సారసాక్షి.

తే. వారి నామంబు లెఱిఁగింతు • సారసాయ
తాక్షి కామేశి ప్రథమాంబ • యతులరూప
యైన వజ్రేశి రెండవ•దైన దేవి
యవల భగమాల మూఁడవ • దయిన దేవి. 753

క. ఈముువ్వురు లలితాంబికఁ, గామితఫలదాత్రి నెల్ల • కాలంబును ను
ద్దామభుజాబల మొప్పఁగ, నేమంబున గాచుచుంద్రు • నిశ్చలభక్తిన్. 754

తే. సకలలోకార్తిహారణయా • సారసాక్షి
లలిత నామంబుచేత నా•లవది యగుచు
వారి కిష్టార్థముల నిచ్చి • వారివలనఁ
బూజఁ గొనుచుండు నసమాన•భూతి దనర. 755

వ. ఆలలితాంబ యోగినీచక్రదేవీపంక్తియందు నవమీసమాఖ్య నొప్పు. ఆసమయేశ్యంతరాళంబునకుమీఁద నాథాంతరంబను స్థానంబుకల దద్ది ప్రాగుక్తప్రమాణసిద్ధంబె యగు. అందు యోగశాస్త్రప్రవర్తకు లగు నాథాహ్వయులు మంత్రగురువు లై సర్వవిద్యానిలయు లై యొప్పుదురు. కామేశ్వరునిచే యుగనాథులగు నలుగురు సృజింపఁబడిరి. వారు మిత్రేశోడ్డీశషష్ఠీశచర్యాహ్వయంబుల వెలయుచుందురు. వారిచే లోకరక్షణార్థంబు పాదుకాత్మకు లగు పెక్కండ్రు పుట్టింపఁబడి దివ్యౌఘమానవౌఘసిద్ధౌఘసంజ్ఞల నొప్పి ప్రాప్తసాలోక్యసారూప్య సాయుజ్యాదిసిద్ధులై గురుచతుష్కంబును గొల్చుచుందురు. ఆస్థానంబునకు మీఁదఁ బ్రాగుక్తప్రమాణసిద్ధం బగు నిత్యాంతరం బొండు చెన్నుమీఱుచుండు. అందు నిత్యాసంజ్ఞల నొప్పు పదియైదుగురుకాంతలు మెఱయుచుందురు. కామేశ్వరియు, భగమాలినియు, నిత్యక్లిన్నయు, భేరుండయు, వహ్నివా

సినియు,మహావిద్యేశ్వరియుఁ, దూతియుఁ, త్వరితయు,కుళసుందరియు, నిత్యయు, నీలపతాకయు, విజయయు, సర్వమంగళయు,జ్వాలామాలినియుఁ, జిత్రయునను నీపంచదశనిత్యలు దేవీస్వరూపలును, మహాబలపరాక్రమలును, గాలరూపలును, గాలగ్రాసవిచక్షణలును,బ్రహ్మాదివందితలునునై శ్రీదేవ్యంగరక్షకలైయుందురు.

సీ. వారికి గృహములై • స్వరము లెల్లఁ జెలంగు బిందుచక్రము పరాం•బికకు షోడ
శికి గృహభూత మై • చెలఁగుచుండును దాని కవ్వల నంగదే•వ్యంతరంబు
ప్రాక్ప్రమాణంబునఁ • బరఁగు నందు హృదయదేవు లార్వురు సము•ద్దీప్తశస్త్ర
పరిశోభితలు లస•ద్బహుభూషణాఢ్యలు నై చెలంగుచునుందు • రట్టి వారి

తే. పేరు లెఱిఁగింతు వినవయ్య ! • ప్రియముగాఁగ
వేని వినినంత పాపముల్ • విలయమొందు
సంపదాయుఃప్రజాతతి • శాశ్వతముగ
నొప్పు సత్కీర్తియును గల్గు • ముప్పు తొలఁగు. 757

వ. హృద్దేవియు, శిరోదేవియు, శిఖాదేవియు, వర్మదేవియు, నేత్రదేవియు, శస్త్రదేవియు నను నీశక్తిషట్కంబు లలితాత్యంతసన్నికృష్టం బై నవలావణ్యాపూర్ణాంగం బై సకలాయుధమండితం బై బిందుపీఠంబుచుట్టును జెలంగు. ఆస్థలంబునకు మీఁది భాగంబునందు. 758

తే. హస్తదశకసమున్నత • మగుచు నష్ట, నల్వవిస్తృతితో బిందు•నాదపీఠ
ముద్యదాదిత్యసన్నిభం•బొప్పునదియె, బిందుపీఠంబు మఱియు శ్రీ•పీఠము నగు.

తే. మఱిమహాపీఠమనియును•మహిఁజెలంగు,వినుమునివర్య విద్యాఖ్య•పీఠమనుచు
నెగడునానందపీఠమం•చుగణిత మగుఁ, బీఠపంచాశదాకృతి • వినుతిగాంచు.

ఉ. అందుఁ జెలంగు శ్రీలలిత • కాస్పద మై మహనీయ మై మహా
సుందర మై సమస్తమణి•శోభిత మై సకలేష్టదంబు శ్రీ
మందిర మంబికాహృదయ • మంజులమై తగు మంచరత్న మా
నందనికేతనంబుగను • నైజమహామహిమ న్నుతిం గనుఁ. 761

వ. అది మఱియును బంచబ్రహ్మమయంబును, లోకత్రయమూలకంబును నగు దాని పాదచతుష్కంబునం దొక్కొక్క పాదంబు దశహస్తసమున్నతంబును, హస్తత్రయవేష్టనంబు నగు. ఆనాల్గుపాదంబులు బ్రహ్మవిష్ణుమహేశానేశ్వరరూపంబుల నొప్పుచుండు. 762

సీ. మంచపాదం బొండు • మహితజపాపుష్పసంకాశ మగునది • పంకజాత
గర్భరూపం బాగ్నే•కం బగు దిగ్భాగమందుండు రెండవ • దైన పాద

మది మహానీలోప•లాభంబు విష్ణ్వాత్మకంబు రాక్షసవిది•గ్భాగమందు
నలరు మూఁడవపాద • మతిశుద్ధమౌ స్ఫటికంబు నా నిర్మల•కాంతి నొప్పు
నదియె రుద్రాత్మకం • బనిలదిగ్భాగంబు నందుండు నాల్గవ • దైన పాద

ఆ. మీశ్వరాత్మక మయి • యెసఁగుచు మఱి కర్ణి, కారకాంతిఁ దనరి • ఖండపరశు
దిక్కునందు జాలఁ • దేజరిల్లుచు నుండుఁ, బాదపంక్తి యిట్లు • ప్రబలుచుండు.

వ. ఇప్పాదంబులు నాల్గు నూర్ధ్వాధోభాగంబుల స్తంభరూపంబులును, మధ్యభాగంబునఁ బురుషరూపంబులు నయి సకలాయుధంబులతో వెలుఁగుచుండు. మఱియు నివి శ్రీదేవీధ్యాననిశ్చలాంగంబులును, నిమీలితాక్షంబు లయి యుండు. వానిపై సదాశివుండు మంచఫలకాకారంబున నొప్పు. అతండు వికాసదాడిమచ్ఛాయుండును, జతుర్నల్వపరివిస్తరుండును, నల్పషట్కాయామంబుగలవాఁడును నై ప్రకాశించు చుండు. అంగదేవ్యంతరంబు మొదలు మంచఫలకంబువఱకు సమస్తంబును జింతామణిమయాంగంబుగ నుండు. 764

తే. చెలఁగు సోపానములు రత్న•శిల్పకలన, ముప్ప దాఱవు వానిపై •ముదముమీఱ
మెల్ల మెల్లన జగదంబ•యుల్లమలర, నెక్కి పోవును నవ్విధ•మెఱుఁగఁ దగును.

వ. ఆరోహణక్రమంబున సోపానంబుల నెఱింగించెద. భూమ్యుదకవహ్నివాయునభోగంధరసరూపస్పర్శశబ్దోపస్థపాయుపదపాణివాగ్ఘ్రాణజిహ్వాత్వక్చక్షుశ్శ్రోత్రాహంకారబుద్ధిమనఃప్రకృతిపురుషనియతి కాలరాగకళావిద్యామాయాశుద్ధవిద్యేశ్వరసదాశివ శక్తి శివులు ముప్పదాఱు సోపానంబులు. ఈ సోపానపంక్తి మంచపూర్వదిక్కు నాశ్రయించి యుండు. అమ్మంచపాదనికటంబునందుఁ సూర్యకోటిసమప్రభయు, మధ్యభాగంబునందు ధగధగత్కారస్వరచ్ఛాయయు, శిరోభాగంబునందు ముక్తాగుళుచ్ఛకలితయును, నానారత్నమయియుఁ, దాంబూలద్రవవాసితయు, దుత్తూరకుసుమాకారయును నగు [1]కళాచి చెలంగుచుండు. 766

సీ. ఆమంచమున కూర్ధ్వ•మందు దివ్యం బగు హంసతూలికతల్ప • మలరు నద్ది
హస్తత్రయోత్సేధ • మై చతుర్నల్వపరివిస్తరం బయి కాంతి • వెలయు [2]శీర్ష
పాదోపధానయు•గ్భాసురం బయి [3]దివ్యగండూకములు నాల్గు •.క్రాలుచుండ
నలరు నద్దానిపై • హరి కౌసుంభాంబరం బొప్పు శ్రీపద్మ•రాగకాంతి

ఆ. మృదుత శుచిత నలరు•మిగులు జగంబున, నసదృశంబు నగుచు • నందుమీఁదఁ

---

1 కళాచి=తమ్మపడిగము. 2 శీర్షపాదోపధానయుగ్భాసురంబు=తలక్రిందను బాదములక్రిందను నున్న తలగడలచేఁ గూడి ప్రకాశించునది. 3 దివ్యగండూకములు=మృదువైన దిండ్లు.

బూర్వదిఙ్ముఖంబు • పొలుపారుచుండంగఁ, జెలఁగుఁ గామశివుఁడు • చిత్రరీతి.

మ. కరుణానీరధి లోచనత్రయుఁడు శృం•గారాంగుఁ డుద్యద్దివా
కరతుల్యప్రభుఁ డాదిదేవుఁడు మణి•గ్రైవేయహారాదినుం
దరుఁ డీశుండు మనోహరస్మితలస•ద్దామాబ్జవైరిప్రభా
పరిపూర్ణామలగండభాగుఁడు మహా•భాగుండు రాజిల్లెడున్. 768

తే. అతఁడె కామేశ్వరాహ్వయుం•డవ్యయుండు, భక్తవాంఛాప్రదానైక•బద్ధచిత్తుఁ
డాదిదేవుండు పరమాత్ముఁ•డఖిలలోక, కారకుం డొప్పు సంతోష•కలితుఁడగుచు.

తే. అతని యుత్సంగమునఁ జెలు•వారుఁ దరుణ, సూర్యపాటలరుచిసదా•షోడశాబ్ద
నూత్నయౌవనదర్పిత•నూపురాది, సకలభూషణభూషిత • సకలవినుత. 770

వ. ఆయంబయె సకలజనని లలితాహ్వయంబున నలరు. అమ్మహాజనయిత్రి దేహ
కాంతిని వర్ణింప నేరికైనఁ దరం బగునే. వేదవినుత యై వెలుంగుచుండు నని
హయవదనుం డగస్త్యునకు వెండియు ని ట్లనియె. 771

క. పరిశుద్ధపద్మరాగ, స్ఫురణను నిరసించి కాంతిఁ • బొలుపారు మనో
హరము లయి యొప్పు తత్పద, సరసిజనఖరంబు లఖిల • జనరంజకతన్. 772

క. లలితాంబాంఘ్ర్యంబుజయుగ, మలక్తసంపదను దూఱి • యభినవరాగా
మలకాంతి నలరి మంజుతఁ, జెలఁగి సమానంబు లేక • చెన్నారుఁ గడున్. 773

తే. నవ్యరాజమరాళాంగ • నాగళస్వ, నంబు నదలించి కలనిస్వ•నములఁ దనరి
శ్రీపరాంబిక పదపద్మ • చిత్రమంజు, శింజమంజీరయుగళంబు • లలిఁ జెలంగు.

సీ. [1]వీరమీనాంకతూ•ణీరదర్పంబును మథియించి వెలిఁబుచ్చి • ప్రథితము లయి
కరిహస్తశోభను • గదళికాకాంతిని జపలతఁ జయతను • జెందఁజేసి
చారుసైకతభాగ • సాంద్రత నణఁగించి తద్గౌరవంబు నుద్ధతిని జెండి
యంబరగాంభీర్య • మంతయు నొక్కట శూన్యతఁ గనఁజేసి • సొగసు మించి
తే. వెలయుచుండుఁ బరాంబ జం•ఘలును దొడలు
పిఱుఁదులును మధ్యభాగంబు • పృథివియందు
సామ్య మించుకయును లేక • సతతశోభ
నను మనోహరతను బొంది • మునివరేణ్య!. 775

తే. తప్తకనకమయంబు నై • తనరు దివ్య, మణిమరీచులసాంద్రమై • గణన సేయ
వీలుపడనట్టి రుచిరత • వెలసి యుంబ, చారు కాంచీకలాపంబు • భూరికాంతి.

1 వీర... దర్పంబును=శూరుఁడగు మన్మథునియంబులపొదిగర్వమును.

తే. అలరు నతనాభికావర్త•కలిత మైన, త్రివళికోర్మిప్రభాఝరీ• తేజరిల్లు
నల్లచీమలబారల • నుల్లసిల్లఁ, జెలువ నూఁగారు శృంగార•సీమ యగుచు. 777

చ. ఘనతరదాడిమీఫలయు•గప్రతిమానము లై మనోజ్ఞతం
దనరి సమస్తజీవులకుఁ • ద్రాణ నొసంగఁ బయోధరాహ్వయం
బునఁ జెలువారి పావనతఁ • బొల్చుచుఁ దుంగదృఢత్వముల్ దగం
దనరు గుచద్వయంబు లలి•తం బగు సౌష్ఠవ మెల్ల మించఁగన్. 778

సీ. మణిమయకేయూర•మహితకంకణరాజరాజితంబులును వి•భ్రాజదూర్మి
కాంగుళంబులు, మనో•హరములు నవశిరీషకుసుమకోమల్య•చారుతరము
లాయతంబులు నయి • యలరు చతుర్భుజంబులు నొప్పు దివ్యకాం•తులఁ దనర్చి
పరదేవికంఠంబు • భాసిల్లు సంమృష్టశంఖసుందరతను • సకలలోక

ఆ. జనని చుబుకమాస్య•చారుదర్పణవృంత, తుల్య మగుచు నలరుఁ.• దోయజాక్షి
పాటలాధరంబు • పరిశుద్ధబింబఫ, లంబు నాఁగ నెపుడు • డంబు మీఱు. 779

మ. పరిశుద్ధంబులు పంక్తిబద్ధములు భా•స్వత్సర్వవిద్యాకృతుల్
శరదింద్వచ్ఛతరప్రభాసమరుచుల్ • సాంద్రంబులౌ దంతముల్
పరికింపం గను గుందకుట్మలరుచి•స్ఫారంబు లై యొప్పు సుం
దరిముక్తామయనాసికాభరణ ము•ద్యద్దీప్తిచే భాసిలున్. 780

ఆ. మొగలిఱేకులవలె • మిగుల దీర్ఘంబు లై, సుందరంబు లగుచు • నంద మొందు
నంబికాక్షు లలరు • నద్దేవి భాలంబు, అర్ధచంద్రరీతి • హారికాంతి. 781

చ. అలకము లొప్పు మీఱెఁ గుసు•మాంగికిఁ దేఁటుల ఱెక్కగుంపు నాఁ
జెలఁగును శ్రోత్రముల్ వరరు•చిస్ఫురణాయతకుండలంబు లై
లలితసమస్తరత్నమయ•లక్షణశోభిత సత్కిరీట మెం
తొ లలితమై సమస్తదివి•జోరుసుఖప్రదమై తగెం దమిన్. 782

సీ. గాంఢాధకారంబు•కరణి శ్యామం బగు కుంతలసంతతి • కొమరు మిగులఁ
గర్పూరకస్తూరి•కాసదామోదితవీటిక యెంతయు • వేడ్క నింప
శరదిందుమండల•సంకాశ మై మనోహరమునై ముఖమెంతొ • యలరుచుండ
సీమంతరేఖాత్త•సిందూరపంక్తియుఁ జంద్రరేఖయు నొప్పఁ • జారుతరము

ఆ. నరుణవర్ణము నగు • నంబరం బలరార, సకలభూషణాళి • చొకళింప
సర్వలోకజనని • శంకరి యానంద, ధాత్రి కామహరుని • తరుణి వెలయు.

వ. మఱియు నమ్మహాదేవి బ్రహ్మ విష్ణు గిరీశేశ సదాశివ నిదానభూమియు,

[1]నపాంగరింఖత్కరుణానిర్ఝరీతర్పితాఖిలభక్తవారయు, సమస్తపాపహర్త్రియు
నై ప్రకాశించుచుండు. 784

తే. అన్యదైవతపూజాదు • లాయతఫల, మేపరాంబిక పూజచే • నెసఁగుచుండు
నందురో యట్టి పరదేవి • నభినుతింప, నెట్లు శక్యం బగును నాకు • నిపుడు చెప్పుమ.

వ. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అని శ్రుతి వచి
యించుఁ గావున వాక్కులచే నెట్లమ్మహాదేవిని వర్ణింపఁ జాలుదు. కుంభసం
భవా! పక్షపాతంబుచేఁగాని స్నేహంబునఁగాని మోహంబునఁగాని వచి
యింప, తత్త్వంబు నవధరింపుము. కల్పతరుశాఖలు లేఖను లైనను, సప్తసా
గరంబులు మషీపాత్రము లైనను, బంచాశత్కోటివిస్తీర్ణ యగు భూమి పత్రి
త్వంబు నొందినను, లేఖనకాలంబు పరార్థాదివత్సరంబులు కలదైనను లిఖించు
టకు సర్వలోకనివాసులు నొక్కొక్కరు కోటిబాహువులు గలవార లైనను
వర్ణించువారు బృహస్పతితుల్యు లైనను శ్రీపరాంబాపాదాంబు జైకాంగుళి
ద్యుతియందు సహస్రాంశంబు నైనను వర్ణింపఁ జాలరు. కావున వాగ్వృత్తి
నిష్ఫలంబు. 786

తే. బిందుపీఠంబు చుట్టును • పృథుత నలరి, సర్వమాయాస్వరూప, [2]మే • చకసమాన
కాంతి సుందర, చతురశ్ర • కముగ నొక్క, [3]యవనిక చెలంగు వర్ణింప • నగు నెదాని.

తే. అంబికోపరిభాగంబు • నందు వింశ
తద్వితయహస్తమాన మై • త్రిజగములను
గాంచ దుర్లభమయి కాంతిఁ • గ్రాలుచున్న
[4]నింద్రగోపవితానంబు • నెసఁగుచుండు. 788

వ. మఱియును దేవీపరిసరంబున నలంకారజాలంబు ప్రకాశించుచుండు. దానిని
వర్ణింప నావాక్కులు సిగ్గుపడుచుండు. ఆవస్తుగుణాదికం బాపరాంబయే యె
ఱుంగు. మనస్సున కగమ్యంబగుట నెట్లు వాక్కులు పొగడ సమర్థంబు లవు
నని మఱియు హాయగ్రీవుండు. 789

చ. మునివర! యిట్లు భండముఖ • ముఖ్యసురారులఁ జంపఁ బూని య
వ్వనరుహనేత్రి లోకతతిఁ • పాలిని శ్రీలలితాంబ పుట్టె నా

---

1 అపాంగ...భక్తవారయు=నేత్రముల తుదలనుండి జాఱుచున్న కరుణాప్రవాహముచేఁ దృప్తి
నొందింపఁబడిన భక్తసముదాయము గలది. 2 మేచకసమానకాంతిసుందర=నెమిలిపురికన్నుతో సమాన
మయినకాంతిచే మనోహరమయినది. 3 యవనిక=తెర. 4 ఇంద్రగోపవితానము=ఆరుద్రపురుగు
వన్నెగల మేలుకట్టు. అనఁగా ఉల్లెడ.

ఘనతరచిద్ధుతాశనని • కామరుచిస్ఫుటకుండమందు నా
జనని సమస్తవైభవము • సంస్తుతి సేయఁగ నెట్లు శక్యమౌ. 790

సీ. ఆయంబ శిల్పజ•నావళినిర్మితషోడశక్షేత్రసం•శోభితాల
యాభిబద్ధం బగు•నట్టి శ్రీనగరంబుఁ బాలింపుచుండు ని•ప్పగిది నొప్పు
నట్టి శ్రీనగరంబు • లలరు ననేకంబు లై భక్తవాంఛల • ననుదినంబు
నిచ్చుచు నిచ్చచే • నెల్లతావుల నుండు నంబిక జనయిత్రి • యఖిలలోక

ఆ. నాథ మునివరేణ్య! • నానావనీరుహా, ధ్యానమాదిగాఁగ • నలరు శ్రీపు
రకథ నెవఁడుచదువు • రయమున నాతండు, పరమగతినిబొందుఁ • బలుకులేల.

వ. ఈయుపాఖ్యానంబును వినినవారును, ప్రశ్నించినవారును, విమర్శించినవారును,
బుస్తకంబును బూజించినవారును బరమగతినొంద నర్హు లగుదురు. ఇట్లు శ్రీ
పురంబున నున్నట్టిప్రాకారంబుల రీతిగా శక్త్యనురూపంబుగాఁ బ్రాకారం
బులఁ గట్టించి శ్రీదేవికి సమర్పించిన నప్పుణ్యపురుషులును బరమగతి నొందుదు
రని భక్తిచే నిమీలితలోచనుం డై హాయవదనుండు చెప్పుటయు నగస్త్యము
నీంద్రుం డిట్లనియె. 792

## శ్రీమంత్రరాజతత్సాధనప్రకారము.

క. కరుణాకర మీవలనం, బరమేశ్వరి జనన మసుర•వధము మొదలుగాఁ
బరగెడు చారిత్రము శ్రీ, పురమహిమము వింటిఁ దృప్తి • పూర్ణత గలిగెన్.

ఆ. ఇపుడు వినఁగ నాకు • నిచ్ఛపుట్టెడు మంత్ర,సాధనంబు భక్త• సముదయముల
లక్షణంబు వేగ • లలిఁ దెల్పుమీ యన,నశ్వకంఠుఁ డతని • కనియె నిట్లు. 794

సీ. సత్పదార్థంబుల • శాబ్దవస్తువుమహత్తర మగు సర్వశ•బ్దంబులందు
వేదౌఘ మతిశయ • విఖ్యాతిని వహించు వేదౌఘములకంటె • వేదమంత్ర
సముదయ మధికంబు • సర్వమంత్రంబులకన్న వైష్ణవములు • సన్నుతిఁ గను
వానికంటెను ఖ్యాతి•వహియించు దార్గముల్ వానికంటెను గణ•పతి మనుప్ర

తే. జంబు శ్రేష్ఠంబు సౌరముల్ •సమధికంబు, లంతకంటెను సౌరమం•త్రాళికన్న
శైవమంత్రంబులగ్ర్యముల్ • శైవమనువి,సరముకన్న రమామంత్ర•సంచయంబు.

వ. శ్రేష్ఠం బామంత్రాళికన్న సారస్వతమంత్రంబు లుత్తమంబు లవ్వానికంటె నా
మ్నాయభేదజంబు లగు గిరిజామంత్రంబులు పావనంబు లవ్వానికన్న వారా
హీమను సముదాయంబు వర్యం బద్దానికన్న శ్యామామంత్రనికరంబు వరిష్ఠం

బద్ధానికంబె దశభేదవిభేదితంబు లగు లలితామంత్రంబులు పవిత్రతమంబులు మఱియు. 796

తే. అందు ద్వివిధంబు లగ్రియంబు • లగును గుంభ
సంభవా! వానిఁ దెలిపెద • సంతసంబు
నిడును విన్నంతమాత్రనె • యొసఁగ నవ్వి
సకలలోకో త్తమంబు లై • ప్రకటకీర్తి. 797

వ. అవ్వి లోపాముద్రాకామరాజవిఖ్యాతి నలరు. అందు హాదివిద్య లోపాముద్ర యనియుఁ, గాదివిద్య కామరాజాఖ్యయు నగు హసాదివాచ్యత్వంబును గామ రాజంబును ; స్మరాదివాచ్యతను లలితాంబయు నొందు. 798

ఆ. హాదికాదిమంత్ర • భేదంబు వర్ణత్ర, యోద్భవంబ యౌ న•యోనిజన్మ!
మౌనివర్య! యట్టి• మంత్రద్వయమునందుఁ, గామరాజమనువు•కలుములొసఁగు.

వ. మంత్రోద్ధారం బెట్లనిన. శివ శక్తి, కామ శక్తి, మాయా, హంస, భృగు, కామ, శశిమౌళి, శక్ర, భువనేశ, చంద్ర, మనోభూ, క్షితి, హ్రల్లేఖలచే హం సాది యై హాదివిద్య చెలంగు. కాదివిద్యయు స్మరయోని శ్రీయోముఖంబున వెలయు పంచత్రికమహావిద్యచే నే పుణ్యపురుషు లుపాసింతురో యట్టి వార లకు లలితాంబిక సర్వార్థంబుల నొసంగు. సద్గురువువలనఁ బంచదశాక్షర మంత్రరాజంబుఁ బడసి వక్ష్యమాణక్రమంబున నుపాసింపవలయు. తత్క్రమం బెఱింగించెద సావధానుండ వై వినుమని హయగ్రీవుం డగు శ్రీమన్నారాయ ణుం డి ట్లనియె. 800

తే. ఉదయమున లేచి విమలశో•భోజ్వలంబు, పత్రముల వేయిచేతను•బరఁగి చారు
కేసరంబుల మెఱయుచు • భాసురంబు, నైన కమలంబు మ స్తక•మందుఁ దలఁచి.

సీ. అందు శ్రీగురువర్యు • నతికరుణాకరుసుప్రసన్నముఖాబ్జు • శుభచరితు
ధ్యానించి శౌచాది•కాఖిలక్రియలను వడి నొనరించి య•వ్వల సుగంధి
తైలవిలేపిత • తనుఁడు నుద్వ ర్తితుం డయి యుష్ణవారితో • ననువు మీఱ
స్నాన మొనర్పంగఁ • జనుస్వభావంబున జలము పవిత్రించ • జ్వలనత ప్త

ఆ. మయ్యెనేని దాని • యందున్న యాధిక్య, మింతమాత్ర మనుచు • నేటు వచింప
నౌను గాన నగ్ని•చే నతితప్తమౌ, జలమె యోగ్యమయ్యె • స్నానమునకు. 802

తే. ప్రీతిహోత్రప్రతప్తమౌ • విమలజలము
సంభవింపనిచో శీత • జలమునందు

స్నాన మొనరింపఁ దగునట్లు • స్నాతుఁ డగుచుఁ
జారుకౌసుంభవస్త్రముల్ • చను ధరింప. 803

చ. అరుణము లైనవస్త్రముల • నైన ధరింపఁగ వచ్చు నావలం
బరమ ముదంబు మీఱఁగను • వార్చి పరాంబిక నాత్మ నెంచి యా
త్మరహితచంచలత్వమున • మానుగ దేశికు దివ్యపాదపం
కరుహములం దలంచి శుచి • కల్పితభస్మము ఫాలమందునన్. 804

వ. ఊర్ధ్వపుండ్రత్రిపుండ్రంబులుగా ధరింపవలయు. మఱియుఁ బట్టవర్ధనంబుగా నైనను దాల్పవచ్చు. అగస్త్యపత్త్రాకారంబుగా నైనను దాల్పవచ్చు. అనంతరము చారుకర్పూరకస్తూరీచందనాదివిలేపితుం డై సకలభూషణభూషితుం డై శృంగారవేషుం డై యామోదికుసుమస్రగ్వతంసితకుంతలుండు గావలయు. సంకల్పభూషణుండు నైనఁ గావలయు. మఱియు నంతర్బహిశ్శుద్ధాత్ముం డగుచు సంధ్యావందనము నాచరించి యశ్వత్థపత్త్రాకారం బగుపాత్రంబుతోఁ గుళాక్షతంబులతోడను బుష్పచందనములతోఁ గూడ మార్తండున కర్ఘ్యంబు సమర్పించి లలితాంబకు నట్లె యర్ఘ్యత్రయం బొసంగి. 805

తే. మూలమంత్రంబు నుడువుచు • శ్రీల నొసఁగు
నట్టి లలితకుఁ దర్పణ • మలరి యొసఁగి
యివ్విధంబున దేవర్షు • లాది యైన
వారిఁ దర్పణవిధిఁ దృప్తిఁ బఱిచి మఱియు. 806

క. పరిశుద్ధహృదయుఁ డై మౌనరతుం డై యాగగృహము • నానాపూజా
పరికరయుక్తము దేశిక, వరు ననుమతిఁ బొందవలయు • భక్తి చెలంగన్. 807

క. న్యాసప్రకరణపఠిత, న్యాసంబుల నాచరించి • హర్షంబున మృ
ద్వాసనమున నుపవిష్టుం, డై సరగున శ్రీపురంబు • నాత్మఁ దలఁచుచున్. 808

క. నానావృక్షౌఘమహో, ద్యానము మొద లంబవఱకు • నతిశయభక్తిన్
ధ్యానించి పూతచిత్తుం, డైనతులను శంభుపత్ని • నలరించి వెసన్. 809

క. పూజాఖండోక్తం బగు, పూజావిధి నాచరించి • ముదమున ముక్తా
భ్రాజన్మాలికఁ జేఁ గొని, శ్రీజగదంబను స్మరించి • చిత్త మలరఁగన్. 810

వ. ప్రాఙ్ముఖుండుగాని యుదఙ్ముఖుండుగాని యై సింహాసనేశ్వరిని ముప్పదియాఱులక్షలు జపించి జపదశాంశంబు హోమంబును, హోమదశాంశము తర్పణంబును, దర్పణదశాంశము బ్రాహ్మణభోజనంబును జేసి సంసిద్ధమంత్రుం డై తరువాతఁ గామ్యజపంబు నాచరింప వలయు. 811

క. మనువరము [1]నియుతమాత్రము, ఘనమతి జపియింప మనుజ • కాండము వశమౌ
వనితలు లక్షద్వయజప,మున దనవశ మొందుదురు వి • మోహిత లగుచున్.

క. పరమేశ్వరి ధ్యానించుచు, నురుభక్తిని మూఁడులక్ష • లొగి జపియింపన్
ధరణీశ్వరులందఱుఁ దన,పరిసరమున నుండువారు • భక్తులు నగుచున్. 813

క. మునివర! లక్షచతుష్టయ, మనుజపమున నా[2]ప్పృదాకు • మహిళామణు లె
ల్ల నలరుచు వశ్య లౌదురు, వినుమింకను మంత్రమహిమ • వివరింతుఁ దగన్.

తే. పంచలక్షజపంబునఁ • జంచలించి, నరగఁ బాతాళవసతులౌ • చాన లెల్ల
వశ్య లౌదురు భూలోక • వామలెల్ల, నాఱులక్షలు జపియింప • నతని మ్రోల.

క. నివసించి యుందు రమ్మం,త్రవరమ్మును భక్తిమీఱఁ • దగు నియమమునన్
సువిహితముగ [3]నగనియుతము,లు విధిన్ జపియింప సర్వ • లోకప్రమదల్. 816

ఆ. వశ్యలై చరింత్రు • భక్తిని నియుతాష్ట,కంబు జపము సేయఁ • గడఁగి దేవ
భేదజాతులెల్ల • వినయంబు మెఱయంగ, మ్రోల సంచరింత్రు • మునివరేణ్య.

తే. లక్షనవకంబు జపియింపఁ • గక్షమాని, యమరులెల్లను వశ్యులై • యలరుచుందు
రబ్లి దశలక్షజపమున • నఖిలదిక్ప,తులును వశ మొందువారు ని • ర్మలమనీష.

వ. పదునొకండులక్షలు జపింప బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వాధీను లగుదురు. ద్వాదశలక్షజపంబున సిద్ధ్యష్టకంబు వశం బగు. ఇంద్రున కింద్రత్వంబును, విష్ణువునకు విష్ణుత్వంబును, శివునకు శివత్వంబును, జంద్రునకుఁ జంద్రత్వంబును, భానువునకు భానుత్వంబును, మఱియుఁ దక్కిన దేవతల కాయాయధికారంబులు ను న్నిమ్మంత్రజపంబువలనఁ గలిగె. ఎవ్వఁ డిమ్మంత్రమును జపించు నతండు సర్వపాపవర్జితుండును, సుందరాకారుండును నై సర్వసిద్ధుల నొంది సర్వజ్ఞుం డై దర్శనమాత్రంబున నెల్లరకు నానందప్రదుం డగుచు వాక్కుచే బృహస్పతిసముండును, లక్ష్మిచే శ్రీపతిసన్నిభుండును, బలంబున మరుత్సముండును, స్థిరత్వంబున హిమాచలసంకాశుండును, నౌన్నత్యంబున మేరునిభుండును, గాంభీర్యంబున మహార్ణవనీకాశుండును, శత్రుక్షోభకరుండును, నీషద్భ్రూభంగమాత్రంబున దుష్టచిత్తులకు స్తంభకుండును, జృంభకుండు, నుచ్చాటకుండును, మోహకుండును, మారకుండును నగు మఱియు. 819

ఆ. అతని దర్శనమున • నగుఁ గోపి సుముఖుండు, పాపమతియుఁ బుణ్యుఁ • డైపరంగు

1 నియుతము = లక్షసంఖ్య. 2 పృదాకుమహిళామణులు=నాగకాంతలు. 3 నగనియుతములు = ఏడులక్షలు.

మఱియు సాధకుండు • మహి నెల్లవిద్యల, దక్షుఁ డై చెలంగుఁ • దత్క్షణంబ.

తే. దివ్యమందాకినీపూర • భవ్యమధుర
వాగ్విజృంభణ మొప్ప స•ర్వనిగమాగ
మములయం దాతఁ డెఱుఁగని • మాటయుండ
దతఁడె సర్వజ్ఞతుల్యుఁ డై • యవనిఁ దనరు. 821

క. కరుణాస్వాంతుం డగు న, ప్వరమతి కపకారులయిన • వారలు కోపో
ద్ధురవహ్నిశిఖల మ్రందుదు, రరయ జగత్త్రయమునందు • నసదృశుఁ డతఁడౌ.

వ. అమ్మహానీయుని దర్శనమాత్రంబునఁ గాంతలు [1]శ్లథనీవీబంధనలును, గళత్కుంతలసంచయలును, [2]ఘర్మవారికణశ్రేణిముక్తాభూషితమూర్తులును, నత్యంతరాగతరళవ్యాపారనయనాంచలలును, స్రంసమానకరాంభోజమణికంకణకదంబలును, నూరుస్తంభనిష్పందలును, అలకాంకురభూషణలును నై యుద్దామరాగజ్వాలామాలికల దీప్యమానలుబలె, ననంగశరపావకదృష్టులఁ బచ్యమానలువలె నొప్పుచు నుత్కంఠచేఁ దనరుచు, శ్రమజలంబులచేఁ దడపఁబడుచు, లజ్జచే విడువఁబడుచు, కులజాతిశీలలోకభయబంధుభీతిపరలోకభయంబుల విడిచి యరణ్యదేవాలయమఠాదులయం దెచ్చటనున్న నాతనిఁ జూడఁ బరుగెత్తుదురు. వాయుహతం బైన పాండుపత్త్రంబు భూమిఁ బడునట్లు సుందరీచిత్తంబులు లలితామంత్రసాధకదర్శనమాత్రంబున గతధైర్యంబులవు. మఱియు. 823

సీ. అమ్మహాత్ముని జూడ • నలరి దేవాంగన లవనికి నేతెంచి • యతని మ్రోల
నివసింతు రని చెప్ప • నెలఁతలు సామాన్యమర్త్యలోకీయ ల•మ్మాడ్కి నుందు
రని వేఱె చెప్పంగఁ • బనియేమి యున్నది సంతతం బాతని•చారుకీర్తి
సర్వస్థలంబుల • సాంద్ర మై భాసిల్లు కవివర్యు లాతని • గడఁగి పొగడు

తే. చుందు రెవ్వార లాపద•లందు లలితఁ, దలఁతు రఖిలంబు వారికిఁ • దత్క్షణంబె
కరబదరతుల్య మైనట్టి•కరణిఁ దనరు, మంత్రఖండత్రయాధిక•మహిమ వినుము.

వ. లలితామంత్రాదిమఖండంబు కుందేందుధవళద్యుతి నై భాసిల్లు. దాని నాధారచక్రము మొదలు హృచ్చక్రపర్యంతము భావింపవలయు. ద్వితీయఖండంబు జ్వాలచ్ఛిఖంబు. హృచ్చక్రము మొద లాభాలాంతము భావింపవలయు. దురితఖండకం బగు తృతీయఖండంబును లలాటపట్టస్థద్వాదశాంబుజకోటరంబున

1 శ్లథనీవీబంధనలు=వీడిపోయిన కోకముడికలవారు. 2 ఘర్మ......మూర్తులు = చెమటబిందుసముదయ మను ముత్తెములచే నలంకరింపఁబడిన దేహములు గలవారు.

ధ్యానింపవలయు. మఱియు మోక్షేచ్ఛయందు లలితాంబను శశిజ్యోత్స్నా
ధవళాకృతిగను, వశీకరణకర్మమునందు రక్తసంధ్యాకాంతిగను, గవిత్వము
నందు స్ఫటికోపలనిర్మలాకారగను, ధనలాభంబున సువర్ణాభగను, సర్వసంప
త్తిలాభంబున శ్యామలాంగిగను, స్తంభనకర్మమునఁ బీతవర్ణగను, మూకీకర
ణంబున నీలవర్ణగను, ధ్యానింపవలయును. మూలాధారప్రభృతిబ్రహ్మరంధ్ర
పర్యంత మెవ్వ రంబికను జ్వలన్మాణిక్యదీపంబువలె ధ్యానింతురో వా రఖిల
సిద్ధులం గాంతురు. మఱియు. 825

సీ. పశ్చిమజన్మ మె ♦ వ్వానికి లేకుండునో శంకరాంఘ్రిభ ♦ క్త్యుత్సుకంబు
నిరత మెవ్వానికి ♦ నిల్చియుండునో వారి కంబార్చనమునందు ♦ నలరునిచ్ఛ
యెవనివంశంబున ♦ నెవ్వని కైనను బరదేవి మంత్రంబు ♦ గురువువలన
నుపదేశమై యున్న ♦ నొగి వాని కులమందుఁ బుట్టిన వారెల్ల ♦ భూరి పాప
ఆ. చయముఁ బాసి పుణ్య ♦ సరణిని గాంతురు, కుంభజా! మునీంద్ర ♦ గూఢ మిద్ది
గుప్తతరముసుమ్ము ♦ గుప్తతమంబగు, మఱియుఁ దెలుపువాఁడ ♦ మంత్రమహిమ.
క. శ్రుతులును సర్వాగమనం, హితలును శాస్త్రములు లలిత ♦ నెప్పుడు పొగడుం
జతురాననాదు లెల్లను, సతతము ధ్యానించుచుంద్రు ♦ జననిని మదిలోన్. 827
క. ఇదియె మహాతీర్థం బి, య్యదియే సత్ఫలము దివ్య ♦ మగు గతి యనఁగా
నిదియే కావున సుజనులు, మది నెఱిఁగి తలంచుచుంద్రు ♦ మంత్రము దీనిన్.
సీ. వేదబాహ్యులు శ్రుతి ♦ విరహితాచారముల్ సలుపువారలు కుటి ♦ లులు దురాత్మ
కులు వ్యర్థవాదులు ♦ కుమతులు విభ్రష్ట, శీలురు మఱియు ను ♦ చ్ఛిష్టు లుగ్ర
కర్మపరాయణుల్ ♦ కాముకుల్ చార్వాకు లార్యదూషకు లాది ♦ యైనవారి
కంబికా మంత్రవ ♦ ర్యంబు లభింపదు కష్టరీతి లభింపఁ ♦ గాంక్షితార్థ
ఆ. దంబు గాదు మఱియు ♦ దారుణసర్పంబు, మూఁడ్క భీతి నొసఁగు ♦ మౌనివర్య!
నీదు ప్రశ్నమునకు ♦ నిఖిలంబుఁ జెప్పితి, నుత్తరంబు తృప్తి ♦ నొసఁగు నీకు. 829
వ. భండాసురవధార్థ మావిర్భవించిన లలితాంబ విధాతచేఁ గామాక్షి యని విను
తింపఁ బడియె. సదాచివచిత్తలాలనంబువలన లలితాహ్వయంబున నొప్పె.
ఇంకఁ జెప్పవలసిన దెద్దియును లేదు. గ్రంథఫలంబును వచించెద నని హయ
గ్రీవుండు. 830

## ఫలశ్రుతి.

తే. దివ్యమైన యాఖ్యానంబు ♦ దీని నెవరు, విందు రట్టి మహాత్ములు ♦ విపులసౌఖ్య
విత్తముఖములనొందుచు ♦ విమలపథము, నొందుదురు మఱి పుట్టక ♦ యుందురనఘ!

# లలితోపాఖ్యాన విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.

తే. ఇద్ది యాఖ్యానవర్యమహా • నెలమి దీని
నెవ్వఁడు పఠియించునో భక్తి • నెవ్వఁడు వినునో
వార లపగతపాపు లై • వైభవముల
ననదృశంబుగఁ జెలఁగుదు • రవనియందు. 832

సీ. కన్యార్థి యగువాఁడు • కన్యక నొందును జయకాంక్షకలవాఁడు • జయము నొందు
మోక్షార్థి యగువాఁడు • ముక్తిని గాంచును ధర్మ మపేక్షింప • ధర్మ మొందు
విత్తంబు గోరిన • విత్తంబు లభియించుఁ బుత్త్రకాముఁడు గాంచుఁ • బుత్త్రకులను
విద్యార్థి యైనచో • విద్యలఁ బొందును యోగమాకాంక్షింప • యోగి యగును
రాజ్యంబుఁ గోరిన • రాజ్యంబు ప్రాప్తించు గ్రామంబె కోరిన • గ్రామ మొందు

తే. కన్యకామణి పతిఁ గోరఁ • గాంతుఁ డలవ
సంతమన్మథులను బోలు • చారుమూర్తి
వేగ లభియించు మునివర్య • వేయి పలుకు
లేల యెయ్యది గోరిన • నెలమిఁ బొందు. 833

క. ధరణీశ్వరుఁ డీయంబా, చరితము విని విజయకాంక్ష • సంగ్రామముచే
య రహితశత్రుభయుం డై, ధరణీతల మెల్లఁ బొందు • ధర్మపరుఁడు నా. 834

ఆ. రోగి యొక్కమాఱు • బాగుగ దీనినిఁ, బఠనసేయ రోగ • బాధ విడుచు
మఱి యకాలమృత్యు • మరణంబు నొందఁడు, సర్పవిషము వానిఁ • జంపలేదు.

క. మంత్రంబు లాభిచారిక, తంత్రంబులు వైరిజనకృ • తంబులు నగు నే
యంత్రంబులు బాధింపవు, సంత్రాసము నొందఁ డతఁడు • సన్మౌక్తలిసెందుర్.

తే. ప్రతిదినంబును దీనినిఁ • బఠనసేయఁ, గల్గు గంగాదివారిసం • గతిని గల్గు
ఫలము క్షణమాత్రమున; వేయి • పల్కులేల, మౌనివర్య లభించు స • మస్తఫలము.

వ. రాజసూయదశకం బగ్నిష్టోమశతంబు నొనరించిన పుణ్యం బీదివ్యగ్రంథపారా యణంబునఁ గోటిగుణితం బై లభియించు. సర్వజంతువులకు నవధ్యుండు నగు. శతవర్షంబులు నీరోగి యై జీవించు. గోఘ్నుండును, కృతఘ్నుండును, గురుతల్పగుండు, శరణాగతఘాతకుండు, మిత్త్రవిశ్వాసఘాతకుండు, దుష్టుండుఁ, బాపరతుండు, మాతృహంతయుఁ, బితృహంతయు, భ్రూణహత్యవలనఁ బాపియైయున్నవాఁడు నీ లలితోపాఖ్యానంబు నొక్కసారి వినినఁ బాతకజాలంబువలన విడువంబడు. సర్వపుణ్యకాలంబులయందును సర్వతీర్థస్నానం బొనరించిన ఫలంబు గూడఁ గలుగు. రాజ్యక్షోభంబున, రోగమారీచోరభయాదులయందు దీనిని బఠింపఁ దదాపద తొలంగు. ఎవని యింట నీయుపాఖ్యానంబు వ్రాయఁబడియుండునో

యాతఁడు నివసించిన యాదేశంబునకు క్షామబాధ కలుగదు. లలితాపూజ విధానం బంతయు మఱియొకఖండంబున విస్తరించి వచించెద. ద్వాత్రింశల్లలి తాఖ్యానం బద్ది దివ్యదర్శనంబు గావున ద్వాత్రింశికాశాస్త్రం బని చెప్పంబడు. దేవ్యుత్సవదివసంబులఁ బఠింపవలయు. విశేషించి దుర్గామహోత్సవంబునఁ బఠింపవలయు. ద్వాత్రింశత్సారకృత్యంబున బ్రాహ్మణుని బ్రార్థించియైనను దృఢ భక్తియుక్తుండై తానైనను బఠించినఁ దత్ఫలంబునకు మేరయుండునే. ఏకవారంబుగాని ద్వివారంబులుగాని త్రివారంబులుగాని పఠించిన సర్వసిద్ధులొనఁగూడు. దుర్గాంబప్రసన్న యగు నశుచియైయున్నను, శుచియైయున్నను దుర్గోత్సవంబు సంభవించిన నాలస్యముచేయక దీనిని బఠించిన సకలపాతకనిర్ముక్తుం డగు. ధరణీశ్వరుండు పఠించునేని యష్టైశ్వర్యంబులను గాంచు. ఈద్వాత్రింశికాశాస్త్రపఠనంబు చండికాస్తోత్రకోటిపఠనతుల్యంబు. కావున భవ్యాత్మకులై పఠించినభక్తులు సకలపాతకనిర్ముక్తులై సర్వసౌభాగ్యంబులం బొంది యంతంబున విజ్ఞానదీప్తికలిక యగు లలితాంబను బొందుదు రని యగస్త్యునకు హయగ్రీవుం డుపదేశింప నమ్మునిపుంగవుం డానందసాగరనిమగ్నుం డయ్యె. 838

ఆశ్వాసాంత్యము.

క. ప్రకటతరదానతర్పిత, సకలార్థిజనా, సమస్తసద్గుణమాన్యా
యకలంకశీలధన్యా, సుకవినుతలసన్మనోజ్ఞశుభతమచరితా. 839

క. మంగళతమవాగ్విభవా, సంగీతకవిత్వచారుసాహిత్యనిధీ
భంగరహితనియమా సా,రంగధరసతీపదబ్జరతనిజహృదయా. 840

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచివంశాంబురాశికుముదినీమిత్రసుబ్రహ్మణ్యమనీషిపుత్త్రి, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రినామధేయప్రణీతం బగుబ్రహ్మాండపురాణోత్తరఖండాంతర్గత హయగ్రీవాగస్త్యసంవాదరూపం బగుశ్రీమదాంధ్రలలితోపాఖ్యానంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

శ్రీమదాంధ్రలలితోపాఖ్యానము సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు ముద్రితము.—1915.

